# కాశీ మజిలీ కథలు

**1 & 2వ భాగములు**

(ఒకే సంపుటముగా)

ఇది గోదావరీ తీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న

**బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవిచే**

రచించబడినది

సరళ సుందర వచనం

**శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం**

✆ 2473444

**రోహిణి పబ్లికేషన్స్**

పాత కూరగాయల మార్కెట్
మెయిన్‌రోడ్, రాజమండ్రి - 533 101

# కాశీ మజిలీ కథలు

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షితకవి

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం



ప్రథమ ముద్రణ :

జనవరి, 2005




సాధారణ ప్రతి
రూ : 125/-

లైబ్రరీ ప్రతి
రూ: 200/-

ప్రకాశకులు :

రోహిణి పబ్లికేషన్స్
మెయిన్‌రోడ్, రాజమండ్రి - 1

ముద్రణ: స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్, విజయవాడ-3. ఫోన్స్: 2578211, 2572832

# నాటికి - నేడు

**శ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవి** విరచిత **"కాశీమజిలీ కథలు"** చదవని పాఠకులు అరుదుగా వుంటారు వ్యాకరణ సమ్మతమైన పద్ధతిలో, భావపూర్ణంగా పఠితలకు పరమోత్సాహం కలగచేసేటట్లు పూర్తిగా చదివిన తర్వాత వెంటనే మర్చిపోకుండా గుర్తుండేలా వ్రాయగల సమర్ధుడు శ్రీ సుబ్బన్న దీక్షితులు ఆనాటి **కాశీమజిలీ కథల** సంపుటాల్లో రచయిత కధాకధన శైలినీ, వ్యాకరణాలంకారశాస్త్ర పాండిత్యాన్నీ కొనియాడుతూ, వాగ్దేవీ నందనులైన శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి శతావధాని శ్రీచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శ్రీ మానవల్లి రామకృష్ణ కవి తమ తమ అమూల్య అభిప్రాయాలను తెలియజేసారు

ఆ రోజుల్లో కావ్య భాషలో రచన చెయ్యగలిగిన వారికే కవిశబ్ద గౌరవం ఆ విధంగా సంఘంలో కవిగా గౌరవింపబడాలంటే రచయిత తప్పనిసరిగా శబ్దగాంభీర్యాన్ని ఆశ్రయించవలసి వచ్చేది తత్కారణంగా ఎంత సామాన్యమైన కధని వ్రాయాలన్నా గ్రాంధికాంధ్రాన్ని ఆశ్రయించే వాళ్ళు ఆనాటి రచయితలు.

కాని రోజులు మారాయి, కాలంమారింది, సంఘంపట్ల రచయితల అభిప్రాయం మారింది ఇప్పుడు అందరు రచయితలూ వాడుక భాషలోనే తమ భావాల్ని వ్యక్త పరుస్తున్నారు. అయితే రచన ఎల్లప్పుడూ అలోచనామృతమేకాని సంగీతంలా ఆపాతమధురం కాదు రచన మాటల్లో వుండదు. మాటల కూర్పులోనే వుంటుంది అంటారు పేరుమోసిన రచయితలు

అరటిపండుని సులువుగా నోట్లో వేసుకోవచ్చు కాని పనసతొనని సాధించుకోవడంలో ఎంతో శ్రమ వుంది ఇంకా ఆధునికంగా చెప్పాలంటే - పాతకాలంనాటి మోటు నగల్ని చెరిపించి నాజూకైన నగల్ని చేయించుకున్నట్లే మేంకూడా **కాశీమజిలీ కథల్ని** నేటి కాలపు వాడుక భాషలోనికి పరివర్తన చేసి పెట్టమని **శ్రీఇచ్ఛాపురపు రామచంద్రం** గారిని కోరాం వారుకూడా ఎంతో ఉత్సాహంగా మా ప్రతిపాదనని అంగీకరించారు వెనువెంటనే కార్యరంగంలోకిదూకారు తత్ఫలితమే వాడుక భాషలో **"కాశీమజిలీ కథలు"** మీ ముందుకు వచ్చి నిల్చాయి మీరు ఏమాత్రం శ్రమపడకుండా ఈ **"కాశీమజిలీ కథల్ని"** అరటి పండు తిన్నంత సులువుగా చదువుకుపోతారు

మహాకవి కాళిదాసు కావ్యాలకు సంజీవనీ వ్యాఖ్యనం వ్రాసిన మల్లినాధసూరి అంటారు - **"నా మూలం లిఖ్యతేకించిత్త"**ని తత్సమానంగానే శ్రీ రామచంద్రంగారు కూడా ఏది ఎలా వున్నా ఏకదేశ వికృత న్యాయాన్ని అనుసరించి ఆనాటి **కాశీమజిలీ కథలే** నేటి ఈ **కాశీమజిలీ కథలు** రసజ్ఞ పాఠకులైన మీరు మా శ్రమకు పట్టెవర్ధనాలు దిద్దుతారనే మా విశ్వాసమూ, ఆకాంక్షా

ప్రకాశకులు.

# కథల వెనుక కథ

మిత్రులూ రోహిణి పబ్లికేషన్స్ అధినేతా, శ్రీ అప్పారావు గారు మధిర సుబ్బన్న దీక్షితకవి విరచిత కాశీ మజిలీ కథలకు నేటి పాఠకులకు తేలికగా అర్ధమయ్యే రూపం ఇవ్వవలసిన గురుతర బాధ్యతని నామీద ఉంచినప్పుడు నేను కొంచెం భయపడ్డాను ఎందుకంటే-స్వతంత్రంగా కదో నవలో రాయడం వేరు, సుప్రసిద్ధ రచనని సరళతరం చేసి తిరుగ రాయడం వేరు-కాశీ మజిలీ కథలలాటి ప్రఖ్యాత రచనను ఆధునిక రూపంలోకి మార్చడం-నా బోటివానికి కత్తిమీద సామే.

భాషాపరంగా క్లిష్టం రాశిపరంగా చాల పెద్దది పురాణలు, చరిత్ర, భూగోళం, ఖగోళ శాస్త్రం వేదాంతం . తత్వం వైరాగ్యం శృంగారం,ప్రేమ కామం...భక్తి... ఎన్నిటిని స్పర్శించారో మధిర సుబ్బన్న దీక్షితకవి తమ రచనలో అద్భుతమైన కల్పన... అమోఘమైన కథా శిల్పం. ఏ దృష్టితో చూసినా "కాశీ మజిలీ కధలు" అనర్ఘరత్నమే అలాంటి రచనని ప్రస్తుత పాఠకులకు-వేగంగా కధను పరుగెత్తిస్తూ మూలానికి ద్రోహం జరగకుండా తిరిగి రాయగలనా. అని నేను ఆలోచిస్తున్న సమయంలో .

నా రచనల వెనకే నా జీవితంతో పాటే ఉండే నా నిరంతర సన్నిహితులు శ్రీ జి రంగబాబుగారు "మీరు రాయగలరు కచ్చితంగా రాయగలరు." అని ఆత్మవిశ్వాసం కలిగించారు

" మీకు ఏ పుస్తకాలు ఎప్పుడు తెచ్చియిమ్మంటే అప్పుడే తెచ్చియిచ్చేపూచీనాది. గురువుగారూ కాశీ మజిలీ కథల తిరుగ రాతకి వేగంగా శ్రీకారం చుట్టండి-"అని ధైర్యం చెప్పి తొందర చేశారు శ్రీ యిమ్మిడి శెట్టి చక్రపాణి (లెక్చరర్) గారు

" మీరు రాయగలరండీ . రాస్తారు' అని ఎనభై దాటిన శ్రీగణపతిరాజు చంద్ర శేఖరరాజు (అడ్వకేట్) గారు వెన్నుతట్టి ఆశీర్వదించారు ఒక్కసారి మానాన్న గారూ, తెలుగు పండితులూ అయిన కీ శే ఇచ్ఛాపురపు వైద్యనాధంగారిని ఒక్కమారు తలుచుకున్నాను అంతే పన్నెండు భాగాలు పన్నెండు నెలలలో తిరిగి రాయగలిగాను

ఈ గ్రంధమునకు సరళ సుందర వచనముకు సహకరించిన శ్రీ పానుగంటి కృష్ణరావుగారికి ప్రత్యేక కృతజ్ఞతలు

వ్రాశాక అర్థమైంది నేనెంత మంచిపనిచేశానో ఈ కధలు శ్రద్ధగా చదువుతూ రాయడం వలన ఎన్నెన్ని విషయాలు తెలిశాయని. ఎంతగా కథా కథనకౌశలం అర్థమైందని కల్పనాచాతుర్యం ఎంతగా చూడగలిగానని !

అంతే కాదు నాపట్టుదలమీదా ఓపిక మీదా నాకు విశ్వాసం కలిగించింది ఈ ప్రక్రియ. ఇతరుల రచనలను కూడా నేటి పరితలకు అనుకూలంగాను మార్చగలనని నమ్మకం కలిగించిందీ మహత్తర కార్యం ఈ రచన వెనుక ఎందరో మహానుభావులున్నారు అందరికీ నా మన. పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

ఇచ్ఛాపురపు రామచంద్రరావు

# కాశీ మజిలీ కథలు





మొదటి భాగము

# విషయ సూచిక

## 1వ మజిలీ నుండి - 11వ మజిలీ వరకు

రెండవ భాగము

# విషయ సూచిక

## 12 వ మజిలీ నుండి - 17 వ మజిలీ వరకు



ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

# కాశీ మజిలీ కథలు

## 1 వ భాగం

### 1. మణి సిద్ధుని కథ

పూర్వం కొల్లాపురంలో యజ్ఞశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను వేదవేదాంగములను చక్కగా చదివి వానిలో చెప్పబడిన ధర్మాలు పాటిస్తూ, న్యాయ మార్గంలో చాలాధనం సంపాదించి, విద్వాంసులలో విశిష్టుడని పేరు పొంది సంసారము చేసికొంటూండగా అగ్నిహోత్రుని కరుణవలన అతనికొక కొడుకు జన్మించాడు

పుత్రోదయానికి యజ్ఞశర్మ చాలా సంతోషించి, పేదలకు దానధర్మాలుచేసి, తన కొడుక్కి గుణనిధి అని పేరు పెట్టాడు. ఆ బాలుడు చక్కగా పెరుగుతూ తనతెలివి తేటలతోనూ బుద్ధిమంతనంతోనూ తల్లితండ్రులకు చాలా ఆనందం కలిగించసాగాడు. గుణనిధికి యుక్త వయసు రాగానే ఉపనయనం జరిపించి విద్యాభ్యాసం ప్రారంభింప జేశాడు పూర్వజన్మ పుణ్యంవల్లకాబోలు అతనికి విద్య, పాండిత్యం జ్ఞానం చక్కగా అమరాయి

యుక్తవయసు రాగానే వివాహం చేసుకోమని తండ్రి కొడుక్కి చెప్పగా వారిద్దరికీ మధ్య యీ దిగువ సంభాషణ జరిగింది.

గుణనిధి : నాన్నగారూ వివాహం ఎందుకు చేసుకోవాలి?

యజ్ఞశర్మ సుఖపడడానికీ, ఆనందించడానికీ.

గుణనిధి : ఏ సుఖం? ఏ ఆనందం?

యజ్ఞశర్మ . లోకమంతా పొందే సుఖమే, ఆనందమే.

గుణనిధి : తండ్రీ! నేను కొన్ని విషయా లడుగుతాను కోపగించరు కద?

యజ్ఞశర్మ : కోపమెందుకూ? అడుగు నాయనా! నాకు తెలిసినంత వరకూ చెబుతాను.

గుణనిధి : నాకు ఉపనయనం చేసినపుడు నా మెడలో మూడుపోగుల ఈ యజ్ఞోపవీతం ఎందుకు వేశారు? దీని సంప్రదాయమేమిటి?

యజ్ఞశర్మ : ఆ మూడుపోగులు – సత్వరజస్తమోగుణాలు. వాటిముడి జ్ఞానగ్రంధి ఉపనిషత్తులలో వ్రాసింది చూడలేదూ?

గుణనిధి : చూశాను, కాని వివరాలు పూర్తిగా తెలియలేదు. వివాహ సమయంలో రెండవ యజ్ఞోపవీతం వేస్తారు కదా! అదేమిటి?

యజ్ఞశర్మ : అలాటితత్త్వంకల మరోదేహభారం తనమీద పడుతుందని.

గుణనిధి : వివాహం అనే పదానికి అర్థమేమిటి?

యజ్ఞశర్మ : వి 'వాహం' అంటే ఎడతెగని బరువును మోయు టని.

గుణనిధి : ఈ యజ్ఞోపవీతములని ఇలాగ మగవాడి మెడలో ఎందుకు వేస్తారు?

యజ్ఞశర్మ : విద్వాంసుడు అర్థంతెలిసికొని బంధాలను గ్రహించి తత్త్వజ్ఞాని యగుటకోసం అందుకే – ఆ మర్మం తెలిసిన సన్యాసులు జంధ్యం తీసేస్తారు జగమెరిగిన (జగమునెరిగిన) బ్రాహ్మణునకు జందెం బేల? – అని సామెత.

గుణనిధి తండ్రీ! నువ్వు సర్వజ్ఞుడివి అన్నీ తెలిసీ నన్నెందుకు పెళ్ళాడమంటున్నావు?

*యజ్ఞశర్మ* ప్రస్తుతం నీది – సంప్రదాయాల్నీ అంతరార్థాల్నీ తెలిసి కోవలసిన వయసుకాదు బ్రహ్మచారి గృహస్థుడై, పుత్ర పౌత్రులవలన కలిగే ఆనందం అనుభవించి ఆ తర్వాతే తురీయాశ్రమాన్ని స్వీకరించి నపుడు తెలిసికోవడం లోకాచారం.

*గుణనిధి* ఏ కర్మనయినా ముందే కారణం తెలిసికొని చేయడం మంచిది కదా? శరీర భారాన్ని వదిలించుకోడానికి గుర్తుగా వేయబడిన యజ్ఞోపవీతం ఒకటే బరువు పైగా రెండవదాన్ని కూడా భరించమని చెబుతున్నావే మంచిదారి చూపక, ముళ్ళదారి చూపుతావేం తండ్రీ?

*యజ్ఞశర్మ*: అయ్యో! అబ్బాయి! ఇప్పుడు నువ్విలాటి మాటలనకూడదు. గృహస్థాశ్రమం అన్నిటికంటె ముఖ్యమైనది విను స్నానంచేసి .. అగ్ని కర్మ చేసి కౌపీనం (గోచి) ధరించి వేదంచదువుతూ ఆకలివేయగా దండము పట్టుకుని . బ్రహ్మచారి ఏ ఇంట భిక్షను కోరుతాడో ఆ గృహస్థుడు సామాన్యుడా?

భూమ్మీద గృహస్థుడు చల్లగా ఉండడం వల్లనే మునులు, తాపసులు, యతులు, వటులు (బ్రహ్మచారులు) మొదలగు భిక్షుకుల వర్గం క్షేమంగా మన గలుగుతూంది.

అందుచేత – గృహస్థు అందరికంటే అధికుడు. "అన్నం, అన్నం" అంటూ ఇంటికి వొచ్చే అతిథినెప్పుడూ పూజించు అందువలన కలిగే పుణ్యం కోటియాగాలు చేసినా కలగదు.

*గుణనిధి* : తండ్రీ! దుఃఖభూయిష్టమైన వలలాటి సంసారంలో నేను చిక్కుకోలేను అందులో ప్రవేశిస్తే ధనాపేక్ష తప్పదు. ఒక పొట్టను ఎలాగో పోషించుకోవచ్చు కాని .. కుటుంబం పెరిగినప్పుడు వారిని పోషించు కుందుకు పడవలసిన కష్టాలు తలుచుకుంటేనే భయమేస్తూంది. భార్యామోహంలో మూర్ఖుడై, ఆమె తనని జలగలా పీలుస్తూందని గ్రహించక అదే సుఖమని భ్రమపడతాడు భోగాల ద్వారా అతని వీర్య ధనాలూ, కుటిల సంభాషణల ద్వారా మనస్సునీ హరించేస్తూంటుంది భార్య కలవానికి నిద్రాసుఖము మిగలదు. పురుషుల్ని మాయ చెయ్యడానికే

బ్రహ్మ వివాహం కల్పించాడు. దీనిలో కొంచెమయినా సుఖం లేదు తండ్రీ. కొడుకు ప్రాజ్ఞుడని తెలిసి కూడా సన్మార్గం బోధించక నరక ప్రాయమైన సంసార కూపంలో పడమంటావెందుకు? నాకు పెళ్ళక్కరలేదు. దయచేసి నన్ను వొదిలిపెట్టెయ్

అనే సరికి యజ్ఞశర్మ శరీరంలో వొణుకు పుట్టింది. దుఃఖంతో కళ్లనుంచి నీరు ధారలు కట్టింది

అది చూచి గుణనిధి – "ఓహో! మాయా మోహబలం ఎంతటిది! ప్రాజ్ఞులను కూడా వశపరచుకోగలదే!

పనులలో మునిగిన మానవులు – నిత్యం జరుగు సూర్యోదయాస్తమయాల వల్ల తమ ఆయువు క్షీణించుచున్నదని గ్రహించలేరు. తమ కన్నుల కెదురుగానే ఎందరో పుడుతూ, గిడుతూ, ఆపదల పాలౌతున్నా భయమే ఎరుగరు. ప్రపంచమంతా ఈ తీరుగానే ఉండడం వల్ల – మోహంఅనే మద్యం తాను త్రాగి – లోకానికి వెర్రెత్తిందని తలుస్తారు. ఇదే మాయాబలం. దీనిని జయించడం అతికష్టం. నువ్వు శాంతం వహించు నేను సన్యసించడానికి అనుమతివ్వు –" అని చెప్పిఅవతలికి వెళ్లిపోయాడు

యజ్ఞశర్మ – కొడుకు యొక్క మానసిక సన్యాసానికి విచారిస్తూ . . అతనికి ఎందరితోనో చెప్పించినా మనసు మారకపోవడంతో వంశం అభివృద్ధి చెందలేక పోయిందని దుఃఖిస్తూ – కొంతకాలానికి చనిపోయాడు అతని భార్య భర్త సహగమనం చేసింది తల్లితండ్రులు చనిపోయినా గుణనిధి ఆ చింతను మనసు కంటనివ్వక వ్యక్తిగత బంధాలు తెగిపోయాయని సంతోషిస్తూ, తత్వ జ్ఞానవిశేషాలు తెలుసుకోవాలని – తనకు తగిన గురువును వెదక సాగాడు.

ఆ సాయంకాలం దేవతాదర్శనానికి కోవెలకు వెళ్లగా – అక్కడ అపరశివుడి వంటి సిద్ధుడు కనిపించాడు. నమస్కరించి – వారి తపోవిశేషాలు తెలిసికొని – ఇంటికి వెళ్లాక కూడా అతని గొప్పతనాన్ని తలుచుకుని మర్నాడు ఉదయంనుండి సాయంత్రం వరకూ సిద్ధుని చెంత మౌనంగా కూర్చుని వాని విశేషములు చూశాడు. అలాగ పదిరోజులు

గడిచాయి. అప్పుడాయతి అతని చిత్తశుద్ధిని గ్రహించి – "నీవెవరవు? ఎవరి కుమారుడవు? రోజూ నా దగ్గర కెందుకు వస్తున్నావు? నీకేంకావాలి? నీ సంగతి చెప్పు" అని అడిగాడు

అందుకు అతను "స్వామీ! నేను యజ్ఞశర్మ అనే బ్రాహ్మణుని కుమారుడను నాపేరు గుణనిధి తల్లితండ్రులు స్వర్గస్థులయ్యారు. నా కెవరూ లేరు మీవంటి సాధువులే నాకు బంధువులు. మీవంటి మహానుభావులు పామరుల నుద్ధరించుటకే లోకయాత్ర చేస్తూంటారు. నాకే కోరికాలేదు ఇహపరములందు నాకు రోతపుట్టింది. కైవల్యమునకు సులభమైన మార్గము తెలిసికొన గోరుతున్నాను నా కోరిక తీర్చే మహనీయులు మీరే నా పూర్వ జన్మపుణ్యము వలన ఇక్కడికి దయచేశారు నాకు ముక్తిమార్గం ఉపదేశించండి అదే నా కోరిక అందుకే నేను మీ వద్దకు వస్తున్నాను నాపై దయచూపండి" అని పాదాల మీదపడి ప్రార్థించాడు,

సిద్ధుడు గుణనిధిని లేవనెత్తి – "నీ బుద్ధిమంతతనం గ్రహించాను పూర్వ జన్మసుకృతం వల్ల నీకు ప్రయత్నించకుండానే విజ్ఞానం లభించింది నువ్వు కారణజన్ముడివి నీకు మా ఉపదేశంతో పనిలేదు నీవిప్పటికే మానసికంగా సంన్యాసివి ఇప్పుడు శరీరంతో కూడా సంన్యాసం తీసుకో నీవలన కొన్ని పురాతన కథలు భూలోకంలో వెలుగు చూడవలసి ఉంది కనుక నువ్వొక సహాయకుడిని తీసికొని కాశీనగరం వెళ్లు. అక్కడ గొప్ప మునులతో నీకు సహవాసం దొరుకుతుంది నీకు విముక్తీ సాఫల్యమూ దొరకగలవు " అంటూ తన మూటనుండి కాంతులు విరజిమ్ముతున్న ఒక అమూల్య రత్నాన్ని తీసి అతని చేతిలో ఉంచి –

'నువ్వీ రత్నాన్ని ముందుంచి పూజించి కళ్లు మూసుకుని ధ్యానిస్తే భూతభవిష్యద్వర్త మాన కాలాల్లోని కథలన్నీ నీకు వివరంగా తెలిసిపోతాయి. దీన్ని సాలగ్రామం వలె పూజించుకో. ఈ మణి సిద్ధించింది కనుక ఇటుపై నువ్వు మణిసిద్ధుడవని పేరు పొందుతావు ఇంక ఇంటికి వెళ్లు' అని దీవించి పంపి, ఆ సిద్ధుడు ఎక్కడికో వెళ్లిపోయాడు

మణిసిద్ధుడు గురువు మాటను మంత్రాల్లా జపించుకుంటూ, గోవింద తీర్థులను యతీంద్రుని వద్దకుపోయి సంన్యాసము స్వీకరించి మణిసిద్ధ యతీంద్రుడని పిలవబడుతూ కాశీపురానికి వెళ్లాలని నిశ్చయించుకుని కౌల్యమతి అనే మిత్రుని చేరి

"మిత్రమా! నాకు చిన్నప్పటి నుంచీ కాశీ వెళ్లాలని కోరిక. గురువుగారు చేసిన ఉపదేశం కూడా నా కోరికని బలపరచింది నేను కాశీ యాత్రకు సిద్ధమయ్యాను ఒంటరిగా పోరాదని పెద్దలు చెప్పారు. నాకు తోడుగా వొస్తే నీకు నేను చేయగలిగిన ఉపకారం చేస్తాను" అన్నాడు కౌల్యమతి నవ్వుతూ – 'అయ్యా! తమ వేదాంత మంతా ఏమైంది? తండ్రి ఎంత బతిమాలినా పెళ్లి చేసుకోక ఆయనని పరలోకం పంపేశావు ఇప్పుడు నువ్వు కాశీ ప్రయాణమౌతున్నావు మాలాటి వాళ్లని తోడుగా తీసికెళ్లి చంపుతావు కాబోలు. చాలు చాలు. అయినా వేదాంతులకి కూడా తీర్థయాత్రలు కావాలా? నేను రాను – " అనే సరికి మణిసిద్ధుడు మరొక స్నేహితుడు దగ్గరకు వెళ్లి తన కోరిక తెలిపాడు.

' ఆలుబిడ్డల్ని వదిలి – ఇలాటికాలంలో .... నానా కష్టాలూ పడుతూ నేను కాశీ రాలేను" అనేశాడతను.

మణిసిద్ధ యతీంద్రుడు మరొక స్నేహితుని సమీపించి – "ఆర్యా! భూలోకంలో కాశీ ప్రసిద్ధపట్నం కదా. అక్కడ ముక్తి నొసగే గంగాభవాని, మోక్ష మిచ్చే విశ్వనాధుడూ ముఖ్యదేవతలని అందరకూ తెలిసిందే ఆ పట్నం చూడాలని లేదూ? ఆ పుర విశేషాలెన్నయినా ఉన్నాయి. అవన్నీ తోవలో చెబుతాను. జన్మధన్యమౌతుంది పుత్ర, మిత్ర, కళత్రాదులందు మమకార వ్యామోహాలు విడచిపెట్టు వారు పరలోక సౌఖ్యమునకు పరమ శత్రువులు. శరీరం అశాశ్వతం. కాశీనగరాన్ని చూడడం వల్లనే సంసార తాపత్రయం నశించగలదు" అని బోధించాడు

'అయ్యా! కాశీపురమంత గొప్పదేకాని – వెళ్ళేతోవమాత్రం చాలా కష్టమైనదంటారు కాశికి పోవడంకంటె కాటికి పోవడం మేలంటారు. అదీకాక మీవంటి దివ్యజ్ఞానులకు తీర్థయాత్రలెందుకు?

అజ్ఞానులకయితే ప్రయాణ కష్టం వలన జ్ఞానం కలుగుతుంది. పామరుల కోసమైన ఈ కల్పిత యాత్రలకై మీరు ప్రయత్నించడం భావ్యం కాదు" అనేసరికి మణిసిద్ధుడు మరొకనివద్దకు వెళ్లి కాశీక్షేత్రాన్ని ప్రశంసిస్తూ అతన్నిఆహ్వానించగా -

"స్వామీ! నామీద కోపం పడకండి కాశీతోవలో రోగబాధ, చోరబాధ ఎక్కువట పరలోకానికి పయనంతో సమానం కనుకనే కాశి వెళ్లినవాడొక్కడూ ఇక్కడికి తిరిగిరాలేదు అలాటి ప్రమాదకరమైన యాత్రకి నేనెలా రాగలను?" అనేశాడు

దాంతో మణిసిద్ధుడు నిట్టూర్పు వదిలి మరొకరివద్దకు వెళ్లాడు. కాశీక్షేత్రంలోని గంగనూ దేవతలనూ ప్రశంసించాడు తనతో రమ్మని కోరాడు అందుకతను - 'అయ్యో మీరేదో చదివి - చివరను కాశి కలుషపిశిత రాకాశి అన్నారే . అది అక్షరాలా నిజం ఎలాగంటే . వినండి మాతాత చాలాముసిలివాడు. అతనొకసారి తానను భవించిన కాశీయాత్రాకష్టాలు నాకు చెప్పాడు ఆ కష్టాలు విన్నవారెవరూ కాశీకిపోరు

ఆ. మాతాత - ఎవరి ప్రోత్సాహంతోనో - ఉన్నచోట హాయిగా ఉండలేక కాశీ బయలుదేరాడు. బయలు దేరేటప్పుడు తోవలో ఆహారం కోసం మోయగలిగినంత పిండి, పెసర పప్పు, ఉప్పు కారాలు కలిపిన చింతపండు కొన్ని బట్టలు, కొంతడబ్బు మూటకట్టుకుని దాన్ని నెత్తిమీద పెట్టుకుని పూటకు రెండు యోజనాలు (యోజనం అంటే 8 మైళ్లు) చొప్పున నడవసాగారు మాతాత అతిఆచారపరుడు సత్రాల్లో తినడు ఆవేళకు చేరిన ఊర్లో ఇంత ఉడక బెట్టుకు తినేవాడు

నడవగా నడవగా ఆయాస మెక్కువై రోజుకి మూడు యోజనాలకి పడిపోయింది నడక క్రమంగా రోజుకి రెండు యోజనాలకి దిగిపోయింది.

ఒకనాడు - మరుసటి మజిలీ చాలా దూరమని తెలిసి ఇంకా చాలారాత్రి ఉండగానే తోటివారితో కలసి అడవి మార్గంలో నడవసాగాడు ఆ రాత్రి సమయంలో పెనుగాలులు . భోరున వర్షం . నిలవడానికి

రక్షణ లేదు. తడుస్తూ . .మూట అటూ ఇటూ మార్చుకుంటూ వొళ్ళంతా నీరు కారుతూ .... చలికి వణుకుతూ, తిట్టుకుంటూ కాళ్లీడవసాగాడు.

వర్షం తగ్గిందని ఊపిరిపీల్చుకో బోయేంతలో – తడిగుడ్డలు పిండుకుని వెచ్చబడుతూండగా .. యమకింకరుల్లాంటి దొంగలు వాళ్లని చావబాది – ఉన్నదంతా ఊడ్చేసి – కట్టుగుడ్డలు, ప్రాణాలతో మాత్రం మిగిల్చారు.

తరువాత నడకకు మూటలబరువు లేకపోవడంతో తేలిక యింది చేతిలో డబ్బులేదు, వొళ్లు హూనమయింది. కాశీయాత్రపై విసుక్కుంటూ చాలా దూరంగా ఉన్న మజిలీని చచ్చీ చెడీ చేరుకున్నారు. ఆ సాయంత్రం వంట చేసికుందుకు పాత్ర సామగ్రి కూడా లేదు. తమ కష్టాలను నలుగురికీ చెప్పుకుని వారిదయతో ఎలాగో రాత్రి భోజనం చేశారు. వారిలో కొందరికి అతిసార రోగం పట్టుకోవడం వలన మర్నాడు ప్రయాణం సాగలేదు. ఆ సత్రంలో రోగుల్ని ఉండనివ్వరు కనుక కావలివారు వారిని బయటకు వెళ్లగొట్టారు అప్పుడారోగులని తీసుకునివెళ్లి మిగిలివారు ఊరిబయటున్న మసీదులో పడుకోబెట్టగా అది తెలిసి తురకలు పరుగెత్తు కొచ్చి వారిని తిట్టి, రోగులను నడివీధిలోకి ఈడ్చి, మిగిలిన వారిని చావగొట్టారు కొందరిని అధికారులు శిక్షించారు రోగులకన్న మిగిలిన వారే ఎక్కువ కష్టాలుపడి – పదిరోజులక్కడ ఉన్నారు. రోగులకు కొంచెం బలం చేరగానే మళ్లీ ప్రయాణం సాగిద్దామన్న వారితో మాతాత ఇలా చెప్పాడు "ఛీ! కాశి రాకాశి అని తెలిసీ బుద్ధి లేక వచ్చాం. జరిగింది చాలు. జ్ఞానంకలవారి కింటి దగ్గరే మోక్షం వస్తుంది. జ్ఞానం లేనప్పుడు నీటికాకుల మునిగి ఉపయోగమేమిటి? అపరాధుల్లా జైల్లో పడ్డాం యవనుల (మహమ్మదీయుల) చే దెబ్బలు తిన్నాం. కడజాతి వారిచే ఈడ్పించుకోబడ్డాం ఈ శిక్షలు చాలు. ఇంటికి పోదాం" కొందరతని మాటలు విన్నారు విననివాళ్లు వాళ్లని వదిలి కాశీ వెళ్లారు మాతాతగారు ఆరుమాసాల కిల్లుచేరి మరో మూడునెలకు మనిషి కాగలిగారు. కాశికి పోయిన పదిమందిలోనూ ఎనమండుగురు దారిలోనే చావగా ఇద్దరు మాత్రం వారణాసి చేరుకోగలిగారట. తిరిగొస్తూ దారిలో చచ్చిపోయారని చాలాకాలానికి తెలిసిందట.

ఈ కథ మాతాతగారు నాకు చెప్పారు." అని ముగించాడు "రానని ఒక్కముక్కలో చెప్పక ఇంతకథ చెప్పావు." అంటూ అతన్నొదిలి వెళ్ళాడు మణిసిద్ధుడు. అతనెంత ప్రయత్నించినా కాశీ వెళ్ళడానికి తోడు దొరక్కపోవడంతో – "నేనేం పాపం చేశాను? విశ్వనాధుని దర్శనం, గంగాస్నానం, అన్నపూర్ణచేతిభిక్ష, కాశీనివాసం లభించే పూర్వపుణ్యం లేదా నాకు?" అని విచారిస్తూ.. విశ్వనాధుడ్ని ధ్యానిస్తూ ...దేశాటనం చేస్తూంటే..... ఒక చిట్టడివిలో పిల్లనగ్రోవి ఊదుకుంటూ పశువులని కాచుకుంటున్న ఒక గొల్లవాడు కనిపించాడు. మెల్లగా అతని వివరాలు కనుక్కున్నాడు

వాడిపేరు కోటప్ప అక్కడి వూరు శ్రీరంగపురం. వాడికి ఇంకా పెళ్లికాలేదు. తల్లితండ్రులు చిన్నప్పుడే చనిపోగా పెదకాపు దగ్గర పశువులు కాస్తూ, వారిచ్చే అన్నం, బట్టతో రోజులు గడుపుతున్నాడు.

"కాశీ మహాపుణ్యభూమి. అక్కడికి వెళ్ళి గంగలో స్నానం చేసి విశ్వనాధుని దర్శించి ఒక్కరాత్రి గడిపినా మరుసటి జన్మలో మహారాజయి పుడతారు " అని చెప్పాడు మణిసిద్ధుడు

గొల్లవాడు ఎవరు వెళ్లినానా?

మణిసిద్ధుడు : ఆ. పురుగులు, మృగములు కూడా గంగలో మునిగితే ముక్తి పొందుతాయి

గొల్లవాడు : అక్కడినుంచేనా కాశీకావడి తెచ్చి ముప్పైత్తుకుని, డబ్బిస్తే కాశీపట్నం చూపిస్తారు?

మణిసిద్ధుడు . ఔన.

గొల్లవాడు · ఐతే ఆ కాశీ పుట్టుపూర్వోత్తరాలు చెప్పు నచ్చితే వస్తాను నాకు కథలంటే ఇష్టం.

అలాగే అంటూ అతని తలమీద చేయివేసి గ్రహణశక్తి కలిగించి – కాశీ మహాత్మ్యాన్ని చెప్పసాగాడు.

# ౨. కాశీ మహిమ తెలుపు కథ

పూర్వం త్రిలోకసంచారి అయిన నారదుడు తీర్థయాత్ర చేస్తూ అనేక పుణ్యక్షేత్రాలకు వెళ్లి అక్కడ నదుల్లో స్నానం చేసి - ఒకనాడు వింధ్యపర్వతం వద్దనున్న అడవి వద్దకు చేరాడు కోకిలలు, చిలకల తియ్యని మాటలతో, మధురమయిన ఫలాలనిచ్చే చెట్లతో ఆ ప్రాంతం ఎంతో మనోహరంగా ఉంది.

నారదుడు నడచివస్తూంటే - వింధ్య రాజు మానవ రూపంలో ఎదురువొచ్చి స్వాగత సత్కారాలు చేసి - "మునీంద్రా! లోకంలో కొండలెన్నో ఉన్నా - నేను, మేరుపర్వతమే కదా గొప్ప? పక్షపాతం లేకుండా మా ఇద్దరిలో ఎవరు అధికులో చెప్పండి" అని కోరాడు నారదుడికి కయ్యాలు పెట్టడం అంటే ఇష్టం కదా "పర్వతరాజా! మొన్ననే నేను మేరుపర్వతాన్ని సందర్శించాను. నువ్వు ఆ మేరుపర్వతం పట్ల గౌరవం చూపావు కాని - మేరు పర్వతం తనకి సాటెవరూ లేరనే నొక్కి చెప్పింది. మీ ఇద్దరి మధ్య తేడాను చెప్పడం ఎవరికైనా తరమేనా?" అని వెళ్ళిపోయాడు.

ఆ మాటకు వింధ్యపర్వతం కలతచెంది - "మేరుగిరి కింత గర్వమా! దాని మదం ఇప్పుడే అణచి వేస్తాను " అంటూ పెరిగిపోయింది. భూమ్యాకాశాలను ఒకటి చేసేంతగా తన శరీరాన్ని పెంచి వేసింది. దాంతో సూర్యుడు మొదలైన గ్రహాల గతులకు అంతరాయం కలిగి - కొన్ని దేశాల్లో చీకటి, కొన్ని దేశాల్లో ఎండ, కొన్ని దేశాల్లో మంచు అలాగే చీడపీడలు కలిగాయి అది గమనించి భయపడిన ఇంద్రాది దేవతలు శతానందుని వద్దకు వెళ్లగా - "ఈ ఉత్పాతం లోపాముద్ర భర్తఅగస్త్యునివల్ల తప్ప చక్కబడదు అత నిప్పుడు కాశీలో కాపరం చేస్తున్నాడు అని చెప్పాడు

"వాళ్లప్పుడు కాశీ చేరుకున్నారు - అని ఆగి - "గోపాలా ఇంతవరకు కథ బాగా అర్థమయిందా? అని ప్రశ్నవేశాడు

"బాగానే తెలిసింది. కాని నాకోసందేహం కలిగింది. వింధ్య – పర్వతం కదా. మనుషుడిలా మాట్లాడ్డం, కావలసినంతగా ఎదిగి పోగలగడం ఏమిటి?" అడిగాడు గోపాలుడు.

అందుకు మణిసిద్ధుడు చాలా సంతోషించి – "భూలోకంలో కొన్ని గొప్ప పర్వతాలకు మనుషుల రూపాలున్నాయి. అవి భార్యా పుత్రులతో కాపరం చేస్తున్నట్లు గ్రంధాలలో రాయబడి ఉంది. హిమాచల పుత్రిక అయిన పార్వతిని – శివుడు పెళ్లాడిన కధను నువ్వు విని ఉంటావు వింధ్యపర్వతం ఆ కోవలోనిదే " అన్నాడు

"ఓహో! అదా! తెలిసింది."

"తరువాత కధవిను. ఇంద్రాదులు కాశీ వెళ్లారు. వింధ్యపర్వతం వల్ల కదా కాశీ చూసే భాగ్యం కలిగిందంటూ సంతోషించి గంగాస్నానం, విశ్వనాధ దర్శనం చేసికొని, అన్నపూర్ణను పూజించి, భైరవాదుల పాదాలకు మ్రొక్కి ఇంకనూ కల శివలింగాలను ఆరాధించి అగస్త్యుని జాడ వెదుక్కుంటూ దేవతలు అతని ఆశ్రమం చేరుకున్నారు.

దివిజులరాకకు మిక్కిలి సంతోషించిన అగస్త్యుడు వారికి స్వాగతం పలికి, సత్కారాలు చేశాడు. "ఏమిటిలా దయచేశారు?" అని అడిగాడు వారు – వింధ్య పర్వతం మూలంగా సంభవించిన ఉపద్రవాన్ని చెప్పి – కాపాడమని ప్రార్థించారు అగస్త్యుడు సరే అని వారిని పంపేశాడు. కాశీ నివాసాని కంతరాయం కలుగుతూందని అతని మనసు కలత పడింది లోపాముద్రతో – "మనం ఈ పురంలో ఏకాంతంగా ఉంటూ ఎంతో సుఖంగా గడుపుతున్నాం. నా ఉనికి వారెలా తెలుసుకున్నారో? దేవతలు మన సుఖానికి అంతరాయం కలిగించారు. నా గొప్పతనమే నాకింత ముప్పు తెచ్చింది ఇదంతా నా కర్మఫలం. దేవతల ప్రతిపాదన కొప్పుకోవద్దని నువ్వేనా చెప్పావు కావు " అని చింతిస్తూ ప్రయాణ సన్నాహాలు చేసికొని – కాశీపురాన్ని ముమ్మారు ప్రదక్షణలు చేసి "గంగాభవానీ! నీ చల్లనినీడ విడిచి పైదేశం పోతున్నాను. అనుజ్ఞ

యిప్పించు అన్నపూర్ణా నీ చేతిభిక్ష వదులుకుని వేరొకచోటుకి పోతున్నాను. దయచూడు తల్లీ విశ్వనాథా. నిన్నువిడచిపోడానికి కాళ్లు రావడంలేదు ' అంటూ అక్కడి దేవతలనందరినీ పేరు పేరునా ప్రార్థించాడు దుఃఖించాడు అలాగే వింధ్యపర్వతానికి వెళ్లాడు." అయ్యా . అగస్త్యుడి కాపూరు వదలడానికంత దిగులెందుకు? పనిపూర్తవగానే మళ్లీ కాశీవొచ్చేస్తాడుగా ఆ ముని?" అని అన్నాడు గోపాలుడు

"రాబోయే కథ చెబుతుంది నీకు జవాబు" అని - మళ్ళీ చెప్పసాగాడు

"అలాగ లోపాముద్రతో అగస్త్యుడు తనవద్దకు రావడంతో వింధ్యుడు గర్వంవిడచి గురుభక్తితో అతని పాదాలకు తన శిఖరాలంటేలా నమస్కరించాడు. ఆ విధంగా వింధ్యపర్వతం వొంగడంతో సూర్యుడు మొదలైన గ్రహాలు మళ్లీ తమతమగతుల్ని పొందాయి లోకానికి ఉపద్రవం తప్పింది. అప్పుడు - అగస్త్యుడు వింధ్యపర్వతాన్ని -

"వత్సా! మేము దక్షిణ దేశయాత్రకు వెళ్లుతున్నాం. మేంవచ్చేదాకా నువ్విలాగే ఉండు. లేకపోతే నా తపఃప్రభావానికి గురికావలసి వస్తుంది" అని హెచ్చరించి, లోపాముద్రతో కలసి దక్షిణముఖంగా వెళ్లిపోయాడు. అందువలనే అతనుమళ్లీ వెనక్కి కాశీ పట్నానికి రాలేదు."

"తరవాతేం చేశాడు?" అని కుతూహలంగా అడిగాడు గోపాలుడు.

"భద్రాచల, పుష్పాచల, ధవళాచలాది పుణ్యక్షేత్రాలు దర్శించి శ్రీశైలం చేరాడు ఆ శ్రీశైలక్షేత్రం గొప్పతనాన్ని లోపాముద్రకు వివరిస్తూ - "ఇక్కడ మల్లికార్జునదేవుడు భ్రమరాంబతో ఏకాంతంగా విహరిస్తూంటాడు ఈ పర్వతంనుంచి పాతాళగంగ అనే పేరుతో కృష్ణానది ప్రవహిస్తూంది. ఈ ప్రాంతం - ముప్పదియోజనాల వైశాల్యంతో నాలుగు ద్వారాలు కలిగి ఉంది ఈ శిఖరంమీద ఎన్నోదివ్యౌషధాలు వృక్షాలు,

రకరకాల మొక్కలు, మృగాలు, నిధులు, ముక్తి ప్రదమైన తీర్థాలు, అనేక మహాలింగాలూ కనపడతాయి ఇక్కడున్న రాళ్లన్నీ శివలింగాలే ఇక్కడుండే చెంచులందరూ మహర్షులే." లోపాముద్ర భర్తకు నమస్కరించి – "స్వామీ! దర్శనమాత్రాన్నే ముక్తిప్రదమైన ఈ క్షేత్రంఉండగా చనిపోయాక కాని మోక్షమివ్వని కాశికి వెళ్లి కష్టాలు పడడం దేనికి? మీరు కాశీ వియోగ సంతాపాన్ని పాతాళ గంగా స్నానంతో చల్లార్చుకుంటూ ఇక్కడే సుఖంగా ఉండొచ్చుకదా?" అని సందేహం వెలిబుచ్చగా – అగస్త్యుడు ఆమెను మెచ్చుకుంటూ – "ఒక ఇతిహాసం ద్వారా నీ సందేహానికి సమాధానం వివరిస్తాను" అంటూ శివశర్మ అనే బ్రాహ్మణుడి కథ సందర్భానుసారంగా చెప్పాడు.

## 3. శివశర్మ కథ

మధుర అనే పట్నంలో శివశర్మనే బ్రాహ్మణుడుఉండేవాడు. అతను సమస్త విద్యల్లో ప్రవీణుడై పండితరాజనే బిరుదు పొందాడు. అనేకమంది పుత్రుల్ని కన్నాడు. యౌవనము గతిస్తూ వార్ధక్యం సమీపిస్తూండగా – "ఇంతవరకూ ఐహిక సుఖాల కోసమే కాలాన్ని వ్యయం చేసుకున్నాను. ఆ ముష్మికం కొంచెమైనా సంపాదించుకోలేక పోయాను. సిరులు అశాశ్వతాలు. శరీరం చంచలం. బంధువులు మాయా సంబంధులు. అన్నీ తెలిసికూడా అజ్ఞానంలో ఉండి పోయాను. ఇప్పటికేనా తెలిసికొన్నాను కనుక – తీర్థయాత్రలకు పోయి పుణ్యం సంపాదించుకుంటాను." అని నిశ్చయించుకుని ఆస్తిపాస్తుల్ని సంతానానికి ఇచ్చివేసి కాశీ యాత్రకు వెళ్ళాడు.

ముందే క్షేత్రాల గురించి గ్రంథాల్లో చదివినవాడు కనుక కాశిలో గంగాస్నానం, విశ్వనాథదర్శనం మొదలైనవి చేసుకుని – అక్కడనుంచి ప్రయాగ వెళ్లాడు. ఎంతటివారినైనా మూడు రోజులకంటె ఉండనీయదు ప్రయాగ క్షేత్రం. అక్కడినుంచి గయ, కాంచీపురం,

ఉజ్జయిని, మధుర, ద్వారవతి అయోధ్య మొదలయిన క్షేత్రాలను దర్శించుకుని మాయాపురం వెళ్లాడు దానిని హరిద్వారమనీ ముక్తి ద్వారమనీ కూడా అంటారు.

హరిద్వారంలో కల తీర్థదేవతలను - ఉపవాసాలచేతనూ అర్చనా విధులచేతనూ తృప్తిపరచి చంద్రశేఖరుని పంచాక్షరీ మంత్ర పారాయణతో మూడు దినములు మహా నిష్ఠతో అర్చించాడు. ఒకనాడు అతను వండుకున్న ఆహారాన్ని భుజించే లోపల అనాయాసంగా మరణించాడు. పావన గంగా తీరంలో దేహంవిడిచాక అతనికి అద్భుతమైన మోక్షదృశ్యాలు కనిపించసాగాయి.

ముందుగా అద్భుతమైన కాంతిపుంజం తనదగ్గరకొస్తున్నట్లు కనిపించింది. కొంచెం నిదానించి చూసేసరికి అది నవరత్నాలతో కూడిన బంగారపు మెరుపులా గోచరించింది ఇంకా దగ్గర కొచ్చేసరికి విమానంలా అనిపించింది. అది తన దగ్గర ఆగేసరికి - ఎక్కాలని సరదా కలిగింది. అంతలో దానిలోంచి ఇద్దరు దివ్యపురుషులు దిగారు

వీరెవరెవరో? ఎవరికోసం వచ్చారో? అని సందేహిస్తూండగా వారు ఖరీదైన బట్టలూ నగలూ పట్టుకుని అతని దగ్గరకొచ్చి "శివశర్మా! వీటిని ధరించు" అన్నారు. అలాంటి గొప్ప గొప్ప వస్తువుల్ని తనంతవరకు చూడనే చూడలేదు ఈ పుణ్యాత్ములెవరో తనని గౌరవిస్తున్నారు వీరెవరో తెలిసికోవాలనుకుంటూ - "అయ్యలారా. మీరెవరు? దీనినెవరికోసం తెచ్చారో తెలియజేయండి" అని అడిగాడు

ఆ దూతలు చిరునవ్వు నవ్వుతూ - "శివశర్మా! మేము విష్ణుకింకరులం. ఈ విమానం నీ కొరకే తెచ్చాం దీన్ని అధిష్టిస్తే, విష్ణులోకానికి వెళ్ళవచ్చు." అన్నారు తానుచదివిన గ్రంథాల్ని గుర్తుచేసికొని - ఇది తీర్థసేవ చేయడం వలన లభించిన పుణ్యఫలం . . అనుకుంటూ వారిచ్చిన బట్టలూ, అలంకారాలూ ధరించి విమానమెక్కి ఊర్ధ్వ లోకాలకు వెళ్తూండగా - దున్నపోతు నెక్కివచ్చిన ఒక దివ్యపురుషుడు వచ్చి అతనికి నమస్కరించాడు "వీరెవరు?" అని శివశర్మ కింకరులనడిగాడు

"యముడు". అని బదులు చెప్పారు విష్ణుకింకరులు.

"పురాణాల్లో యముణ్ని భయంకరంగా వర్ణిస్తారు కదా"

"పాపాత్ముల కలా కనిపిస్తాడు. మీవంటి పుణ్యాత్ములకు మాత్రం ఇలా సౌమ్యంగా కనిపిస్తాడు." అని చెప్పారువారు. ఆ విమానం అనేక భువనాలు దాటి బ్రహ్మలోకం చేరింది శివశర్మ గురించి కింకరులు బ్రహ్మకు చెప్పగా – "ఇతను చేసిన పుణ్యం ఇంతేనా." అని ఈసడించినట్లు చూశాడు. తరువాత శివశర్మ కింకరులనందుకు కారణం అడిగితే "నీవత్యంత పుణ్యాత్ముడివని మేం ఎంత చెప్పినా నీవు కాశిలో దేహం విడువని లోటు గురించి విరించి ఈసడించాడు. కాశిలో మరణించిన వాడెంత పుణ్యాత్ముడైననూ పునర్జన్మ లేని ముక్తిని పొందజాలరు." అని వివరించారు.

. . .

"గోపాలా! కాశీ మహిమ తెలిసికొన్నావు కదా? స్వయంగా చూస్తే కాని ఆ విశేషాలు మరింత చక్కగా తెలియవు వేళచాలా అయింది. నీ సమాధానం చెప్పు " అన్నాడు.

ఆ యతీంద్రుడికి గోపాలుడు భక్తితో నమస్కరించి – "మీరు చెప్పినవి విన్నాక నాకు కాశీరావాలనే ఉంది కాని ఒక విషయం వినండి నేను మీతో వస్తున్నప్పుడు తోవలో నాకేదైనా వింత కనపడితే నా ప్రశ్నకు సమాధానం మీరు కధలా చెప్పాలి మరి. అలా చెప్పకపోతే వెంటనే నేను ఇంటిముఖం పట్టేస్తాను." అన్నాడు.

" నీ కోరిక అంతేకద? అలాటి విచిత్ర విషయాలకు కధలరూపంలో జవాబుచెబుతాను. నువ్వు సందేహించకుండా మీయజమానికి చెప్పేసిరా" అన్నాడు యతి

గోపాలుడు తన కాపుకు కాశీయాత్రగురించి చెప్పి ఒప్పించుకుని కావలసిన సామగ్రిని కావడికట్టి రాగా మణిసిద్ధుడు ఒకశుభముహూర్తాన గోపాలునితోడు తీసుకుని కాశీయాత్ర ప్రారంభించాడు.

ఆ యతీంద్రుడు - చేసేది కాశీయాత్ర కదా అని మార్గంలో ఓంకారం జపిస్తూ నడుస్తూంటే గోపాలుడు మధ్యమధ్య ఏదో ఒకప్రశ్న అడిగేవాడు. మాట్లాడకూడదని చేతితో సూచించి - తొందరగా నడచుకుంటూ మొదటిమజిలీ చేరాడు. ఒక సత్రంలో బస చేశాడు. అక్కడ మౌనం వదిలి "నేనిక్కడ వంట చేస్తాను. ఆకులు, కట్టెలు లేవు. ఇది అడవి ప్రాంతమే కనక ఊరిబయట దొరుకుతాయి. కొట్టి తీసుకురా" అని గోపాలుడికి పురమాయించాడు

గోపాలుడికిది అలవాటయిన పనే కనుక కట్టెలుకొట్టి ఆకులు తెంచి వాటిని మూటకట్టి తలకెత్తుకోబోతుండగా ఆకాశంలో ఒక కీలురథం వెళ్తూ కనిపించింది

"నేలనంటకుండానే ఈ రథం పరుగెత్తుతూందే! ఈ వింతేమిటీ?..." అనుకుంటూ త్వరత్వరగా సత్రానికొచ్చి "అయ్యగారూ! అయ్యగారూ!" అంటూ కేకవేశాడు అయ్యగారు మడి కట్టుకొంటే ఇతర జాతులవారితో మాట్లాడరని వాడికింకా తెలియదు ఎంతగట్టిగా అరిచినా జవాబివ్వక పోవడంతో వాడికి కొంచెం కోపమొచ్చింది. "ఈ కేకకు పలక్కపోయారో నేనిలాగే యింటికి పోతాను" అంటూ నెత్తిమీది మోపు క్రింద పడేసాడు. అయ్యగా రివతలకివొచ్చి - భోజనంచేశాక మాట్లాడతానని చేతితో సౌంజ్ఞ చేశారు . గోపాలుడు కూడా భోజనం చేశాక - "ఇప్పుడు చెప్పు" అన్నారు.

"అయ్యా! నేనాకులకు వెళ్లినప్పుడు - ఒక బండి ఆకాశంలో పోతూంది. దాంట్లో స్త్రీలు, పురుషులు కూర్చుని వినోదంగా మాట్లాడుతున్నట్లు కూడా వినిపించింది అదేమిటో చెప్పండి చెప్పేటప్పుడు గూఢార్థాలూ, సంస్కృతపదాలు ఉంటే నాకర్థం కాదు " "గోపాలా! నువ్వు శౌనక మహర్షిలా కథలంటే చెవికోసుకుంటావు కనుక నిన్నిక శౌనకుడంటాను" అంటూ - సన్యాసిచ్చిన మాణిక్యాన్ని ముందుపెట్టుకుని పూజించేసరికి - ఆ వృత్తాంతమంతా యతి కన్నులకు కట్టినట్లు కనపడసాగింది

# కాశీ మజిలీ కథలు

## 1 వ మజిలీ

### 4. శూరసేన మహారాజు కథ (కీలురథం కథ)

కాశ్మీరదేశంలో మధుర అనేపట్నంలో శూరసేనుడనే రాజుండే వాడు. అతను ధార్మికుడు, నీతివంతుడు, వినయశీలుడు, బుద్ధికుశలుడు. తన రాజ్యంలోని ప్రజల్ని ప్రేమగా పాలించేవాడు. అతనికి వినయనిధి అనే సర్వసమర్థుడైన మంత్రి ఉండేవాడు. రాజువద్ద ఉండే - కళానిధి పేరుగల పురోహితుడు కూడా మంచి సమర్థతతో కాలవైపరీత్యాది దోషాలకు తగిన శాంతులు చేయిస్తూ.. రాజుకి సలహాలు కూడా యిచ్చేవాడు. ఒకవర్తక శ్రేష్టుడు, సకల యంత్రరచనా నిపుణుడగు కళాకారుడు కూఢా రాజుకి ఆప్తులే. వీరైదుగురు ఒకే ప్రాణంలా ఉండేవారు.

ఒక వసంతకాలం సాయంత్రం - వట్టి వేళ్ల చాపలనుండి - చల్లని, సుగంధ మయమైన గాలులు వీస్తుండగా భవనం పైభాగంలో వీరు నలుగురితోనూ ఏకాంతంగాకొలువు తీరాడు రాజు. అతను తన మనసులో విచారాన్ని దాచుకుంటున్నట్లు ప్రసంగిస్తూంటే వినయనిధి అనునయంగా అడిగాడు. "రాజా! ఇవాళ మీరెందుకో విచారంగా ఉన్నారు. ఏపనినయినా సాధించగల మేముండగా మీకు చింతదేనికి?"

అందుకు రాజొక నిట్టూర్పు విడిచి - "మిత్రులారా! నాకే లోటూలేదు. కాని నేడు మన ఆస్థానానికి వచ్చిన వార్తాపత్రికని చూశాక నాకు విచారం పట్టుకుంది. ఒక కోటీశ్వరుడు అకాల మరణం చెందాడు. అతనికి సంతానంకాని రక్త సంబంధీకులు కాని లేరట. మరణ శాసనం రాయలేదు. అందుచేత ఆ ఆస్తి అంతా మన ఆధీనమైందని గ్రామాధికారి విజ్ఞాపన పత్రిక పంపాడు. మీరూ చూశారు.

సంతానం లేనివాని గతి ఏమిటో మనం కళ్ళతో చూశాం కదా మనకీ ఇలాటి దుస్థితి సంభవిస్తుందేమోనని చింత మొదలైంది మనలో ఒక్కరికీ పుత్రుడు లేకపోయాడు నా విచారం ఇదే " అన్నాడు అప్పుడు మంత్రి వినయనిధి మెల్లగా . "దేవా! మనకు పుత్రులు లేరని, మన అనంతరం రాజ్యంఎవరి అధీనంఅవుతుందో అనీ చింతించకండి పుత్రోత్పత్తి విషయమై అనేక సాధనా లున్నాయి. దశరథుడు మొదలగు చక్రవర్తులు వృద్ధులయినా పుత్రకామేష్టి వంటి సత్క్రియల వల్ల సంతానలాభం పొందారు కదా? అలాటి సాధనం మన పురోహితుడు కూడా చెప్పగలడు " అన్నాడు

అప్పుడు పురోహితుడు లేచి – "రాజా! పుత్రసంతతిని పొందడానికి పెక్కువిధులు పురాణాల్లో చెప్పబడి ఉన్నవి అవి – హోమాలు, దానాలు, తీర్ధసేవనలు మొదలైనవి. వీటన్నింటిలో సులభమయిన మార్గమేదో కనుక్కుని ఆపనిలో నిమగ్నమౌతాను

అప్పుడు కళానిధి "వృద్ధుడైన నరసింహదేవ మహారాజు బ్రాహ్మణ ప్రసాదంతో కృష్ణదేవరాయలను కన్నారు కదా!" అన్నాడు

"ఏమిటీ. ఆ వృత్తాంతం చెప్పు" అన్నారు రాజుగారు అప్పుడు పురోహితుడు ఇలా చెప్పసాగాడు.

## 5. కృష్ణ దేవరాయల జనన కథ

నరసింహదేవ మహారాజు ఆంధ్రదేశంలో ప్రసిద్ధులు కవులనుంచి అనేక కృతుల్ని అంకితంగా పొందినవారు వృద్ధులైనా వారికి సంతానం కలగలేదు. అందుకు మంత్రి చాలా చింతించి జ్యోతిష ప్రవీణులైన సిద్ధాంతుల్ని రప్పించి – "దైవజ్ఞులారా. రాజుగారు సంతానం కలగక చాలా చింతిస్తూన్నారు మీవలన రాజుగారికి ప్రయోజనం కలుగవలసి ఉంది మీకు భూతభవిష్యద్వర్త మానకాలాలు మూడును

కరతలామలకములే కదా. మీరు ప్రాచీన జ్యోతిష గ్రంథాల్ని పరిశీలించి రాజుగారి జాతకాని కనుగుణంగా ఉండే కాలరీతి కనిపెట్టి వారికి సంతానయోగం కలిగే మార్గం చెప్పండి. లేదా మీ అగ్రహారముల్ని వదిలి పరదేశాలకి పోవలసిఉంటుంది" అన్నాడు

అప్పుడు వారు మంత్రిగార్ని ఆరుమాసాల వ్యవధి కోరారు ఇళ్లకి వెళ్లాక సిద్ధాంతులందరూ అంతవరకు తాము తెరచిచూడని పురాతన జ్యోతిషగ్రంధాల్ని కూడా తిరగేశారు ఒకనాడొక గ్రంథంలో సంతాన జననసూచక విషయం కనిపించింది

ఆ సంవత్సరం మూఘ బహుళ చతుర్దశీ భానువారం నాటి రాత్రి తులాలగ్నం రెండు గడియలు భుక్తి అయిన పిమ్మట ఆ గ్రామానికి ఉత్తర దిశగా రెండు కోసుల దూరంలో ఆకాశంనుండి ఒక నక్షత్రం భూమిపై పడుతుందని సిద్ధాంతమూలంగా తేలింది బుద్ధిమంతులయిన సిద్ధాంతులు దానిని పుత్రోత్పత్తికి కారణంగా మార్చి – ఆ నక్షత్రాన్ని ఒక కలశంలోని నీటిలోనికి పట్టి ఆ జలాన్ని తాగితే పుత్రోత్పత్తి ఔతుందని నిశ్చయించారు ఈ సంగతి వెంటనే మంత్రికి తెలిపారు.

మంత్రి ఆ స్థలంలో ఎత్తుగా ఒక మంచె కట్టించి, దానికి మెట్లేర్పరచి, మహాశివరాత్రినాడు ఒక వృద్ధ బ్రాహ్మణున్ని ఉపవాసంతో దానిమీదకు ఎక్కించి పవిత్రోదకంతో నింపిన బంగారు కలశం ఒకటి అతని చేతికిచ్చారు రాజు, మంత్రి సామంతులు, పౌరులు, గ్రామ గ్రామాలవారు ఎందరో నక్షత్రపతన దర్శనానికి కనురెప్పవేయకుండా చూడడానికి వచ్చారు.

సిద్ధాంతులు చెప్పిన వేళకే మిరుమిట్లు కొలుపుతూ ఒక నక్షత్రం బ్రాహ్మణుని చేతిలో ఉన్న కలశంలోని ఉదకంలోకి తళుక్కుమనిజారింది. రాజుగారు – మంత్రి చెప్పగా ఆ సిద్ధాంతులకు అనేక అగ్రహారాలను బహుమతిగా ఇచ్చాడు

ఆ కలశంలోని నీటిని రాజు తాగాడు రాజుగారికి చిన్నభార్యంటే ఎక్కువప్రీతి కనుక ఆ రాత్రి అమెను పడకకు రమ్మన్నాడు. కాని అమె –

కాన్పువల్ల యౌవనం జారిపోతుందనీ, అందువల్ల యౌవన సుఖానికి లోటువొస్తుందనీ తలపోసి తనకి బదులుగా తనకిష్టమైన దాసిని తనలాగ అలంకరించి రాజుఉన్న శయ్యా గృహానికి పంపింది. స్త్రీలకు కామాన్ని మించిన అభిలాష ఉండదు కదా.

ఆ వయసులో ఉన్న దాది రాజు భార్యవలె అభినయిస్తూ మంచం దగ్గర మౌనంగా నిలుచుంది కలశోదకం త్రాగింది మొదలు మదోన్మత్తతతో కైపెక్కిన రాజు ఆమెను తన భార్యయే అనుకుంటూ రతిక్రీడ సలిపాడు అనంతరం నిదానించి ఆమె నీచకాంతగా తెలిసికొని కోపంపట్టలేక ఒకచేత్తో ఆమె జుత్తు పట్టుకుని రెండోచేతితో కత్తిపైకెత్తి అంతలోనే ఆగి – మంత్రిని వెంటనే తీసుకురమ్మని భటుణ్ణి పంపాడు. అంత అర్ధరాత్రి రాజు కబురంపాడంటే ఏమి ఉపద్రవం ముంచుకొచ్చిందో అని పరుగు పరుగున వచ్చిన మంత్రి ఆ దృశ్యంచూసి భయంతో – "దేవా! ఆగు, ఎందుకింత సాహసం తలపెట్టావు? ఈమె ఏమి తప్పు చేసింది?" అని అడిగాడు.

రాజు జరిగిందంతా చెప్పి – "నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు

"అయ్యా! ఈ నేరం చేరసినదీమె కాదు యజమానురాలి ఆజ్ఞ నిర్వర్తించింది. రాణిగారు బాల్య చాపల్యం వల్ల అలా చేశారు ఎంతో ప్రయత్నించి సాధించిన దానిని ఊరికే చెడగొట్టుకోడం వివేకం కాదు. దైవ సంకల్పం ఇలా ఉంటే మార్చడం మనుషులతరమా? పుత్రులలో ఔరసుడు, క్షేత్రజ్ఞుడు ముఖ్యులు. దీనికి జనించువాడు ఔరసుడౌతాడు అతడందరి కంటె ఉత్తము డౌతాడని శాస్త్రం ఈమెను భార్యగా స్వీకరించి అంతఃపురంలోనే ఉంచండి" అన్నాడు మంత్రి రాజు అంగీకరించాడు

మంత్రి ఇంటికి బయలుదేరేసరికి తెల్లవారుతోంది. అక్కడక్కడ వీధుల్లో జనంగుంపులుగా చేరి గుసగుస లాడుకుంటున్నారు మనసు వ్యాకులమై ఉన్నందున అదేమిటో కనుక్కోకుండానే మంత్రి ఇల్లు చేరాడు. భార్య ఎదురొచ్చి – "నగరంలో విశేషాలేమిటి? అర్ధరాత్రి రాజుగారెందుకు కబురు చేశారు?" అని ప్రశ్నించింది.

"రాచకార్యపు తొందర–" అన్నాడు మంత్రి పూర్తిగా – నిజంచెప్పలేక. అందుకామె నర్మగర్భంగానవ్వి –

"మీరు చెప్పకుండా దాచినా నాకు కొంతవరకూ తెలిసిందిలెండి" అంది

"నీకేం తెలిసిందో?" చెప్పమన్నట్లు ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె చెప్పింది – నిజంగా జరిగిందే. ఎక్కడా ఒక్కముక్కా పొల్లుపోలేదు.

మంత్రి ఎంతో ఆశ్చర్యపడుతూ – "నాకన్నా ముందే ఈసంగతి ఊరికి తెలిసిపోయింది. లోకం ఎంతటిది!" అనుకున్నాడు. కాని. ఆ రహస్యం ఊళ్ళో అందరికీ తెలిసిపోయిందని మాత్రం రాజుకి చెప్పలేదు.

కాలక్రమంలో ఆ దాది మన్మథుడిలాటి బాలుణ్ని ప్రసవించింది.

అతడే హంపీ విజయనగరాన్ని పాలించిన కృష్ణదేవరాయలు. అష్టదిగ్గజాలనే బిరుదులు పొందిన మహాకవుల కృతులనేకంఅంకితాన్ని పొందిన ఘనుడు "రాజా! తమక్కూడా అలాగే బ్రాహ్మణ ప్రసాదంవలన పుత్రుడు కలుగుతాడని చెప్పాడు. తర్వాత – షరాబు వ్రతదాన పరమ తర్పణాదులు ప్రయత్నించమని శూరసేన మహారాజుని తొందర పెట్టాడు. అప్పుడు కళానిధి లేచి – "రాజా! పుత్రోత్పత్తికి వీరుచెప్పినవి దైవికాలు కలిగితే కలగొచ్చు, లేకపోతే మానెయ్యొచ్చు. అలాకాక మానుషమైన ఉపాయాన్ని నేను చెప్తాను. వైద్య గ్రంథములు శోధించి చెప్పుచున్న విషయమిది అపుత్రతకు హేతువు దంపతుల రోగం. దానికి తగిన చికిత్స చేసినచో తప్పక సంతానం కలుగుతుంది."అన్నాడు.

అలాగ వీళ్లయిదుగురూ వెన్నెలలో బల్లచుట్టూ వలయాకారంలో కూర్చుని సంతానం విషయం మాట్లాడు కొంటూండగా – అంతరిక్షము నుండి ఒక మామిడిపండు బల్లమీద పడింది. వాళ్ళు ఆశ్చర్యంతో ఆకాశంవైపు చూశారు. దూరంగా ఒక గరుడపక్షి గిరికీలు కొడుతూ కనిపించింది. మామిడిపండుమీద పక్షి ముక్కు గీతలు కనపడడంతో –

ఉండక పెళ్లెందుకు చేసుకున్నాను? పెళ్ళాడినా యిలాటి దుర్మార్గురాలే ారకాలా? బృహస్పతంతటి వాడికే కళంకము తెచ్చిన స్త్రీజాతిని నమ్మి ాదకుందురా? అని బాధపడ్డాడు.

భార్య జారిణి అయినచో ఏంచేయాలో రాసి ఉన్న నీతిశాస్త్రం ారగేశాడు.

భార్య జారిణి అయితే - ఎరిగినా ఎరుగనట్లూరకొనుట, ారకుండలేకపోతే దేశాంతరం పోవుట, అది కూడా యిష్టంలేకపోతే ారణమే మేలని చనిపోవుట, ఈ మూడుమార్గములవల్లనూ అపఖ్యాతి ాయముండదు అని రాసి ఉంది.

దేశాంతరం పోవడం ఒంటరిగానా, భార్యతోనా? అని కొంత తర్కించుకున్నాడు

భార్యతో వెళ్తే అక్కడకూడా దానివలన అపఖ్యాతి రాగలదు ందుచేత ఒంటరిగా పోవుటయేమేలని - దర్భాసనము, కొన్ని గ్రంథములు, దేవతార్చన సంచి - మూటకట్టుకుని రహస్యంగా యిల్లు వదిలి అడవిమార్గాన పోసాగాడు

గురువుగారి మనసులో చింత తెలిసిన నలుగురు విద్యార్థులు వీరితో పోవాలని సిద్ధంగానే ఉన్నా, నిద్రలో ఉండడంతో వెళ్లలేకపోయారు. అయినా మెలకువరాగానే జాడలను బట్టి వీరుకూడా నడవసాగారు. శిష్యులు ఎక్కువ బలంకల వారవడం వల్ల తెల్లవారేలోగానే గురువును సమీపించారు. వీరు తననింటికి తీసుకుపోడానికే వొస్తున్నారని గురువుగారెంతవేగంపెంచినా కుదరలేదు

"మీరెందు కొస్తున్నారు నా వెంట?"

"మాకింకనూ విద్య పూర్తికాలేదు తమవంటి గురువులు మాకు ారకరు. అందుకే మేము మీవెంట వొస్తున్నాం " అన్నారు వారు.

"మీరు నాతో వొచ్చేకారణం నాకు తెలుసు నా భార్య జారిణి యని అందరికీ చెప్పి నన్నపకీర్తి పాలు చేయాలనే మీరు నాతో రావొద్దు

నేనెక్కడికీ రాను. మీమానాన మీరు పొండి". అంటూ నేలమీద చతికిల పడిపోయాడు

వారామాటలకు ఆశ్చర్యపోయారు. "శివ శివా! మాకు విద్యాసక్తి తప్ప వేరు గొడవేమీ తెలియదు మీ రెందుకో దేశాంతరమేగు చున్నారనుకున్నాము. అమె మాకు తల్లి మీ పాదముల మీదొట్టు. మమ్మల్నీ మీతో తీసుకుపొండి". అని వారి పాదాలు పట్టుకుని వదలలేదు

అతనెన్ని విధాలుగా వ్యతిరేకించినా శిష్యులు వినలేదు. చివరకు గురువు సమ్మతించకతప్పలేదు. శిష్యులు వారి సామగ్రి పట్టుకుని వారి వెనుక నడుస్తూ - జాముపొద్దెక్కేసరికి ఒక పట్నం చేరుకున్నారు. ఒక బ్రాహ్మణ వీధిలో రెండువేపులా యింటి అరుగులున్ననూ ఆఛాందసులు వీధిలోనే కూర్చుని మార్గాయాసం తీరడానికి పైపంచెలతో విసురుకోసాగారు.

ఒక గృహస్థుని భార్య మంచినీటికై బావికి వెళ్తూ వారిని చూచి వారు "మీరెవరు?" అని అడిగింది "పరదేశులం-" అన్నారు, వారు.

"మీరు పరదేశులు కారు-" అందామె అని బావికెళ్ళి పోయింది ఆమె తిరిగివచ్చేసరికి వీరాలోచించుకుని - 'పరదేశులము కానిచో మార్గస్తులమైనా కామా?" అన్నారు

"మార్గస్తులు కూడా కారు-" అందామె.

"ఐతే ..బాటసారులమని చెప్పుచున్నాం" అన్నారు వాళ్ళు

'మీరు బాటసారులూ కారు - " అని బావికి మళ్ళీ వెళ్ళింది.

వాళ్ళు ఆశ్చర్యపోయారు 'ఈ గ్రామంలో ఆడవాళ్ళకు సైతము అఖండ పాండిత్యం కలదు కాబోలు. అనేక శాస్త్రములు చదివాము కాని మనమెవ్వరమో తెలిసికొనలేకపోయాం ఇంకేమని చెప్పాలి? మనం వెళ్తున్నది పరదేశం పండితులతో సంభాషించవలసి ఉంటుంది ఆమె వచ్చువరకు ఆగి మనమెవ్వరమో తెలిసి కొని మరీ వెళ్ళాలి'. అని నిశ్చయించుకుని ఆమె వచ్చాక - ఆమెకు వందనం చేయబోయారు ఆమె వారించింది.

ఆ పక్షి ఎక్కడినుంచో తీసుకుపోతుండగా అపండు జారిపడిందని గ్రహించారు అప్పుడు మంత్రి – పురోహితుడితో. “ప్రశ్నశాస్త్రం ఆధారంగా యీ ఫలంవెనుక వృత్తాంతం చెప్పు” అన్నాడు. అతడప్పటి లగ్నం బట్టి చూడగా అది సంతాన జనన కారకమగు ఫలమని తేలింది వారు దైవానుగ్రహానికి సంతోషించి – ఆ ఫలమునప్పటికప్పుడే విభజించి రాజుటెంకను, మంత్రి తొక్కనీ; బ్రాహ్మణుడు వర్తకుడు కంసాలి రసము కల ముక్కలనూ యిళ్లకు తీసుకెళ్లి భార్యల కిచ్చి ఆ రాత్రి రతిక్రీడలు సలిపారు. ఉదయం వారి హృదయాలకు కొడుకు పుట్టే శుభసూచకాలెన్నో కనిపించాయి. కాలక్రమంలో వారి భార్యలు గర్భచిహ్నాలు ప్రదర్శించారు పదవమాసంలో శుభలగ్నంలో ఐదుగురికీ పుత్రులు జన్మించారు ”

అని మణిసిద్ధుడు చెప్పగా “అయ్యా! మామిడిపండు తిన్నంత మాత్రానే వాళ్ల భార్యలు గర్భందాల్చి పుత్రులను కన్నారంటే ఆపండు వెనుక ఏదో విశేషముండి ఉండకపోదు అదేమిటో చెప్పండి” అని అడిగాడు

అందుకా యతి పుంగవుడు సంతోషించి ఆకథ చెప్పసాగాడు

## 6. మామిడి పండు కథ

కర్ణాటకదేశంలో శుద్ధమతి అనే బ్రాహ్మణుడుండేవాడు చిన్నతనంలోనే తల్లితండ్రులు మరణించి ఏకాకి అవడంవల్ల అతను కాశీపట్నం చేరుకున్నాడు అతనికి విద్యాభిలాషలేకపోయినా భోజనం దొరుకుతుందని విద్యార్థుల్లో కలిశాడు చిత్రంగా – అతనికందరికంటే సులభంగా విద్య అలవడసాగింది.

సాధారణంగా విద్యార్థులు పెళ్లికావడంతోనే కాశీ వొచ్చి చదువునేర్చుకుని భార్యఎదిగాకే యింటికి పోవడం రివాజు శుద్ధమతికి తనవూరు, తనవారు లేకపోడంతో నలభైఏళ్లు వొచ్చేవరకూ కూడా

చదువుతూనే ఉన్నాడు కాశీలో ఎవరికైనా విద్యార్థి అనే తప్ప ఉపాధ్యాయుడనే పేరురాదు కాని యితనికి ఉపాధ్యాయుడనేకాక ప్రఖ్యాతికూడ వచ్చింది. అప్పుడతనికి తన గ్రామం వెళ్లాలనే కోరిక కలిగింది కొందరు విద్యార్థులను వెంటబెట్టుకుని తనవూరు వెళ్లాడు అతనినెవరూ గుర్తుపట్టకపోయినా అతని కీర్తిని తెలిసినవారు మిక్కిలి గౌరవం చేసి తమయింటిలో బసయిచ్చి కొన్నాళ్ళు అతిధ్యమివ్వసాగేరు కాశీనుంచి గొప్పపండితుడు వొచ్చాడనివిని చుట్టుప్రక్కల అనేక గ్రామాలనుంచి విద్యార్థులతని వద్దచేరి శాస్త్రాలు చదవసాగారు. లౌకికవిషయములోనే తప్ప విద్యావిషయంలో ఛాందసం లేకపోవడం, బోధనాశక్తి, సహనమూ ఎక్కువగా ఉండడం వల్ల అతని వద్ద చేరిన విద్యార్థి మరియొక చోటుకి పోడు

శుద్ధమతి ప్రఖ్యాతి విన్న శ్రోత్రియబ్రాహ్మణుడొకతనితో బంధుత్వము కలుపుకొనిన చాలునని – అతని వయసును పరిగిణించక పదిహేడేండ్ల తనకుమార్తె నిచ్చి వివాహం చేశాడు. ఆమె మరో నాలుగు సంవత్సరాలకు కాపురముకు వొచ్చి – ఆడతోడు లేకపోవడంతో కొన్నాళ్లు లజ్జతో ఉన్నా క్రమంగా ప్రౌఢత్వంతో మసలసాగింది విద్యార్థులను తనపుత్రులుగా భావించుకుంటూ వీరితో చనువుగా ఉండసాగింది

అవిచూచి ఆ వృద్ధబ్రాహ్మణుడు– "స్త్రీలు దుష్టమతులని ఎరిగియూ దీనిని విద్యార్థులతో చనువుగా మాట్లాడనిచ్చిన నాకంటె మూర్ఖుడుంటాడా? ఎంత ధృడమైన స్త్రీల మనసులయిననూ పురుషులుసమీపించేసరికి చలించక మానవు" అనుకొంటూ విద్యార్థులకూ తన భార్యకూ సంబంధమున్నదని గుడ్డిగానమ్మి ఆమె నవ్వినా, చూచినా,మాట్లాడినా విద్యార్థులకోసమే అని భావిస్తూ విద్యార్థులకు పాఠం చెప్పడంమాని సర్వకాల సర్వావస్థలయందూ ఆమెను విడవక తిరిగేవాడు

వీధులలో ఎవరేమనుకున్నా నవ్వుకున్నా తనభార్య జారత్వం గురించే అనీ, తనకి అపకీర్తి వొచ్చిందనీ చింతిస్తూ – ఎంతో చదువుకుని కూడా కాశీలో ఉండక యిక్కడికెందు కొచ్చాను? వచ్చినా స్వేచ్ఛగా

ఉండక పెళ్లెందుకు చేసుకున్నాను? పెళ్ళాడినా యిలాటి దుర్మార్గురాలే దొరకాలా? బృహస్పతంతటి వాడికే కళంకము తెచ్చిన స్త్రీజాతిని నమ్మి చెడకుందురా? అని బాధపడ్డాడు.

భార్య జారిణి అయినచో ఏంచేయాలో రాసి ఉన్న నీతిశాస్త్రం తిరగేశాడు.

భార్య జారిణి అయితే - ఎరిగినా ఎరుగనట్లూరకొనుట, ఊరకుండలేకపోతే దేశాంతరం పోవుట, అది కూడా యిష్టంలేకపోతే మరణమే మేలని చనిపోవుట, ఈ మూడుమార్గములవల్లనూ అపఖ్యాతి భయముండదు అని రాసి ఉంది.

దేశాంతరం పోవడం ఒంటరిగానా, భార్యతోనా? అని కొంత తర్కించుకున్నాడు.

భార్యతో వెళ్తే అక్కడకూడా దానివలన అపఖ్యాతి రాగలదు అందుచేత ఒంటరిగా పోవుటయేమేలని - దర్భాసనము, కొన్ని గ్రంథములు, దేవతార్చన సంచి - మూటకట్టుకుని రహస్యంగా యిల్లు వదిలి అడవిమార్గాన పోసాగాడు.

గురువుగారి మనసులో చింత తెలిసిన నలుగురు విద్యార్థులు వీరితో పోవాలని సిద్ధంగానే ఉన్నా, నిద్రలో ఉండడంతో వెళ్లలేకపోయారు. అయినా మెలకువరాగానే జాడలను బట్టి వీరుకూడా నడవసాగారు. శిష్యులు ఎక్కువ బలంకల వారవడం వల్ల తెల్లవారేలోగానే గురువును సమీపించారు. వీరు తననింటికి తీసుకుపోడానికే వొస్తున్నారని గురువుగారెంతవేగంపెంచినా కుదరలేదు.

"మీరెందు కొస్తున్నారు నా వెంట?"

"మాకింకనూ విద్య పూర్తికాలేదు. తమవంటి గురువులు మాకు దొరకరు. అందుకే మేము మీవెంట వొస్తున్నాం " అన్నారు వారు

"మీరు నాతో వొచ్చేకారణం నాకు తెలుసు నా భార్య జారిణి యని అందరికీ చెప్పి నన్నపకీర్తి పాలు చేయాలనే మీరు నాతో రావొద్దు

నేనెక్కడికీ రాను. మీమానాన మీరు పొండి". అంటూ నేలమీద చతికిల పడిపోయాడు

వారామాటలకు ఆశ్చర్యపోయారు. "శివ శివా! మాకు విద్యాసక్తి తప్ప వేరు గొడవేమీ తెలియదు మీ రెందుకో దేశాంతరమేగు చున్నారనుకున్నాము. అమె మాకు తల్లి మీ పాదముల మీదొట్టు మమ్మల్నీ మీతో తీసుకుపొండి". అని వారి పాదాలు పట్టుకుని వదలలేదు

అతనెన్ని విధాలుగా వ్యతిరేకించినా శిష్యులు వినలేదు చివరకు గురువు సమ్మతించకతప్పలేదు. శిష్యులు వారి సామగ్రి పట్టుకుని వారి వెనుక నడుస్తూ - జాముపొద్దెక్కేసరికి ఒక పట్నం చేరుకున్నారు. ఒక బ్రాహ్మణ వీధిలో రెండువేపులా యింటి అరుగులున్ననూ ఆఛాందసులు వీధిలోనే కూర్చుని మార్గాయానం తీరడానికి పైపంచెలతో విసురుకోసాగారు.

ఒక గృహస్థుని భార్య మంచినీటికై బావికి వెళ్తూ వారిని చూచి వారు 'మీరెవరు?" అని అడిగింది "పరదేశులం-" అన్నారు, వారు

'మీరు పరదేశులు కారు-" అందామె అని బావికెళ్ళి పోయింది. ఆమె తిరిగివచ్చేసరికి వీరాలోచించుకుని - "పరదేశులము కానిచో మార్గస్తులమైనా కామా?" అన్నారు.

మార్గస్తులు కూడా కారు-" అందామె.

"ఐతే.. బాటసారులమని చెప్పుచున్నాం" అన్నారు వాళ్ళు

"మీరు బాటసారులూ కారు - " అని బావికి మళ్ళీ వెళ్ళింది

వాళ్ళు ఆశ్చర్యపోయారు 'ఈ గ్రామంలో ఆడవాళ్ళకు సైతము అఖండ పాండిత్యం కలదు కాబోలు. అనేక శాస్త్రములు చదివాము కాని మనమెవ్వరమో తెలిసికొనలేకపోయాం ఇంకేమని చెప్పాలి? మనం వెళ్తున్నది పరదేశం పండితులతో సంభాషించవలసి ఉంటుంది ఆమె వచ్చువరకు ఆగి మనమెవ్వరమో తెలిసి కొని మరీ వెళ్ళాలి' అని నిశ్చయించుకుని ఆమె వచ్చాక - ఆమెకు వందనం చేయబోయారు. ఆమె వారించింది

"మేమొట్టి శుద్ధ వెర్రి మూఢులం". అన్నారు.

"కాదు" అందామె

"నాలుగు విధముల చెప్పినా కాదంటివి నువ్వు మహావిద్వాంసురాలివిగా అనిపిస్తున్నావు మేమెవ్వరమో చెబితే తెలిసికొని సంతోషించి వెళ్తాం" అన్నారు

"ఇప్పుడు చాలా వేళయింది మా యింటికి వొచ్చి వంట చేసికుని భోజనం చేయండి. తరవాత చెబుతాను" అని వారి నాహ్వానించి వంట సామగ్రి యిచ్చి- నూతివద్ద స్నానం చేసి త్వరగా వంట, భోజనం ముగించండి. నా మగడు వట్టి అనుమాన పిశాచం పన్నెండు గంటలకు రాజుగారి కొలువు నుంచి వొచ్చేస్తాడు" అని తొందర చేసింది

కానీ ..ఆ ఛాందసులు దేవతార్చన చేస్తూంటేనే పన్నెండు అవడమూ, రాజుగారికి పురాణం చెప్పి యజమానుడు యిల్లు చేరడమూ జరిగిపోయాయి.

యజమాని వాడుక ప్రకారం నాలుగుగదులూ వెదికి చూడగా ఒక గదిలో యీ గురుశిష్యబృందం కనిపించారు. ఆ గదికీ, తన భార్య కల గదికీ తాళములు వేసి లక్కసీలుతో ముద్రవేసి పరుగు పరుగున రాజు వద్దకు పోయాడు

గోపాలా ఆ బ్రాహ్మణునకు భార్యపై విపరీతమైన అనుమానము. ఒకనాడు రాజుగారితో – 'అయ్యా తమరనేక నేరములకు శిక్ష విధిస్తారు కాని జారత్వదోషానికెందుకు శిక్ష విధించరు?' అని అడిగాడు

"అటువంటి దోషమెక్కడున్నదో చూపు దండిస్తాను" అన్నాడు రాజు

ఆ బ్రాహ్మణుడు సిగ్గు విడచి – 'ఎక్కడో కాదు రాజా మాయింటనే జరుగుతూంది నేనిచ్చటకు పురాణం చెప్పడానికి వొచ్చిన వేళలో యింటివద్ద నా భార్య విటులతో విచ్చల విడిగా వ్యభిచరించుచున్నది ' అని చెప్పాడు

రాజతని ఆరోపణలోని సత్యాసత్యాలను తెలిసికొందుకు ఎందరినో అడిగాడు

'పురోహితులు అబద్ధమాడారు. మీ భార్య దొడ్డయిల్లాలుట. ఎందరో చెప్పారు – " అని అతనిని నిలదీశాడు

"మీరడిగిన వారందరూ ఆమె విటులే" అన్నాడు పురోహితుడు. "నేనునిజమే చెప్పాను".

"అలా అయితే – యీ సారి మీ భార్య విటులతో ఉండగా వచ్చి నాకు చెప్పండి. ఆకృత్యం జరిగితే అవశ్యం శిక్షిస్తాను ' అన్నాడు రాజు.

అవకాశం చిక్కింది కదా అని పురోహితుడు పరుగెత్తి – గతంలో వారిచ్చిన మాటని గుర్తుచేసి – "వేగముగా వచ్చి చూడండి" అని రాజుని ప్రార్ధించగా అతను భోజన కార్యక్రమమును కూడ ఆపుకుని కొంతమంది పెద్దమనుషులని వెంటబెట్టుకుని పురోహితుని యింటికి వచ్చాడు బ్రాహ్మణుడు ఆ గదితలుపులు తెరవగా – తెల్లని విభూతి పూసుకుని రుద్రాక్షలు ధరించి శంకరుడి అవతారంలా కనిపిస్తూ – తలుపు మూసినది మొదలు దిగులు చెంది, దైవమును ధ్యానించుచున్న ఐదుగురూ కనిపించారు "వీరేనా విటులు?' రాజు పరిహాసంగా అడిగాడు

"వీరే. నేనింటలేనప్పుడు ప్రవేశించి పెద్దమనుషుల్లా నటిస్తున్న జారులు " చెప్పాడు పురోహితుడు రాజు వారందరినీ – "అయ్యలారా. తమరెవరు? ఎక్కడికి వెళ్తున్నారు? ఈ యింటికెందుకు వచ్చారు? నిజం చెప్పండి" అని గద్దించాడు

"మేమెవ్వరమో తెలిసికొనుటకే యీ యింటికి వొచ్చాం" అంటూ తమ వృత్తాంతమంతయు వివరించారు భార్యమీద అనుమానంతో యిల్లు వదలి వచ్చేస్తున్న గురువు కథ విని – యితడు కూడా పురోహితుడి వంటి పిచ్చివాడే వృద్ధుడికి పడుచుపెళ్ళాం విషంవంటిదే. దోషం వీరి మనసులోనే కాని భార్య యందుండదు. వీరి బుద్ధిని చక్కబరచెదనను కుంటూండగా – "మీరే చూచితిరికదా? నా భార్యని దండించండి" అని కోరాడు పురోహితుడు

"మీ భార్యఎక్కడ?" అని రాజు అడగగా – ఆమెను బంధించిన గదికి తీసుకెళ్లి తాళం తీసి చూపాడు రాజామెకు నమస్కరించి – ' అమ్మా

నేను నీ పుత్రుడనే వేరుగా తలచకు నీ సుగుణము లిదివరకే విన్నాను నీవలన ఒక విషయము 'తెలిసికొన గోరుతున్నాను. ఈ గురుశిష్యు లైదుగురూ పరదేశులు, మార్గస్తులు, బాటసారులు, వెర్రి మూఢులు కాదంటివట మరి వీరెవరు?" అని అడిగాడు

ఆమె అతని ప్రశ్నకు సమాధానం చెప్పక – "నేను దుష్టురాలిని కాకపోయినా దుష్టురాలినయినట్లు, నలుగురిలోనూ వాదు వచ్చినప్పుడు దానికి తగిన శిక్షవిధిస్తే సరిపోతుంది నేనా బ్రాహ్మణుల కట్టి సమాధానము లిచ్చుటలో ఉద్దేశము వారు వచ్చి భోజనము చేయవలెననియే". అంది

అందుకు రాజు – "నాకు నిజం తెలిసింది. నీ భర్త పలుమార్లు చెప్పినను – విటులతో ఉండగా పట్టి యిమ్మని చెప్పాను. విటులున్నారని అతను రావడంతో విధిలేక నేను వచ్చానంతే. అది తప్ప మరేమియుకాదు అమ్మా. వీరికినీవిచ్చిన సమాధానముల అంతరార్థం దయచేసి వివరించవా?" అని ప్రార్థించాడు.

"రాజా. వీరు నడివీధిలో దర్భాసనముల మీద కూర్చోడం చూసి చదువుకున్న వారే అయినా ఛాందసులని గ్రహించి వారు వారికి చెప్పిన పేరులన్నియు కాదన్నాను. పరదేశులనడం భాషాభేదం కలవారికే తప్ప ఏకభాషకలవారికి చెల్లదు. మార్గస్తులమనగా మనకంటె ముందు మార్గముండాలి. బాటసారులనగా నిరంతరము నడచు సూర్యచంద్రులకే చెల్లుతుంది. వెర్రి మూఢులనే పదం చదువుకున్న వారికి చెల్లదు'.

"మరెవరికి చెల్లుతుంది?" అడిగాడు రాజు

"వెర్రిమూఢులలో మొదటివాడు నా పెనిమిటి మధ్యాహ్నకాలమున తనభార్య ఐదుగురు విటులతో క్రీడించుచున్నదని వివేకములేక చెప్పినవాడు ఆయన చెప్పడంతోనే – జారత్వమున కైదుగురొకే పర్యాయమేల వత్తురని కూడ ఆలోచించక పెద్ద మనుషులని వెంట బెట్టుకు వచ్చిన మీరు రెండవ వారు కావచ్చును వీరు – వెర్రి మూఢులు కారు ఛాందస బ్రాహ్మణులు". అని నిర్భయంగా చెప్పేసిందా యిల్లాలు

ఆ వివరణకు రాజు కోపగించలేదు సరికదా సంతోషించాడు. "ఇంత ఉత్తమురాలిననుమానించిన నిన్ను దండించిననూ దోషం ఉండదు. ఆమె ముఖం చేసి యీసారికి నిన్ను మన్నిస్తున్నాను. మరోసారి ఇలాంటి సంసార ద్రోహపు మాటలన్నావో శిక్షిస్తాను–" అని పురోహితుణ్ని మందలించి – శుద్ధమతి భార్య సుగుణములను అతని శిష్యులద్వారా వినియుండుటచే – 'త్రిలోక పూజ్యురాలగు భార్యను వెర్రి అనుమానముతో విడిచి పరదేశ మరుగుచున్న నీ కంటె నిర్భాగ్యుడుంటాడా? నీ విద్య, పాండిత్యం ఎందుకు? ఇందుకే – వృద్ధులకు కన్య నివ్వకూడదంటారు. ఇప్పటికేనా నీకు బుద్ధి వొచ్చిందా? లేకపోతే నిన్ను దండిస్తాను" అన్నాడు.

జరిగినదానితో – భార్య విషయంలో తనకి కలిగిన అనుమానం కూడా అలాగే నిరాధార మయినదే అన్న నిశ్చయానికి వచ్చిన శుద్ధమతి – "దేవా నాకు బుద్ధొచ్చింది. నా అనుమానం నిరాధారమని యిక్కడ జరిగిన దాని వైనం నుండి తెలుసుకున్నాను

ఇక నేను నా భార్యతో సామరస్యంగా సంసారం చేసుకుంటాను". అని అంగీకరించాడు అటువంటి పండితుడు తన ఆస్థానంలో ఉండదగిన వాడని రాజతనిని కోరగా శుద్ధమతి తనసమ్మతి తెలిపాడు. రాజు శుద్ధమతి భార్యను రప్పించి ఇల్లు కట్టించి ఇచ్చాడు పురోహితుడు, శుద్ధమతి అది మొదలు తమ భార్యలతో అనురాగంగా సంసారం చేసుకోసాగారు. సంతానం లేదని విచారిస్తున్న భార్యతో ఒకనాడు – "విచారించకు.చక్రవర్తి లాటి కొడుకును కనే ఉపాయం నాకు తెలుసు అందుకు నేను శ్రీశైలం వెళ్తున్నాను' అని బయలుదేరి శ్రీశైలం చేరాడు.

పాతాళగంగ వొద్దున నరసింహబిలంలో ఉంటూ కందమూలాలే తింటూ కల్పంలో చెప్పిన ప్రకారం పాశుపత వ్రత మాచరించుచు శివుణ్ని ఆరునెలలారాధించాడు అప్పుడా దేవత కలలో ప్రత్యక్షమై – 'నీవు సగం భక్తితో అరాధించినా నీ కోర్కె తీర్చక తప్పదు నువ్వు రేపు స్నానం చేసివస్తూంటే దారిలో ఒక మామిడి పండు కనిపిస్తుంది దానిని తీసికొని ఎక్కడా నేలమీద పెట్టకుండా యింటికి తీసుకుపోయి నీ భార్యకివ్వు

ఆమెకు ఉత్తమసంతానం కలుగుతుంది ఏకారణంగా అయినా నియమం తప్పావో ఫలం దక్కదుసుమీ" అని హెచ్చరించి అదృశ్యమయ్యాడు.

శుద్ధమతి మరునాడు ఫలమును తీసికొని కింద పెట్టకుండా నియమంగా యింటికి వెళ్ళుచుండగా ఒకనాడు జాముపొద్దువేళ తెలగరాయని చెరువు పక్కన నడచుచూ - ఫలాన్నొక చెట్టు యొక్క కొమ్మల సందులో యిరికించి దగ్గరలో కలబావిలో స్నానం చేయసాగాడు. అంతలో -

ఆ వృక్షం మీదున్న గరుడ పక్షి ఆ ఫలాన్ని చూసి - ముక్కుతోనూ కాళ్ళతోనూ పట్టుకుని ఎగిరిపోయింది అది చూసి ఆ బ్రాహ్మణుడు వేగంగా పరుగెత్తుకు వచ్చాడు కానీ అప్పటికే ఆ గరుడపక్షి చాలాదూరం వెళ్ళిపోడం వల్ల ప్రయోజనం లేకపోయింది అతనెంతో విచారంతో యిల్లు చేరి తన పాట్లన్నీ ఆప్తులతో మొరపెట్టుకున్నాడు జీవితాంతమూ తన దురదృష్టానికి చింతిస్తూనే ఉన్నాడు కాని జరగవలసినదలా ఉండగా అతనికాఫలమెలా దక్కుతుందీ?

ఆ ఫలమే పక్షినోటినుండి జారి కాశ్మీర దేశపు రాజు ముందరి బల్లమీద పడింది తరవాత జరిగిన కథ విను

## 7. వరప్రసాదుల కథ

**కా**శ్మీర దేశపు రాజుకు మంత్రికీ, పురోహితుడికీ, కోమటికీ, కలాదుడికీ పుత్రులు కలిగినప్పటి ఆనందం మరెప్పుడూ కలగలేదు ఆ సంతోషంతో వారు పేదలకు దానాలు బంధుమిత్రులకు విందులు - ఎన్నో చేశారు ఆపుత్రులకు - రాజకుమారుడికి వసంతుడని, మంత్రి కుమారుడికి రాముడని, పురోహితుడికి ప్రవరుడని వైశ్యనందనునకు సాంబుడని, కలాద కుమారునకు దండుడని - మొదటక్షరములు చదవగా వరప్రసాదులనివచ్చేలా పేర్లు పెట్టారు పిల్లలయిదుగురూ ఒక్కలా చక్కగా పెరగసాగారు

ఐదేళ్లు రాగానే ఆ పిల్లలనొక ఉపాధ్యాయుడి దగ్గర వేశారు గురువుకు వచ్చిన చదువంతా వీళ్లు ఆరుమాసాలలోగానే గ్రహించేశారు సాహిత్యధురీణుని వద్ద ఒక్క సంవత్సరంలోనే నాటకాలంకారాలలో పాండిత్యం సంపాదించారు. వ్యాకరణ పండితులదగ్గర మూడేళ్ళుచదివి అతనిలోనే తప్పులు పట్టగలిగేస్థాయికెదిగారు అలాగే తార్కికుడు, సిద్ధాంతి, వైణికుడు, వైద్యుడు, వైదికుడు, వేదాంతుల వద్ద స్వల్పకాలంలోనే విద్యలు నేర్చుకున్నారు మాంత్రిక, తాంత్రిక, విద్యలు, శస్త్ర, అశ్వ, దనుర్విద్య మొదలైన రాజవిద్యలూ కూడా కొద్దికాలంలోనే అభ్యసించారు ఇలాగ చిన్నవయసులోనే అరవది నాలుగు కళలలోనూ ఆరితేరిన వరప్రసాదులను పొగడని వారేలేరు. వారైదుగురూ ఒకే ప్రాణంలా మెలగేవారు

రాజుకి వారియందు సమానప్రేమ ఉండేది.

వీరు ఉదయంనుంచి సాయంత్రం వరకూ మంచిగుర్రములెక్కి చాలాదూరం తిరిగివచ్చేవారు. పదహారేళ్ల వయసురాగానే వీరికి తల్లి తండ్రులు వివాహం చెయ్యాలనుకున్నారు. అది తెలిసి వాళ్లు ఉద్యానవనంలోకి పోయి మాట్లాడుకోసాగారు

రాముడు మిత్రులారా. మనమనేక విద్యలు చదివినా దేశాటనం చేస్తేకాని మన విద్యలకు తేటరాదు అందుకిదే సమయం మీరేమంటారు

**వసంతుడు**· నాకు చక్కని ఊహ కలిగింది తల్లితండ్రులు మనకు వివాహాలు తలపెడుతున్నారు మెడకులంకె తగులుకున్నాక కదలలేం దేశాలు చూసి రావాలని మొదట్నించీ నాకు కోరిక

ప్రవరుడు · మీ అభిప్రాయాన్ని కాదంటానా? నూతిలోకప్పలా స్వదేశంలోనే కాలక్షేపం చేసేవారు పండితులయినా మూఢులే అని నీతిజ్ఞులు చెప్పనే చెప్పారు

**సాంబుడు** : మీ యౌవనం మీకిలాటి వికారం పుట్టించింది దేశాటనమంటే మాటలా? వేళకి తిండుండదు పడుకోడానికి చక్కని పక్క ఉండదు సత్రంభోజనం - మరంనిద్ర పరదేశులను చూచి

చులకనగా మాట్లాడతారు రోగముల భయముంటుంది. ఆపాట్లన్నీ రాజకుమారుడు పడలేడు స్వదేశములో, స్వగ్రామంలో . స్వగృహంలో పూజ్యతలేని దరిద్రులకే పరదేశమేగుట గొప్ప. చెప్పివెళ్లాలంటే తల్లితండ్రులు ఒప్పుకోరు చెప్పకుండా వెళ్ళిపోతే దుఃఖ సముద్రంలో మునిగిపోతారు.

*దండుడు* · మన సాంబుడు కులసహజమైన పిరికితనంతో దేశాటనానినికి భయపడుతున్నాడు అతను చెప్పిన పరదేశ కష్టాలు ధనహీనులకి కావలసినంత డబ్బు తీసికెళ్తే ఏ సమస్యలూ ఉండవు రాజపుత్రులు యౌవనంలో దిగ్విజయ యాత్ర చేయడం పరిపాటే. మనమ్వెరమో తెలియనీయకుండా తిరిగితే ఎన్ని విశేషాలూ వింతలూ చూడవచ్చునో మహారణ్యాలూ మహానగరాలూ తిరిగి దివ్యౌషధులు సంపాదించవచ్చును. సౌందర్యవతులయిన స్త్రీలనూ, వారి చాతుర్యాలనూ గమనించవచ్చును మనం వెళ్లిపోతే తల్లితండ్రులు సరిపెట్టుకుంటారు మన ప్రాణములను నేను కుప్తముగా దాచగలను కదా ఒకసారి దేశాలు చూసి రావడమే మంచిదని నా ఉద్దేశం

**సాంబుడు** · నేను పిరికితనంతో చెప్పినమాటలుకావవి నేనుమీకంటె ముందడుగువేయగలను దేశములు అనంతములు తిరుగుట కొరకు జీవితకాలంచాలదు మనం అనుకున్నట్లు అన్నీ జరుగవు మీ మాట కాదంటానా? అలాగే దేశాటనం చేసొద్దాం

**వసంతుడు**. సాంబా. నువ్వు చెప్పింది నిజమే కాని మనం కావలసినంత ధనంతీసికెళ్దాం

**రాముడు** వీడికిష్టమేకాని వాళ్లనాన్న మంచి పిల్లని పెళ్ళి చేస్తానంటున్నాడుగా. అందుకని

**ప్రవరుడు** · ఆమాత్రం పిల్లలా దేశాలలో దొరక్కపోతారా? స్వయంగా చూసి చేసికోడం మేలు

**దండుడు** · మీ కోరికలన్నీ తీరుతాయి దేవతాస్త్రీలనే పెళ్లాడదాం పదండి

వసంతుడు. అందరూ అంగీకరించారు కదా ముహూర్తం నిర్ణయించండి.

ప్రవరుడు : రేపు రాత్రి పన్నెండు గంటలు కొట్టడంతోనే గుర్రాలెక్కి ఊరిబయట మామిడితోటలోకి రావాలి ఆలస్యం చేయకూడదు. తరువాత పడమటి దిశగా పోదాం

దండుడు · వెలగలరత్నాలు, బంగారం అందరూ పట్టుకురండి."

అలా నిర్ణయించుకుని వాళ్లయిదుగురూ యిళ్లకి వెళ్ళిపోయారు.

మర్నాడు రాత్రి నిర్ణీత సమయానికి కలుసుకుని మంగళ శ్లోకాలు చదువుతూ పడమటి దిక్కుగా, నరసంచారంలేని అరణ్యంలోంచి గుర్రాలమీద వెళ్లసాగారు.

ఆ అరణ్యం ముందు చూస్తే దుర్గమంగా ఉంది. కానివాళ్లు తోవచేసుకుంటూ పోసాగారు అందరికంటె వెనుక వచ్చుచున్న దండుడు వైద్యశాస్త్ర ప్రవీణుడు, యంత్రనిర్మాణకుశలుడు అవడం వల్ల మూలికలనూ యంత్రాలకు పనికొచ్చే కర్రలనూ పోగుచేయసాగాడు.

తెల్లవారింది సూర్యోదయమయింది ఒక చెరువుదగ్గర కాలకృత్యాలు తీర్చుకున్నారు "మిత్రులారా. మనమీరాత్రి ఎన్నో యోజనాలు వచ్చాం అయినా యీ మహారణ్యానికి అంతూ అనేది కనిపించడం లేదు. మనపట్నానికి పడమటి దిక్కున సముద్రం కనుక జనసంచారం లేని అరణ్యముందని భూగోళశాస్త్రంలో చదివాం. మనవారు మనలని వెదకి పట్టుకొంటారేమో అనే సంశయం యిక అక్కర్లేదు ఇక్కడినుంచి దక్షిణంగా వెళ్తే కొన్ని నగరాలు కనపడతాయి అలసట తీర్చుకుని బయలుదేరుదాం." అన్నాడు వసంతుడు

విశ్రాంతి తీసుకుని మళ్ళీ ప్రయాణం సాగించి రాత్రి ఒకచోట విశ్రమించి మర్నాడు మధ్యాహ్నం వరకూ ప్రయాణం చేయగా అప్పుడొక బంగారు శిఖరంగల గోపురం కనపడింది 'ఇక్కడ భూములు పండుతున్నాయి అడవి పలచబడింది జనంతిరుగాడే చిహ్నాలు కనపడుతున్నాయి పట్నమేకావొచ్చును-' అన్నాడు రాముడు

'కాని . ఒక్కమనిషి కూడా కనపడడంలేదు గృహములు కనపడుచున్నవి, రాజధాని వలె అగుపించుచున్నదే. మరి - శూన్యముగా ఎందుకుందో?"

"అది ఏదైతే మనకేం? మన ఆయువులు గుప్తముగా దాచానుకదా " అన్నాడు దండుడు.

నిర్జనంగా ఉన్న ఆ పట్టణ వీధులలో వాళ్లు తమగుర్రాలను నడిపిస్తున్నారు ఇళ్ల తలుపులు మూసీ దుకాణములు కట్టివేయబడీ ఉన్నాయి అక్కడక్కడ అరుగులమీద కొందరు నిద్రపోతున్నారు

"వీళ్లు రాత్రించరులేమో ఇక్కడనుండి తొందరగా పోదాం " అన్నాడు వసంతుడు

"వాళ్ళు మనలాగే ఉన్నారు. రాక్షసులైతే అలా ఉందరుగా ఐనా - మనమొచ్చిందే వింతలు చూడడానికి ." అంటూండగానే ఢింఢిం అను చాటింపు శబ్దం వంటిది వినిపించింది. ఇద్దరు రక్షకభటులు ఒక చాటింపు వానితో వీధిలో తిరుగుతూ - "పౌరులారా! భద్రంగా నిద్రపొండి మీసొత్తును మేము కాపాడుచున్నాము " అని కేకలు వేయసాగారు.

వరప్రసాదులు వాళ్ళ దగ్గరికి వెళ్లారు

**రాజభటులు** . మీరెవరు?

**వరప్రసాదులు** మేము కాశ్మీర దేశస్తులము.

**రాజభటులు** : ఇలాటి అర్ధరాత్రి నిర్భయంగా సంచరిస్తున్నారే

**వరప్రసాదులు** ఇది అర్ధరాత్రా పట్టపగలుకాదా? మీమాటలు వింతగా ఉన్నాయే

**రాజభటులు** ఇది పగలన్నవారిని శిక్షించుట మారాజుగారి శాసనము మొదటి తప్పు మన్నించితిమి మరోమారలా అంటే శిక్షించబడుతారు సుమా.

వరప్రసాదులు · ఇది ఏమిన్యాయము? నిజంపలికితే దండించే రాజులుంటారా? సరే పోనిండు మాకు భోజన సదుపాయమెక్కడ జరుగును? సత్రము వంటిదేమైనా ఉందా?

రాజభటులు · మేము పురరక్షకులమే కాని పరదేశులకు భోజనసదుపాయము చేయువారము సత్రములు చూపించు వారము కాదు. రాత్రులందు వీదుల్లో యితరులు సంచరించడానికి వీలులేదు. ఎక్కడైనా వేగంగా పడుకోండి లేదా శిక్షిస్తాం

వరప్రసాదులు · ఎందుకంత కోపం? పరదేశులకు బసచూపినంతనే అధికారమునకు లోటొచ్చునా?

రాజభటులు . వచ్చును అది మా విధికాదు. వేగముగ పడుకొండి.

వాళ్ళు గుర్రాలుదిగి దగ్గరలో ఉన్న ఓ అరుగుమీద పడుకున్నారు. నిద్రపట్టలేదు అంతలో సాయంత్రమైనది ఆగ్రామస్థులకది ఉదయం కనుక లేచి వారి వారి పనులు చేసికోసాగారు వరప్రసాదులు పడుకున్న అరుగు యింటి యజమానుడు తలుపుతెరచి చూసి వారిని గొప్పింటి వారిగా తలచి - అయ్యలారా! మీరెవరు? ఇక్కడికెందుకొచ్చారు?" అంటూ గౌరవంగా అడిగాడు.

వారు తమ వివరములు, అక్కడి కొచ్చాక జరిగినదీ చెప్పి - "ఇందలి వారలు నిశాచరలగుటకు కారణమేమి?" అని అడిగాడు. అతను వారిని లోపలికి తీసుకువెళ్లి భోజనముపెట్టి ఒక రహస్య స్థలమునకు తీసికొనిపోయి ఆనగరవృత్తాంతం చెప్పసాగాడు

# 8. కానీనుని కథ

లాటదేశానికధిపతి కానీనుడు అతనికి సుబుద్ధి, దుష్టబుద్ధి అనే యిద్దరు మంత్రులు, వారి ఆలోచనల బట్టి రాజ్యపాలన చేసేరాజు ఒకనాడిలా అన్నాడు "మంత్రులారా! నా కొక కొత్త ఆలోచన వచ్చింది. భూమి పుట్టింది మొదలు రాజులందరి పరిపాలనా ఒకేలా ఉంది. ముందు వాడెలాటి చెడ్డతోవన నడచినా అది పెద్దలు నడచిన మార్గమంటూ తరువాతి వారు గుడ్డిగా అనుసరించారు. వాళ్లూ వీళ్లూ కూడా గుడ్డివాళ్లే. మొదటివారు తరువాతి వారికి పెద్దలౌతారు కదా నిద్రాహారములను బట్టి పగలు రాత్రి అంటిరి. నేనిప్పుడు వీటినటుయిటు చేయదలచితిని. కనుక రాత్రి పనులు పగటి యందును, పగటి పనులు రాత్రియందును చేయడం మొదలుపెడితే వాటికాపేర్లే స్థిరపడతాయి " "చాలాబాగుంది." అంటూ తన అభిప్రాయం వెలిబుచ్చాడు దుర్బుద్ధి కాని సుబుద్ధి "రాజా! నేను చెప్పబోయేది అప్రియమైన హితవు. రాత్రింబగళ్లకాపేర్లు నిద్రహారములను బట్టి కాక చీకటి వెలుగులను బట్టి వచ్చినవి. భగవంతునిచే చేయబడిన ఆ నియమమును మనుష్యులు మార్చలేరు ఒకరాజు పాదములతో కాక చేతులతో నడువ మనును మరియొక రాజు కన్నులతో విని చెవులతో చూడమనును అట్టివిపరీత కృత్యములను ప్రజలు చేయగలుగుదురా? ప్రజావిరోధము సంభవించి రాజు అపఖ్యాతి పాలగును- " అన్నాడు.

రాజు ఆగ్రహించి అతనినుద్యోగము నుండి తొలగించాడు. కొత్తశాసనమును ప్రకటించాడు. అతిక్రమించిన వారిని శిక్షించుటకు రాజభటులను నియమించాడు. శిక్షకు వెరచి ప్రజలు దీపాలకు చమురు తెచ్చుకోలేకా.. .చీకటిలో నడువలేకా మొదట నానా బాధలూ పడ్డారు. చివరకు అదే అలవాటయింది

మారాజు చరిత్రయిది పొరపాటునైనను యిది రాత్రి అనబోకండి, శిక్షించబడతారు వేగంగా వెళ్లిపొండి" అన్నాడు

వరప్రసాదులా ప్రజల యిబ్బందులకు జాలి పడ్డాడు. ఇలాటి రాజులు కూడా ఉంటారా! ఇతని దుష్కృత్యము నెలాగైనా మాన్పించాలి – అని భావించి వారు ఒక గొప్పభవనమద్దెకు తీసుకుని ఉండసాగారు.

# 8. దేవతా వస్త్రాల కథ

వరప్రసాదులు గౌరవనీయమైన వేషములు వేసికొని రాజుగారి ఆస్థానమునకు వెళ్లి, కొన్ని విషయములను వ్రాసిన చీటిని ద్వారపాలకుని ద్వారా రాజుకి పంపారు. తక్షణమే వారిని తోడితెచ్చుటకై ఒక గౌరవనీయుడైన ఉద్యోగిని రాజుగారు పంపారు.

రాజు వారికెదురేగి స్వాగతం పల్కి – "మీరెవరు? మీరు చీటిలో చేతుమని రాసిన వింతపనులేమి?" అని అడిగాడు.

అందుకు రాముడిలా చెప్పాడు. "మాది కాశ్మీరదేశము. మేము పట్టుసాలివారము. విచిత్ర మయిన వస్త్రములు నేయగలము మారాజు గారికొక ఆపదసంభవించుటచే మమ్ము రక్షించు వారెవరాయని అన్వేషించుచుండగా నూతనమార్గ నిర్మాణ దక్షులగు మీకీర్తి మేము విన్నాము. మీవలె కొత్త ఆలోచనలు చేయగలవారే మావిద్యను పరీక్షచేయగలరు "

'మంత్రీ చూశావా .మనం ప్రవేశపెట్టిన కొత్తవిధానం వల్ల మనకెంత కీర్తి వచ్చిందో ఎంతో దూరంగా ఉన్న కాశ్మీర దేశంలో కూడా మనపేరు చెప్పుకుంటున్నారట–' అని పొంగిపోయిన రాజుతో

'దేవా కాశ్మీరమనే ఏమిటి? భూమండలమంతా మనపేరు వ్యాపించినది వార్తాపత్రికలు తేటతెల్లము చేయుచున్నవి కదా మీకు శిబి కర్ణ, బలి చక్రవర్తుల కన్న అధికఖ్యాతి రాగలదు " అని మంత్రి ప్రశంసించాడు

రాజు వరప్రసాదులతో – 'మీ విద్యాపాటవం చెప్పండి' అన్నాడు.

"మేమారు నెలల కొక పంచెలచాపు, చీరయు, తలరుమాలు నేయుదుము అందుకు ఏభైవేలమాడలు (బంగారుకాసులు) ఖర్చవుతాయి. ముందుగా సగం సొమ్మివ్వాలి మేమెవరికోసం నేస్తామో వారు ఊరేగింపుతో మా బసకువచ్చి తక్కినరొక్కము బహుమతులు యివ్వవలెను

ఆవస్త్రములు ధరించి ఆ దంపతులా రాత్రి కామకేళిలో తేలినచో వారికి అధిక తేజస్వియగు పుత్రుడు జన్మించును మరియొక విశేషమేమిటంటే - మేము నేయు బట్టలు కాని దారములు కాని జారత్వ (వ్యభిచార) దోషంవలన కలిగిన వారికి మాత్రం కనిపించవు అవి దేవతావస్త్రములు ఆబట్టలు ధరించినప్పుడు కాని ఆ ఆనందము తెలియదు అది వర్ణనాతీతము మీరిందు కంగీకరిస్తే సరే లేదా మరొక ఆస్థానానికి పోతాం" అన్నారు

" ఆ విషయంలో మీకు సందేహం అక్కర్లేదు మా సంస్థానమున కొచ్చిన విద్వాంసులూరకే వెళ్లిపోవడమా. అసంభవం. రాత్రింబవళ్లనే మార్చగల నాకు కొత్త పనుల కెంత సొమ్ము అయిననూ లక్ష్యమా? అద్భుతవస్త్రములు నేయండి " అని ద్రవ్యమిచ్చి పంపాడు రాజు

వరప్రసాదులు వేమాదండములు, రాట్నములు, మగ్గములు మొదలైనవి యింట్లో పడేయించి లోపలి కెవరినీ రానీయకుండా కావలివానిని పెట్టి తాము విందువినోదములతో పొద్దు పుచ్చుచుండిరి రాజు-రెండు మాసాలు గడిచాక ఆ వస్త్రముల పని ఎంతయినదో చూచిరండని గ్రామాధికారులను పంపాడు

"కొంచెముసేపాగి ప్రవేశపెట్టమని కావలివానికి చెప్పి తాము నూలొడుకువారివలె, నూలు చుట్టు వారివలె నటించసాగిరి

గ్రామాధికారులు లోపలికి రాగా -

"నూలెంత సన్నమో చూసితిరా. మృదువు పరీక్షించి చూడండి రెండుమాసాలకి నూలుతయారగుటయే కష్టమౌతుంది ఇట్టి నూలు మీరెన్నడేనా చూశారా?" అని అడిగాడు

నూలుకనిపించలేదంటే తమతల్లి వ్యభిచారిణిని తెలుస్తుందని - ఆ నూలును గొప్పగా పొగిడారు కరణానికి కనిపించి ఉంటుందని కాపు, కాపుకి కనిపించుంటుందని కరణమూ తలచి తమగుట్టు బయట పడకుండా మాట్లాడసాగారు

కానీనుడు గ్రామాధికారుల ద్వారా విచిత్ర వస్త్రముల గురించి విన్నది మొదలు అతని ఆత్రత మరీపెరిగిపోయింది. దండనాధులు, మంత్రి మొదలయినవారిని పంపగా వారుకూడ తమకేమియూ కనిపించలేదంటే తనతల్లి జారిణి అని అంగీకరించ వలసి వస్తుందని - వారు కూడా నేతవారిని పొగిడారు. అలాగెందరో వొచ్చి వెళ్లి రాజుకి ఆవస్త్రములగురించి గొప్పగా చెప్పారు

ఆరు మాసములు పూర్తయినవి రాముడు దేవతావస్త్రములు సిద్ధమయ్యాయని రాజుకి తెలియపరిచాడు రాజు అపరిమితానందంతో "ప్రధానిమొదలైన ఎందరో ప్రముఖులు మీరునేయుచున్న వస్త్రములు చాలా ఆశ్చర్యం కలుగజేశాయని చెప్పారు. మీదేశపు రాజు వీనిని ధరించునాడేం చేసేవాడో చెబితే మేము కూడా అలాగే చేస్తాం " అన్నాడు

"ఉత్సవమునందు వలె భద్రగజముపై భార్యతో ఎక్కి ఊరేగింపుగా వొచ్చి, బ్రాహ్మణులకు మహాదానములు చేసి, మా బసకువచ్చి మానుండి వస్త్రములందుకుని మాకు కానుకలిచ్చి ఊరేగింపుగానే యింటికి వెళ్లేవారు ఇవి దేవతా వస్త్రాలు కనుక ఆ దినం స్త్రీలకు పురుషదర్శనం తప్పుకాదు మారాజుగారికంటె మీరు కొత్తపుంతలు తొక్కినవారు కనుక యింకనూ వైభవంగా చేయవచ్చును" అని పలికి రాముడు యింటికి వెళ్లిపోయారు

రాజు గ్రామమంతా చాటింపు వేయించాడు. తానూరేగేటప్పుడు అందరూ ఉండాలన్నాడు మంత్రి, సామంత, హిత, పురోహిత వర్గంతో ఏనుగు మీద వరప్రసాదులబసకు వచ్చాడు వరప్రసాదులు వారిని ఆహ్వానించి ఉచితాసనములందు కూర్చుండ బెట్టారు తానీయవలసిన విత్తము, మణిమాణిక్యాల కానుకలు బంగారు పళ్లెంలో వారికందించి - "దేవతావస్త్రాలెక్కడ ' అని అడిగాడు రాజు

వసంతుడు, ప్రవరుడు, దండుడు ఒక్కొక్క పళ్లెం తెచ్చి వారి ముందుంచారు "దేవతావస్త్రములేవి?" అడిగాడు రాజు

రాముడు సైగ చేయగా మిగిలిన ముగ్గురూ ఒక్కొక్క పళ్లెం రాజు ముందుంచి "ఇవిగో, చూడండి ' అన్నారు

రాజుకా పళ్లెంలో ఏమీ కనపడలేదు. దానితో ... అయ్యో! నావంటి రాజును కన్న స్త్రీ జారిణియా! అందుచేతనే యిట్టి వింత వస్త్రాలను చూసే భాగ్యం నాకు లేకపోయింది ఏడంతఃపురములలో ఉంచినా స్త్రీలు చెడ్డపని చేయకమానరు ఎందరికో కనిపించిన యీ వస్త్రాలు నాకు కనపడలేదన్న ఎంత అవమానము! నన్ను కన్న ఆజారిణి యుండిన తలనరికి వైచి ఉండేవాడిని వారందరి తల్లులకూ ఉన్న నీతినియమములు నాతల్లికి లేకపోయే . " అని మనసులో విచారించుచూ మౌనముగా మిగిలిపోగా

"ఏమీ !పలుకరేమిదేవా? బట్టలు కనిపించడంలేదా? అందంగాలేవా? తమరు ధరించవలసిన వస్త్రములివే ముట్టుకుని చూడండి, ఎంతమృదువుగా ఉన్నాయి " అని రాముడనేసరికి – కనపడలేదంటే పరువుపోతుందని గుర్తొచ్చి "బట్టలు చక్కగా కనపడుతున్నాయి చాలా చక్కగా ఉన్నాయి. వీటినిధరించి మొక్కుటకు మా తల్లి లేకపోయెనే అనే విచారంలో పడిపోయానంతే " అన్నాడు, రాజు

అప్పుడు రాముడు – "ఇటువంటి సంతోషసమయంలో విచారానికి తావివ్వకూడదు ఈ దేవతావస్త్రాలు మీకు కనపడడంవల్లనే మీ తల్లిగారు దొడ్డ యిల్లాలని తెలియుచున్నది వస్త్రముల విషయమై సందేహములేమైనా ఉంటే చెప్పండి." అంటూ వస్త్రాలని విప్పి చూపెడుతున్నట్లు పళ్ళెంలో చేతులటుయిటు తిప్పి అభినయించాడు.

'అమాత్యా ఈవస్త్రములెంత మృదువుగా' ఉన్నాయో చూశారా? జరీపూవు లెంత చక్కగా అమరాయో మీకెలా కనపడు తున్నాయో చెప్పండి " అన్నాడు రాజు మంత్రివైపు తిరిగి

'అంచు చక్కగా అమిరింది వస్త్రములద్భుతంగా ఉన్నాయి నిరంతరమూ నూతనత్వం అన్వేషించే మీకివి చక్కగా అమరుతాయి "

అన్నాడతను, వస్త్రములు కనపడలేదంటే తను జారిణికి జన్మించిన వాడౌతాడని . అలాటి భయంతోనే సభ్యులు కూడా ఆ దేవతావస్త్రాలు బాగున్నాయని మెచ్చుకున్నారు. అప్పుడు రాజు తన భార్యనడిగాడవి ఎలా ఉన్నాయని ఆమె వస్త్రాలను పరిశీలిస్తున్నట్లు నటిస్తూ 'అయ్యో! నా, తల్లి జారిణియా. కాకపోతే వీళ్లందరికీ కనపడే వస్త్రాలు నాకెందుకగుపించవు? నేను నిజము చెప్పి నా తల్లి నేలతిట్టించవలెను?' అనుకొని - "రాత్రిం పవళ్లనే మార్చగల మీ వంటివారు కట్టగల పుట్టములివి" అని ఊరుకుంది

అప్పుడు రాముడు రాజుకావస్త్రంబులు కట్టుటకై కుచ్చిళ్లు పెట్టుచున్నట్లు నటించి రాజు కట్టుకున్న వస్త్రములనూడదీయించి, దేవతా వస్త్రములను ధరింపజేశాడు. రాజు అందరికీ దిగంబరంగానే కనిపిస్తున్నా - ఆమాటంటే తమతల్లి జారిణిఅని అంగీకరించి నట్లవుతుందని ప్రతివాడూ ఊరకుండిపోయాడు రాజుకూడా - తనకి తాను దిగంబరంగా కనిపిస్తున్నా మాతృదోషమును బట్టి తనకొక్కనికే అలా కనిపిస్తుందనీ, యితరులకు వస్త్రాలే కనిపిస్తున్నాయనే అనుకుని అతనూ మిన్నకుండిపోయాడు

అంతకు ముందు నియమించబడిన ఒక స్త్రీ రాణిగారిని చాటుకుతీసుకుపోయి అంతవరకూ కట్టుకున్న చీరను విప్పి - దేవతావస్త్రమును కట్టుచున్నట్లు నాలుగైదు సారులామెచుట్టూ తిరిగి - ఆమెను సభలోకి తెచ్చింది మునపటిలాగే ఎవరికి వారే తమతల్లి జారత్వం బయటపెట్టుకున్నట్లవుతుందని నిజం చెప్పడం మానేశారు. చివరకి రాజుకూడా ఆమె దిగంబరత్వం తనొక్కడికే కనపడుతూందనుకున్నాడు

వాళ్లు భద్రగజమెక్కి ఊరేగింపుతో రాజభవనం వైపు వెళ్తూంటే వింత చూడడానికి మేడ లెక్కిన పురకాంతలు సిగ్గుతో కళ్ళుమూసు కున్నారు విధిలేక కొంతసేపు ఊరేగి తన సౌధానికి వచ్చి తల్పంమీద కూర్చుని రాజిలా అన్నాడు. 'నాకు నీవు కట్టుకున్నచీర అసలు కనిపించడం లేదు. పదిమందిలోనూ నా అపకీర్తి బయటపడుతుందని అట్లంటిని

చీర బాగుందని నువ్వన్నావు కదా మన ఇద్దరి మధ్య రహస్యం ఉండదు, కనుక నిజం చెప్పు

"నాధా మీరు, మంత్రి అందరూ కనపడుతున్నాయంటే - నేను కనపడడంలేదనలేకపోయాను మీరు నాకు నగ్నంగానే కన పడుతున్నారు- " అందిరాణి.

దాంతో రాజుకి లజ్జ, కోపం వొచ్చి మంత్రిని పిలిచి, "ఆ పట్టుసాలీలు నాటకమాడినట్లున్నారు నువ్వు రెండుసార్లు వస్త్రాలతయారీ దశలో చూశావు నీకేమైనా కనిపించిందా? నిజంచెప్పు భయపడకు. మాకేమీ కనిపించలేదు-' అన్నాడు

"మీరలా అడిగినప్పుడు నిజం దాచకూడదు మిగిలిన సేనాధిపతులూ వాళ్లూ కనిపించినట్లు చెప్పడంతో మాతృదోషమునకు వెరచి నేనలా చెప్పాను. మీరే కనపడ్డాయన్నారని - పొగిడానంతే " చెప్పాడు మంత్రి చాలామందిని పిలిపించి అడిగినా - "ఏమీ కనిపించలేదు ' అని నిజం ఒప్పేసుకున్నారు

రాజు దానితో - తానూ రాణీ నగ్నంగా ఊరేగిన విషయం జ్ఞాపకం వొచ్చి కోపంతో ..' ఆకపటసాలెవారిని పట్టితెండు " అని యమకింకరులలాటి భటులను పంపాడు

వారు తిరిగివచ్చి -'మహారాజా ఆభవనమిప్పుడు నిర్జనంగా ఉంది. అందు మనుషులు కాని సామానులుకాని ఏమీలేవు. ఆకపటులెక్కడికో పారిపోయారని అనుకుంటున్నాము అయింటిని వెదుకగా ఒక మూల యీపత్రం కనపడింది ఇది వారు వ్రాసినట్లే ఉంది చూడండి.-' అంటూ ఆపత్రాన్నందించారు

మంత్రి దానినందుకుని అందరికీ వినపడేలా చదవసాగాడు. అపూర్వదుర్మార్గ చర్యాభిలాషులైన కానీన మహరాజుగారికి - కపటపు పట్టు సాలీలు వ్రాసిన ఆజ్ఞ ఏమనగా -

నీవు లోక విరుద్ధమగు మార్పులు చేసి ప్రజలననేకవిధాలుగా బాధిస్తున్నావు. కనుక నిన్ను మోసగించి అది మానిపించుటకై యింద్రుని చేత పంపబడిన దూతలమైన మేము నీకిట్టి అవమానము కలుగజేసి అదృశ్యులమైతిమి. ఇకనయినా బుద్ధి కలిగి విపరీతపు శాసనము మార్చుకుని, సుబుద్ధికి మరలా మంత్రిత్వము నిచ్చి సక్రమముగా రాజ్యము చేయుము. లేదా మా ఆజ్ఞ తిరస్కరించినట్లు భావించి నిన్ను పెక్కుచిక్కులు పెట్టి రాజ్యభ్రష్టుని చేయుదుము ఇది ముమ్మాటికిని మా ఆజ్ఞ"

అది విని రాజు చాలా భయపడ్డాడు. "మన మార్పు ఇంద్రునికి విరోధముగా నున్నది కాబోలు. త్రిలోకాధిపతి యగు ఇంద్రునితో వైరము పెట్టుకుని ఎవరు రాజ్యము చేయగలరు? జరిగినది చాలు అతని ఆజ్ఞని శిరసావహిస్తాను కనుక యికనుంచి రాత్రిరాత్రిగా పగలు పగలుగా వ్యాపారాలు (పనులు) చేయమని ప్రజలకు పత్రికలు రాయండి సుబుద్ధిని పిలువనంపండి ' అన్నాడు.

సుబుద్ధి వచ్చాక అతని సలహాల ప్రకారము చక్కగా రాజ్యాన్ని పరిపాలించాడు "

అని కథపూర్తిచేసి, మణిసిద్ధుడు – "గోపాలా! ఇప్పుడు చల్లబడింది. నడువవలసిన సమయం కావడి ఎత్తుకో. తరువాత కథ పెద్దది. ఇప్పుడు తేలదు రాత్రి మజిలీలో చెబుతాను " అన్నాడు.

ఓంకారం జపిస్తూ అతనూ, మౌనంగా గోపాలుడూ నడుచుకుని తరవాత మజిలీ చేరారు అక్కడ కూర్చున్నాక మణిసిద్ధుడు కూర్చుని శ్రద్ధగా వినే శిష్యుడికి తరువాత కథ చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 2 వ మజిలీ

వరప్రసాదులు లాటదేశమువదలి ఉత్తమాశ్వములపై ఉత్తరదిశగా దట్టమైన అడవిలోంచి మూడుదినములు ప్రయాణం చేసినా అడవికి అంతం కనిపించలేదు మూడోనాడు మధ్యాహ్నం దాహంతో బాధపడుతూ వెళ్తూండగా ఒకచోట తియ్యనినీటి సరస్సు, దానివొద్దున అంతుకనిపించని మర్రిచెట్టూ కనిపించాయి వాటిని చూచి ఎంతో సంతోషిస్తూ గుర్రాలు దిగి మార్గాయాసం పోయేలా జలక్రీడలాడి, వంటచేసుకుని భోజనాలు కానిచ్చారు అప్పుడా విశాల వటవృక్ష్యాన్ని తీరిగ్గా చూశారు

'ఈవటవృక్షమెంత వింతగా ఉందో చూశారా? దీనిమీద మనమెన్నడూ చూడని వింతపక్షులెన్నో ఉన్నాయి దీనికొమ్మల మీంచి బళ్లు కూడా అటూ యిటూ వెళ్లిపోగలగినంత పెద్దవిగానూ ధృడంగానూ ఉన్నాయి." అనుకున్నారు

'ఈ కొమ్మల పొడవెంతో చూద్దామా?" అని రాముడనడ మేమిటి, సాంబుడు తప్ప మిగిలిన నలుగురూ అందుకు సిద్ధపడ్డారు

"నలుగురమూ నాలుగుకొమ్మల వెంటపోదాం ఆరు మాసాల గడువులో మళ్లీ యిక్కడికి తిరిగిరావాలి ఎవరేనాముందుగా వొచ్చినా మిగిలిన అందరూ వొచ్చే దాకా యిక్కడే ఉండాలి గుర్రాలనీ సామగ్రినీ కాపలా కాస్తూ సాంబుడిక్కడుంటాడు ' అని ప్రమాణంచేసి – వసంతుడు తూరుపు వేపూ ప్రవరుడు పడమటివేపూ, దండుడు ఉత్తరదిశగానూ రాముడు దక్షిణంవేపూ కొమ్మలెక్కి వెళ్లారు

# 10. వసంతుని కథ

వసంతుడు తూర్పు దిక్కుగా కొమ్మమీద - భూమిమీదలాగే రెండు దినాలు నడిచాడు. తరువాత నిలబడి నడవడానికి వీలులేక చేతులు కూడా మోపుతూ నాలుగు రోజులు నడిచాడు. తరువాత తోవమరీ చిన్నదవడంవల్ల పాక వలసి వొచ్చింది ఇలాగ ఎనిమిదిరోజులు అయ్యాక ఆ మర్రికొమ్మ కంతుకనిపించింది అక్కడ నుంచి చూసే సరికొక వింతకనిపించింది.

మొట్టమొదట చాలా దట్టమైన పొగ. అది మాయమై పెద్దకాంతి. .యింకా చూసేసరికి ఎత్తయిన, మెరిసిపోతున్న భవనాలు.

వసంతుడు వాటిని చూసి . ..“ఇదేదో పట్నంలా ఉంది. చెట్టమొదలుకి చేరుకుందుకు నాకింకా చాలా గడువుంది. ఆలోగా యీపట్నం విశేషాలు చూసొస్తాను ” అనుకుంటూ ఆ పట్నానికి వెళ్లాడు

అక్కడొక మనిషికాని పక్షికాని లేదు. భవనాల తలుపులన్నీ మూసివేసి ఉన్నాయి జనసంచారమేలేనట్లుంది. కానీముని నగరంకంటె చిత్రంగా ఉంది.

అక్కడి యిళ్లన్నీ ఒకేలా ఉండడంవల్ల అతను తిరిగిన వీధుల్లోనే మళ్లీమళ్లీ తిరుగుతూ చివరకొక కొత్త వీధిలోకి వచ్చాడు. ఇక్కడకూడా మనుషులు కనపడకపోతే మరలిపోవాలనుకుంటూంటే-ఒక పెద్దకోట కనిపించింది. అందులో మనుషులుంటారని తలచి దాని చుట్టూ తిరిగినా ఎక్కడా ద్వారం కనిపించలేదు

అటువంటి భవనానికి ద్వారముండి తీరుతుందని నేలని కూడా చూస్తూ తిరుగుతూంటే భవనానికి ఒక గొళ్లెం కనిపించింది దానిని పైకి లాగేసరికి గుహలాటి ఒక గుమ్మం తెరచుకుంది. చీకటిగా ఉన్నా ముందుకి నడిచాడు. అతను ప్రవేశించడంతో .... .ఆ గుమ్మం మూసుకుపోయింది

మొదట అతనికెవరూ కనపడలేదు ఒక ఉద్యానవనం కనిపించింది అంతచక్కని ఉద్యానవనమున్నచోట ఎవరో ఉండకపోరని భావించి ఆతోటలో సేద తీరి ముందుకు నడవగా ఎన్నో భవనాలు కనిపించాయి ఇలా ఆలోచిస్తూ ముందుకి నడిచేసరికి ఒక మేడ లాంటిది కనిపించింది మెట్లెక్కి దాని అందం చూస్తూంటే అంతకంటె అందమైన అంతస్తు కనిపించింది తరువాత మరొక చక్కని అంతఃపురం కనపించింది అతను దానిలో ప్రవేశించాడు

అక్కడ హంసతూలికాతల్పం మీద అద్భుత సౌందర్యరాశి అయిన ఒక కన్య నిద్రిస్తూ కనపడింది

ఆమెను చూసి - నిజంగా యింత సుందరీమణులు ఎక్కడేనా ఉంటారా? అనుకున్నాడు ఆమెకు నిద్రాభంగం చేయడం యిష్టంలేక వసంతుడామె సౌందర్యాన్ని చూసి ధన్యుడౌతూంటే ఆమె మేల్కొని

తను నిజంగానే ఎదుటనిలబడిన పురుషుని చూస్తున్నానని ధృవపరచుకుని నువ్వీ రాక్షస భవనానికెలావొచ్చావు? నీదేదేశం? నీపేరేమిటి? చెప్పి నాకు వీనులవిందు చెయ్యి నా ఆతిధ్యం స్వీకరించు-" అంది

వసంతుడు తనగురించి అంతా చెప్పాడు. తరువాత అతనామె గురించి ప్రశ్నించగా - ఆమె యిలా చెప్పింది

'నాపేరు కళావతి ఈనగరాన్నొక బ్రహ్మరాక్షసి పాలించుతూంది అది అనేక దేశముల నుండి దోచుకుని వచ్చిన ధనమునంతయూ భవనాలలో పెట్టి తాళం వేస్తుంది వారానికొకసారి వచ్చి - యిక్కడ మేడకట్టి తాను తెచ్చిన డబ్బునందులో ఉంచి ముద్ర వేసి వెళ్తుంది ఈ భవనాలన్నీ అలా కట్టినవే

ఒకసారి మాదేశమైన అవంతి పై పడి అందలివారను చంపి .బంగారు తొట్టెలో పడుకున్న - రెండేళ్ల వయసుకల నన్ను మాత్రం చంపక ముద్దుపెట్టుకుని నన్నిక్కడికి తెచ్చి కన్నకూతురిలా పెంచుతూంది. నేను దానినే తల్లిగా భావించుకుంటున్నాను వారానికొకసారి వచ్చి నాకు

విద్యలు నేర్పుతూ ఎక్కడెక్కడో జరిగిన వింతలూ విశేషాలు చెబుతుంది అందువల్లే నేనింతవరకూ మగవాడిని చూడకపోయినా నిన్ను చూడడంతోటే మర్యాదకల పురుషుడని ఊహించగలిగాను.

మాకోటలో ఉన్న వింత వస్తువులు మరెక్కడా ఉండవు మాఅమ్మనిన్ననే వచ్చి వెళ్ళింది మరి వారం దాకారాదు "అంది

ఆమె సౌందర్యానికి మోహం చెంది అతడామెను గట్టిగా కౌగలించుకుని చెక్కిళ్లు ముద్దు పెట్టుకోగా - ఆమె అతనికి తన మనసర్పించుకుంది

అతనికి చక్కని విందు చేసింది ఐదు రోజులపాటు వాళ్లిద్దరూ ఉద్యానవనంలో విహరించి సకల సుఖాలూ అనుభవించారు ఆవేళ కళావతి - ' రాక్షసి వస్తుంది అందుచేత నిన్ను ఉడుముగా మార్చి గోడ కంటిస్తాను మా అమ్మరాక్షసి వెళ్లే వరకూ అలాగే ఉండు ఆ విద్య నాకు అమ్మ నేర్పినదే " అని అతన్ని ఉడుముగా మార్చి గోడకంటించింది అంతలో బ్రహ్మరాక్షసి వచ్చింది ఆమెఎదురేగి ఆహ్వానించింది భోజనమయ్యాక "అమ్మాయీ నేడు మనింట నరవాసన వేస్తూందేం? అంది రాక్షసి - సందేహంగా

" ఈ అడవిలోకి మానవులు రాగలరా? వచ్చినా యీ కోటలో కెలారాగలరు? నేను మనిషిని. నాకంపు నీకు పడదు కదా. నన్ను చంపేయ్ నరవాసన రాకుండా అంది కళావతి

రాక్షసి పశ్చాత్తాపపడి కూతురినోదార్చి వింతలు చెప్పి నిద్రించి ఉదయం కావడంతోనే వెళ్ళిపోయింది కళావతి స్నానంచేసి, అలంకరించుకుని, ఉడుమును వసంతునిగా మార్చుకుని విందు చేసింది వారిద్దరూ శృంగారకేళిలో మునిగిపోయారు కొన్నాళ్లలాగే గడిచాయి అప్పుడు వసంతుడు - కళావతీ! పాము పడగకింద కప్పలా ఏం బతుకిది? ఆకలిగా ఉన్నప్పుడు మీ అమ్మరాక్షసి నిన్ను కూడా నిస్పందేహంగా తినేస్తుంది క్రూరులను నమ్మలేం మనం యిక్కడినుంచి పోయి సుఖంగా ఉండొచ్చు కదా? స్వేచ్ఛగా సుఖించవచ్చు కదా? ' అన్నాడు

"అయ్యో మీకారాక్షసి శక్తి సామర్థ్యాలు తెలియక అలా అన్నారు మనమెక్కడికెళ్లినా క్షణంలో వొచ్చి మనిద్దరినీ తినెయ్యగలదు." అందామె భయంగా

మళ్ళీ కొన్నాళ్ళు గడిచాక వసంతుడామెకొక పదకం చెప్పి ఆరాత్రి రాక్షసి వచ్చాక అలా చెయ్యమన్నాడు. రాక్షసి వొచ్చేముందతన్ని బల్లిని చేసి గోడకతికించి రాక్షసి చూసేలా కన్నీరు పెట్టుకోసాగింది ఆమెనలా చూడలేక .. రాక్షసి "నేనులేనప్పుడు నిన్నెవరైనా అవమానించారా? చెప్పు వాళ్లని చంపేస్తాను నువ్వు దుఃఖిస్తే నేను చూడలేను " అంటూ ఒత్తిడి చేసింది.

చాలా బతిమాలించుకున్నాక – "నావిచారానికి కారణం అవేవీ కావు. నువ్వనేక దేశాలు తిరుగుతూంటావు ఎన్నో ఘోరాలు చేస్తూంటావు ఏమాంత్రికులో తాంత్రికులో నీకు హానిచేస్తే నేనీ అడవిలో అంతమవవలసిందే కదా? నువ్వురాకపోతే నా ప్రాణాలు నిలుస్తాయా? అయినా. .సంపాదించింది చాలదా? పోనీ నన్ను తినేసెయ్ " అంది కళావతి దుఃఖం నటిస్తూ

"ఇదానీచింత? చాలేల్లే నన్నెవరూ చంపలేరు. నేనెక్కడ కెళ్లినా నా ఆయుర్దాయం యిక్కడే ఉంటుంది అమర్మమెరిగిన వాడు తప్ప నన్ను చంపలేరు. ఆమర్మం తెలుసుకోడం బ్రహ్మతరం కాదు రాక్షసులు ఒకే చోట ఉండడం పరిపాటి కాదు " అంది రాక్షసి కళావతి ఆ సమాధానానికి సంతృప్తి పడక."నీ ఆయువు గోప్యంగా ఉందనేస్తే సరిపోతుందా? ఆ రహస్యం తెలుసుకున్నాక నేను నిశ్చింత పడాలి." అందివసంతుడు బోధించిన ప్రకారం

తనమీద కూతురికెంత ప్రేమ – అని మురిసిపోతూ – బ్రహ్మరాక్షసి చెప్పసాగింది "ఐతేవిను ఈ నగరాని కుత్తరంగా నవరత్నములద్దబడిన మెట్లు కల ఒక తటాకం ఉంది దానిలో స్నానం చేసి, ముమ్మారు ప్రదక్షిణం చేసి పడమరవైపు చూస్తే అరటితోట కనిపిస్తుంది. ఒక్కొక్క అరటి చెట్టుకి నూరేసి పళ్లుంటాయి. అవి

రకరకాలుగా కనిపిస్తాయి ఆ చెట్ల మధ్య వింతయిన ఆకులతో పళ్ళుకిక్కిరిసిన గెలలతో ఒక చెట్టుంటుంది ఆ పళ్లన్నీ తొలగిస్తే తాళం వేయబడిన యినపపెట్టె కనిపిస్తుంది. ఆ మూత తెరిస్తే రత్నాల గోడలతో ఒక పాతాళ గృహం కనిపిస్తుంది. దానిలో మణుల, స్ధంబాల మండపం అక్కడ వేలాడగట్టిన బంగారు పంజరంలో పంచెవన్నె రామచిలుక నా ఆయువు దానిలో ఉంది. ఆ చిలుక కేమైనా హాని జరిగితేనే నాకు హాని జరుగుతుంది మరోలా చావు నా సమీపానికి కూడా రాలేదు. కూతురివని నేను నీకు చెప్పాను ఇప్పటికేనా నాకు మరణం లేదని నీకు నమ్మకం కలిగిందా?"

"ఆ," అందికళావతి

తెల్లవారి - బ్రహ్మరాక్షసి వెళ్ళిపోగానే - బ్రహ్మరాక్షసి ఆయుర్దాయ రహస్యం పూసగుచ్చినట్లు వసంతుడికి చెప్పింది

వసంతుడామెకేదో మిష చూపి - కోటలోంచి బయట పడి ఉత్తరంగా వెళ్లేసరికి పద్మాలతో నిండిన సరస్సు కనిపించింది. దానిలో మునిగి ముమ్మారు ప్రదక్షిణం చేసి మొక్కి..రాక్షసి చెప్పినట్లు అరటితోటను చూసి అరటి బోదెను నరకగానే యినుపద్వారం కనిపించింది

అప్పుడు తనుద్వారపు తాళము మరచి వచ్చిన విషయము తెలిసి - పరిపరివిధాల విచారిస్తూ అలవాటు చొప్పున చొక్కాజేబులో చెయ్యి పెట్టేసరికి తాళం తగిలింది' దానితో ప్రయత్నించగా కప్ప తెరచుకుంది దైవమే తనకీసాయంచేసాడని వెయ్యి నమస్కారాలు పెట్టి పాతాళ గృహంలోకి ప్రవేశించాడు.

'ఆతాళం వసంతుడి జేబులోకెలా వొచ్చింది గురువుగారూ"? అడిగాడు గోపాలుడు

"రాక్షసి తనవృత్తాంతం చెప్పి వెళ్లాక కళావతి చూద్దామని పెట్టెలోంచి ఆతాళం తీసిచూసి. అశ్రద్ధ వలన దానిని తీసిన చోట పెట్టక మంచముమీదున్న మగని జేబులో వేసింది అతనదే అంగీని ధరించి వొచ్చాడు."

"ఓహో. చెప్పండి తరవాతేమైంది?"

"వసంతుడు పాతాళ గృహంలోకి వెళ్లి మణికాంతులతో పట్టపగలులా వెలిగిపోతున్న మండపంలో వేలాడుతున్న పంజరంలోని చిలకను పట్టుకునేంతలో - దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తూ బ్రహ్మరాక్షసి వొచ్చేసింది

కాని మొదట చిలక రెండుకాళ్ళనూ విరిచేయడంతో బ్రహ్మరాక్షసి దబ్బున నేలకూలింది వసంతుడు చిలక రెక్కలూ కంఠమూ నులిమి చంపెయ్యడంతో బ్రహ్మరాక్షసి గిలగిల తన్నుకుంటూ చచ్చింది అలాటి దుష్టురాలిని చంపినందుకు దేవతలు కూడా సంతోషించారు

(రాక్షసి అరుపులు విని - నాతల్లి అకాలమున వచ్చుచున్న దేమి? నామనోహరుడడవికి ఒంటరిగా పోయెనే అతని ఉనికి తెలిసివచ్చిందా? ఏం జరగబోతూంది? తాళం చెవి కనిపించడం లేదు నన్ను పుత్రిక అని నమ్మి తన ఆయువు రహస్యం చెప్పింది. స్త్రీ చాపల్యం వలన నేను గుట్టు దాచలేక పోయాను నాతల్లి కేం జరుగుతుందో? అని విలపించసాగింది.)

వసంతుడు రావడం చూచి సంతోషంతో ఎదురేగి - "ఇంతాలస్యం చేశారేం?" అని అడిగిన కళావతి కతను కథంతా చెప్పాడు తల్లి మరణానికామె దుఃఖించగా "నీ జననీజనకులను చంపిన రాక్షసి .నిన్ను ఏకాంతమున బందీ చేసిన బ్రహ్మరాక్షసి.. లోకకంటకి అటువంటి దాని మరణం పట్ల విచారించడమేమిటి?" అని ఓదార్చాడు "నేను విశ్వాసఘాతకు రాలినైతిని ఆ రాక్షసి నన్ను పుత్రికా వాత్సల్యంతో చూసినది కదా ఒకసారామె కళేబరమును చూబించు ' అంది కళావతి

అతనామెను తీసుకెళ్ళగా చూచింది ఆకళేబరమున కగ్ని సంస్కారముగావించి కళావతితో కలసి సముద్రంలో శుచిస్నానం చేస్తుండగా ఆమెకుడిచేతి కుండే నవరత్న ఖచితమైన కంకణము సముద్ర

కెరటాల తాకిడికి జారి సముద్రంలో పడిపోయింది. అందుకై ఆమె సముద్ర జలాలలో వెదకుటకు యత్నించింది

"నాథా! ఆకాశగంగలో నగలు, వస్త్రములు గట్టున బెట్టి దేవతలు జలకాలాడు తుండగా మా అమ్మ ఆకంకణముల జత దొంగిలించి తెచ్చి నాకిచ్చినది రెండవ కంకణమును చూడు. అది ఎంత అందమైనదో నీకే తెలుస్తుంది. ఆ కంకణంమీద నాకతిమక్కువ. ఇక్కడ సముద్రంలోతు కంకణం దొరకుతుందనే ఆశలేదు " అందామె

వసంతుడు – "కళావతీ! ఊరికే శ్రమపడకు నేర్పరియగు కంసాలి మిత్రుడు కలడు. అతనిచే రెండవది చేయిస్తాను." అంటూ ఆమెను కోటలోకి నడిపించాడు.

అంతలో తన మిత్రుల విషయం జ్ఞాపకం వొచ్చింది. కాని, కోటలోని భవంతులలోని వింతలు చూసి వెళ్లొచ్చనుకుని – కళావతితో గడపసాగాడు.

"గోపాలా! అలా సముద్రంలో జారిపడిన కంకణాన్ని ఒక చేప మింగింది ఆచేప ఒక జాలరివలలో పడగా – గర్భమునందు మణికంకణ ముండడం వల్ల కాంతులు విరజిమ్ముతూ సుందరంగా ఉన్న ఆ చేపను రాజుజాలరికిచ్చినచో మంచి బహుమానము లభించగలదని దానిని కోయక, ఆ ప్రాంతమునకధిపతి అయిన వంగదేశాధీశుడు కందర్ప కేతుడనువానికి అర్పించాడు

కందర్పకేతుడు జాలరికుచిత బహుమానమిచ్చి పంపి తాను దగ్గరుండి ఆ చేపను కోయించగా బయటపడిన కంకణమునుచూసి – 'ఇంత వింతయగు కంకణమును ధరించిన ఆస్త్రీ ఎంత వన్నెలాడియో.. . ఆమెను పొందిన మగవాడెంత అదృష్టవంతుడో అనుకొనుచూ – 'ఇట్టి కంకణమును ధరించిన ఆమెను తీసికొని వచ్చి నా కప్పగించిన వారికర్ధరాజ్యమిస్తాను.' అని ప్రకటించాడు

కంకణం చిత్రం తప్ప మరే ఆధారమూ లేకపోవడంతో ఎవరూ ముందుకు రాలేదు.

ఒకనాడు ఆవూరిలో ఉన్న వృద్ధ వనిత ఆవృత్తాంతంవిని రాజువద్దకు వచ్చి జాలరి వలవేసిన ప్రదేశం గుర్తూ, కంకణం రుపు రేకలూ తెలిసికొని యిలా అంది 'దేవరవారు కోరిన కాంతను నేను తీసికొని వచ్చెదను విచిత్ర వస్తువులు, సకల సదుపాయాలూ కల ఒక ఓడను నాకిప్పించండి ''

రాజు అవన్నీ ఆమెకు సమకూర్చగా పల్లెవానికి చేపదొరికిన దిక్కుగా ఓడ కదిలింది ఓడ నడుస్తూంటే ఒడ్డుని జాగ్రత్తగా పరిశీలించ సాగింది వృద్ధురాలు పదిహేను రోజులు గడిచి – పదహారవ రోజున – ఒడ్డునుండి పొగ దానిలోనుండి మంట ఎత్తయిన మేడలు కనిపించాయి వాటిని చూసి ఆముసలమ్మ సంతోషించి పడవకి లంగరువేయించి – చిన్నదొన్నెలో ఆ పట్నం రేవులో దిగింది

మొదట ఆమెకెవరూ కనిపించలేదు గట్టెక్కి నాలుగు వేపులా చూసేసరికి యిద్దరు కనిపించారు. ఉదయం షికారుకొచ్చిన వసంతుడూ, కళావతీవారు. వారిని చూసి తలవిరగబోసుకొని సముద్ర తీరంలో కూర్చుని ఏడవసాగింది వృద్ధురాలు

వారిటువచ్చి "అమ్మా నీవెవరివి? నీకొచ్చిన కష్టమేమిటి? చెబితే మాకు చేతనయిన సాయం చేస్తాం '' అన్నారు.

ఆమె తలెత్తి చూసి వాళ్ల చక్కదనానికి ఆశ్చర్యపోయింది కళావతి చేతికంకణం కూడా చూసి – ఎలాగో ఒకలా దీనిని మాయ చేసి పట్టుకు పోయి అర్ధరాజ్యం చేజిక్కించుకుంటాను – అనుకుంది మనసులో 'నాకష్టమేమని చెప్పుకోను. లేకలేక కొడుకు పుట్టేసరికి వాడి తండ్రి చనిపోయాడు వాడిని పెంచి పెద్ద చేసి పెళ్ళిచేశాను పెళ్లయ్యేసరికి వాడికి నాయందు అభిమానమూ భయభక్తులూ తగ్గిపోయాయి కొడుకు చెడ్డవాడైతే కోడలు మంచిదౌతుందా? అదేం నూరిపోసిందో, నాకొడుకు నన్ను చావమని సముద్రంలో పడేశాడు పాపీచిరాయు' వని నేను చావకుండా అలలు తేల్చి యిక్కడ పడేశాయి అని భోరు భోరున

ఏడ్చేసరికి వాళ్ళు జాలిపడి – "అవ్వా! మేమీప్రాంతానికి ఏలికలము నువ్వుమాకు తల్లిగా ఉండు ' అంటూ ఆమెను కోటలోకి తీసుకెళ్ళారు

ఆవృద్ధురాలు ఎంతో నమ్మకంగానూ వారిని వశపరచు కునేటట్లూ ప్రవర్తించసాగింది. కొన్నాళ్లు గడిచాక – కళావతి మెత్తదనం కనిపెట్టి, వసంతుడు లేని సమయంలో –

"అమ్మా. మనమీకోటలో ఒంటరిగా ఉన్నాం కోటదాటితే భయంకరమైన .అడవే తప్ప మరేమీ లేదు నీ భర్త అమిత బలశాలి కనుక మనకేలోటూ లేదు కాని. మానవశరీరములు శాశ్వతము కావు కదా. నేనిలా అంటున్నానని నువ్వు మరోలా భావించకు. అతను ముందో, మనం ముందో? ఎవరు చెప్పగలరు? భవిష్యత్తు గురించి ముందే జాగ్రత్త పడాలి నీమగని ఆయుర్దాయామెంతో అడుగు నేనడిగినట్లు కాదు సుమీ." అంటూ బోధించింది.

అవ్వ తన క్షేమంకోరే అలా చెబుతూందని భావించిన కళావతి – ఒకవేళ మీకేమైనా అయితే మాకేదిదిక్కు? మీ ఆయువు మీకు తెలుసునా? 'అని అడిగింది అందుకు వసంతుడు నవ్వుతూ – "నాకు భయమేమిటి?నా ఆయువీకత్తివరయందుంచ బడింది దీనికి ప్రమాదం వొస్తే తప్ప నాకేమీ అపకారం జరగదు పోనీ, యీ వరను నువ్వేకాపాడు " అంటూ కత్తివరనిచ్చేసి వేటకెళ్లిపోయాడు.

కళావతి అదంతా అవ్వకి చెప్పేసింది. అప్పుడు – "దీనిని మనము అతి జాగ్రత్తగా కాపాడుకోవాలి సుమా ఎక్కడ దాచుతావో మరి – " అంది అవ్వ.

"ఎక్కడ దాచినా భయమేముంది? మనంకాక మరెవరూ యిక్కడికి రాలేరు. నీ మంచం తలదగ్గరుంచుదాం. రోజూ చూసుకోవచ్చు – "అంది కళావతి.

కొన్నాళ్లు గడిచాక ఆ దంపతులలసి సొలసి గాఢనిద్రలో మునిగి ఉన్నవేళ, ఆ నీచురాలు ఒక రాతిమీద వరనరగతీస్తూంటే – రాజకుమారుడయిన వసంతుడు మరణవేదనతో కొట్టుకోసాగాడు

కళావతి లేచి – వరకనపడక ముసిలిదానిని వెదకిపట్టుకుని – ' ఆయన నీకేం అపకారం చేశారే నిర్భాగ్యపు ముండా" అని తిడుతూ అవ్వచేతిలోని వరను లాక్కుంది అందుకా అవ్వ –

'ఊరికే తిడతావేం? నీ మగడు చెప్పిన గుట్టు నిక్కమోకాదో చూస్తున్నానంతే. పద. నీ మగనికి నిజముగా ఆయాసము కలిగిందో లేదో చూద్దాం." అంటూ అతని గదిలోకి తీసుకెళ్లింది వసంతుడు శవంలాగే పడున్నాడు

"కళావతీ నేను పొరపాటున అట్లు చేసితిని అయితే ఏం? ఒక సిద్ధౌషధం వల్ల నేను బతికిస్తాను దానికి ముందు నువ్వు సముద్ర జలంతో స్నానం చెయ్యాలి." అంటూ ఆమెను సముద్ర తీరానికి తీసుకుపోయింది

"వట్టినేలను కూర్చుని తలంటుకోరాదు" అంటూ దోనలోకి నడిపించి, "పులుసుపోస్తాను. కళ్లుమూసుకో. " అంటూ నిముషంలో ఆ దోనెను పెద్ద ఓడ దగ్గరికి తీసుకుపోయింది

అప్పుడు కనులు కడుక్కుని చూడగా భూమికనిపించక . పెద్దఓడ మాత్రమే కనిపించగా ' వోసి పాపాత్మురాలా నామగడక్కడ అచేతనుడై పడుంటే నన్నిక్కడికెందుకు తీసుకొచ్చావ్? కావాలంటే నన్ను కూడా చంపెయ్. " అంది బిగ్గరగా. ముసలిదేమీ మాట్లాడకపోడంతో "నేనీ సముద్రంలో పడి చచ్చిపోతాను " అంటూ ఆమె లేవబోయేంతలో – ముసలిదాని ఆజ్ఞప్రకారం . ఆమెను ఓడలోకి తీసుకుపోయి ఒకమంచి గదిలో ఉంచి తాళం బిగించారు. "పడవను పోనిమ్ము అనివారికి చెప్పి – కళవతితో యిలా చెప్పింది.

"నీ భర్త మరణించాడు తిరిగిరాడు అతనికంటె రూపంలోనూ ఐశ్వర్యంలోనూ అధికుడూ యౌవనవంతుడూ అయినవానిని నీకు భర్తగా తెస్తాను."

కళావతి అవేవీ వినిపించుకోక తననితాను తిట్టుకుంటూ దుః ఖించసాగింది గాలి అనుకూలంగా వీచడంతో ఆరురోజులకే ఓడ

వంగదేశం చేరింది ఫిరంగి ధ్వని వినడంతోటే వృద్ధురాలు కార్యం సాధించుకొచ్చిందని రాజు ఎదురొచ్చాడు అప్పుడికప్పుడే ఆమెను చేపడతానన్న "రాజుని కొన్ని దినములు మచ్చిక చేసిన గాని యిచ్చగింపదు - "అని వారించింది వృద్ధురాలు రాజు కళావతిని అపూర్వమగు అంతః పురం చేర్చి - పరిచారకల నేర్పరచి కొన్ని దినములు గడిచాక ఆమెను కోరగా . ఏదో వ్రతం మిషతో ఆమె సంవత్సరం గడువు విధించింది. ఆ రాజు దినమొక యుగంగా గడపసాగాడు

గోపాలా! ప్రయాణ సమయమయింది. పద, వెళ్దాం తరవాయికథ వొచ్చే మజిలీలో చెబుతాను." అన్నాడు మణిసిద్ధుడు.

కథవినే ఉత్సాహంలో - యతి మౌనంగా నడుస్తున్నా - "అయ్యా! ఆ వసంతుడు బతికేడా? మళ్ళీ కళావతిని కలుసుకుంటాడా?" అంటూ అడిగాడు, కాని యతి మౌనం వదలలేదు

# కాశీ మజిలీ కథలు

## 3వ మజిలీ

### 11. రాముని కథ

గోపా. దక్షిణ దిశగా మర్రికొమ్మ మీద మంత్రికుమారుడు రాముడు వెళ్లాడు కదా ప్రయాణం మొదటి నాలుగు రోజులూ సులభంగానూ తరువాత రెండు దినాలూ ప్రయాసతోనూ సాగి – ఆ కొమ్మ అంతం కనిపించింది

అది పర్వతప్రాంతభూమి అక్కడి విశేషాలు చూద్దామని కొమ్మదిగాడు. గొప్ప పర్వత ప్రాంతం కనిపించింది దాని ఎత్తు చూడాలని ఎక్కడం ప్రారంభించాడు ఆరురోజులెక్కినా శిఖరం కనిపించకపోవడంతో – "ఇది విచిత్రంగా ఉంది రేపు కూడా దీని శిఖరం కనపడకపోతే తిరిగి పోడమే. ఎక్కిన కొద్దీ యింకా ఉంటూంది పర్వతం." అనుకున్నాడు

ఆరాత్రి గడిపి – మర్నాడు రాత్రివరకూ మళ్లీ ఎక్కి – అంతుకనపడక మరలిపోదామనుకునేంతలో ఒకగుహ కనిపించింది రాత్రి అని సందేహించి అక్కడే గడిపి మరుసటి రోజు పొద్దున్న ధైర్యసాహసాలే తోడుగా గుహలో ప్రవేశించాడు.

తోవ క్రమంగా సన్నగిలి – వొంగి నడవవలసి వచ్చింది. మార్గంచిన్నదౌతూ చీకటి చిక్కబడసాగింది ఇక నడవశక్యంకాక వెనక్కిపోదామనుకునే సరికి వొచ్చిన తోవ కనిపించలేదు ముందుకీ దారిలేదు, వెనక్కీ దారిలేదు

"నా సాహసమే నన్నిట్లు చేసింది మర్రికొమ్మ చివరకనపడగానే తృప్తి చెంది ఎందుకు వెనుదిరగలేదు? పర్వతం ఎక్కడంతో సరిపెట్టుకోక గుహకెందుకొచ్చాను?

ఇంతదూరం రావడం దైవికమే' - అని విచారించి మళ్ళీ 'ఎవరి కర్మని బట్టి వారిని దైవం నడిపిస్తాడు.' అని ధైర్యం తెచ్చుకుని మరో రెండు బారలు పాకడంతో వెలుతురు కనిపించింది మరో రెండు గజాలు సాగేసరికి ఒక ద్వారం చేతికి తగిలింది అది లాగేసరికి - పట్టపగలులా ఉన్న గదిలో తపస్సు చేసికొంటున్న మహర్షి కనిపించాడు.

రాముడు అతని పాదాలమీద వాలిపోయాడు. ఆయోగి కళ్ళుతెరచి - "నువ్వెవరివి? ఇక్కడికి ప్రాణాలతో ఎలా రాగలిగావ్?" అని అడిగాడు రాముడు తనకథ చెప్పి రక్షించమన్నాడు

ఆయతి "నేను పన్నెండేళ్ల కొకసారి బాహ్యప్రపంచం చూస్తాను అది యీ దినం కనుక నువ్వు బతికి పోయావు లేకపోతే వృధాగా చావవలసిఉండేది ఏంకావాలో కోరుకో" అన్నాడు. 'ఇక్కడినుంచి బయట పడడం కంటె ఏం కావాలి?' అన్నాడు రాముడు "కళ్లుమూసుకో." అని యతి అనగానే కళ్లుమూసుకున్నాడు తెరిచేసరికి పర్వతాని కవతల వేపున్నాడు

"అయ్యో! ఆమర్రి మొదలు చేర్చమని కోరక వెర్రివాడి నయ్యాను ఇప్పుడా వటవృక్షం ఎటుందో తెలియదు " అనుకుంటూ నడవసాగాడు సాయంత్రం వరకూ నడచినా ఏగ్రామమూ కనిపించలేదు ఒకమామిడిచెట్టు కనిపించింది దాని మొదట మేను వాల్చాడు. నిద్ర పట్టక అలాగే ఉండగా ఆ చెట్టుమీది గూటిలోకి రెండు గరుడ పక్షులు చేరి యిలా మాట్లాడుకోసాగాయి

*ఆడపక్షి* : నాథా! మీరనేక భూములు తిరిగి వొచ్చారు కదా వింతలేమిటి?

మగపక్షి : వింతలేమీలేవుకాని యిక్కడికి రెండు యోజనాల దూరంలో ఒకపట్నముంది ఆ రాజుకి అతిచక్కని పుత్రికుంది ఎందువల్లనో కొన్నిరోజులుగా ఆమెకు కనులు కనిపించడం లేదు అంత అందమైన అమ్మాయికి దృష్టి పోగొట్టినందుకు తల్లితండ్రులేకాక పౌరులు కూడా దేవుణ్ని తిడుతూ భోజనం మానేశారు రాజు ఎంతడబ్బు ఖర్చుపెట్టినా ఎన్నిచికిత్సలు చేయించినా కళ్లురావడంలేదు

ఆడపక్షి మరి రాజేం చేశాడూ?

మగపక్షి గొప్పకులంలో పుట్టినా నీచకులంలో పుట్టినా ఎవడయినా ఎలాటివాడయినా ఆమెకు కళ్లు తెప్పిస్తే అతనికాఅమ్మాయినీ రాజ్యాన్నీ యిస్తానని చాటింపు వేయించారు

ఆడపక్షి అయ్యో అంత అందగత్తెకు అంధత్వమంటే నాకే జాలేస్తూంది ఆమెకు నేత్రాలు తెప్పించగల వైద్యుడే లేడా భూమ్మీద?

మగపక్షి మనగూట్లో ఉన్న పసికాష్ఠం అరగదీసి ఆగంధం ఆమె కన్నులకు పట్టిస్తే తప్ప మరేవైద్యానికీ ఆమెకన్నులు తిరిగిరావు

పక్షి భాషను తెలిసిన రాముడా మాటలు విన్నాడు తెల్లవారి ఆపక్షులు వెళ్లిపోగానే చెట్టెక్కి వాటిగూటిలోని పసికాష్ఠం తీసికొని సాయంత్రానికే ఆపట్నం చేరుకున్నాడు రాత్రి ఒక బ్రాహ్మణ గృహమందు భుజించి వీధరుగుమీద పడుకుంటే – ఆనారీమణి చక్కదనం గురించీ, నేత్రవ్యాధి గురించీ పౌరులు మాట్లాడుకోడం విన్నాడు తెల్లవారాక "రాజకుమార్తె కన్నులు నేను చక్కబరుస్తాను." అని అతననడంతోటే – పదిమంది అతన్ని పట్టుకుని రాజనగరుకి తీసుకు పోయారు

రాజు – "ఇలాటి వైద్యులు బోలెడంత మందయ్యారు." అని మొదట యీసడించినా, రాముని వాక్చాతుర్యానికి లొంగి, పరిచారికలను నియమించి అతనికా కన్యను చూపమన్నాడు ఆ గదిలోకి రాగానే వారిని దూరముగా పొమ్మని – పసికాష్టం అరగదీసి గంధం ఆమెకనులకు పూయగానే మరుక్షణం ఆమెకు దృష్టివొచ్చి కన్నులు మణులవలె ప్రకాశించాయి ఆమె –ఎదురుగా ఉన్న రామునికి నమస్కరించి – "నాపుణ్యంఫలించింది నువ్వే నాభర్తవి ' అని అనురాగ పూర్వకంగా పలికింది

రాజు ఆశుభవార్తవిని శుభముహూర్తంలో తన పుత్రికను రాముడికిచ్చి పెళ్లి చేశాడు కొన్నాళ్లామెతో సుఖంగా గడిపాక ఒకనాడు తన కథ చెప్పి మిత్రులను కలుసుకుని వస్తాననీ, అనుమతిమ్మనీ అడిగాడు మొదట ఆమె అభ్యంతర పెట్టినా చివరకంగీకరించింది

రాముడు ఒకనాటి అర్ధరాత్రి మంచి గుర్రమెక్కి అడవి మార్గాన పోయాడు. మరునాటి వరకూ ప్రయాణం చేసి విసుగొచ్చి . ఎండగా ఉండడంవల్ల అలసి ఒక కొలనులోని నీరు త్రాగి విశ్రమించాడు అప్పుడు దిక్కులు పగిలేలా ఒక అద్భుత ధ్వని వినపడింది నిరాయుధుడైన అతను ఎత్తుగా ఉన్న చెట్టుకొమ్మపైకెగ బ్రాకేంతలో. . ఒక సింహం వేగంగా వచ్చి చెట్టుకి కట్టబడిన గుర్రాన్ని చంపి యీడ్చుకుపోయింది.

సింహం దూరంగా పోయిందని నిశ్చయమయ్యాక అతను చెట్టుదిగి మెల్లగా నడవసాగాడు చీకట్లు చిక్కగా కమ్ముకుంటున్నాయి ఆకాశంలో మేఘాలు కమ్ముకుని ఉరుములు మెరుపులుతో పెద్ద వర్షం మొదలయింది ఆమెరుపులో ఒకగుడి కనిపించే సరికి ముందు వెనుకలాలోచించకుండా దానిలో ప్రవేశించి గుమ్మంలో నిలబడి తడిగుడ్డలు పిండుకోసాగాడు. చలికి వొణుకుతూ అలా నిలుచుండగా ఒకస్త్రీ ఆక్రందన, పురుషుల మాటలు వినపడి భయపడి – గర్భాలయంలోకి పరుగెత్తి చండికా విగ్రహం వెనుక దాగున్నాడు.

అప్పుడు ఒకస్త్రీని వెంటబెట్టుకుని యిద్దరు దొంగలు విచ్చుకత్తెలతో ఆ గదిలో ప్రవేశించారు విగ్రహం చాటునుండి రాముడు చూశాడు. ఆ స్త్రీ మెరుపుతీగెలా ఉంది. ఆ దొంగలు కాటుక కొండల్లా భయంగొల్పుతున్నారు ఆ దొంగలిలా మాట్లాడుకోసాగారు

**చార్వాకుడు** భుజంగా ఇంతవరకు తొంభై తొమ్మిదిమంది రాచకన్నెలను బలిచ్చాం

ఈమెతో వ్రతం పూర్తవుతుంది రేపు మనకు చండిక వరమునిస్తుంది

**భుజంగుడు** · చార్వాకా! మనం కనుక యింత అసాధ్యమైన వ్రతమును పూర్తిచేయగలుగుతున్నాం. మర్వెరూ నూరుగురు రాజ కన్యలను బలివ్వలేరు

**చార్వాకుడు** . మనమింతవరకు బలిచ్చిన వారిలో యింత చక్కనిది లేదు సుమీ

భుజంగుడు : లేదు. ఆరు మాసాల కిందట దీని తండ్రి స్వయం వరానికి చాలామంది రాజకుమారులను రప్పించాడు కాని యిది తన చక్కదనమునకెవరూ సరిరారని వారిలో ఎవరినీ వరించలేదు అప్పుడే నేను దీనిమీద కన్నేశాను

చార్వాకుడు · దీనికి ఈ యోగముండగా ఎందుకు వరిస్తుంది

భుజంగుడు : చార్వాకా! దీనిసోయగం చూస్తూంటే ఒక్కసారి దీనితో భోగించి తరవాత అమ్మవారికి బలిద్దామనిపిస్తూంది

చార్వాకుడు · అలా చేస్తే అమ్మవారికి కోపమెచ్చివరమివ్వరు సుమా

భుజంగుడు : దీనితో సంభోగ సౌఖ్యంకంటె అమ్మవారి వరమెక్కువా?

చార్వాకుడు · కాదా? అమ్మవారికి కోపమొస్తే మనం భస్మమైపోమూ?

భుజంగుడు అలా అయితే యీ స్త్రీని అమ్మవారికి బలియివ్వనే వొద్దు. నేను పెళ్లాడతాను బలికి మరో రాజకన్యను తెస్తాం

చార్వాకుడు . గడుసువాడివే. నువ్వే నా మగాడివి? చక్కని భార్య నాకూ యిష్టమే నేనే దీనిని పెళ్లాడుతాను

భుజంగుడు ఈ సంగతి ముందుగా నేను తెచ్చితినా, నువ్వు తెచ్చితివా?

చార్వాకుడు · ఎవరు తెచ్చినా, దీనిమీద హక్కు యిద్దరికీ సమానమే

భుజంగుడు · ఇంత మాత్రానికి హక్కులవరకూ పోవాలా? అమ్మవారికి బలిద్దాములే.

చార్వాకుడు అదయితే నాకు సమ్మతమే

అలామాట్లాడుకుని వాళ్లిద్దరూ నిద్రపోయారు వీరి మాటలు విన్న రాముడు - నిద్రిస్తున్న వారిని చంపకూడదన్న నీతి పాటించి, వారి కత్తులను తీసుకుని - నిద్రమాని జాగారం చేశాడు తెల్లవారింది.

తమకత్తులు కనిపించక అమ్మవారి మాయేమో అని వారనుకుంటుండగా - రాముడు రెండు చేతులతోనూ కత్తులతో వారి

ముందుకురికి – "చండికకు బలినివ్వడానికి తెచ్చిన భామను చెరపదలచిన మీపాపమూరికే పోతుందా? శక్తికి సేవకుడిని " అని బెదిరించగా వారు కొయ్యలవలె నిలబడిపోయి.. ఏమీ అనలేకపోయారు "

వాళ్లు పారిపోదామనుకునేంతలో రాముడు వారి తలలు నరికేశాడు. దొంగలను చంపి, ఆలయంలోనికి వెళ్లి – 'నారీమణీ. లే. దొంగలు చచ్చారు తెల్లవారింది అనగానే ఆమె కళ్లు తెరచి, రాముని చూసి – "మహాత్మా! మీరెవరు? నన్నుద్ధరించ వచ్చిన దేముడి లాగే కనపడుతున్నారు కృతజ్ఞతా సూచకంగా మీకు నమస్కరిస్తున్నాను మీ వృత్తాంతం చెప్పండి.' అంది రాముడు తన గురించి చెప్పి, ఆమె వివరాలడిగాడు.

అప్పుడామె యిలా చెప్పింది "అయ్యా నేను కుంతల దేశాధిపతి శ్రుతకీర్తి కూతురను నాపేరు కనకప్రభ వయసు వచ్చింది మొదలు నన్ను వరించడాని కెందరు రాజకుమారులు వచ్చినా నాకు సరిపడక ఎవరినీ వరించలేదు ఆయీర్ష్యతో ఏరాజకుముడు ప్రోత్సాహ పరిచెనో, మొన్నటి రాత్రి నిద్రలో మునిగిన నన్ను దొంగిలించి యిద్దరు దొంగలు తీసుకు వచ్చిరు. నేను ఏడుస్తూంటే నిన్నరాత్రి వీరిగుడిలోకి తెచ్చారు మూర్ఛపోయిన నాకు ఆతరువాతేం జరిగిందీ తెలియదు అలాటి దుర్మార్గులను చంపి నాకు ప్రాణనాదానం చేశారు మీవంటి చక్కని వానినింతవరకూ చూడలేదు నన్ను వివాహం చేసుకోండి. నా పినతల్లి కూతురు పద్మగంధి మిక్కిలి చక్కనిది దానికి నేత్రవ్యాధి రాగా కన్నులు తెచ్చిన వానికి దానితండ్రి తనకూతురినీ, అర్ధరాజ్యాన్నీ యివ్వలేదూ? ప్రాణదానం చేసిన వానిని పెళ్లాడుటలో ఏమాశ్చర్యముంది?'

అప్పుడతనామెను కౌగలించుకుని – నువ్వు నా మరదలి వన్నమాట పద్మగంధికి కనులు తెప్పించి పెండ్లాడింది నేనే విధి ఎంత చిత్రమైన నాటకాలాడగలదు." అన్నాడు.

ఆమెతో అడవిలో ప్రయాణం చేసి సాయంకాలానికొక కోయపల్లె చేరాడు.

కోయదొర యిల్లు మాత్రమే కొంచెం పెద్దది మిగిలిన యిళ్లన్నీ చిన్నవే 'ఈ రాత్రి నివసించదానికి చోటివ్వగలవా?" అని రాముడడగగా - కనకప్రభ అందానికి వలచిన దొర వారికొక గది చూపించి - తినదానికి మంచి పదార్థాలు కూడా యిచ్చాడు. అలసి ఉన్నవారు అవి తిని గాఢనిద్రలో మునిగిపోయారు

కోయవాళ్లకు మంత్ర తంత్రాలు తెలుస్తాయి ఆ రాత్రి కోయదొర రాముడిమీద మంత్రించిన అక్షతలు జల్లగా అతను కుక్కగా మారిపోయి మొరగసాగాడు

కనక ప్రభమేలుకుని మగడు కనిపించక కంగారుపడుతూంటే - కోయదొర 'సానీ భయపడకు నేను నిన్ను వలచాను నన్ను పెళ్లాడి కోయరాజ్యం ఏలుకో నామంత్ర ప్రభావంతో నీమొగుణ్ని నేనుకుక్కగా మార్చాను." అన్నాడు

అయ్యో దైవమా దొంగల బారినుండి రక్షించి మంచి మొగుణ్ణిచ్చావని సంతోషిస్తూంటే యిలా చేశావా! ' అని దుః ఖించి మూర్ఖుడిముందు నీతులు చెప్పడంవల్ల ప్రయోజనముండదని, ఆకోయదొరను మాయతో వంచించాలనుకుంది. 'దొరా. నాపూర్వజన్మ పుణ్యంకొద్దీ నువ్వు దొరికావు కాని నీకిదివరకున్న భార్యతో నాకు పడడం కష్టంకదా దేశాంతరంపోతే మనం సుఖంగా ఉండొచ్చు నేనక్కడనిన్ను పెళ్లాడతాను ' అంది. కామాతురుడైన కోయదొర భార్యాబిడ్డల నొదిలేసి ఆరాత్రి ఆమెను నమ్మి ఊరు వదిలేశాడు

ఒకచేత్తో కుక్క మెడతాడూ, మరోచేత్తో కత్తీ పట్టుకుని కనకప్రభ కోయదొరతో మర్నాడు జాము పొద్దెక్కేంతవరకూ నడిచి యిక నడవలేనంటూ అలసటతో చతికిలబడిపోయింది అతనామెకు పచారాలు చేశాడు మళ్లీ రెండు దినాలయ్యాక 'దొరా. ఈ మార్గం ఎక్కడికి పోతుందో తెలుసా?" అని అడిగింది

'వంగదేశరాజధానయిన హేలాపురం పోతుంది నేనాదేశానికి కస్తూరి, పునుగు మొదలయినవి పంపుతుంటాను. ఈ దారినాకు బాగా తెలుసు "

"నీమంత్రశక్తి చాలా అద్భుతం. మనిషిని నిముషంలో కుక్కని చేసేశావు. నీ సామర్థ్యం చూస్తాను. ఈ కుక్కను మళ్లీ మనిషిగా చెయ్యగలవా?"

"నేనలాటి మంత్రం నేర్చుకోలేదు ఆ ప్రక్రియ తెలిసిన వాడు హేలానగరంలో సత్రం ప్రాంతంలో మఠములో ఉన్న బైరాగి ఒక్కడే అతను నాకారహస్యం మాకాత్రం చెప్పలేదు మరి మన పెళ్ళెప్పుడు?"

ఇవాళ మంచిరోజే మా కులాచారం ప్రకారం ముందు చెట్టుకుమొక్కాలి. కొన్ని పువ్వులుతే " అని ఆమె అనగానే వాడు మోపెడు పూలు తెచ్చాడు పెళ్లి సంబరంలో. కనకప్రభ కుక్కనొక చోటకట్టి - ఆపూలతో చెట్టు మొదట పూజించి - సాష్టాంగ నమస్కారం చేసి అతనిని కూడా అలా చేయమంది.

పెళ్లిసంబరంలో వాడలా చేతులు జోడించి పడుకోగానే ఒక్కవేటుతో ఆమె వాడితలనరికేసింది. వాడు చచ్చాక -

'నారూపమేనాకపకారం చేస్తుంది. దీన్ని కప్పిపుచ్చాలి.' అంటూ మసిపూసుకుని మగవేషం ధరించి కుక్కనీ కత్తినీ పట్టుకుని హేలానగరం చేరుకుంది " అని చెప్పి -

'ఇక మన ప్రయాణానికి వేళయింది పద " అన్నాడు గోపాలుడితో. గొల్లవాడు కావిడెత్తుకుని స్వామి వెంట నడవసాగాడు

తరువాత మజిలీ చేరుకున్నాక స్వామి మళ్ళీ చెప్పసాగాడు

# కాశీ మజిలీ కథలు

## 4. వ మజిలీ

### 12 ప్రవరుడి కథ

"గోపా. మర్రిచెట్టు పడమర కొమ్మనెక్కి సాగర ప్రవరుడు మూడు రోజులు నడిచాక దాని అంతంకనిపించింది అతనంతటితో ఊరుకో. ఇంకా వ్యవధుంది కదా ఇక్కడేమైనా వింతలుంటే చూద్దాం - అని కొమ్మదిగి, అడవిలో లాగ ఉన్న అక్కడ సన్నటి దారికనపడేసరికి దాని వెంటనడవసాగాడు

కొంతదూరం వెళ్లాక విచ్చుకత్తులు పట్టుకున్న దొంగలు ఎదురై అతని కట్టుగుడ్డలతో సహా దోచుకుని తమమురికి గుడ్డలు కట్ట బెట్టి పోయారు. ఇక తన దగ్గరదోచుకోడానికి దొంగల కేమీ లేదు కదా అని సంతోషంగా సాయంత్రం వరకూ నడచి ఓ పట్నం చేరాడు.

అమావాస్య కావడంతో అంతా చీకటిగా ఉంది. భోజన సదుపాయం చేసే బ్రాహ్మణ గృహమెక్కడుందో తెలుసుకోలేక కోటకు పడమట దిక్కునున్న గుర్రాలసాలలో పడుకున్నాడు అలసిపోయిన అతనికి గాఢంగా నిద్ర పట్టేసింది కాని ఆకలివలన తొందరలోనే మెలకు వొచ్చేసింది. అప్పుడు కోట మీదుగా గలగల అనే శబ్దం వినిపించింది. అతను బెదరి - ఏమిటా అని చూసేసరికి - కోటగోడ పైనుంచి ఒక యినప గొలుసు క్రిందికి దిగింది అంతలోనే మెరపులా మెరిసిపోతున్న పదహారేళ్ల ముద్దుగుమ్మ ఆగొలుసు వెంట దిగింది

అదేమిటో చూద్దామని అతను కళ్లు మూసుకుని నిద్ర నటించాడు ఆమె ప్రవరుని వద్దకు చేరి - అతని వీపు మీద తడిమి - లెమ్మని పిలిచింది అతను లేవగానే ఒక గుర్రాన్ని చూపించి ఎక్కమంది

ఆమె మరో గుర్రాన్నెక్కి దారితీయగా అతనామెననుసరించాడు ఆ యిద్దరూ పడమటిదిశగా ఉన్న అడవి మార్గాన వేగంగా పోసాగారు."

మణిసిద్ధుని మాటలకడ్డమొచ్చి – "ఆమె ఎవరు? కోటగోడదిగి – ఎన్నడూ ఎరుగని ప్రవరుడితో ఎందుకు వెళ్తూంది?" అని ప్రశ్నించాడు గోపాలుడు

మణిసిద్ధుడతని కుతూహలానికి సంతోషించి – "కాంచనవల్లి ఆమెపేరు ఆనగరాధీశుని కూతురు ఆమెనైదేళ్ల వరకూ అతిగారాబంగా పెంచి సకల శాస్త్రములు తెలిసిన ఒక గురువు వద్ద చదవేశాడు. ఆమెతోపాటే మంత్రి కొడుకు జయంతుడు కూడా ఆ గురువు వద్ద చేరాడు

వాళ్లిద్దరూ విద్యాభ్యాస వేళయందేకాక మిగిలిన సమయంలో కూడా ఒకరినొకరు విడచి ఉండేవారు కారు. సకలశాస్త్రాలూ, సంగీతం, కవిత్వం, అశ్వపరీక్షలలో వారొకరిని మించి మరొకరుగా ఉండేవారు.

ఒకనాడు విహారం కోసం పూలతోటకు వెళ్లినప్పుడు అక్కడ కాంచనవల్లి – 'మిత్రమా! నీకిది తెలుసా? నాకు యౌవన మొచ్చిందట. ఇక నన్ను బయటకు వెళ్ళనివ్వరట." గురు దక్షిణ యిప్పించి అంతః పురంలో పెట్టండమ్మాయిని" – అని నాతల్లి చెప్పగా నాతండ్రి – అలాగే అన్నాడు. రేపు విదియ. మంచి ముహూర్తము ఈ యౌవనం వల్ల మనకెడబాటు కలుగుతూంది నేను నిన్ను చూచుటకు వీలుండదు. నన్నెవరికో యిచ్చి వివాహం చేస్తారని దాది చెప్పింది. శరీరములే వేరు, మనసొకటే అన్న తీరుగా ఉన్నాం కదా? సంపద కలిగిన తగని మగడితో కంటె విద్యారూప చతురుడగు మగనితో ముష్టెత్తి బతికిననూ మేలేకదా?

ఆడజాతిది అస్వతంత్రపు బతుకు. తల్లితండ్రులే తుచ్ఛునకు కట్టబెట్టినా వాడిని దేముడిలా చూసుకుంటూ సేవలు చేయాలి నాకు జ్ఞానం వొచ్చినప్పటినుంచీ నిన్నే పెళ్ళాడాలని కోరుకున్నా, సిగ్గువల్ల బయట పెట్టలేకపోయాను నిన్ను తప్ప వేరొకరిని వివాహమాడవలెనని నాకు లేదు. దీనికేదేనా ఉపాయం ఆలోచించు–" అంది.

"నాకూ చాలా రోజులనుంచి అలాటి కోరికే ఉన్నా నువ్వేమంటావో అని సందేహించాను కులం ఒకటే అయినా సంపద లేనందున నీ తండ్రి నిన్ను నాకివ్వడు ఏం చేయాలి? సాహసించమని చెప్పడం నావంతు కాదు ' అన్నాడు జయంతుడు నర్మగర్భంగా

"నేను మనసు విప్పి చెప్పినా యింకా సందేహమెందుకు? నువ్వేంచెప్తే అది చేస్తాను

'నీకు నన్ను పెళ్లాడాలని ఉంటే మనం విదేశంపోవాలి సుకుమారివీ, సుఖంగా ఉన్న దానివీ నిన్నిల్లు వదలి రమ్మనుటకు నోరు రావడంలేదు. ఆపైన నీయిష్టం 'సరిపడని వరునితో రాజ్యం చేయడంకంటె యిష్టమైన మగనితో ముష్టెత్తుకోవడం మంచిది ఎల్లుండమావాస్యనాడు నేను గుర్రాలసాలకి వొస్తాను. ఆరాత్రి అక్కడి నుంచే మనం పోదాం " అని వాళ్ళిద్దరూ బాస చేసుకున్నారు

మంత్రికొడుకయిన జయంతుడు సాయంత్రంనుంచే విలువైన వస్తువులూ, బట్టలూ, ఆహార పదార్థాలూ సిద్ధం చేసుకోసాగాడు చీకటిపడడంతోనే భోజనం చేద్దామనుకున్నాడు కాని తండ్రి ముందుగా రావడంతో – అతని పంక్తిన కూర్చోవలసివచ్చింది.

భోజనం చేస్తూ 'అబ్బాయ్ విదేశంనుంచి సంగీత విద్యా ప్రవీణురాలగు వేశ్య ఒకతె వచ్చింది ఈ రాత్రి నగరంలో సంగీత సభ జరుగుతుంది దానిని పరీక్షించడానికి నువ్వే సమర్థుడివని మీగురువు రాజుతో చెప్పాడు నిన్ను నాతో వెంట బెట్టుకు రమ్మన్నాడు మంచి బట్టలు కట్టుకుని సిద్ధంగా ఉండు –" అని తండ్రి అనేసరికి జయంతుడికి మతిపోయింది ఏమీ చెప్పలేక మౌనంగా ఉండిపోయాడు

"మాట్లాడవేం? నీకు ప్రావీణ్యం లేదా?"

'అదికాదు నాకివేళ తలనొప్పిగా ఉంది "

"ఎలాగైనా సరే వెళ్లక తప్పదు రాజుగారికీ సంగతి చెప్పివారేం చెబితే అది చేద్దాం.'

జయంతుడే అభ్యంతరాలు చెప్పినా తండ్రి వినలేదు రాజసభకు వెళ్లక తప్పలేదు. ఆసంగతి రాజకుమార్తెకు తెలియక –

అనుకున్నట్లే అర్ధరాత్రి గుర్రాల సాలకి వొచ్చింది పడుకున్నది జయంతుడే అనుకుని అతనిని వెంటపెట్టుకు వెళ్లింది.

వెళ్తూ.. ఆమె తన గుర్రాన్ని అతనిగుర్రం దగ్గరగా పోనిచ్చి - "మొన్నటి నుంచీ నేనీ ప్రయాణానికి ఎంత ప్రయాసపడ్డానో. ఏమైతే ఏం, మనమనోరథం ఈడేరింది. రాత్రి కూడా ఒక అవాంతరం ఎదురైంది.

గానకళానిపుణి యగు ఒకగణిక రాత్రి సంగీతము పాడ్తుననీ దానికి నన్ను రమ్మనీ నాతండ్రి కబురంపాడు. నేను తలనొప్పిగా వుందని బొంకి తప్పించు కున్నాను నీకు కూడా అవాంతరాలేమైనా ఎదురయ్యాయా?" అని అడిగింది. ప్రవరుడేప్పటికి తగిన సమాధానమిచ్చి దాటవేశాడు.

సూర్యోదయంతో కాంచవల్లి అతనిని చూసి - జయంతుడు కాదని గ్రహించి పరిపరి విధాల పశ్చాత్తాపడి దుఃఖించింది

'వెనక్కి వెళ్తే ఉరితీస్తాడు తండ్రి. చక్కని జయంతుడికోసం సాహసించి వొస్తే యీనిర్భాగ్యుడి పాలబడ్డాను ఇప్పుడేం చేయాలి? దైవఘటన కాబోలు. 'ఆపదలొచ్చినప్పుడే ధైర్యం నిలుపుకోవాలి గాలివీచినప్పుడే దూదికీ రాయికీ తేడా తెలిసేది. బుద్ధిమంతులు ఆపత్సమయంలోనే తెలివిని కనపరుస్తారు." అనుకుంది

ప్రవరుడామెను పలకరింపక దంతకాష్టం (పలుదోముపుల్ల) నిచ్చాడు. కాలకృత్యాలు తీర్చుకుని మళ్లీ గుర్రాలమీద బయలు దేరారు. జాము పొద్దెక్కేసరికి వారికొక నది అడ్డమొచ్చింది. కొందరు జనుల నెక్కించుకుని కదలడానికి సిద్ధంగా ఉన్న ఓడని వారుకూడా ఎక్కేశారు, గుర్రాలనొదిలి.

ఆ పడవ సాగుతుండగా పడవవాడు సొమ్మిమ్మని ఒకబ్రాహ్మణ వితంతువు నడుగగా ఆమె తన వద్ద ఏమియూ లేదంది. సొమ్మివ్వక పోతే అక్కడే దింపేస్తానని బెదిరించి - ప్రవరుణ్నడగగా .. అతను కాంచనవల్లిని చూపాడు. అతనికి ఆమె ఒక నాణెమిచ్చింది. "ఈ నాణెం మేము నీకివ్వవలసినదానికి పదిరెట్లు విలువ కలది. ఆవితంతువుని నిర్బంధించకు ", అన్నాడ.

పడవదిగాక – వాళ్ళిద్దరూ నడుస్తూంటే – ఆ వృద్ధ బ్రాహ్మణి వారిని కలుసుకొని కృతజ్ఞతలు తెలుపుకుని – "అయ్యా! నేనొక దిక్కుమాలిన దానను. నాకింత అన్నం పడేస్తే మీ యింట వంటచేస్తూ పడుంటాను " అంది దీనంగా

అతనిని విడచిపెడితే తనకి ప్రమాదమని కాంచనవల్లి ప్రవరుడితోపాటే ఉంది. ముగ్గురూ మధ్యాహ్నానికి హేలానగరం చేరి సత్రంలో బస చేశారు

మర్నాడు ఉదయం లేచి – స్నాన సంధ్యాదులు చేసుకుని.. విభూది రాసుకుని బ్రహ్మతేజంతో వెలిగిపోతూ పంచాంగమొకటి పట్టుకుని విపణి వీధికివెళ్లి వర్తకులు మూగి యున్న చోటుకి వెళ్లాడు

వారతనికి నమస్కరించి, రాకకు కారణం అడిగారు. అతను వారినాశీర్వదించి – "అయ్యా! నేను పరదేశిని కుటుంబంతో వచ్చి సత్రంలో ఉన్నాను. జ్యోతిశ్శాస్త్రమందు నాకు చక్కని పాండిత్యముంది మీజన్మ నక్షత్రాలు చెబితే దినచర్య వ్రాసిస్తాను. అది సరిపోతే నన్ను గౌరవించండి లేకపోతే నన్ను గౌరవించకండి. ' అన్నాడు.

వారతని మాటలకు సంతోషించి తమ నక్షత్రాలు రాసియిచ్చారు. ఆనాటికి పిండి వంటలకి కూడా సరిపడే భోజన సామగ్రి కూడా యిచ్చారు

మర్నాడు బ్రాహ్మణుడు రాసిచ్చిన ఫలితములు చక్కగా సరిపడడంతో – మళ్లీ రాయమని భోజన సామగ్రి యిచ్చారు. కొన్ని రోజులలో అతని ఖ్యాతి నలుమూలలా పాకింది

ఒకనాడు రత్నాలవర్తకుడి దినచర్య రాసిస్తూ తనకి రత్నాల పరీక్షకూడా తెలుసన్నాడు అతను తనింటికి తీసుకెళ్లి రత్నాలను నాణ్యం చేయమనగా – వారు రత్నములనుకుని దాచిన వానిలో గాజురాళ్లననేకం తీసి పరీక్ష చేసి చూపాడు అరత్నాల వర్తకుడు ఆశ్చర్యపడి – "మీకీ దైన్య జీవితం ఎందుకు? నా దగ్గర రత్నాలపరీక్షకుడిగా ఉంటే నెల కిరవైరూపాయుల జీతమిస్తాను ' అనగా అతనా ఉద్యోగంలో ప్రవేశించాడు సత్రానికి దగ్గరలో చిన్నయిల్లు అద్దెకు తీసుకున్నాడు.

రాజకుమార్తె మాత్రం అతని ముఖం చూడదు. మాట్లాడదు. అవ్వ తనపని తాను చూసుకోడమే తప్ప వీరి విషయంలో జోక్యం కలిగించుకోదు. ప్రవరుడు భోజనం వేళ తప్ప యింట్లో ఉండడు.

రత్నాల వర్తకుడతని తెలివితేటలకు సంతోషిస్తూ జీతం పెంచుతున్నాడు. ఇలా ఉండగా ఒకనాడు దక్షిణదేశంనుంచి ఒక వర్తకుడు అద్భుతమైన రత్నమొకటి తెచ్చి కందర్పకేతుని దర్శనముచేసికొని దానిని చూపాడు అలాటిదానిని ఎన్నడూ చూడలేదని ఆరాజు దానిని కొనడానికి చాలా ఉత్సాహపడ్డాడు వెల ఎంతని అడగగా రాజుగారి ఉత్సాహం గ్రహించి – కోటి రూపాయల కొక్క గవ్వయేని తక్కువకివ్వను." అని కచ్చితంగా చెప్పాడు.

రాజారత్నమును తనవద్దనున్న పరీక్షకులకివ్వగా – కొందరు ముప్పయిలక్షలనీ, కొందరు నలభైలక్షలు, అరవైలక్షలు. తొంభై లక్షలనీ చెప్పారు.

రాజు ఆమణివెల కట్టించడానికి భటులకిచ్చి పెద్ద వర్తకుల వద్దకు పంపాడు. వారుకూడా ఏభైలక్షలపైన అని కొందరు, కోటి అని కొందరూ కట్టారు ప్రవరుడు పనిచేయుచున్న వర్తకుని వద్దకు రాగా అతను ప్రవరుని కిచ్చి వెలకట్టమన్నాడు. అతను ముమ్మారటుయిటు తిప్పి పెదవివిరిచి – "అయ్యా ఇది కృత్రిమ రత్నము. చిల్లిగవ్వ పాటివిలువయినా చేయ" దనేశాడు.

రాజభటులా రత్నంతో రాజుదగ్గరకి పోయి వర్తకుల మాటలు, బ్రాహ్మణుని మాటలూ చెప్పారు. రాజు ఆ బ్రాహ్మణుని తీసుకురమ్మని – గౌరవించి – "అయ్యా. దీనికి తమరెంత విలువకట్టారు?" అని అడిగాడు.

"ఇది అసలు రత్నమైనచో రెండుకోట్ల రూపాయల విలువ చేయును. కాని యిది ఒట్టి గాజురాయి.' అన్నాడు ఆ మాటలకు రత్నాల వర్తకుడు మనసులో దిగులు పడినా – "ఓహో మంచి నాణ్యగాడివే. నీలాటి వాళ్లు పదిమందుంటే మా వ్యాపారం సాగినట్లే. అడిగారు కదా అని నోటికొచ్చింది చెప్పడం కాదు ఇది గాజురాయని ఎలా చెప్పగలవు?' అని అరిచాడు

బ్రాహ్మణుడు - "చూడండి" అంటూ ఒక యినప పలకమీద కొట్టేసరికది నువ్వుగింజలంతేసి ముక్కలయింది దానితో ఆవర్తకుడు చిన్నబోయాడు వర్తకులూ వ్యధపడ్డారు రాజుబ్రాహ్మణుని కౌగలించుకుని - 'మీ మూలాన నాకెంతో లాభం కలిగింది. మీవంటి వారెక్కడా ఉండరు మీకు నెలకు నూరురూపాయల జీతమిస్తాను. నా ఆస్థానంలో రత్న పరీక్షకులుగా ఉండండి." అంటూ ముద్రికనిచ్చాడు. ఆదొంగవర్తకుడి వద్ద నున్న ధనమంతా తీసుకుని అతన్ని ఖైదులో పెట్టాలనుకున్న రాజు - ప్రవరుడి మాటల వలన విడచిపెట్టాడు

రాజాస్థానంలో చేరడంవల్ల ప్రవరుడి గౌరవం మరింత పెరిగింది

కొద్దిరోజులకే ప్రధానమంత్రి చనిపోయాడు. రాజు ఆ ఉద్యోగాన్ని ప్రవరుడికిచ్చాడు. అతను మంత్రిఅయినది మొదలు రాజ్యంలో ధర్మం పెరిగేటట్లూ అధర్మం నశించేటట్లూ ప్రకటనలు ఎన్నో చేశాడు

ప్రవరుడి నివాసం పెద్దమేడలోకి మారింది అప్పటికీ రాజపుత్రిక అతనినికాని అతను రాజపుత్రికను కాని బలాత్కరించలేదు అంత మనోధైర్యం వారిది.

ఒకనాడు రాజు అతన్ని పిలిపించి ఏకాంతంలో - "నువ్వు బుద్ధికి బృహస్పతివి. నువ్వు చేరినప్పటినుంచీ నేనూ ప్రజలూ ఎంతో సుఖంగా ఉంటున్నాం మనమధ్య రహస్యాలుండవు ముల్లోకాలలోనూ సౌందర్యవతి అయిన స్త్రీని ద్వీపాంతరం నుంచి రప్పించాను కాని ఎన్ని విధాల చెప్పినా నా కోరిక నంగీకరింపక ఎప్పుడూ దుఃఖిస్తూ ఉంటుంది నాలో మదన తాపము మితిమీరిపోతూంది ధర్మాధర్మ వివేచము వదలి నేనామెనే తలుచుకుంటూ క్రుంగిపోతున్నాను .

స్త్రీలు ఒక్కొక్కప్పుడు విముఖంగా ఒక్కొక్కవేళ అనుకూలంగా ఉంటారు జవరాళ్ల చిత్తములు క్షణక్షణం మారిపోతుంటాయి అందుచేత తొందరపడక మెల్లగా బుజ్జగించి వాళ్లని సానుకూలం చేసికొని సుఖించాలి - అని వ్రాసిన కవివాక్యాన్ననుసరించి కాలయాపన చేస్తున్నాను ఆమె

తనంత వచ్చి నన్ను అంగీకరిచేలా చేయగల బుద్ధిశాలివి నువ్వు నీకసాధ్యమయినది లేదు' – అనిపొగిడేసరికి అ ధర్మానికి మనసిచ్చగించక పోయినా మౌనందాల్చి ఒకనాడామెవద్దకు వెళ్ళాడు

'సాధ్వీ! నేను క్రొత్తగా చేరిన మంత్రిని. నీ వృత్తాంతమంతా విని, జాలిపడినా చేయునది లేక ఊరుకున్నాను. సమయం వచ్చినప్పుడు నేను చేయగలిగినంత ఉపకారము నేను చేస్తాను రాజు నన్నిప్పుడు నీ మనోభావం తెలుసుకురమ్మని పంపాడు. నా బుద్ధి నీ మనోభావాన్నంగీ కరింపదు నీ మగని కులము చెప్పు అతన్ని రప్పించే ప్రయత్నం చేస్తాను" అని చెప్పాడు

ఆ మాటలకామె చాలా సంతోషించి – "నీ మాటలే నీ మంచి బుద్ధిని చెబుతున్నాయి. నీవంటి పరోపకార పరాయణులు కొందరైనా ఉండబట్టే భూమి యిలా ఉంది నా పేరు కళావతి. అంటూ తాను వసంతుణ్ణి వివాహం చేసుకోవడం ముసలిది వచ్చి కొన్నాళ్ళు రహస్యంగా ఉండి ఆయువు రహస్యం తెలుసుకోవడం మోసంచేసి – పడవలో తననిక్కడికి తెచ్చి రాజుకప్పగించడం, తాను వ్రతం పేరుతో ఏడాది గడువు పెట్టడం మొదలయినవన్నీ వివరించి – 'నామనోహరుణ్ని తెప్పించి ఆ ఆపద తప్పించండి " అని వేడుకుంది.

ఆమె చెప్పినది వినే సరికతని గుండె ఝల్లుమంది. హో వసంతా. హో రామా! హో సాంబా. హో దండుడా. మీ మాటే మరచి పోయాను కృతఘ్నుణ్ని. మీరాచెట్టు దగ్గరనాకోసం నిరీక్షించి నిరీక్షించి ఎక్కడికేనా వెళ్లిపోయారా? " అని విచారించి, కళావతికి తమ కథంతా చెప్పాడు " "నా పూర్వ జన్మ పుణ్యం కొద్దీ మీ దర్శనమయింది నన్ను రక్షించే భారం మీదే " అంది.

"సాధ్వీ! చింతింపకు నేను నిన్ను కాపాడుతూనే మిత్రులను వెదికించి రప్పిస్తాను. మనుషులు కోరకుండా దుఃఖాలెలా వొస్తాయో సౌఖ్యాలూ అలాగే వస్తాయి ఏవయిననూ దైవాధీనాలే." అని ఆమె నూరడించి – రాజు వద్దకు వెళ్లి – "ఆమెయింకనూ వ్రతములోనే ఉన్నది

మౌనంగా ఉంది తరువాత ఆలోచిద్దాం " అని విన్నవించి, తన మిత్రులను వెదకడానికి నలుమూలలకీ దూతలను పంపాడు

ఒక సత్రంగోడ మీద తన బొమ్మను వేలాడదీయించి దానినెవరేనా పట్టి పట్టి చూస్తే తన వద్దకు తీసుకురమ్మని భటులను నియోగించాడు ఇవి యిలా ఉండగా –

ఒకనాడు మంత్రిగారింటికి బిశునమతి అనుచాకలిది వచ్చి ఉతకడానికి బట్టలు వేయమనేసరికి, పరధ్యానంగా ఉన్న రాజకుమార్తె కొన్ని బట్టలతోపాటు తాను కట్టిన రైకను కూడా వేసింది ఆమె అందాని కాశ్చర్యపడుతూ – రాజుగారింటికి ఆమూటతో సహా వెళ్లింది. “ఆబట్టలెవరివి? ' అని రాణి అడగడంతో .. 'మంత్రి గారి కుటుంబానివి. ' అంది. “మంత్రి భార్య ఏపాటి చక్కనిది? ' అడిగింది రాణి

'మీరు కూడా ఆమెకు సాటిరారు కాని ఆమె ఎప్పుడూ విచారిస్తూ కూర్చుంటుంది వాళ్లింట్లో ఒకముసిలామె ఉంది. మంత్రిగారి భార్య వయసుబింకం యీరైక చెబుతూంది చూడండి, ఆమె వొంటిమీది లాగే ఎలా బింకంగా ఉందో విప్పేసినా '

“యాచకుడి నుంచి మంత్రి స్థాయికెదిగిన అతని కంత చక్కని భార్య లభించడం వింతే అంటూంటే రాజక్కడివచ్చి 'నీచేతిలో ఉన్న రైకెవరిది? ఎందుకలా పరీక్షిస్తున్నావు? అని అడిగాడు.

అందుకామె నవ్వుతూ – ఈకంచుకి ఎవరిదో చెప్పుకొండి చూద్దాం “అని అందించింది అతను పరిశీలించి – “ఎన్ని మడతలు పెట్టి నలిపి విడిచినా గుబ్బ బిగవున నిలిచియే ఉంది దీనిని ధరించే స్త్రీ వయసూ సొగసూ ఆశ్చర్యకారకాలే జౌతాయి అన్నాడు “ఇది ఎవరిదో చెప్పు '

మీ ప్రధానిగారి భార్యదని యీ చాకలి చెప్పింది ఆమె చక్కదనం గురించి తెగ పొగుడుతోంది ఈ మూఢురాలినే ఆశ్చర్యపరచిన ఆమె అందం చూసి తీరవలసిందే బ్రాహ్మల్లో అందగత్తెలరుదంటారు ప్రధానికాకముందు 'సామాన్యస్థితిలో ఉన్నవానికంత అందగత్తె ఎలా లభించిందో? '

"ఈ సందేహం తీర్చుకోవలసిందే." అన్నాడు రాజు చేపకడుపులో రత్నకంకణం దొరకడం తోటే దానిని ధరించినామెను ద్వీపాంతరం నుంచి రప్పించారు ఇప్పుడీరైకధరించిన రమణిని చూడక వదులుతారా." అని రాణి పరిహాసమాడింది

"వింత వస్తువులని చూడాలనెవరికుండదు? చూసినంతనే తప్పేమీ కాదుకదా? రేపు మనం మంత్రిని విందుకు పిలుద్దాం. తొందరగా వంట చెయ్యి' అని ఏంచెయ్యాలో చెప్పాడు మంత్రిని మరునాడు తమింట భోజనం చేయవలసిందిగా కోరాడు. మంత్రి అంగీకరించాడు.

మరుసటి దినము విందులో – 'లోకంలో స్నేహమూ బాంధవ్యమూ భోజనం వద్ద కాని బలిష్టము కావు. రేపు నాకు మంత్రిగారింట విందు జరుగుతుంది మామంత్రి గారి భార్య నీకంటె చక్కగా వంట చేస్తుందట. ఏమైనా భోజనంరుచి బ్రాహ్మణులకు తెలిసినంతగా యితరులకు తెలియదు.' అంటూ, తనని విందుకు పిలవాలని భార్యతో ఆడిన మాటల ద్వారా మంత్రికి సూచించాడు అమాటలకు ప్రవరుడు దిగులు పడ్డాడు

భోజనమయ్యాక నృత్యగాన వినోదములలో కొంతసేపుగడిచాక శలవుతీసుకొనునప్పుడు – "రాజా. మేము తినేదంతా మీసొమ్మే. తమరిందాకా అన్నమాటలు నిజం చేయండి రేపు మాయింట విందుకు దయచేయండి " అన్నాడు మంత్రి

'తప్పకుండా వస్తాను వంటపెందలకడే చేయించండి."

మంత్రి యింటికి వెళ్లి – 'రాజును విందుకు పిలకవ తప్పలేదు రాజు తన భార్యచే వంట చేయించినప్పుడు నేను వంటామెచే చేయించుట యుక్తము కాదు రాజుకి ఎవరో నాయింటనున్న కాంతగురించి చెప్పి ఉంటారు స్త్రీ వ్యామోహం కలరాజు కపటము చేస్తున్నాడు ఇంటనున్న కాంత ఎవరో నాకు తెలియదు నేనెవరో ఆమెకు తెలియదు వంటామెకూడా మా విషయంలో జోక్యం కలగజేసుకోలేదు

నాకు భార్యలేదంటే - హాస్యాస్పదంగా ఉంటుంది ఎవరూ నమ్మరు అవ్వచేత వద్దన చేయిస్తే మర్యాదా భంగమౌతుంది అదీకాక ఆమెను చూచుటకే రాజు విందుకొస్తానన్నాడు. ఏంచేయాలి?. అని విచారిస్తూంటే - అవ్వ భోజనానికి లెమ్మంది.

"నాకాకలిలేదు. మీరు తినేయ్యండి" అన్నాడు.

లేవకుండానే అతనలా చెప్పడం తెలుసుకుని - అతని విచారానికి కారణం గ్రహించి అతని యందనురాగము కల ఆమె అతను వినేలా అవ్వతో - 'బుద్ధిశాలురు చిన్న కారణంకోసం అజ్ఞానుల్లా ఆహారం మానరు తమ పోషణలో ఉన్న వారు చేయవలసిన పనిని చేయమని అడగడం అపరాధమేమీ కాదు అడిగితే కాదంటారేమో అనే అనుమానం అక్కర్లేదు మేము చెప్పదగిన వారము కాము కాని మాకు పోషక విశ్వాసముంది భోజనం చేశాక ఆపనేమిటో చెప్పవచ్చు ' అంది

అందుకతను సంతోషించి . భోజనం చేసి ఆమె వినునట్లుగా రాజుకు విందు చేయవలసిన అవసరం గురించి అవ్వకు చెప్పాడు. విందుకు పిలవదగునని ఆమె చెప్పింది

మర్నాడు ఆమె కొత్తరుచుల పిండివంటలెన్నిటినో చేసింది వారు విందుకు కూర్చోగానే ఒక్కొక్క పదార్థం వడ్డించడానికొక్క రీతిలో అలంకరించుకుని వడ్డించింది

రాజు యింటికి వెళ్లి - 'మనమంత్రిగారికి ఒక భార్యకాదు, యిద్దరు. ఎంత అందగత్తెలో. ఎంత చమత్కారంగా వడ్డించారో!" అని పొగిడేసరికి రాణికి వారిని చూడాలనిపించి ఒక ఉపాయం చెప్పింది

ఎల్లుండి పర్వదినం భార్యలతో చెంగు ముడి వేసుకుని సముద్ర స్నానం చేస్తే చాలా పుణ్యం మంత్రిగారిని మనతో రమ్మని పిలవండి " అంది

రాజు అలాగే పిలిచాడు మంత్రికి మతిపోయింది

ఒకసారి గండంగట్టెక్కించింది పరకాంతను వంట చేయమంటే కొంత ఫరవాలేదు కాని సరిగంగ స్నానాలకెలా రమ్మనడం? మొదటనే తనకి పెళ్లికాలేదనీ, ఆసుందరి తన భార్య కాదనీ చెప్పేసి

ఉంటే యీ ముప్పురాక పోయేది. ఇప్పుడు నిజం చెప్పినా పరిహాసపాత్రుడౌతాడు ఏంచేయాలి? అని తలపట్టుకు కూర్చోగా -

"అస్తమానూ అలా విచారించడం ఎందుకూ? ఒకమారు వినియోగించిన సేవకులను మరో మారు వినియోగించుకుందుకు సందేహమెందుకు? తమను పోషించే వారి కవసరమైనప్పుడు పనిచేయుట సేవకులవిధే." అందామె

అప్పుడతనామెకు రాజుగారి సముద్రస్నాన ఆహ్వానం గురించి చెప్పాడు విని - "దీనికేముంది? ఏడు పల్లకీలు, ఏడు రకాల నగలూ, బట్టలూ తెప్పించండి స్నానఘట్టంలో ఏడుగుడారాలు ఏడు గుమ్మాలుండు నట్లు కట్టించండి "అంటూ ఏంచెయ్యాలో చెప్పింది సమయానికి రాజు, రాణి, మంత్రి స్నానఘట్టం చేరారు

రాజు, భార్య చూస్తూండగా మొదటి గుడారంలోంచి ఆమెవచ్చి ప్రవరుడితో సరిగంగ స్నానం చేసింది అయ్యాక వెళ్లి. రెండో గుడారంలోంచి మరోరకం బట్టలు, నగలు ధరించి వొచ్చి అతనితో స్నానం చేసింది అలాగ ఏడుగుడారాలలోంచీ ఏడురకాల దుస్తులు, అలంకారాలతో వొచ్చి ప్రవరుడితో సరిగంగ స్నానాలు చేసింది

అదిచూసి కందర్పకేతుడు, భార్య - 'మనప్రధాని కొక్కతే భార్య అని విన్నాం తరువాత యిద్దరని తేలింది. ఇప్పుడు చూస్తే - ఏడుగురు భార్యలు! అందరూ ఒకే తీరుగా ఉన్నారు ఇతనికిందరు సుందరీ మణులున్నారా! వారిలో ఐకమత్యమే యీ గుట్టుకి మూలం.'' అనుకున్నారు

ప్రవరుడు రాజకుమార్తె వైభవంగా యిల్లు చేరుకున్నారు

మరునాడు రాజు తెలివయిన ఒక పరిచారికను పిలిచి ఏడు జల్తారు చీరెలు కొన్ని కానుకలు ఉంచి - 'వీనిని తీసుకుపోయి మంత్రిగారి భార్యలకిచ్చి, వారిపేర్లు వారు చదివిన విద్యలూ వ్రాసుకురా " అన్నాడు ఆ పరిచారిక మంత్రిగారి యింటికి వెళ్లి తనరాక రాజుగారి సందేశమూ తెలుపగా మంత్రి గుండె గుభేల్మంది 'ఈరాజూ నాగుట్టు రట్టు చేసేవరకూ విడిచేటట్లు లేదు. ఏడుగురు భార్యలొకేసారి కనిపించి . . .

తీసుకోవడం ఎలా? రాజకుమార్తె నాకంటె తెలివైనది ఆమె ఏవ్యూహంపన్నుతుందో" అని అవ్వకు చెప్పినట్లుగా ఆమెకు చెప్పాడు అందుకామె - "అవ్వా, వెరవవలసిన పనిలేదు సరిగంగ స్నానములు చేసినవారు చీరెలందుకోరా?" అని అవ్వ చేయవలసినది చెప్పి తాను లోపలికి పోయింది.

రాజుగారి దాసిని ప్రవరుడు తన అంతఃపురంలోకి పంపగా అవ్వ ఆమెకు తగిన మర్యాదలు చేసింది అప్పుడామె - 'మంత్రిగారి భార్యలకు నేను కానుకలందజేయవలెను వారెందరు? వారిపేర్లేమిటి? మీరెరుగుదురా?" అని అడిగింది

"మంత్రి గారి భార్యలు ఎనమండుగురు శ్రీకృష్ణుని భార్యల పేర్లే వారి వీని వారందరూ కలసి ఒకసారిగా రారు వారొకరితో ఒకరు మాట్లాడుకోరు సవతులు కదా ఎవరిని పిలవమంటే వారిని పిలుస్తాను ' అందవ్వ

"సముద్ర స్నానాని కొచ్చింది ఏడుగురే కదా అని ఏడుచీరెలే తెచ్చితిని సరే, ఈలోగా ఎనిమిదవచీర తెప్పిస్తాను. ముందు - పెద్ద భార్యని పిలవండి-" అంది దాసి

అవ్వలోపలి నుంచి చక్కగా అలంకరించుకున్న రాజకుమార్తెను తీసుకొచ్చి "ఈమె పేరు రుక్మిణి సంగీతంలో నిధి " అని పరిచయం చేసింది. ఆమెలోపలికి వెళ్ళాక 'మొన్న చిన్న భార్యకి ఆరోగ్యం సరిలేక సముద్ర స్నానానికి రాలేదు ఈసారెవరిని పిలిచేది? అవ్వ దాసినడిగింది "

"రెండో భార్యని తీసుకురా అందామె

రాజకుమార్తె మరోవేషంలో రెండో భార్యగా వచ్చి కానుకలందుకుంది అలానే ఎనిమిది వేషాలలోను కానుకలందుకుంది ఆదాసి ఎనమండుగిరికి కానుకలిచ్చి వారిపేర్లు రాసుకుని వారి గురించి రాజుకి గొప్పగా చెప్పింది

రాజు ఆవిశేషము భార్యకి చెప్పి - మనమంత్రి శ్రీకృష్ణునికంటె విలాసపురుషుడట ఎనమండుగురు భార్యలట అతనికి అదృష్టమెలా పట్టిందో? అన్నాడు యీర్ష్యగా

ప్రవరుడు రాజకుమారి చేసిన చమత్కారానికి చాలా మెచ్చుకుని – 'నేను ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో తెలియడం లేదు–' అన్నాడు.

'నాయవ్వనమంతా అడవికాచిన వెన్నెలగుచున్నది. జయంతుని విడదీసిన విధి యిప్పుడు సానుకూలమౌతున్నట్లున్నది. ఇన్నాళ్ళకి తమ ముఖం చూశాను. ఇతను జయంతుడికంటె చక్కనివాడూ, విద్వాంసుడూ కూడా. ఇతని జితేంద్రియత్వము చాలా గొప్పది. ఇతని సుగుణ సంపదయే యితని అదృష్టమునకు కారణమేమో ఇతణ్ణి వివాహమాడనిచో నాకు దిక్కేది? నాకు శుభసూచకముగా ఎడమభుజమదురుచున్నది ఈ రాత్రి యితనితో మాట్లాడతాను " అని మనసులో అనుకుని – ఆ రాత్రి అతనికి పూర్వముకన్న ఎక్కువగా వడ్డించమని అవ్వకు చెప్పిందామె

ఆ రాత్రి భోజనం చేస్తూ – "అవ్వా, నా భోజనం తీరు మరిచావా? ఇంత ఎక్కువగా ఎందుకు వేశావు?" అని అడిగాడు ప్రవరుడు.

తలుపుచాటునున్న ఆమె – "పదార్థము లెక్కువయినచో ఉంచివేయవచ్చును వంటచేయుటకూ సరిగంగ స్నానాలు చేయుటకూ పనికొచ్చిన వారు పదార్థ శేషములు తినుటకు పనికిరారా? అర్హులుకారా? అవసరమప్పుడే కాని ఆశ్రితులను మన్నింపరు కాబోలు. ' అంది అతనే మీ బదులు చెప్పక ఎప్పటిలాగే పడకగదిలో పడుకున్నాడు

ఆమె ఆతని పాత్రలో భోంచేసి – అంతఃపురాన్ని వింతగా అలంకరించి, పరిమళపు ద్రవ్యములు సువాసనలు వెదజల్లుచుండగా – "అవ్వా, నేనొకసారి ఆయనని రమ్మన్నానని చెప్పు" అంది

ఎందుకా అనుకుంటూ అతను వస్తూంటే – ఇలా అందవ్వ "మొన్న సముద్ర స్నానం చేస్తూంటే కాలిలో చేపముల్లు గుచ్చుకుంది తీయగలవారు మీరే " "అయ్యో. ఉపకారమునకు పోయిన ఆమె ముల్లుతో బాధపడుతూందా." అంటూ ముల్లు తీసేసాధనం పట్టుకుని ఆమె గదిలోకి వచ్చాడు. "ఎక్కడ గుచ్చుకుంది?" అని అడిగాడు.

అంత తొందర పడకండి నిదానంగా తీయకపోతే నొప్పెడుతుంది. ఈ ఆసనం మీద కూర్చోండి' అని, అతను కూర్చున్నాక

– "ఆపత్సముద్రంలో తోసిన సర్వేశ్వరుడు నాకు మీరనే తెప్పను సమకూర్చాడు మొదట మీరు సామాన్యులనుకొన్నాను కాని మెల్లగా మీ గొప్పతనం తెలుసుకోగలిగాను మీ అండదొరికినా అనాధవలె నాయౌవనాన్ని వ్యర్థం చేసుకుంటున్నాను. మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. గాంధర్వ వివాహంతో నన్ను స్వీకరించండి నేను రాజకుమార్తె కాంచనవల్లిని. నా సహాధ్యాయుడు, మంత్రికుమారుడు అగు జయంతుని చిన్ననాటినుంచి వలచినా నా తండ్రి అతని కివ్వనన్నందున యిద్దరమూ కలసి విదేశము పోవాలనుకున్నాం ఇంతకంటె నేను ఏ తప్పూ చెయ్యలేదు." అని ఆమె దీనంగా ప్రార్థించగా –

"నీ మనసు మరెవరిమీదో ఉందని యిన్నాళ్ళూ నేను పేక్షించాను నాకవమానము కలగకుండా కాపాడావు. నీ సౌందర్యం చాలా అద్భుతం నిన్ను వివాహమాడడం కంటె నాకేం కావాలి? దీనికింత బతిమాలాలా? ఇప్పుడు మంచి ముహూర్తం ఇదిగో నిన్ను గాంధర్వ వివాహంతో స్వీకరిస్తున్నా" నంటూ ఆమె మెడలో పూలమాల వేశాడు. ఆమె అతని మీద పూలు జల్లింది. వారిద్దరూ ఒకటై సుఖాలలో తేలియాడారు "

సన్యాసి కథ చెప్పడం ఆపాడు – తదుపరి మజిలీకి బయలుదేరవలసిన సమయమయిందని. గోపాలుడు కావడెత్తుకున్నాడు.

తదుపరి మజిలీ చేరాక ఆయతి మళ్ళీ కథ చెప్పడం మొదలు పెట్టాడు

# కాశీ మజిలీ కథలు

## 5 వ. మజిలీ

### 13. దండుని కథ

గోపాలా! కంసాలి కుమారుడగు దండుడు మర్రిచెట్టు ఉత్తర దిక్కు కొమ్మమీద నాలుగురోజులు ప్రయాణం చేసేసరికే దానిచివరకనిపించింది అక్కడే మయినా వింతలుంటాయేమో అని కొమ్మదిగి అటూ యిటూ తిరుగుతూంటే ఒక ఉద్యానవనం కనిపించింది దానిలో బంగారు పద్మాలున్నాయి మెట్లు మణులతో చేయబడి కాంతులీనుతున్నాయి. అక్కడ చక్కని పరిమళాలలముకుంటున్నాయి.

ఆ సరస్సులోని నీరు తాగి ఒకపొదవద్ద కూర్చుని.. దానికున్న పువ్వును తెంపి వాసన చూసేసరి కతను చిలకగా మారిపోయాడు చిలకరూపం వచ్చినా ముందరితెలివితేటలుండడం వల్ల – 'ఇందుకా దైవం నన్నిక్కడికి తీసుకు వచ్చాడు? పక్షిరూపంలో ఎలా బతుకుతాను? నేను మళ్లీ మనిషయ్యేదెలా?' అని విచారిస్తూ అక్కడి పళ్లను తింటూ కొన్ని రోజులు గడిపాడు.

అప్పుడు ఒకనాడు ఆ ఉద్యానవనానికి సోమప్రభ అనువాని పుత్రిక విద్యుత్ప్రభ స్నేహితులతో వచ్చి విహరిస్తూంటే దండుడామె దగ్గరగా వెళ్లి మృదుమధురములైన పలుకులు పలికాడు ఆమె ఆ మాటలకు ముచ్చటపడి ఆచిలకను పట్టుకుని మచ్చిక చేసుకుంది ఆ చిలక ఎంతో తీయని మాటలు పలికింది విద్యుత్ప్రభ దానియందిష్టము పెంచుకుని గారాబంగా చూసుకోసాగింది ఆ చిలక పారిపోయేదికాదని స్వేచ్ఛగా వదిలేది

విద్యాధర లోకంలో విమానములు చేయుపని విద్యార్థులకు పాఠశాలలో నేర్పుతూంటారు చిలకగానున్న దండుడు ఆ పాఠశాల కరిగి చాటున ఉండి – సూక్ష్మ బుద్ధి కనుక తొందరగా ఆ పనిని నేర్చుకున్నాడు. ఒకనాడు –

విద్యుత్ప్రభ తనతాత అయిన మయుడి వద్దకు చిలకతో వెళ్లి అతని మన్ననలు పొంది ఆచిలక ప్రత్యేకత గురించీ, అది దొరికిన చోటు తాతగారు నిర్మించిన ఉద్యానవనంలోనే అనీ చెప్పింది అప్పుడు మయుడు -

'చిలకంటే జ్ఞాపకం వచ్చింది నీ ఉద్యానవనంలోని తటాకం దగ్గరున్న పొదరింటి పువ్వు నెప్పుడూ వాసన చూడబోకుసుమా చిలకయిపోతావు అలాటి ప్రమాదం జరిగితే ఆపొదరింటిలోనే వెనక భాగాన పచ్చని పూలగుత్తిని వాసన చూస్తే మళ్లీ మునపటి రూపం వస్తుంది - " అన్నాడు

దండుడామాటలు విని తనరూపు మార్చుకొను మార్గం చూపినందుకు దైవాన్ని మెచ్చుకుని - విద్యుత్ప్రభ మళ్లీ ఉద్యానవనాని కెప్పుడు వెళ్తుందా అని ఎదురు చూడసాగాడు

ఒక వసంత కాలంలోని సాయంత్రం ఆపట్నపు ఉద్యానవనం లోని మామిడి చెట్టు కొమ్మమీద కూర్చుని విద్యాధర స్త్రీల సోయగాలు చూస్తూ ఆనందిస్తూంటే - యీ మాటలు వినిపించాయి

**చెలికత్తెలు** రాగమంజరీ నిన్నమనందరమూ భూలోకంలో జలక్రీడలాడాం కదా

నువ్వు మాతో రాకుండా ఆలస్యం చేశావేం? ఏమైనా వింతలు కనిపించాయా?

**రాగమంజరి** నన్నొక్కదానినీ వదిలి నాచిక్కులు తెలుసుకోకుండా మీరు వచ్చేశారు ఒక మానవుడు ఆ చెట్టు చాటున దాగియుండి నావలువలు తీసుకుపోయాడు

**చెలికత్తెలు** ఏమీ! మానవుడు నీ వస్త్రములు తీసుకుపోయెనా! తరవాతేమైంది?

***రాగ మంజరి*** మీరు ప్రయాణపు తొందరలో వెళ్లిపోయారు చీర కనపడక నేనునాలుగు వైపులా వెదుకుతూ మర్రికొమ్మలలో దాగిన ఒక చిన్నవాణ్ని చూసి కోపం పట్టలేక నామాయనుపయోగించి వాడిని చెట్టు దింపించి చీరతీసికొని రాయిగా పడుండమని శపించాను

చెలికత్తెలు : మంచి శాస్తి చేశావు.

కుసుమగంధి నీ గుండె ఎంతకరినం. పాపం, అతన్నెంత కాలం రాయిలా పడుండ మన్నావు?

రాగమంజరి :మరొకరికి నీతులు చెప్పడం సులభమే నీ చీరపట్టుకు పోతే తెలిసేది.

కుసుమగంధి : శాపమిచ్చి విమోచనం చెప్పకపోడం తప్పుకదా

రాగమంజరి వానియందు నీకంత మక్కువైతే - ఆ మర్రిచెట్టు మొదలు నున్న తీగె ఆకుని జలంతో కలిపి ఆ రాయిమీద జల్లితే అతను మళ్లీ పురుషుడౌతాడు. అలా చేసి అతన్ని, వరించు దేవుడు నాయందు దయతలచాడు కనుక వాడు నావస్త్రం యిచ్చాడు లేకపోతే నేనతనికి భార్యగా ఉండవలసిందే కదా

కుసుమగంధి నాకతన్ని వలచే అవసరమేమిటి? ధర్మం చెప్పానంతే నిన్ను వలచియే అతను నీచీరెను సంగ్రహించాడు కనక నువ్వే అతన్ని పెళ్లాడు

ఆమె మాటకు చెలికత్తెలందరూ పకపక నవ్వారు. జలక్రీడలాడి వాళ్లు వెళ్లిపోయారు ఆ మాటలు విన్న దండుడు - ఆ మానవుడు నా స్నేహితుడు సాంబుడయి వుంటాడు. దైవానుగ్రహం ఉండబట్టి కాని లేకపోతే నాకీ మాటలు వినపడేవా? సాంబుడు మళ్లీ మునుపటి రూపం దాల్చేమార్గం తెలిసింది - అని సంతోషించాడు

విద్యుత్ప్రభ ఒకనాడు భూలోకంలోని ఉద్యాన వనంలో విహరించడానికి చిలకతో వచ్చి మయుని మాటలు మదిలో మెదిలి ఆపొద వద్దకు వెళ్లి పువ్వు నానవాలు పడుతూంటే చిలక రూపంలో ఉన్నదండుడిదే సమయమని రివ్వున ఎగిరి ఆపచ్చని పువ్వుని వాసన చూసింది మళ్లీ మానవరూపం వొచ్చిన అతన్ని చూసి ఆశ్చర్యపడి -

"అయ్యా మీరెవరు? మీకు చిలక రూపం ఎందుకు వచ్చింది?" అని అడిగింది విద్యుత్ప్రభ దండుడు తన వృత్తాంతం చెప్పసాగాడు "కాంతా. నేను మీతాత మయుని వంశంలోని వాడినే నాపేరు దండుడు

ఒకకారణంవల్ల యీ ఉద్యానవనానికొచ్చి పొదరింటి పువ్వును వాసన చూశాను నాపూర్వ పుణ్యం వల్ల నీ ఆశ్రయం లభించింది మొన్న మీతాత చెప్పిన మాటలు వినడంతో యీ పువ్వుని వాసన చూసి పూర్వ రూపం పొందాను నీదయవలన నీలోకంలోని విశేషాలు చూడడమేకాక విమానాలు తయారుచేయడం కూడా నేర్చుకున్నాను. నాకు శలవిస్తే వెళ్తాను ”

అతని రూపానికీ, మాటలకీ చాలా మెచ్చుకుని అతనియందు కామభావం రేకెత్తగా ఆమె “నన్నంతగా పొగడనవసరం లేదు విద్య అచేతా రూపం చేతా కూడా నువ్వు సాధారణుడివే. నీ అంత సుందరుడు మావిద్యాధరులలో లేడు నామనసునీపై మరలుకొంది. నన్ను భార్యగా స్వీకరించు నాకు మానవుడు భర్తగా లభించునన్న మాతాత మాటలు నిజం చెయ్యి నువ్వు మాకులంవాడివే ” అని బతిమాలింది.

దండుడామెను గాంధర్వవివాహం చేసుకుని కొన్నాళ్లు ఉద్యానవనంలో ఆమెతో సుఖించాడు. ఒకనాడు - “కాంతా! నా వృత్తాంతం నీకు తెలిసినదే కదా నా స్నేహితులు మఱ్ఱిచెట్టు మొదలున ఎదురు చూస్తూంటారు నేను వెళ్లాను. సెలవియ్యి ” అన్నాడు.

‘వేడుక రుచి చూపి వెళ్ళిపోతాననడం న్యాయమేనా! నాకంటే మిత్రులెక్కువా? వెళ్ళవలదు- ” అని ఆమె అభ్యంతరం చెప్పింది.

‘నువ్వు కామరూపిణి కదా నేనెక్కడినుండి తలచుకుంటే అక్కడికివొచ్చి నీ కోరిక తీర్చుకోగలవు ” అని దండుడు చెప్పేసరికామె అంగీకరించింది ఆ రెండు రకాల పువ్వులనీ మూటగట్టుకుని - దండుడు నాలుగు రోజుల అనంతరం మఱ్ఱిచెట్టు మొదలు చేరాడు

అక్కడెవరూ లేరు.

‘గడువు మీరింది ఎవరూ యిక్కడికి చేరలేదు కారణం తెలియదు సాంబుని పరిస్థితి గురించి విన్నాను కదా అతనికి శాపవిమోచనం చేసి అతనితో కలసి ఆలోచిస్తాను ’ అనుకుంటూ విద్యాధర కన్య చెప్పిన ఆకుని గుర్తుపట్టి - నీటితో కలిపి రాయిపై

జల్లాడు. సాంబునకు తొలిరూపం వచ్చి – ఎదుటనున్న దండుని కౌగలించుకుని – "అన్నా! నువ్వొచ్చి ఎంత సేపయింది? మనవాళ్లింకా రాలేదా? ఇక్కడొక సుందరి ఉండాలి ఎక్కడికి వెళ్లింది? ఇంతవరకూ నాతో మాట్లాడుతూనే ఉందే! ఇంతలోనే నాకు నిద్ర పట్టేసింది కాబోలు. ఆమెను చూడకపోతే నాప్రాణాలు నిలవవు. ఆమెను తెచ్చి నాకనుల ముందరపెట్టి ప్రాణదానం చెయ్యి." అంటూ బతిమాలాడు.

దండుడు నవ్వుతూ – రాగమంజరి అతన్ని శిలగా పడుండమని శపించిన వైనమంతా వివరించాడు. ఐనా సాంబుడు అంగీకరించక – "ఆమెలేనిదే నేను బతకలేను. నీవలెనేనును విద్యాధరకన్యను పొందాలి." అని పట్టుపట్టాడు.

"అందుకు మార్గముంది. ప్రతి ఆదివారం విద్యాధర కన్య లిక్కడికి జలకేళికి వస్తారు. ఈ సారి రాగమంజరి వస్త్రాలను సంగ్రహించి చెట్టు మీద దాక్కుని ఉండు ఎంత బతిమాలినా దగ్గరకురానివ్వకు మిగిలింది నేను చూసుకుంటాను." అన్నాడు

మర్నాడు వాళ్ళు రావడమూ సాంబుడు రాగమంజరి వస్త్రాల నపహరించి చెట్టుమీద దాగుండడమూ జరిగాక – రాగమంజరి తన వస్త్రాలను వెదుకుతూ సాంబుని చూసి ఆచీరనిమ్మని అనేక మాయో పాయములను పన్నింది కాని అతనా చీరయివ్వకుండానే జవాబులు చెప్పాడు. అంతలో మిగిలిన విద్యాధరకన్యలు వెళ్ళిపోయారు.

అప్పుడు దండుడు వారివద్దకు వెళ్లి తనని చూసి సిగ్గుపడుతున్న రాగమంజరి కొక వస్త్రమిచ్చి – "ఏమిటి, తగవు?" అని అడిగాడు అప్పుడు రాగమంజరి – అతను తన చీరను దొంగిలించిన విషయం చెప్పి తగవుతీర్చమనగా – దండుడు, "ఈ తగవును మీ ఏలిక కూతురే తీర్చగల' దంటూ ఆమెను రప్పించాడు. విద్యుత్ప్రభ రాగమంజరికి వారి గొప్పతనం చెప్పి తానూ దండుడూ పెద్దరికం వహించి వారిచేత పాణిగ్రహణం చేయించారు. సాంబుడు రెండుమూడు రోజులు సుఖించి తాను తలచినప్పుడు వొచ్చు షరతు కంగీకరింపజేసి రాగమంజరిని యింటికి పంపాడు

సాంబుడు దండుడూ మిత్రుల జాడ తెలుసుకుందామని మొదట వసంతుడు వెళ్లిన కొమ్మమీద ప్రయాణం చేయసాగారు అతనికి కనిపించిన వింతలన్నీ వీళ్లకీ కనిపించాయి నిర్జనమైన పట్నం దానిలోని కొట రహస్యంగా ఉన్నద్వారం చూచి లోపలికి వెళ్ళి గదులన్నీ తిరిగి వసంతుడు పడున్న గదిలోకి చేరారు సగం ప్రాణంతో మిగిలిన వసంతుణ్ని చూసి దండుడు బిగ్గరగా అరిచి, గదినాలుగు మూలలా వెదికే సరికి అతని ప్రాణాలిమిడ్చిన కత్తివరకనిపించింది

"దైవానుగ్రహంవల్ల యీ వరని మొదలంతా అరగదియ్యలేదు ఇతన్ని బతికిస్తా చూడు' అంటూ తన యంత్ర రచనా పాటవంతో వరని చక్కజేసిన వెంటనే వసంతుడు కళ్లు తెరిచి - కళావతీ' అంటూకేకవేసి, ఆమె కనిపించక తనమిత్రులు కనుపించే సరికి "మిత్రులారా. నన్ను స్త్రీలోలుడని తెలిసి యిలా వచ్చారా? రాముడూ ప్రవరుడూ ఏరీ? కుశలమేనా?' అని అడిగాడు

వాళ్ళు జరిగినది చెప్పారు అది విని - నన్నెందుకు బతికించారు? కళావతి వియోగాన్నెలా భరించేది?" అంటూ వసంతుడు రోదించసాగాడు అతని దుఃఖం మాన్పించి జరిగినదంతయూ వానినోట తెలిసికొన్నాక - "నేను కొత్తగా విమానం చేసే విద్య నేర్చుకున్నాను దానిమీద భూలోక మంతా తిరిగి కళావతి ఎక్కడుందో కనుక్కుందాం " అంటూ దుండుడు తన వృత్తాంతం సాంబుడి వృత్తాంతం చెప్పి - తొందరగా ఒక కీలురథం నిర్మించగా ముగ్గురూ భూలోకంలో ఉన్న ప్రసిద్ధ పట్నాలలో కళావతిని వెదకసాగారు '

అప్పటికి ప్రయాణ సమయమవడంతో కథ చాలించి మణిసిద్ధుడు తరవాత మజిలీలో మళ్లీ చెప్పసాగాడు.

'వాళ్ళు ముగ్గురూ అలా తిరుగుతూ హేలాపురం వచ్చి ఆరాత్రి అక్కడ ఆగారు

పరదేశులుండే సత్రంలో వారికి తగిన భోజన సదుపాయాలు లభించాయి మర్నాడు ఉదయం సత్రపు వీధి వేదిక మీద వేలగట్టిన చిత్రం చూశారు

సాంబుడు  వసంతా. ఈ బొమ్మ మనప్రవరుని పోలికలో ఉంది చూశావా?

వసంతుడు: ఔను, అలాగే ఉంది

దండుడు  నేను గుర్తుపట్టగలను. ఇది మన ప్రవరుని చిత్రమే

సాంబుడు  అతని చిత్రం యిక్కడెందుకుందో?

దండుడు . ఇది - అతనిని పోలిన వేరొకనిదేమో

సాంబుడు  కాదు. ఇది కచ్చితంగా ప్రవరునిదే.

వసంతుడు· తమ్ములారా! నాకు కళావతి వియోగం కంటే మిత్ర వియోగ సంతాపమే ఎక్కువగా ఉంది హా ప్రవరా హా రామా మిమ్మల్నెప్పుడు చూస్తానో?

వాళ్లు అలా మాట్లాడుకుంటూంటే రాజభటులువచ్చి - "మీరెవరు? ఈ చిత్రఫలకాన్ని చూస్తి మాట్లాడుకుంటున్నారు కనక వేరొక చోటుకి పోనియ్యము మామంత్రిగారి కడకు రావలసిందే." అన్నారు.

"మీ మంత్రి గొప్పవాడే! చిత్రఫలకం చూడ్డమేనేరమా? ఐతే యిక్కడెందుకు వేలగట్టాలి? పదండి ఆయననే అడుగుతాం ', అంటూ వాళ్లు భటుల వెనక నడవసాగారు వీరి రాక గురించి తెలియ జెప్పగానే అంతఃపురానికి తీసుకురమ్మన్నాడు మంత్రి

వారిని చూసి - వారు తనని పోల్చగలరో లేదో అనుకున్నాడు ప్రవరుడు అంతలో వసంతుడు 'అయ్యా మీరేనా ప్రధాన ప్రవరులు? పరోపకార బుద్ధితో సత్రం కట్టించి - చిత్రఫలకం చూసినందుకు యిలా భటులచేత రప్పించడమేమిటి? ఇదేమిపాలన?" అని అడిగాడు.

"మీరాచిత్రము నెందుకు పరిశీలనగా చూశారు?" అడిగాడు ప్రవరుడు

'అది మామిత్రుని పోలికలో ఉంది " చెప్పాడు వసంతుడు

"మీ మిత్రుడేమయ్యాడు? మిమ్మల్ని మరచి విగ్రహ మయ్యాడనుకున్నారా?" అడిగాడు

అప్పటికి దండుడు గ్రహించి - "ఇతడు మనప్రవరుడే ' అని అరిచాడు

ప్రవరుడు వారిని ఆనందంతో కౌగలించుకుని - "అన్నలారా. ఆచిత్రపటమును మీకోసమే వేలాడదీయించాను "అంటూ మర్రిచెట్టు కొమ్మ ఎక్కినది మొదలు అంతవరకూ తన వృత్తాంతాన్ని చెప్పాడు వాళ్లు కూడా తమకథలు చెప్పారు

'ఇక రాముడొక్కడే మనని కలుసుకోవాలి ' అంటున్నంతలో - ద్వారపాలకుడొచ్చి - "దేవా. సత్రమందలి చిత్తరువును తదేకముగా చూశారని ఒక జంటను కావలివారు తీసుకొచ్చారు వారిని ప్రవేశ పెట్టమనెదరా?" అని అడిగాడు

' తక్షణం ప్రవేశపెట్టు."అన్నాడు ప్రవరుడు వచ్చినవారు రాముడు, అతని కనకప్రభ అర్థాంగియే వారు రాముణ్ని కౌగలించుకుని కుశలమడుగుతూంటే కనకప్రభను కాంచనవల్లి ఆహ్వానించింది మిత్రులు ఒకరి వృత్తాంతం ఒకరు తెలుసుకున్నారు

"నిన్ననే ఈ చిన్నది సత్రందాపులో ఉన్న సన్యాసిని ప్రార్థించి, కుక్కగా ఉన్ననన్ను మళ్లీ రాముణ్ని చేయించింది " అని తనకథ ముగించాడు రాముడు.

వసంతుడిలా అన్నాడు "ఎక్కడఎవరెన్నాళ్లు సుఖంగానో దుః ఖంగానో గడపాలో దైవం వాళ్ళనక్కడికి తీసుకొచ్చి వాళ్లచేత అలా అనుభవింపజేస్తుంది.

కోరకుండానే దుఃఖాలెలా కలుగుతాయో, ప్రయత్నం లేకుండానే సుఖాలూ అలాగే కలుగుతాయి పూర్వజన్మ కృతము, వేళా విశేషమూ అలా జరిపిస్తాయి సుఖాలకి ఉబ్బిపోదం,దుఃఖాలకి క్రుంగిపోడం తగదు " అని వేదాంతము పలికి - "మనకింతటి సంతోషం కలిగించిన దైవానికి వందనములు

రామా ప్రవరుడు కళావతి వృత్తాంతమంతా చెప్పాడు కదా ఇప్పుడామెను ఏకాంతముగా యిక్కడికి రప్పిద్దామా, లేక కందర్పకేతు నోడించి అప్పుడు తీసుకొద్దామా? ' అని అడిగాడు

"సామము మొదలయిన చతురోపాయములను వైరులయెడ క్రమముగా నడిపించదగును కదా. మనప్రవరుని ఉద్దేశం కూడా కనుక్కుందాం." అన్నాడు రాముడు

"ఈరాజు పరాక్రమంలో కాని బుద్ధి కుశలతలో కాని. మనని మించినవాడు కాదు సేనలన్నీ నా అదీనంలోనే ఉన్నాయి. కోటను స్వాధీనం చేసుకోడం త్రుటిలో పని. కాని కృతఘ్నతాభీతి నన్ను బాధిస్తూంది కనుక రాముడు చెప్పినట్లు సామోపాయమే ప్రయత్నించి చూద్దాం. అది అందరికీ మేలు " అన్నాడు ప్రవరుడు.

వారయిదుగురే భయంకరమయిన వేషాలు ధరించి, కత్తులుపట్టుకుని, చూచువారికి భయం కొల్పుతూ ఆస్థానం చేరుకుని రాజసింహాసనం మీద వసంతుడు, దగ్గరున్న పీఠాలమీద తక్కిన వారూ కూర్చుని రాజుకి కబురుపంపారు.

దూత రాజుకు అతని సింహాసనం ఆక్రమించుకోబడినదని చెప్పాడు. వినోదంలో ఉన్నరాజు "వెంటనే ప్రవరుణ్ణి తీసుకురా " అన్నాడు

"వారితోనే వచ్చి పీఠమాక్రమించుకుని మనలను బెదిరించు చున్నాడు దీనికంతటికీ మూలకారకుడతడే అని నా అనుమానం."

"మైత్రి కొస్తే సింహాసనం ఆక్రమిస్తారా? వారి ఆకారాలు కూడా స్నేహితులవలె లేవు కదా." రాజు వణికిపోతూ భార్య వేపు చూసి " కాంతా! ఇప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు.

ఆమె యుద్ధం చేయమనే సరికాపిరికి వాడంగీకరింపక పారిపోదామన్నాడు. రాణి తానే వెళ్లి సంధి చేసుకొస్తానంది అంతలో పరిచారకులు వొస్తూంటే వారిని శత్రువులుగా భావించి రాజు ముసుగు కప్పుకుని మంచమెక్కాడు రాజుగారిని తీసుకురమ్మన్నా"రని పరిచారకులు చెప్పగా రాణి – "మనమంత్రిని నేనొకసారి రమ్మన్నానని చెప్పండి" అంది.

రాజుపారిపోవాలని ప్రయత్నిస్తూంటే రాణి అతన్ని పట్టుకుని ఆపింది. అప్పటికి వరప్రసాదులు రానే వచ్చేశారు.

'అమాత్యా వీరికి మేమేం అపకారం చేశాం? వీరికి రాజుగారితో ఏంపని?' అని అడిగింది ప్రవరుడు రాజువద్దకు వెళ్లి ముసుగుతీసి చూడగా అతను కళ్ళు తేలవేసి పళ్ళు గిట్టకరచి వాణికి పోతున్నాడు అతనిని చూసి వరప్రసాదులు నవ్వారు

వీని తత్వమెరిగిన బ్రాహ్మణ వింతతువుంది ఆమెను తీసుకురండి' అని భటులను పంపాడు ప్రవరుడు వారు వెళ్లక్కర్లేకుండా ఆమె ఎదురు పడింది ఇక నన్ను మన్నించే వారెవరు? నాకింకనూ పారితోషిక మివ్వలేదే అయ్యో ' అని ఏడుస్తున్న ఆమెను –

'నువ్వు రాజుకేమి ఉపకారం చేశావు?" అడిగాడు రాముడు

' ఇతను కోరిన చిన్న దానిని ద్వీపాంతరం నుంచి తెచ్చాను ఇతన్ని వరించడానికది సంవత్సరం గడువు పెట్టింది 'అంటూ ఆకదంతా వివరంగా చెప్పింది

తమని మోసం చేసిన ఆవితంతువుని నరికెయ్యడానికి సిద్ధ పడ్డాడు వసంతుడు ప్రవరుడు అడ్డమెచ్చి 'స్త్రీ వధ మహాపాపం దీనిని మరోలా శిక్షిద్దాంలే ' అని అపాడు

రాణి వీరిపాదాలమీద పడి పతిభిక్ష పెట్టమని కోరింది అప్పుడు ప్రవరుడు తామెవరో వివరించాడు అది విని రాజు వారి పాదాలపై పడి 'మీపాదసేవకుడినై బతుకుతాను. నన్ను రక్షించండి కళావతిని నేను ముట్టుకోలేదు ఆమె నన్ను కన్నెత్తి చూడలేదు " అన్నాడు వరప్రసాదులు రాజుని రాణిని వదలి ఆవృద్ధ బ్రాహ్మణిని మాత్రం కళావతి ఉన్న అంతఃపురానికి యీడ్చుకుపోయారు

కళావతిని చూడడంతోటే వసంతుడు ఆనందంపట్టలేక హా, కళావతీ అంటూ కౌగలించుకున్నాడు వసంతుని కలుసుకున్నందుకామె ఎంతో సంతోషించి ముసలిది పెట్టిన బాధలన్నీ చెప్పింది కాని దాని మొరవిని క్షమించి వదిలెయ్యమంది

'మనం తొందరగా మరలిపోదామన్నా దైవఘటన వలన ఆలస్యమయింది. మన తల్లితండ్రు లెంత చితించుచున్నారో, వేగం వెళ్లి వారిని చూద్దాం " అన్నాడు వసంతుడు

సాంబుడు, దండుడు రాగమంజరిని, విద్యుత్ప్రభని తలుచుకోగా వారు వచ్చారు దండుడు నిర్మించిన కీలురధం మీద ఆ ఐదు జంటలూ ఆకాశమార్గాన వెళ్లారు

రాముడు కన్నులిచ్చి పెండ్లి యాడిన పద్మగంధి పట్నం వెళ్లి ఆమెను కూడా ఎక్కించుకున్నారు "

గోపాలా. నువ్వు చూసింది ఆకీలురధమే కథ బాగా అర్థమైందా? "అడిగాడు యతి "అయిందం"టూ వరప్రసాదుల అదృష్టంతలుచుకుంటూ తరువాతి మజిలీకి ప్రయాణం కట్టాడు

# కాశీ మజిలీ కథలు

## 6. వ మజిలీ

### 14. విక్రమసింహుని కథ

యతి, గోపాలుడు బస చేసిన సత్రం సింహద్వారం పైన స్త్రీ చిత్రం కల ఫలకం వేలాడదీయబడి ఉంది. ఆ వృత్తాంతం చెప్పమని గోపాలుడడిగాడు.

'చోళదేశంలో ప్రజాపతి అనే పట్నం ఉంది దానికి రాజయిన చిత్రసేనుడికి సంతానం లేదు. ప్రజలను చక్కగా పాలించే ఆరాజుకి పెద్దవయసులో ఒక పుత్రుడు కలగగా వానికి విక్రమసింహుడని పేరు పెట్టారు రాజుకి పుత్రుడు కలిగిన మూడోరోజునే మంత్రికీ పుత్రుడు జన్మించాడు. వీని పేరు బహుశ్రుతుడు

ఆబాలురు పదహారేళ్లు రాకుండానే సకల విద్యలూ గ్రహించారు ధనుర్విద్య, సంగీతం, కవిత్వాలలో దిట్టలయ్యారు

ఒకనాడు రాజుసభతీర్చి తన పుత్రుడయిన విక్రమసింహునీ, మంత్రిశ్రుతకీర్తి కుమారుడయిన బహుశ్రుతునీ రప్పించి యిలా చెప్పాడు

"నేనూ, మంత్రీ వృద్ధులమయ్యాము రాజ్యభారం వహించడం కష్టమౌతూంది. ప్రజలు మిమ్మల్ని ప్రభువులు గాకోరుతున్నారు చిరంజీవీ. పూర్వాచార ప్రకారం నేను నిన్ను పట్టభద్రుని చేసి తపస్సుకి వెళ్ళిపోతాను నువ్వు సప్తవ్యసనాల జోలికి పోక దండనీతి ప్రకారం రాజ్యంచెయ్యి ఆయాసమయాలకి తగినట్లు సామదాన భేదదండములనుపయోగించు దైవభక్తీ, బ్రాహ్మణభక్తీ కలిగి - ఆదాయాన్ని బట్టి వ్యయము చేయుచూ, సమర్థులు, విద్వాంసులు దయా సత్యనిరతులు అయినవారిని ప్రధానులుగా చేసికొని అల్పులను దరిచేర నివ్వక చక్కగా పాలించు

మరునాడు విక్రమసింహుడూ, బహుశ్రుతుడూ విహారార్థం ఉద్యానవనానికి వెళ్ళినప్పుడు విక్రమసింహుడు – "మిత్రమా. మొదటినుంచీ నాకు దేశ సంచారం చెయ్యాలని కోరిక. నీకు తెలుసు ఇంతవరకూ విద్యాభ్యాసంతో గడిచింది రాజ్యభారం పైనపడితే దేశసంచారానికవకాశముండదు మనం రహస్యంగా పోయి దేశసంచారం చేసివద్దామా?" అని అడిగాడు మంత్రి కుమారుడికీ అదే కోరిక. కనుక వెంటనే సై అన్నాడు

ఆరాత్రేవారు బంగారం, విలువైన రత్నాలు పట్టుకుని గుర్రాలెక్కి అడవిమార్గంలో వెళ్లారు తోవలో పల్లెలూ పట్నాలూ చూస్తూ చివరికిక్కడికి వచ్చి యీసత్రంలోనే బస చేశారు రాజకుమారుడీ చిత్రాని చూశాడు. నిజమైన వనితయే అనుకుని మూర్ఛబోయి, తరువాత తనది భ్రమ అని గ్రహించాడు "లోకంలో యింత చక్కదనంకల కన్యలుంటారా? బహుశ్రుతా. ఈమెను తెచ్చి నాకు పెళ్ళి చెయ్యకపోతే ప్రాణాలొదిలేస్తాను " అన్నాడు ఈ చిత్రం వెనుక నిజం తెలిసికొని అలాటి కన్య ఉంటే తప్పకుండా తెచ్చి వివాహం చేస్తాను, కానీ ఓర్పు వహించు " అని చెప్పి మంత్రికుమారుడు అరాత్రియగా ఒక వృద్ధ బ్రాహ్మణుడిలా చెప్పాడు

"మూడేళ్ళక్రిందట-మళయాళ దేశరాజధాని అనంతపురం నుంచినిపుణుకుడను చిత్రకారుడు వచ్చి దీనిని కట్టిపోయాడు. కారణం నాకు తెలియదు '

విక్రమసింహునితో కలసి బహుశ్రుతుడా పట్నం వెళ్లాడు పురజనులను అడిగి ఆ చిత్రకారునింటికి వెళ్లి తామా చిత్రం చూచుట రాజకుమారుడు వలచుట చెప్పగా అతను –

"నేనొకప్పుడు కాశీపురికి వెళ్లాను అప్పుడే అక్కడికి పురుష ద్వేషిణి అనురాజపుత్రిక వచ్చినది ఆరాజపుత్రిక – తాను మగవారి మొగము చూడక పోవడమే కాక తానెక్కిన పల్లకిని కూడా పురుషులు చూడకూడదట ఆమె ఎంత చక్కనిదో చూడాలని – జలస్తంబన విద్య కల నేను మణికర్ణికా ఘట్టంలో నీటిలో దాక్కొని ఉన్నాను. ఆమె మోకాలి

లోతు నీటిలో నిలచి చెలికత్తెలు కలశాలతో నీరు పోయగా స్నానం చేసింది నాకు –

నీటిలో బంగారు కమ్ములవలె మెరుస్తున్న మోకాళ్లు కాలివేళ్లు మాత్రమే కనపడ్డాయి నాకు సాముద్రికశాస్త్రం కూడా రావడంవలన ఆమెకాళ్లు, వేళ్లని బట్టి ఆమె ఎలా ఉంటుందో ఊహించి చిత్రంరాశాను ఆసుందరి చిత్రంలానే ఉంటుంది సందేహంలేదు అచిత్రం గీసి స్వదేశానికి తిరిగివొస్తూ మీరు చూసిన సత్రంలో దిగాను పదిమంది వొచ్చిపోయే సత్రం కదా అని అక్కడ వేలాడగట్టాను అంతే తప్ప ఆమె దేశ, కుల, వివరాలేమీ నాకు తెలియవు " అన్నాడు

అదివిని – 'ఈకార్యం సాధించడం అసాధ్యంలా ఉంది. ఆమె ఎక్కడుందో తెలియలేదు. విక్రమసింహుని విరహవేదన పెరిగిపోతూంది దైవం ఏం చేస్తాడో?' అనుకున్నాడు మనసులో

అంతలో విక్రమసింహుడు – 'అన్నా. ఈ చిత్రకారుని మాటలు విన్నావు కదా తనకి సరిపడిన పురుషులు లేకనే ఆమె పురుషద్వేషిణి అనే పేరు పెట్టుకుని ఉంటుంది మరి నువ్వేం చేయదలచుకున్నావు?' అని అడిగాడు

"ఆమె ఎక్కడున్నా తొందరగానే ఆమెతో నీకు వివాహం చేయిస్తాను ' అని ప్రతిజ్ఞచేశాడు ఆ సుందరిని వెదుకుతూ వాళ్లు అనేక దేశాలు తిరిగారు అతను ఒకనాడు అడవిలో నడుస్తూ –

"అన్నా. బహుశ్రుతా ఎండలో నడచి అలసిపోయాను. నేనీ చెట్టునీడను పడుకుంటాను నువ్వువేగంగా నీళ్ళు తీసుకురా." అని కూలబడిపోయాడు విక్రమసింహుడు

అప్పుడు బహుశ్రుతుడు చెట్టెక్కి చుట్టుపక్కల పరికించి దగ్గరలో నీటిపక్షులెగరడం చూసి ఒక్కనిమిషం తాళు " అంటూ వెళ్లాడు అక్కడొక తటాకం కనుల పండగగా కనిపించింది దగ్గరకు వెళ్లేసరికి ఒక శిలాఫలకం మీద – ఇది పురుష ద్వేషిణి అను రాజపుత్రిక క్రీడించు సరోవరము దీని చెంతకు వచ్చిన పురుషులురితీయ బడుదురు " అని రాసి ఉంది మిత్రుడి కాసంగతి చెబుదామని నీరు పట్టుకుని చెట్టుదగ్గరకు వచ్చేలోగా –

విక్రమసింహుడి కొక భయంకరమయిన ధ్వని వినిపించింది. నిరాయుధుడై ఉండడం వలన తటాలున మర్రిచెట్టెక్కేశాడు ఒక సింహం వచ్చి ఆ చెట్టుకింద తిష్టవేసింది సింహభయంతో - విక్రమసింహుడు - చెట్టుమీద పడుకున్న క్రౌంచపక్షి రెక్కలను కూడా కొమ్మలే అనుకుని ఆరెక్కలమధ్య దాక్కొన్నాడు. ఆ అలికిడికి క్రౌంచపక్షి చెట్టుకొమ్మ విరిగేలా రివ్వున లేచి ఆకాశమార్గంలో క్రౌంచద్వీపంవేపు ఎగరసాగింది

పక్షిరెక్కలమధ్య చిక్కుపడిన విక్రమ సింహుడు 'అయ్యో! నేనొకటి తలిస్తే దైవమింకొకటి తలచెనే ఈ పక్షి నన్నెక్కడికి తీసుకుపోతుందో? ఇంటి దగ్గర సుఖంగా ఉండక దేశాటన మెందుకు తలపెట్టాను? మిత్రుడికి సంగతెలా తెలపాలి?' అనుకుని ఒక చీటి వ్రాసి నేలమీద పడేశాడు.

ఆ పక్షి ఆకాశ మార్గాన రివ్వున ఎగరసాగింది

## 15. క్రౌంచ ద్వీపం కథ

అనేకదేశాలూ, ద్వీపాలూ దాటి ఆ పక్షి క్రౌంచ ద్వీపంలో ఒక చెట్టుమీద వాలింది. ఆ పక్షులక్కడ నివసిస్తూ ఎప్పుడేనా మేతకి జంబూద్వీపం వొస్తూంటాయి

పక్షివాలడంతోనే విక్రమసింహుడు దాని రెక్కల సందునుంచి తప్పించుకుని చెట్టు దిగాడు. ధైర్యమేతోడుగా అతను నడచినడచి ఒక పట్నం చేరి అక్కడొక స్త్రీని చూశాడు. ఆమె కూడా అతన్ని చూచి - మోహించి - తన భాషలో నీవెవరని అడిగింది. ఒకరి భాష ఒకరికి తెలియక చివరికామె అతన్ని తనయింటికి రమ్మని సైగలతో చెప్పింది. అతను సరే అన్నాడు

అది క్రౌంచ ద్వీపానికి రాజధాని అయిన ఏకశిలానగరం. దానికి రాణి క్రౌంచవతి అక్కడ స్త్రీలు సౌందర్యవతులే కాని వారివి

రాక్షస కృత్యములు పురుషులు నల్లగా పొట్టిగా కోతిమొహాలతో వికారంగా ఉంటారు.

రామరావణ యుద్ధంలో మూర్ఛపోయిన లక్ష్మణుడిని బతికించడానికి హనుమంతుడు సంజీవని తెచ్చి.. తిరిగి తీసుకు వెళ్తూ అక్కడొకనిముషం విశ్రమించాడు చక్కని వారయిన అక్కడి పురుషులతన్ని చూసి పరిహాసం చేశారు అంజనేయుడు కోపగించి అక్కడి పురుషులూ వారికి పుట్టే పుత్రులూ - వామనులూ, వానరరూపులూ ఐఉందురనీ, స్త్రీలు రాక్షస కృత్యాలు చేస్తారనీ శపించాడు

ఆ దీవి యందలి పుష్పవతి, చక్కని వాడగు విక్రమసింహుని చూసి పట్టరాని ఆనందంతో వెంటబెట్టుకుపోతూ - రాణి అయిన క్రౌంచవతికి తెలిసినచో అతనిని తనకు దక్కనివ్వదని, రహస్యంగా తీసికెళ్లాలనుకుంది. కాని . పుష్పవతికి మరియొకతె తారసిల్లి -  "పురుషులలో కూడా యింత చక్కని వాళ్లుంటారా? ఎక్కడదొరికాడే?" అని అడిగింది

"మనభాష తెలియని లోపమొక్కటే యితనిలో కనిపించు చున్నది. మనమిద్దరమూ యితన్ని పెళ్లాడుదాం కాముకి అయిన మనరాణికి తెలిసినచో యీ చక్కని వానిని మనకిదక్కనివ్వదు. " అని సందులలోంచి నడుచుచుండగా - మరొకతె ఎదురొచ్చి. . "ఇంతచక్కని వాడెక్కడ దొరికాడే? నాకు కూడా భాగమివ్వకపోతే ఒప్పుకోను-" అంది. అలాగే మరో యిద్దరు తారసిల్లి అతన్ని తమకి కూడా పతిని చేయమన్నారు

అంతలో ఆవింత వార్త పట్నమంతా వ్యాపించింది స్త్రీలందరూ అతన్ని చూడడానికి గుంపులు గుంపులుగా రాసాగారు. అక్కడ స్త్రీలకే తప్ప పురుషులకేవిధమైన స్వాతంత్ర్యమూ లేదు కనక అక్కడ జారత్వము నేరము కాదు.

అందరూ తమింటికి రమ్మంటున్నా విక్రమసింహుడు తాను మొదట్ల చూచిన పుష్పవతి యింటికేవెళ్లాడు. ఆమె అతన్ని అనేక విధాల

సత్కరించింది కాని వారి ఆహార విహారాలతనికి విపరీతంగా తోచాయి. వాళ్లు పచ్చి మాంసం తింటారు కోపమొస్తే మగాళ్లని చంపి తినేస్తారు

ఒకవేపు పురుషద్వేషిణీ విరహం, మరోవేపు మిత్ర వియోగం, ఇంకొకవేపా పట్నంలో నివసించడం – అతనికి చాలా విచారం కలగ జేస్తున్నాయి. చురుకయిన వాడు కనక పదిరోజులలోనే వారి భాష గ్రహించినా – మాట్లాడితే తంటా అని రానట్లే ప్రవర్తించసాగాడు.

పుష్పవతి ఎంత బతిమాలినా అతనామెతో కామక్రీడ సలపలేదు. అతని విషయం రాణివరకూ వెళ్ళడంతో! అతన్నీ పుష్పవతినీ వెంటబెట్టుకురమ్మని రాణి సేవికను పంపింది

అతన్ని చూడడంతోనే రాణి కౌగలించుకుని అర్ధసింహాసనం మీద కూర్చోబెట్టి ఎంతగానో గౌరవించి – "పుష్పవతీ అంధకారంలోకి కాంతిరేఖలా యిక్కడకు వచ్చిన సుందరాకారుని గురించి నాకు చెప్పక దాచుకున్నావేం? వింతవస్తువు లేమైనా ఏలికకు యివ్వాలనేన్యాయం తెలియదా? వెళ్లు " "అని, అతన్ని తీసుకుని అంతఃపురానికి వెళ్లింది.

ఆమె ఎంత మోహం చూపినా అతను సంతోషించలేదు. అప్పుడుఆమె – "మా పూర్వపుణ్యం కొద్దీ మీరు దొరికారు అందమైన మగవారి సంపర్కంలేక యీ దేశ స్త్రీలందరికీ వికృత పురుష సంతానమే కలుగుతూంది. నాకును వికృత పురుషుడొకడు భర్తగా ఉన్నాడు కాని యింతవరకూ నేను వాడి ముఖం చూడలేదు. నన్ను నీవు భార్యగా స్వీకరించి అందమైన పుత్రుని ప్రసాదించు". అనగా అతడామె అభీష్టం నెరవేర్చాడు

కొంతకాలానికామె గర్భం దాల్చింది ఆదేశంలో గర్భవతులు పురుష సాంగత్యం చేయరు. రాణి విక్రమసింహునితో – "కొన్నినెలల వరకూ నాకు పురుష సంపర్కం కూడదు. నాకు కుసుమగంధి అను చెల్లెలుంది అంతవరకూ దానికానందం కలిగించు. 'అంది

ఆమెకు కూడా నెలతప్పాక అతనామె నంటడం మానేశాడు అప్పుడా వూరిలోకల స్త్రీలు వంతు ప్రకారం అతనితో తమ కోరిక తీర్చుకో

సాగారు అతను అప్పుడప్పుడు సభలు చేస్తూ వారి దురాచారాల గురించి ఉపన్యాసాలిస్తూ వారి క్రూరత్వాన్ని తగ్గించ సాగాడు

ఒక శుభలగ్నంలో సర్వావయవసుందరుడైన పుత్రుడు రాణికి జన్మించగా ఆమె, బంధువులు క్రౌంచ ద్వీప చక్రవర్తి పుట్టాడని ప్రకటించారు. విక్రమసింహుని సంపర్కము కలిగిన స్త్రీలందరూ చక్కని కొడుకులను కన్నారు. క్రౌంచద్వీప పురుషులదుర్దశలను బాపుటకు వచ్చిన పరమేశ్వరుడే అని పొగుడుతూ అతనేం చెప్పినా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు అయినా అతనికి సంతోషం లేదు. జంబూద్వీపం పోవాలని ప్రయత్నించాడు కాని వారికాద్వీపం పేరే తెలియదు.

ఆదేశ పురుషులందరూ ఒకచోట చేరి – “మన గతి ఏమైందో చూశారా? మనభార్యలు మనముఖమే చూడక ఎక్కడినుండో వచ్చిన వానితో క్రీడిస్తూ సంతానం పొందుతున్నారు. కొన్నాళ్లలో యీ దీవంతా వాడి సంతానమే ఔతుంది. మనమూ మన సంతానమూ అడవులు పట్టవలసిందే. ఎలాటి మగాడికైనా తన భార్య మరొకడితో రమిస్తూంటే ఈర్ష్య కలగకమానదు. మనలో కొందరికి అంతఃపురం ప్రవేశించడానికి వీలుంది కదా మన శత్రువుని రాత్రి నిద్రించునప్పుడు మంచంతో సహా సముద్రంలో పారేద్దాం ” అని నిశ్చయించారు

మంచాన్నెత్తుకొని పోతున్నప్పుడు విక్రమసింహునికి మెలకువొచ్చింది వారి మాటలు విన్నాడు ఒక చెట్టు క్రిందనుంచి వెళ్తున్నప్పుడు చటుక్కున దానికొమ్మందుకుని చెట్టుమీద కెగబాకి తనని రక్షించుకున్నాడు వాళ్లది తెలియక తమ శత్రువు చచ్చాడని సంతోషించారు మర్నాడు విక్రమసింహుడు కనపడక తమ పురుషులే అతన్నేదో చేశారని మగవాళ్ళందరికీ తీవ్రమైన శిక్ష విధించింది రాణి కాలక్రమంలో విక్రమసింహుడి కొడుకే రాజయ్యాడు ఆదీవంతా అతని సంతతే వ్యాపించింది ”

“విక్రమసింహుడేమయ్యాడు?” అడిగాడు గోపాలుడు.

'ఇంతకు మునుపు తననిక్కడకి తెచ్చిన పక్షే అని తెలియ కుండానే అతనాచెట్టుమీది పక్షి రెక్కల సందులో దాక్కున్నాడు అది ఎగిరెగిరి పూర్వం విక్రమసింహుడెక్కిన చెట్టు మీదే వాలింది అతను మెల్లగా దిగి బహుశ్రుతుని గురించి వెదుకుతూంటే అతనే ఎదురయ్యాడు. ఇద్దరికీ నమ్మలేని కలయిక అది. బహుశ్రుతుడు పురుషద్వేషిణి విహార సరోవరం గురించి చెప్పి, అతన్ని సింహం మింగేసిందేమో అనుకున్నా నన్నాడు. ఆ సింహం చేతే చంపబడాలని ఎదురు చూస్తూ అక్కడే తిరుగుతున్నట్లు చెప్పాడు అంతలో విక్రమసింహుడు రాసిపడేసిన చీటి కనిపించి – అతను బతికే ఉన్నాడని సంతోషించి – ఆ పక్షిగురించి వాకబు చేయగా – ఒక వృద్ధకిరాతకుడు – "ఆ పక్షి పేరేమిటో మాకు తెలియదు అది సంవత్సరాని కొకసారి వచ్చి యీ మర్రిచెట్టుమీద రెండు మూడు రోజులుండి వెళ్లిపోతుంది. మనుషులని తేలికగా మోసుకుపోగలిగే బలమున్నా అది క్రూరమయినది కాదు." అని చెప్పాడు.

"నువ్వాపక్షితో వస్తావేమో అని దేముణ్ని ప్రార్థిస్తూ, కందమూలాలతో ఆకలి తీర్చుకుంటూ రుషిలా గడుపుతున్నాను ఇవేళ అది వొచ్చే దినమని విని – దానితోపాటు నువ్వు రాకపోతే చనిపోదామని నిశ్చయించుకుని యిక్కడికి వస్తున్నాను" – అన్నాడు బహుశ్రుతుడు. 'విక్రమసింహుడు పురుషద్వేషిణి విహార సరోవరం గురించి నువ్వు చెప్పగా విన్నాను ఆమెనివసించే పట్నం యిక్కడికి దగ్గరలోనే ఉంటుంది నాకామెను జతకూర్చి నీవాగ్దానం నిలుపుకో ఆమెను పొందకపోతే నా ప్రాణాలు నిలవవు " అన్నాడు.

'ఇప్పటికెదుర్కొన్న ఆపదలు చాలవూ? పురుషద్వేషిణిని పెళ్ళాడడం సులభంకాదు మనకోసం యింటిదగ్గర తల్లితండ్రులు చింతిస్తూ ఉంటారు మరలిపోదాం " అన్నాడు బహుశ్రుతుడు కాని విక్రమసింహుడు తన పట్టుదల వదలలేదు

'సరే. ముందు ఆమె జలకాలాడే సరోవరం చూద్దువు కాని, పద తరువాత ఆమెను జతచేసే ప్రయత్నం మొదలు పెడతా" నంటూ ఆ సరోవరానికి తీసుకువెళ్లాడు దానిని చూడడం తోనే పురుషద్వేషిణిని చూచినట్లే పొంగిపోయాడు విక్రమ సింహుడు

# 16. పురుష ద్వేషిణి కథ

అంతలో పురుష ద్వేషిణి జలకేళికి వచ్చుచున్నదనీ, పురుషులు దూరంగా పోవాలనీ చాటింపు వినబడింది. విక్రమ సింహుడూ, బహుశ్రుతుడూ సరస్సు వొడ్డునున్న చెట్టు కొమ్మల్లో దాక్కుని చూడసాగారు.

స్త్రీలు మోస్తున్న బంగారు పల్లకి ఎక్కి ఎందరోస్త్రీలు కొలుస్తూండగా ఆమె పల్లకీ దిగి సరోవరంలో జలక్రీడలాడుతూంటే ఆమెస్నేహితురాళ్లు సంభాషించసాగారు. వాళ్ళిద్దరూ ఆమె సౌందర్యాన్ని కొనియాడి మురిసిపోయారు.

**మంజువాణి** : ఇంత చక్కనిది పురుషులను ద్వేషించి యౌవనం వృధా చేసికొనుట ఎందుకో

**సఖులు** : మాకు తెలియదు తెలుసుకోవాలని కుతూహలం ఉంది

**మంజువాణి** : అడిగి తెలుసుకుందామా?

**భ్రమరవేణి** అందుకు నువ్వే సమర్ధురాలివి.

**మంజువాణి** : నేనే అడుగుతా, రండి

ఆమె పురుషద్వేషిణి వద్దకు వెళ్లి – "సఖీ! నీళ్లు జల్లుట ఆపుము. నీతో కొంచెం మాట్లాడాలి. సఖులమగు మాతో చెప్పకూడని రహస్యముండదు కదా? లోకంలోని మిగిలిన స్త్రీల వలె కాక విరుద్ధమైన వ్రతంపూని పురుషులతో సుఖపడవలసిన కాలమంతా వారిని దేషిస్తూ గడప డమెందుకో అని మాచింత.

అది విని పురుషద్వేషిణి మౌనం దాల్చింది

"నువ్వు పురుషులనెందుకు ద్వేషిస్తావ్?" మంజువాణి మళ్లీ అడిగింది. "చెప్పేవరకూ వదలం " అన్నారు సఖులు

పురుషద్వేషిణి 'నాతల్లిదండ్రులడిగినా చెప్పనిది, మీకు చెబుతున్నాను." అంటూ ఆకథ మొదలుపెట్టింది

# 17. రత్నాంగి కథ

నాకు పూర్వజన్మ స్మృతి ఉంది పూర్వ జన్మలో నేనొక రత్నాల వర్తకుడికూతురిని. నాపేరు రత్నాంగి. పెళ్లయిన కొన్ని రోజులకే కాపరానికి వెళ్లాను నాభర్త మంచి కుటుంబం లోనివాడే కాని జూదరి. తాతతండ్రులు సంపాదించినదంతా తగలబెట్టేవాడు. అదికూడదని నేనెంత చెప్పినా వినేవాడు కాదు

ఒకసారి అతను తాకట్టుపడిపోతే నావొంటిమీద నగలిచ్చి విడిపించాను ఐనా సిగ్గురాలేదతనికి మా తండ్రి యిచ్చిన ధనమంతా జూదంలో ఓడిపోయాడు. రుణాలు చేసి ఆడాడు చివరకి కూటికీ గుడ్డకీ మొహందాచవలసిన పరిస్థితి తెచ్చాడు. అప్పులవాళ్లు నిర్బంధిస్తూంటే చూడలేక అతన్ని వెంటబెట్టుకుని పుట్టింటికి వెళ్లాను మా హీన స్థితి తెలియని నాతండ్రి ఎంతో గౌరవంగా చూశాడు

"నాన్నగారూ! మీ అల్లుడు కడు భాగ్యవంతుడని మీకు తెలిసిందే కొన్ని రోజుల కిందట లక్షలవిలువ చేసే సరుకుతో విదేశాలకు ఓడను పంపారు అది యింకా తిరిగిరాలేదు. ఇక్కడ కొన్ని సరుకులు కొనాలి. కొంత సొమ్ము బదులిస్తే వడ్డీతో సహా తీరుస్తాము " అని అబద్ధమాడాను.

తన సొత్తుకు మేమూ అర్హులమే అంటూ తిరిగివ్వక్కర్లేదంటూ సొమ్ము తీసికెళ్ల మన్నాడు మానాన్న. ఆమాట నాభర్తకు చెప్పి - యిదివరకు చేసిన రుణాలన్నీ తీర్చేసి, మరి జూదం జోలికి పోనని ఆయన చేత ప్రమాణం చేయించుకుని, కొంతసొమ్ము నాదగ్గరుంచుకుని, మళ్లీ యింటికి వెళ్తూంటే అతనేం చేశాడో తెలుసా?

నేనా డబ్బుని అతని జూదానికివ్వనని ఊహించి .. తోవలో . ఒకవింత నుయ్యి చూబిస్తానని ఒక అగాధం చూబిస్తూ. నేను తొంగి చూస్తూంటే నాకాళ్లెత్తి నన్నందులోకి తోసేశాడు డబ్బంతా పట్టుకుని పోయాడు. దుష్టులు చేయరాని దుర్మార్గమేముంటుంది?

ఆ అగాధంలో పడుతూంటే దైవకృపవలన ఒక మఱ్ఱిమొక్క నాచేతి కందింది దాని ఆధారంతో - నీటిలో మునగక తేలి ఉన్నాను అంతలో బాటసారులెవరో నీటికోసం వచ్చి. నూతిలోని నన్ను చూసి తాడు, కఱ్ఱలు నూతిలో దింపి నన్ను బయటకు లాగారు. నాగురించి తెలిసికొని నన్ను మా తండ్రి కప్పగించారు

నా తండ్రి చాలా విచారించి - 'ఏమయింది?" అని అడిగాడు.

నిజం చెబితే నాకాపరం చెడుతుందని - "అడవిలో దొంగలు దోచుకుని మీ అల్లుణ్ణి తరిమేసి నన్ను నూతిలో పారేసి పోయారు." అని అబద్ధమాడాను. కొన్నాళ్ళుండి -

నా మగని దగ్గరకు వెళ్తాననగానే నా తండ్రి మళ్ళీ డబ్బిచ్చి పంపాడు. ఇంటి ముందు నేను పల్లకీ దిగుతూంటే చూసి అతను విభ్రాంతుడయ్యాడు నేను నమస్కరించి లోపలికి వెళ్ళాను నన్నవమానపరచి తీసికున్న ధనమంతా అప్పటికే జూదంలో ఓడిపోయాడు. ఎప్పటికైనా బుద్ధొస్తుందేమో అని కొంచెం చొప్పున ధనసహాయం చేస్తున్నాను.

నేనింటి వద్దనుంచి ఎక్కువ తెచ్చాననీ, తనకివ్వడం లేదనీ భావించి ఆ దుర్మార్గుడొక రాత్రి నేను నిద్రపోతూంటే నాగొంతు నలిపి చంపేశాడు అదృష్టవశాత్తూ, పూర్వజన్మ జ్ఞానంతో యిలాటి ఉత్కృష్టమైన పుట్టుక పుట్టాను.

మగజాతంటేనే దుర్మార్గులూ దుష్టులూ ఇంకెప్పుడేనా మీరు నాముందు పురుషుల ప్రస్తావన తెచ్చారో తీవ్రంగా శిక్షిస్తాను." అని ముగించింది.

బొమ్మని చూసే మోహించిన విక్రమసింహుడు నిజమయిన ఆమెను చూసేసరికి వివశుడై పోయాడు బహుశ్రుతుడు పురుషద్వేషిణి మాటలు జాగ్రత్తగా విన్నాడు రాజకుమారుణ్ని చెట్టుదింపించి - ఆసాయంకాలానికి పురుష ద్వేషిణి ఉండేఊరుచేరి - ఒక పూటకూళ్ల పెద్దమ్మ యింట బస చేశారు ఆమె విశేషాలడుగగా వారికి పురుషద్వేషిణి గురించి చెప్పింది

వాళ్ళు తమవద్దనున్న మణిమాణిక్యాలన్నిటినీ రొక్కంగా మార్చి సమీపంలో ఒక విశాలమైన కాళీజాగా తీసుకుని అక్కడొక పట్నాన్నీ కోటనీ నిర్మింపజేసి – కాపురం ఉండడానికి ఉచితంగా గృహాలనిచ్చారు. విక్రమసింహునకు వనితాద్వేషి అనిపేరుపెట్టి, అతనినాపురానికి రాజును చేసి, సైన్యాన్ని సమకూర్చుకుని రాజచిహ్నాలతో పాలించ జేశాడు. అతన్ని సింహాసన మెక్కించిననాడే – ఆపురమును వనితాద్వేషి పరిపాలిస్తున్నాడనీ, రాజు ప్రతిదినమూ ఉదయమున కేళీ సరోవరమున కేగుననీ, అప్పుడు స్త్రీ లెవ్వరూ బయటకు రాకూడదనీ వచ్చిన వారు శిక్షించబడెదరనీ ప్రకటన పత్రికలను ఆవూరిలోనే కాక పురుష ద్వేషిణి ఊరిలోని గోడలమీద కూడా అంటించారు.

పురుష ద్వేషిణి బయలుదేరువేళకే వనితాద్వేషి, సైన్యముచుట్టూ ఉండగా "స్త్రీలు దూరంగా పోవా"లంటూ చాటింపువేయిస్తూ కొంతసేపా సరోవరంలో జలకాలాడి వస్తున్నాడు పురుషద్వేషిణి విహారసరస్సు కావూరిమీదుగానే పోవాలి. అచాటింపు విని మరో తోవను పోయేది. పురుషులు రాకూడదనీ, స్త్రీలు రాకూడనీ రెండు చాటింపుల వల్ల ప్రజలు బాధపడలేక ఆవూరి రాజుగారితో యిలా మొరపెట్టుకున్నారు. "మహారాజా. ఇదివరకే తమకూతురు స్నానానికి వెళ్ళేటప్పుడు మగవారు చేస్తున్న పనిని వదిలి వెళ్ళవలసివచ్చేది. ఇప్పుడు పులిమీద పుట్రలా స్త్రీలను కూడా బయటకు రానివ్వడం లేదు. అంచేత యిక్కడ స్త్రీలూ పురుషులూ కూడా ఉండలేకపోతున్నారు. మాబాధ తీర్చకపోతే మేము మరో చోటుకి పోతాం " అని వాపోయారు.

అందుకు రాజు – "అతని విపరీతపు చర్యల గురించి యిది వరకేవిన్నాం మీబాధలు తీరుస్తాను వెళ్లిరండి." అని వారిని పంపించి వనితా ద్వేషికొక ఉత్తరం రాసి పంపాడు

దానికి – 'మా వనితాద్వేషి మహారాజుగారి నక్కడికి దయచేయమని ఆహ్వానం పంపినందుకు చాలా సంతోషం. మారాజుగారి వృత్తాంతం మీకిదివరకే తెలుసుంటుంది. వీరువచ్చునప్పుడు కాని మీ

సభలోకాని స్త్రీలుండకూడదు అలా ఏర్పాటు చేసి తెలియపరచిన వెంటనే మారాజుగారు రాగలరు.' అని జబాబు రాసి పంపాడు అంతేకాక బహుశ్రుతుడు విక్రమసింహుడికి కొన్ని రహస్యాలు బోధించాడు

ఆవింత చూడడానికెందరో వచ్చారు. చెలికత్తెల ద్వారా వనితాద్వేషి గురించి విన్న పురుషద్వేషి కూడా రహస్యస్థలంలో కూర్చుంది

రాజుగారి ఆదేశంప్రకారం ఆయనమంత్రి బహుశ్రుతునితో – "ఆర్యా. సృష్టికర్త తనశరీరంలో ఎడమ భాగాన్ని స్త్రీగానూ కుడిభాగాన్ని పురుషుడిగానూ చేశాడు ఆజంట వలనే ప్రజావృద్ధయింది త్రిమూర్తులు తమ భార్యలను శరీరంలోనే ఉంచుకున్నారు. దీనిని బట్టి ప్రతి పురుషుడికీ భార్య ఉండాలని స్పష్టమౌతుంది. మీరాజుగారు స్త్రీజాతియందు పగపట్టుటకేమి కారణమో తెలియడంలేదు. ఆవివరం చెప్పండి " అన్నాడు విక్రమసింహుడు అప్పటికే చెవులు మూసుకున్నాడు. అతన్ని శాంతపరచి బహుశ్రుతుడు "మారాజు స్త్రీ ప్రసంగం సహింపడు ఆయన స్త్రీ ద్వేషానికి కారణం ఎంతడిగినా చెప్పలేదు కాని, ఇందరడుగుతూంటే చెప్పకపోడం భావ్యం కాదు ' అని విక్రమసింహుని వేపు తిరిగి – "దేవా! ఎలాటి రహస్యమైనా పెద్దలు పదిమంది అడిగినప్పుడు చెప్పవలెనని బృహస్పతి నీతి వీరు మిమ్మల్ని వ్రతానికి కారణమడుగుతున్నారే తప్ప వనితా ద్వేషవ్రతం మానుకోమనడం లేదు. దయచేసి చెప్పండి. అన్నాడు భయంనటిస్తూ

చిట్టచివరకి విధిలేక తనవ్రతం గురించి చెప్పసాగాడు వనితాద్వేషి. ' నేను చెప్పబోయేది వింటే నావనితా ద్వేషము సమంజసమే అని మీకనిపించక మానదు పూర్వజన్మలోనేనొక వర్తకుని కుమారుడను నాకు యుక్తవయసు వచ్చినప్పుడు ఎంతోమంది తమకన్యకలను వరదక్షిణతో యిస్తామని వచ్చారు కాని రూపమునకు ఆశపడి ఒక వర్తకుని కూతురయిన రత్నాంగిని వివాహమాడాను

పెళ్లయిన కొద్దికాలానికే అదికావరానికొచ్చింది భార్యారూపవతీ శత్రుః అన్నట్లు దాని చక్కదనమే నాదుఃఖానికి మూలమయింది ఎన్న నీతులు చెప్పినా అది తన దుర్గుణములు

మానుకోలేదు. నాకు వివాహం జరిగిన కొద్ది కాలంలోనే నాతల్లితండ్రులు మరణించారు. కనక ఇంటి పెత్తనం దానిదే అయింది. అది సొమ్మంతా దుర్వ్యయం చేసి స్వల్పకాలంలోనే నన్ను అప్పులపాలు చేసింది.

నేనెంత చెప్పినా వినకుండా ఒకనాడది పుట్టింటికి పోతాననే సరికి అపకీర్తి భయంతోనేనూ దాని వెంట వెళ్లాను. తోవలో నేనొక నూతిలో తొంగిచూస్తూంటే అది నన్ను బలాత్కారంగా అందులోకి తోసేసిపోయింది. దైవానుగ్రహంవల్ల ఒక మర్రిమొక్క నాచేతి కందింది. దానిని పట్టుకుని నూతిలో తేలుతూంటే ఎవరో పుణ్యాత్ములు నన్ను రక్షించారు. నేనత్తవారిల్లు చేరాను.

నన్ను చూడడంతోనే విభ్రాంతి చెందిన ఆమెను నేనేమీ జరగనట్లే పలకరించి మంచి మాటలతో దానిదిగులు పోగొట్టాను. దాని చెడుగుణాలు సహించి కొన్ని దినాలున్నాను.

ఒకనాడు నేను నిద్రిస్తూండగా అది నాగొంతునరికి చంపేసింది. నేను నీతి మార్గాన బతికిన వాడిని కనక బలవన్మరణం పొందినా యీ జన్మలో రాజుగా జన్మించాను. ఆ జన్మలో అన్నిపాట్లు పడ్డాను కనుకనే యీ జన్మలో స్త్రీ అంటే అంత ద్వేషం అందుకే వనితాద్వేషవ్రతం."

ఆమాటలన్నీ గోడచాటునుండి వింటున్న రత్నాంగి తటాలునలేచి సభలోకి వచ్చేసి, అందరూ ఆశ్చర్యపోతుండగా విక్రమసింహుని చూస్తూ "ఏం చెబుతున్నావు! ఏమీఎరుగరని వీరితో అబద్ధాలాడుతున్నావే నువ్విప్పుడు చెప్పిన ఘోరకృత్యం చేసింది నువ్వే ఇక మాట్లాడకు –" అని గద్దించగా

విక్రమసింహుడు కళ్లెర్రజేసి – "ఓహో రత్నాంగీ నువ్వు మళ్లీ తటస్థ పడ్డావా! గద్దించినంత మాత్రాన నిన్ను ముద్దరాలనుకుంటారా? అలాటి క్రూరకృత్యం నువ్వు చేయక నేను చేశానా? ఎంతదుర్మార్గుడైనా మగవాడలాటి పని చెయ్యడు. స్త్రీలకే అలాటి సాహసమని గ్రంథాలే చెబుతాయి." అన్నాడు.

అందుకామె 'బొంకులు పలికే వాళ్లకి సాక్ష్యాలు కొదువా? సాక్ష్యాలు చూబించి నిందపోగొట్టుకుందామనుకున్నారేమో, అదేమీ కుదరదు. నేరం ఒప్పుకుని మరీ మాట్లాడండి " అంది గట్టిగా

"గడుసుతనం చాల్లే నీ మాటలకి మోసపోయే వారెవరూ లేరు నువ్వే నేరం ఒప్పుకో."

అలా యిద్దరూ కుక్కల్లా పోట్లాడుకుంటూంటే రాజు మొదలయిన వారందరూ ఆశ్చర్యంగా చూడసాగారు.

అప్పుడు బహుశ్రుతుడు నువ్వతూ – ఓహో మీవ్రతాలు చక్కగానే ఉన్నాయి.. ఊరికే ఎందుకు పోట్లాడుకుంటారు? మీపోట్లాటకు కారణం చెప్పండి." అన్నాడు

పురుషద్వేషిణి సభనుద్దేశించి – 'పూర్వజన్మలో యితడు నామగడు. తాను చేసిన నేరాలన్నీ నామీద తోసి అబద్ధం చెబుతున్నాడు ఆరత్నాంగిని నేనే నిద్రపోతూండగా బలవంతంగా చంపాడు. అందుకే యీ జన్మలో నేనీవ్రతం పట్టాను.' అంది

'ఆర్యులారా! పూర్వజన్మలో యీమె నాభార్య నన్ను బలాత్కారంగా చంపింది యిదే. తాను చేసిన నేరములు నామీదకి తోస్తూంది. దీని మాటలు నమ్మకండి " అన్నాడు విక్రమసింహుడు

ఆ యిద్దరి మాటలూ విని .సభ్యులేమీ చెప్పలేక పోయారు. అప్పుడు బహుశ్రుతుడు లేచి "వీరు పూర్వజన్మమందు దంపతులు. బలవన్మరణం చెందారు. ఇవివారే చెప్పారు కాని నిజంగా అపరాధం ఎవరు చేశారో తెలుసుకోడం మనతరం కాదు అపరాధం ఎవరు చేసినా, పూర్వజన్మ వైరాన్ని తలుచుకోకుండా యీ జన్మలో అనురాగంతో మెలగడమే దానికి నిష్కృతి అని నాకు తోస్తూంది ఇందుకు వీరంగీకరిస్తే బాగుంటుంది " అన్నాడు

విక్రమసింహుడ్ని చూసినప్పటినుంచీ అతని మీద అనురాగం పెంచుకున్న పురుషద్వేషిణి తనకంగీకారమే అని తండ్రికి సూచించింది.

'మాఅమ్మాయి ఒప్పుకుంది మీరాజుని అంగీకరింప జేయండి. ' అంటూ రాజు బహుశ్రుతుడి వైపు చూశాడు

ఆమె సిగ్గుతో అంతపురానికి వెళ్లిపోయింది

"మారాజు సులభంగా ఒప్పుకోడు ఇంటి దగ్గర నేను ఒప్పిస్తాను. నాదిపూచీ, అన్నాడు బహుశ్రుతుడు

వారి వివాహానికందరూ సంతోషించారు ఊరివారు కూడా తన బాధ తగ్గిందని యింట్లో పెళ్ళయినంత ఆనందించారు అంతకు మునుపు తానెంత చెప్పినా వినని కూతురు పెళ్లికొప్పుకున్నందుకు రాజు సంతోషానికి మేరలేదు

శుభముహూర్తంలో వనితా ద్వేషికీ పురుష ద్వేషిణికీ వివాహం జరిగింది. వారిద్దరూ కొంతకాలం ఆనందంగా గడిపాక – బహుశ్రుతుడి సలహాపై ఆమెనూ చతురంగబలాలనూ వెంట బెట్టుకుని మిత్రునితో కూడా స్వదేశానికి వెళ్లి విక్రమసింహుడు రాజ్యసుఖాలనుభవించాడు ఇదీ, యీ చిత్రపట వృత్తాంతం అని ఆ కథ ముగించాడు మణిసిద్ధుడు

# కాశీ మజిలీ కథలు

## 7. వ మజిలీ

### 18. కృష్ణదేవరాయల కథ

ఎనిమిదో మజిలీలో గోపకుమారుడు భోజన సామగ్రి తేడానికి అంగడికి పోతూ తోవలో ఒకయింట్లో అద్భుతమయిన ఒక విగ్రహాన్ని చూశాడు. సామగ్రి సంగతి మరిచిపోయి వచ్చి దానికధేమిటని అడిగాడు

మణిసిద్ధుడు – "నీకింత కథల పిచ్చేమిటి? సామగ్రి తీసుకురా భోంచేసి, ఆవిగ్రహంకథ చెప్పుకుందాం ' అని తిరిగి పంపించాడు

ఆంధ్రదేశానికధిపతి అయిన నరసింహదేవరాయలు ధర్మంగా రాజ్యం చేస్తూంటే – అతని ప్రధాని మరణించాడు సమర్థుడయిన మంత్రికావాలని దేశ దేశాలుచాటింపించాడు ఎందరో బుద్ధిమంతులు వచ్చి ఆ ఉద్యోగం తమకిమ్మన్నారు కాని వారెవరూ ఆయనకి నచ్చలేదు భంగపడినందున బుద్ధిశాలురకు కళంకం వొస్తూండడంతో యిక ఎవరూ రావడంమానేశారు మంత్రిలేక భారమెక్కువైనా సరే భరించాడు కానీ అల్పబుద్ధికి మాత్రం ఉద్యోగం యివ్వలేదు.

ఒకనాడతడు తీవ్రంగా ఆలోచించి ఒక కాగితంమీద నాలుగంగుళాల గీత గీసి పరిచారకులను పిలచి – "ఈకాగితమును ప్రతివూరూ తీసుకెళ్లి అందరికీ చూబిస్తూ యీగీతని చెరపకయే చిన్నదిగా చేయగలరా అని అడగండి అలా చెయ్యగలిగిన వారిని పల్లకీ ఎక్కించి నావద్దకు తీసుకురండి –" అన్నాడు

వాళ్ళా పత్రాన్ని పట్టుకుని ఎన్నోవూళ్లు తిరిగి ఎందరికో చూబించారు. ఎవరూ అలా చేయలేక పోడమేకాక – "మీరాజుకి మతిలేదు. చెరపకుండా గీత చిన్నదెలా ఔతుందీ?" అని పరిహాసం చేశారు తమకి తెలియనివి ఉండవనే అనుకుంటారు కదా మందమతులు?

ఒకనాడా పత్రాన్నందరికీ చూబిస్తూ బడిలో పిల్లలకు చదువు చెబుతున్న ఉపాధ్యాయునకు కూడా రాజభటులా పత్రం చూబించారు "ఈ గీతను చెరపకుండా చిన్నది చేయగలరా?' అని అడిగారు

'అలా చేయడానికి నా దగ్గర గారడీ లేదు." "అనేశాడా ఉపాధ్యాయుడు , వాళ్ళు వెళ్ళిపోబోతూంటే తిమ్మరుసను పదహారేళ్ల బాలుడు "ఏమిటి?" అని ఉపాధ్యాయుడినడిగాడు అయన ఆగీత గురించి వివరించగా "నేను చేస్తాను " అన్నాడు రాజభటులు పత్రం పట్టుకుని అతనివద్దకు వచ్చారు

"ఈపాటిపనికే యింత దూరం రావాలా? ప్రపంచమంతా బుద్ధిలేనిదేనా?' అంటూ ఆగీత పక్క మరొక పెద్ద గీత గీశాడు. దాంతో మొదటి గీత చెరపకుండానే చిన్నదైపోయింది రాజభటులు ఎంతో సంతోషించి – రాజశాసనము చెప్పి – 'పల్లకీ తెప్పిస్తాము రండి అన్నారు.

ఆ ఉపాధ్యాయుడు తిమ్మరుసు తెలివితేటలను మెచ్చుకుని 'రాజు నీకు గొప్ప బహుమాన మివ్వగలడనిపిస్తూంది. నువ్వునాకు శిష్యుడివి శిష్యుడి విద్యాగౌరవం గురువుదే నువ్వు చేసిన పని నేను చేశానని రాజుతో చెబుతాను నాకు మంచి పారితోషికం లభిస్తుంది రాజభటులకి లంచమిచ్చి వొప్పించగలను ' అన్నాడు

"అయ్యా! దీనికి నన్నింత బ్రతిమాలవలెనా? ఇదంతా మీ అనుగ్రహమే కదా? అన్నాడు తిమ్మరుసు. రాజభటులను వొప్పించి తగిన వేషం ధరించి ఆ ఉపాధ్యాయుడు రాజుగారి వద్దకు వెళ్ళాడు.

రాజు తగిన మంత్రి దొరికాడని సంతోషిస్తూ – పల్లకీలో కూర్చున్న ఉపాధ్యాయుడి రూపం చూసే బుద్ధిమాంద్యం గ్రహించినా –

పరీక్షించి చూద్దామని సభలో పీఠంమీద కూర్చోబెట్టి "ఈ గీతను యిట్లు చేసిన వారు మీరేనా?" అని అడిగాడు

ఉపాధ్యాయుడు భయపడుతూ "నేనే, నేనే" అన్నాడు ఆ కంఠంబట్టి కూడా అతను తెలివైన వాడు కాదని గ్రహించిన రాజు "అయ్యా మీ బుద్ధి చాతుర్యానికి మరో పరీక్ష పెడతాను అది మీరు నెగ్గితే - యిది మీరే చేసినట్లు నమ్ముతాను" అంటూ మంత్రి ముద్రికలను మధ్యనుంచి చుట్టూ పరుపులు పరిపించి - "పరుపు తొక్కకుండా ఆముద్రికలు తెచ్చుకోండి" అన్నాడు

ఉపాధ్యాయుడికే ఉపాయమూ తోచలేదు గడగడ వణుకుతూ - "రాజా నేను బ్రాహ్మణుడను కుటుంబము కలవాడను శిక్షింపక వదిలేస్తానంటే యదార్థం చెప్పేస్తాను" అన్నాడు.

రాజు నవ్వుతూ "అలాగే" అన్నాడు

"అయ్యా ఈ గీతనేను గీయలేదు. నావిద్యార్థి తిమ్మర్సనేవాడు గీశాడు. అతనిని పిలిపిస్తే మీరు చెప్పింది చేయగలడు"

రాజు తిమ్మర్సును బహుమానమిచ్చి రప్పించగా "నాగురువు గారి ప్రభావం వల్లనే ఆ గీత చిన్నదయింది" అని చెప్పాడు అప్పుడు రాజు పరుపులు తొక్కకుండా మంత్రి ముద్రికలను తెమ్మనగా పరుపులు చుట్టుకుంటూ పోయి - వాటిని తొక్కకుండానే తెచ్చాడు ఆనాటినుంచీ తిమ్మర్సు వారి ఆస్థానానికి మంత్రయ్యాడు

గోపాలా నరసింహరాయలుకు కృష్ణదేవరాయలు జన్మించిన కథనీవిదివరకు విన్నావు కదా వృద్ధరాజు గతించడంతోనే కృష్ణదేవ రాయలు రాజయ్యాడు అతనికి రాజుగా ఎంతకీర్తి ఉన్నా దాసీపుత్రుడనే కళంకం కూడా ఉంది రాజులెవరూ తమకన్యక నిస్తామని రాలేదు అందుచేత అతను చాలకాలము పెళ్లికాకనే మిగిలాడు.

ఒకనాడు కళానిధి అను బ్రాహ్మణుడొచ్చి తన విద్వత్తుతో రాయలను మెప్పించగా - "మీరనేక దేశాలు తిరిగి ఉంటారు ఎక్కడేనా పాండిత్యం కల స్త్రీలను చూశారా?' అని అడిగాడు

'కుంతల దేశానికి రాజధానయిన గోపాలపురాన్ని గోపాలుడను రాజు పాలిస్తున్నాడు అతని పుత్రిక కళానిలయ. కళలకూ విద్యకూ నిలయమైన ఆమెకిప్పుడు పదహారేళ్లు ఏ రాజకుమారుడొచ్చి అడిగినా తనకి తగిన వాడుకాదని వివాహమాడకున్నది.

పండితులయిన బ్రాహ్మణులకు మాత్రమే దర్శనమిస్తూ ఏ విద్యయందెంత పాండిత్యం కలవాడినయినా ఓడించి జయపత్రిక తీసుకుంటుంది. ఆమె అందం దేవకన్యలకి కూడా ఉండదు ఆమెను మీకు కూర్చిన నాడే బ్రహ్మ.

పండితరాయలని బిరుదు పొందిన నేను కూడా ఏ విద్యయందునూ ఆమెతో సమానంగా మాట్లాడలేక జయపత్రిక నిచ్చి వచ్చుచున్నాను. " అని చెప్పాడు

కృష్ణదేవరాయలు కళావతి గురించి వినడంతోటే ఆమె మీద మనసుపడ్డాడు

పండిత రాయలను సత్కరించి పంపి - తన దర్శనమునకై మరికొందరు పండితులు రాగా కళావతి గురించి వారిని అడిగాడు. వారు ఆమె గురించి పండితరాయల కంటే ఎక్కువ చెప్పారు ఆమె మీది వలపుతో అతడు క్షీణించ సాగాడు

తిమ్మర్సు ఆయన అవస్థను చూచి కారణమడుగగా - రాయలు అంతా చెప్పి "ఆమెతో పెళ్ళి చేయకపోతే త్వరలోనే ప్రాణాలు విడుస్తాను " అన్నాడు.

తిమ్మర్సు నవ్వుతూ . ." రాజా నీ కోరిక అసాధ్యంగా ఉంది. ఆ గోపాలుడు అధికారంలోనూ సంపదలోనూ మనకంటె అధికుడు మీకు దాసీ పుత్రుడను కళంకముంది అతను తన కూతురిని మీకెలా యిస్తాడు?" అన్నాడు

కృష్ణ దేవరాయలు నిట్టూర్చుతూ - "ఇదా మీరు చెప్పేది? లోకాతీతుడైన మిత్రుడున్న నాకేంలోటు? నాకార్యమెలాగైనా చేయగల వనుకుంటే - యిలాటి పిరికి మాటలు చెబుతున్నావా. నేను సామాన్య

స్త్రీని పెళ్ళాడను కళావతి నిచ్చి పెండ్లి చేయించావా సరే, లేకపోతే సన్యాసినై పోతాను. రాజ్యం నువ్వే చూసుకుందువు గాని –" అన్నాడు నిష్ఠూరంగా

అందుకు తిమ్మర్సు – "చిన్నపనికే అంత పెద్ద మాటలు మాట్లాడాలా? ఒకస్త్రీకోసం ఎక్కువ ప్రయత్నమెందుకని అలా అన్నాను కాని నీకోరిక అంత ప్రగాఢ మయినచో తీర్చక ఉందునా? బుద్ధిమంతుడు తక్కువ పలికి ఎక్కువ చేయును నాసామర్థ్యమంతా వినియోగించి ఆమెను నీకు కూర్చుతాను కాని దైవం ప్రతికూలించి ఒకవేళ కార్యం సఫలం కాకపోతే ఘోరప్రతిజ్ఞ చేయకూడదు నీకామెను చూబించడం వరకూ నేను శపథం చేస్తున్నాను అన్నాడు

"నువ్వు తలుచుకుంటే కార్యం సఫలం కాకపోవడమనేది ఉండదు ఒక్కసారామెను కన్నులారా చూసినాచాలు " అని రాయలు తొందరపెట్టాడు.

"ఆమె చాలా తెలివైనదని విన్నాం ఆమెని చూడాలంటే బ్రాహ్మణవేషాలు ధరించాలి నిన్ను బ్రాహ్మణవేషం వేయమని ఎలా చెప్పేది? '

"బ్రాహ్మణులు సర్వోత్కృష్టులు వారివేషం వేయడానికేం? బైరాగివేషమైనా వేస్తాను " ఒక శుభముహూర్తంలో వారు పట్నంవదలి బ్రాహ్మణ వేషాలలో కాపిల్యమను వూరు చేరి సోమశర్మ అన్నదాత అని తెలిసికొని వారింట బస చేశారు అయిల్లాలు వారికి వండిపెట్టింది రాజు గారి పురోహితుడయిన సోమశర్మ యింటికి వచ్చినా అతను అతిధులను పరామర్శింపక ఒక గదిలో పడుకుని విచారించసాగాడు.

భర్తనొచ్చి అతిధులతో భోజనం చేయమని యిల్లాలు పిలువగా "నాస్నేహితుడయిన మంత్రి రేపురితీయబడబోతూంటే నాకు నోటికన్నమెలా వెళ్తుంది?" అన్నాడు విచారంగా. "ఇవేళ మంత్రి..రేపు నేనేమో? అవివేకపు రాజును కొలవడం కంటె ముష్టెత్తుకోడం మేలు. రాజుకి చెప్పడానికి తిమ్మర్సెక్కడెక్కడున్నాడు?"

ఆ మాటలు విన్న తిమ్మర్సు వాని వద్దకు వచ్చి - "యజమాని భుజించకుండా మేము భుజించే వారంకాము. మరియు మీమాటలలో తిమ్మర్సు ప్రస్తావన వచ్చింది మీరు తిమ్మర్సు నెరుగుదురా?" అని అడిగాడు.

"అయ్యా నేను వారినెన్నడూ చూసి ఉండలేదు తిమ్మర్సు కృష్ణదేవరాయల మంత్రి అనీ, ముల్లోకాలలోనూ అతనికి సమానుడైన బుద్ధిమంతుడు లేడనీ, అతని చర్యలను కథలుగా చెప్పుకోడం విన్నాను మొన్న మారాజు, మంత్రికి మూడు ప్రశ్నలిచ్చి నాలుగోనాటికి జవాబులు చెప్పనిచో ఉరితీయిస్తానన్నాడు ఇలాటి ప్రశ్నలకు తిమ్మర్సే చెప్పగలడను కొంటిమి కాని - వారి వద్దకు వెళ్లి వచ్చుటకు వ్యవధి లేదు. రేపే నాలుగోరోజు. మంత్రి నాకు ముఖ్య స్నేహితుడు. మీరు భుజించండి నేను తినలేను ' అన్నాడు సోమశర్మ.

అప్పుడు రాయలు - "అయ్యా! ఇతను తిమ్మర్సుకు ప్రాణమిత్రుడు బుద్ధిలో అతనితో సమానుడే. ఆ మూడు ప్రశ్నలూ చెప్పినచో యితను సమాధానములు చెప్పును మీ పుణ్యం బాగుంది మీమంత్రి ప్రాణంఇతడు కాపాడగలడు " అన్నాడు.

అప్పుడతను ప్రశ్నలు చెప్పాడు.

1 ఎప్పుడూ భగవంతుడేం చేస్తూ ఉంటాడు?

2 నక్షత్రముల సంఖ్య ఎంత?

3 భూమికి నడిమి భాగమేది?

ఇవీ రాజిచ్చిన ప్రశ్నలు. మంత్రికి ఒక్క ప్రశ్నకీ జవాబు తెలియదు భార్యబిడ్డలు చుట్టూ చేరి ఏడుస్తూంటే మంత్రి విచారంగా కూర్చున్నారు అది చూడలేక నేనింటి కొచ్చాను

మీరు వీటికి జవాబులు చెప్పి మంత్రి ప్రాణాలు కాపాడారో మీ అంత పుణ్యాత్ముడుండడు -" "అయ్యా నేను జవాబులు చెబుతాను

భోజనం చేశాక మీ మంత్రి నొకసారి తీసుకురండి ' అని తిమ్మర్సు అనే సరికి సోమశర్మ చాలా సంతోషించి - భోజనం చేశాక మంత్రిని తీసుకొచ్చాడు

మంత్రి తనకొచ్చిన ఆపద చెప్పాక తిమ్మర్సు - "రాజు మిమ్మడిగిన ప్రశ్నలకు సమాధానాలు మాటలతో చెప్పదగినవి కావు. క్రియలో చూబిస్తాను - అని 'రేపు రాజు అడిగినప్పుడు -

'తమ ప్రశ్నలు త్రిలోకాలలోనూ ఎవరూ చెప్పలేనివి వాటికి జవాబులు సామాన్య లౌకికుడగు నాకు సాధ్యపడక అందుకు ఒక విప్రుని నియమించితిని అతను సమాధానము లివ్వగలడు తమ సెలవయితే అతన్ని పిలిపిస్తాను' అనండి మిగిలింది నేనే చూసుకుంటాను ' అన్నాడు.

మంత్రి అలాగే అని ఆనందంగా వెళ్లాడు

మర్నాడు రాజు సభ తీర్చాడు మంత్రి చేసిన విన్నపాన్నంగీ కరించగా బ్రాహ్మణుడు పిలిపించబడ్డాడు

'నా ప్రశ్నలకు సమాధానము లీయగలవా? అని అడిగాడు రాజు. ' మీప్రశ్నలు చెప్పండి అన్నాడు తిమ్మర్సు రాజు ప్రశ్నలు చెప్పాడు

'మీ ప్రశ్నలు సామాన్యమైనవి కావు ఒకే రోజున మూడింటికీ జవాబులివ్వడం అసాధ్యం రోజుకొక ప్రశ్నకు చెబుతాను ఇవాళ ఏ ప్రశ్నకు సమాధాన మివ్వాలో సెలవివ్వండి '

"అలాగే ఈరోజు - భగవంతుడు నిరంతరమూ ఏం చేస్తూంటాడు? '

తిమ్మర్సు లేచి నిలబడి - "రాజేంద్రా. సకల లోక నిర్మాణ రక్షకుడు, సచ్చిదానంద స్వరూపుడు అగు భగవంతుని దినచర్య చెప్పుట సామాన్యం కాదని అందరికీ తెలిసిందే భగవంతుని అంశతో జన్మించిన మీ అలంకారాలు నాకిచ్చి, నాబట్టలు మీరు కట్టుకుని మీ సింహాసనం మీద నన్ను కూర్చోబెట్టి నా ఎదుట మీరు నిలబడితే అప్పుడు భగవంతుని చర్యలు చెప్పుటకు నాకర్హత కలుగుతుంది " అన్నాడు

రాజు అతను చెప్పినట్లే చేశాడు అప్పుడు - సింహాసనం మీద కూర్చున్న తిమ్మర్సు రాజా! ఇంతకు మునుపు నేనెట్లుంటిని, నువ్వెట్లుంటివి? ఇపుడెలా ఉన్నాం? సామాన్య విప్రుడినైన నేను కిరీటం మొదలైన అలంకారాలూ, దివ్యాంబరాలూ దాల్చి ప్రజాపాలన చేసే మహారాజు నయ్యాను పూర్వం మహారాజయిన మీరిప్పుడు సామాన్య బ్రాహ్మణులయ్యారు

భగవంతుడు నిరంతరమూ యిలాగే గొప్పవానిని తక్కువ గానూ తక్కువ వానిని గొప్పవాడిగానూ చేస్తుంటాడు

సముద్రాన్ని దిబ్బగానూ దిబ్బను సముద్రంగానూ, అణువును మేరువుగానూ మేరువునణువుగానూ గడ్డిపరకని వజ్రంగానూ వజ్రాన్ని గడ్డిపరకగానూ, మంచును అగ్నిగానూ, అగ్నిని మంచుగానూ చేసే బగవంతుని కనేక నమస్కారములు ఇదే బగవంతుని దినచర్య "అన్నాడు

అతని సమాధానానికీ యుక్తికీ రాజుతో సహా అందరూ సంతోషించారు రాజు తన కిరీటం, బట్టలూ అవీ తీసికొని మంత్రితో తిమ్మర్సుని బసకు పంపాడు.

మర్నాడు రాజు - 'నక్షత్రముల సంఖ్య ఎంత?' అని అడిగాడు. బ్రహ్మణ వేషంలో ఉన్నతిమ్మర్సు తన వొడిలో ఉన్న యిసుకను రాజు ముందర రాశిగా పోసి - 'రాజా నేను ఒక్కొక్క చుక్కకూ ఒక్కొక్క యిసక రేణువు చొప్పున వొడిలో వేశాను నక్షత్రాలీ యిసుక రేణువులన్ని" అన్నాడు

ఆ సమాదానానికి సభలోనివారు రాజు ప్రశ్నకు తగ్గట్లే జవాబిచ్చాడు ఈ బ్రాహ్మడసాధ్యుడే అనుకున్నారు రాజు ఏమీ అనలేక ఆ జవాబుకు అంగీకారం తెలిపాడు

మూడోనాడు మంత్రితో ఒక చోట స్థంబం పాతించమని చెప్పి - తాను సభకాలస్యంగా వచ్చాడు రాజు అతనిరాకకెదురు చూస్తూ - "ఎందుకింత ఆలస్యం చేశావు? నీకు వేళ తెలియదా? భూమికి మధ్యభాగం ఏది? అని అడిగాడు

"భూమి అనంతంకదా? దానిని చూపడానికి మంత్రశక్తి కావలసి దేవతనారాధించడంలో ఆలస్యమయింది క్షమించండి భూమి మధ్యభాగం చూడాలంటే దేవరవారు నాతో నడచిరావాలి మరెవరూ రాకూడదు " అన్నాడు తిమ్మర్సు

రాజు అతనితో నడవసాగాడు.

ఎండలో యిసక తోవలలో నడిపిస్తూంటే రాజుకి కిందకాళ్లూ, పైన నెత్తీ మాడుతూ అలసటా ఆయాసమూ వచ్చాయి. మరికొంత దూరం నడిచాక ఒగర్చ "నేనింక నడవలేను చాలా శ్రమగా ఉంది " అన్నాడు

"దగ్గర కొచ్చేశాం ఆమాత్రం నడవలేరా? అంటూ తిమ్మర్సు అతన్ని నడిపించసాగాడు

'ఒకింతసేపు విశ్రాంతి తీసుకోనీ." అడిగాడు రాజు.

'విశ్రమిస్తే నామంత్ర శక్తి కంతరాయం కలిగి మనం యింటికి చేరలేము. భూమి నాభిసులువుగా కనిపిస్తుందా?" అంటూ విప్రుడు నడవసాగాడు మరికొంతదూరం నడిచాక –

"నన్ను చంపేయదలుచుకున్నవా ఏం? భూమి నాభి చూచించక్కర్లేదు కానీ నాకింత దాహమిచ్చి యింటికి చేర్చు, నీకు పుణ్యముంటుంది ఇంటి కెళ్లాక నీకు మంచి పారితోషిక మిస్తాను." అంటూ రాజు బతిమాలసాగాడు

అప్పుడు తిమ్మర్సు – 'ఇంత అశక్తుడివి, యిలాటి కోరిక కోరడమేమిటి? ఇల్లు చేరడం సులభంకాదు. పదిరోజులు పడుతుంది. రావడమైతే మంత్రశక్తి వల్ల త్వరగా వచ్చేశాం మంత్రశక్తిని వదిలితే క్రూరమృగాలు చంపేస్తాయి ఇంకెంతో దూరంలేదు " –

'అంటూ అతను రాజుని మళ్లీ నడిపించాడు ఇక నడవలేని రాజు ఒక చెట్టు నీడనుచతికిలబడిపోయి – "నాకు భూమధ్యభాగం అక్కర్లేదు చూసిన దానికంటె వెయ్యిరెట్లు సంతోషించుతున్నాను నాప్రాణాలు పోయేటట్లున్నాయి చచ్చాక నీ జవాబెందుకు? ఇంత

పానీయం తెచ్చి నన్ను బతికించు నీమేలెన్నటికీ మరవను –" అని అతని కాళ్లు పట్టుకున్నాడు.

అప్పుడు – "రాజా! ఇతరుల ప్రాణాలు కూడా నీ ప్రాణంలాటివే కదా అసాధ్యపు ప్రశ్నలు వేసి జవాబు చెప్పలేకపోతే మంత్రిని చంపించబోవడం తగునా? ఇకమీదట యిలాటి ప్రశ్నలు వేసి ప్రజలను బాధింపనని ప్రమాణం చేస్తే క్షణంలో నీ ఆపదని తొలగిస్తాను" అన్నాడు తిమ్మర్సు

రాజు – "నాకు బుద్ధొచ్చింది. ఇక మీదట ఎవరినీ యిలాటి ప్రశ్నలడగను నీమంత్ర దేవత సాక్షి." అని ప్రమాణం చేశాడు.

తిమ్మర్సు ఆప్రాంతమందే పాతించిన స్ధంబం వద్దకు తీసికెళ్లి 'ఇదుగో భూమధ్యభాగం. చూడు." అన్నాడు.

రాజు – "చూశాను చాలా సంతోషంగా ఉంది కాని ఆకలి దప్పికలతో నాప్రాణం పోతూంది. ఎలా కాపాడతావో." అన్నాడు దీనంగా.

"రాజా! చింతింపకు. నామంత్రశక్తితో ఆహారపానీయాల నిక్కడే సృష్టిస్తాను " అంటూ రహస్యంగా దాచిన వాటినొక పొదనుండి తెచ్చి అందించాడు అవి తీసికొని – ప్రాణం తేరగా .." బ్రాహ్మణోత్తమా! నీరుణమెన్నటికీ తీర్చుకోలేను నారాజ్యమంతా యిచ్చినా చాలదు. సాయంత్రం మౌతూంది. ఈ అడవిలో క్రూరమృగముల బాధ ఎక్కువగా ఉండేటట్లుంది. నీ మంత్రశక్తితో చీకటి పడక ముందే యిల్లు చేర్చు." అని ప్రార్థించాడు.

విప్రుడు తీసికొని వచ్చిన తోవనకాక నిదానంగా ఉన్న అడ్డదారిని దగ్గరలోనే ఉన్న రాజధానికి తీసుకు వెళ్లాడు. రాజు తన ప్రశ్నలకు సమాధానాలు చెప్పినందుకే కాక అడవిలో తనకి చేసిన మేలుకి కూడా అతన్ని తెగపొగిడాడు.

మంత్రికతను తన ప్రాణములు కాపాడిన దేముడిగానే తోచాడు వాళ్ళిద్దరూ అతన్ని పువ్వులతో పూజించి – "మీ కిష్టమైన కోరిక చెప్పండి. తీరుస్తాం. "అన్నారు

"నాకు మీ సంతోషంకంటె వేరే ఏమీ అక్కర్లేదు. మీయిద్దరికీ మంచివాడి నయ్యాను, చాలు మేము తీర్ధయాత్రలకి వెళ్తున్నాం సెలవివ్వండి." అని వారి మెప్పును పొంది గోపాలపురం చేరి ఒక బ్రాహ్మణునింట బస చేశారు.

ఆ గృహయజమాని వారి కాతిధ్యమిచ్చాక వారిరాకకు కారణమడుగగా – "మేము పెక్కు విద్యలలో పాండిత్యం కలవారము ఈరాజు వద్ద ఎవరైనా పండితులుంటే వారిని వాదనలో గెలిచి రాజుగారిచ్చే పారితోషికాలందుకుని కాశీ వెళ్తాం " అన్నారు వారు అందుకా గృహయజమాని ఫక్కున నవ్వి – "మీరీ రాజు కూతురు చరిత్ర వినలేదు కాబోలు ఎంతటి పండితులు వచ్చినా, ఆమె వారినోడించి జయపత్రికలు తీసుకుంటుంది ఏరాజకుమారుడు పెళ్లాడతానన్నా తనకి సరితూగడని తీసి పారేస్తుంది మీరనవసరంగా మీ గౌరవం పాడు చేసుకోకండి మరో రాజునాశ్రయించండి '' అన్నాడు వారిశ్రేయోభిలాషిలా. అందుకు వారు – "అయ్యా! ఆకాంతవలన మాకేమీ భయంలేదు ఆమె తాతలవంటివారి వద్ద జయపత్రికలందుకొన్నాం." అన్నారు.

"నేను చెప్పవలసిన మాట చెప్పాను. ఆపైన మీ యిష్టం – " అనేశాడతను

"పెళ్లి లేకపోతే ఆసౌందర్యానికి ఉపయోగమేమిటి? ఆమె అభిప్రాయమేమిటి? పెళ్లే చేసుకోదా? తగిన వరుడు దొరకలేదనా?"

"మీరెందుకింతగా ఆమె గురించి అడుగుతున్నారు? ఆమె విద్వాంసులయిన విప్రులకు కాని దర్శనమివ్వదు వాళ్లైనా శృంగార భావంతో ఆమెను చూశారో తీవ్రంగా దండిస్తుంది మాటలలోనే మనసుకనిపెట్టేస్తుంది. ఆమెతో చాలా నేర్పుగా మాట్లాడాలి ' అని చెప్పాడు గృహయజమాని.

కృష్ణ దేవరాయలకనేక జాగ్రత్తలు చెప్పి – మరునాడు తిమ్మర్సు రాజాస్థానానికి తీసుకు వెళ్లాడు. రాజయిన గోపాలుడు వారిని గౌరవించి రాకకు కారణ మడిగాడు

"మేము కాశికి పోవుచున్నాము. మీ కీర్తి విని మీ దర్శనం చేసుకుందామని వచ్చాము. మీ పుత్రిక పాండిత్యం కలదనీ ఎందరినో ఓడించిందనీ విని – ఆమెతో కొంతసేపు ముచ్చటించి ఆనందించాలని మా అభిమతం." అన్నారు.

"మీకే విద్యలలోపాండిత్యమో తెలపండి. అనగా" సకల విద్యలలోనూ అని చెప్పారు. రాజు అలాగే చీటిరాసిపంపగా రాజకుమారి తక్షణమే వారిని ప్రవేశపెట్టమంది.

సేవకులు వారిననేక గదులు దాటించి కళానిలయ భవనానికి తీసుకువెళ్లారు. అక్కడ రత్నకంబళీ పరచివారినాసీనులని గావించారు. ఆగదిలో నాలుగు గోడలకీ ప్రసిద్ధ చక్రవర్తుల చిత్రాలున్నాయి. వాటిలో రాయలు, తిమ్మరుసుల చిత్రం కూడా ఉంది. ఆ గదిలో లెక్కలేనన్ని దేవతా విగ్రహాలున్నాయి. అక్కడున్న స్త్రీల చిత్రాలలో కళా నిలయ చిత్రంలో సౌందర్యాన్ని చూసి మోహంతో రాయలు మూర్ఛపోబోయాడు. అది కనిపెట్టి తిమ్మర్సు – "ప్రతిమని చూచియే యింత మనోవికారము పొందుతున్నావు. నిజముగా ఆమెను చూస్తే మనగుట్టు బయట పెట్టేలాగున్నావ్ ఆమెను వెర్రి చూపులు చూడకు సుమీ." అని హెచ్చరించాడు.

అంతలో అక్కడికొక సుందరి వచ్చింది. రాయలామెను కళానిలయ అనుకున్నాడు కాని ఆమెను వీరి తెలివి పరీక్షించుటకై కళానిలయ పంపింది. తిమ్మర్సు దగ్గరా అలాటి ఆటలు? ఆమె కళానిలయకాదని రాయలుకు తిమ్మర్సు సూచించాడు. ఆమె ఎంత అందంగా ఉన్నా చేతులు కఠినంగా ఉండడమే ఆమెను కళానిలయ కాదని అతను గుర్తించడానికి ఆధారం. ఆ దాది వారి బుద్ధి కౌశలానికి మెచ్చుకుంది.

ఒక తాడును లాగేసరికి వస్త్రము, జలతారులతోను కట్టబడిన ఒక తెరవంటిది (జాలరు) వీరి ముందు వేలాడింది.

ఆ దాది – "అమ్మా! వీరు విద్యలలో ఎలాటి వారో తెలియదు కాని లౌకికంలో దిట్టలు. చాలామందిలా కాక వీరు నన్ను గౌరవించలేదు,

పలకరించలేదు. దాదినని కనిపెట్టేశారు. వీరితో జాగ్రత్తసుమీ". అని హెచ్చరించగా కళావతి ఆగదిలోకి ప్రవేశించింది.

ఆమె సంస్కృతంలో అడిగిన ప్రశ్నలకు శ్లోకరూపంలోనే జవాబిచ్చాడు తిమ్మర్సు. పద్యంలో అడిగిన ప్రశ్నకు పద్యంలోనే చెప్పాడు. ఆమె రత్నంకంబళంపై కూర్చుంది. రాయలామె సౌందర్యాన్ని కళ్లతో తాగేస్తున్నాడు.

తిమ్మర్సు ఆమెలో పునరుక్తి దోషాన్ని చూబించాడు. స్త్రీలకు వేదం చదివే అధికారం ఏ గ్రంథంలో ఉందో చూపమన్నాడు. దానికి జవాబు చెప్పలేకపోయిన కళావతికి వాళ్లిద్దరూ తిమ్మర్సు, కృష్ణదేవరాయలు అని స్ఫురించి చిత్రపటాలు చూసి ధ్రువీకరించుకుంది. వారు మారువేషంలో ఉన్న కృష్ణదేవరాయ, తిమ్మర్సులనీ తనని చూసేందుకే వచ్చారనీ, తననిమానభంగం చేశారు కనుక ఉరితీయించమనీ తండ్రికి చీటి రాసి పంపింది.

దానికి రాజు – "నువ్వనుకుంటున్నదబద్ధం. మారువేషాల్లో రావడానికి వారికేంకర్మ? తగిన నిదర్శనాలు చూపితే కాని అలాటి ఆజ్ఞయివ్వను." అని తిరిగి చీటీ పంపాడు.

అందుకామె వీరినానవాలు పట్టడానికి మార్గం తనదగ్గరుందనీ – కృష్ణదేవరాయల వేషంలో ఉన్నవాడు తనని తదేకంగా చూడడం, తిమ్మర్సు తప్పు చేయలేని కపటవాదన రెండో పండితుడు చేయడం మొదలయినవి ఆమెరాసి పంపగా ఆ చీటిలో ఉన్న ప్రకారం చెయ్యడానికి రాజు పరిచారకులను నియమించాడు.

ఆమె తొట్రుపాటు చూసి తననామె తెలుసుకుని ఏదో మోసం చేయబోతూందని గ్రహించిన తిమ్మర్సు – "మానినీ! మాకనుష్టానములకు వేళ దాటిపోతూంది. వెళ్లివస్తాం. మళ్లీ రేపు పొద్దుట సభ చేద్దాం." అన్నాడు.

"తొందరపడకండి. ప్రసంగంకొంచెమైనా జరగలేదు. మీకు జవాబు చెప్పాలికదా". అందామె. "రేపటికి ఆలోచించి ఉండు." అంటూ రాయల చేయందుకుని వేగంగా నడుస్తూ – సింహద్వారం దగ్గర చేతులడ్డంపెట్టి చాకలి నిలబడగా, రాజుతో, – "ద్వారమున కడ్డంగా

నిలబడిన చాకలిని చూశావా? చేతులు తియ్యమనేంతలో రాజభటు లొచ్చేస్తారు. మీరు చేతులకిందనుండి దూరిపోకూడదు. నేనోఉపాయం పన్నుతాను. నువ్వు మెరపులా వాడిని దాటిపోవాలి." అని - చాకలివేపు -తిరిగి" చాకలి మడేలు గారూ! దండాలండి. దండాలు." అన్నాడు.

వాడికెంత దిట్టంగా చెప్పినా, బ్రాహ్మణుడు నమస్కరించగా ప్రతి నమస్కారం చేయకుండా ఉండలేక - "మీరు గొప్పవారు. నాకు దండం పెట్టొచ్చునా? మీకు దండాలు." అంటూ చేతులెత్తేసరికి రాయలు దాటిపోయాడు. రెండోవానిని దాటనివ్వనని చేతులడ్డంపెట్టగా తిమ్మర్సు బ్రాహ్మణుడే కనుక చేతులకింద నుంచి దూరిపోయాడు. అంతకుముందే సిద్ధంగా ఉంచిన గుర్రాలమీద యిల్లు చేరారు.

జరిగినది విని కళావతి తండ్రితో "వారెంత వంచకులో చూశావా? దాసీపుత్రుడు నాకు మానభంగం చేశాడు, చూపులతో. అతన్ని చంపిస్తేకాని నేనన్నంముట్టను." అని ప్రతిజ్ఞ చేయగా రాజు వారి ఆకారాలను చిత్రించి రాజభటులకిచ్చి వారు కనపడిన తోడనే రెక్కలు విరిచికట్టి తెండి అని ఆజ్ఞాపించాడు.

రాజభటులువాళ్లకోసం వెదికి ఎంతకీ కనపడక విసిగి మరలివస్తూండగా కాశీ వెళ్తున్న యిద్దరు బ్రాహ్మణులు వారి కంటపడ్డారు. వాళ్ళని బంధించి రాజసముఖమునకు తేగా - వారు నిజంగా బ్రాహ్మణులే, నిష్కారణంగా ఎందుకు తెచ్చారని చికాకుపడి వారిని బంగారు నాణాలిచ్చి పంపించేసింది రాకుమార్తె.

తరువాత కొందరు రాజభటులువచ్చి - "అమ్మా! వారు మీరూహించినట్లే రాయలు, తిమ్మర్సులే. వారుగుర్రాలమీద పారిపోతూంటే మేమడ్డగించాము కాని విచ్చుకత్తులతో మమ్ము పరాభవించితిరి." అని చెప్పారు.

రాజకుమార్తె - "నేను నీచజాతుల కంటపడితిని. ఒక అధముని కంటపడి వేరొకరినెలా పెళ్లాడగలను? ఆ దుర్మార్గుడికేమి వొరిగినది? నేను వానిని పెళ్లాడెదననుకున్నాడా? ఎలాగైనా వాడిని సాధించి నేను మరణిస్తాను-" అని నిశ్చయించుకుని తండ్రికి కొన్ని రహస్యములు బోధించి అతనిచేత కృష్ణదేవరాయలుకి లేఖ రాయించింది.

"రాజాధిరాజ రాజపరమేశ్వరాది బిరుదములు కల కృష్ణదేవరాయ మహారాజుగారి సన్నిధికి గోపాలవల్లభుడు వ్రాయు శుభలేఖార్థములు. అధిక విఖ్యాతి కల మీకు సకల విద్యాపరిపూర్ణయగు కళానిలయ అను నాకూతురినిచ్చి వివాహము చేయ నిశ్చయించినాము కనుక యిందు వ్రాసిన శుభముహూర్తానికి సకల పరివార సహితముగా రాగోరుచున్నాను."

ఆ లేఖను బ్రాహ్మణులచేత రాయలకు పంపించాడు రాయలు దానిని తిమ్మర్సుకు చూపి "మిత్రమా! నీ ప్రయత్నం ఊరకే పోతుందా? చూడు, నేను కోరిన చిన్నది నన్ను కోరినది. త్వరగా వివాహపు ఏర్పాట్లు చేయించు." అన్నాడానందంగా.

అందుకు తిమ్మర్సు - "మనము అంతఃపురభంగము చేసితిమని కోపంతో ఆ రాచది నిన్ను వివాహం మిషతో అక్కడికి పిలిపించి చంపాలనుకుంటూంది. దీనికి జవాబు చెప్పలేకపోతే నాబుద్ధి సూక్ష్మత ఎందుకు?" - అని యిలా రాశాడు. "గోపాలభూపాలుడంపిన శుభలేఖకెంతయూ సంతసించి కృష్ణదేవరాయలు వ్రాయనదేమనగా - మీకన్యకను స్వీకరించుటకు సమ్మతమైనది. కాని - తరలివచ్చుట మాకాచారము కాదు. మాకు బదులుగా కత్తిని పంపుతున్నాము. వైవాహిక క్రియలన్నీ ఆకత్తికే జరిపించండి."

అది చదివిన రాజకుమార్తె - యిప్పటికి దాటిపోయారు. ముందు దొరకరా ....ఎప్పటికేనా పగ సాధించి తీరతాను. అనుకుని కొన్నాళ్లయ్యాక తండ్రి పేరుతో మళ్లీ లేఖ పంపింది. "మీ ఆజ్ఞానుసారంగా కత్తికి పెళ్లి చేశాము. ఇది వసంతకాలం కనుక మీరు వచ్చి పైకార్యములు జరిపించుకోగలరు."

అది చదువుకుని రాయలు మొదట సంతోషించినా తిమ్మర్సును గుర్తు తెచ్చుకుని అదికపటమని తెలిసికొని యిలా జవాబు రాయించాడు. "ప్రస్తుతము మాకు రాజ్యకార్యములు తొందరగ ఉన్నవి. వచ్చుటకు వీలు లేదు. తీరిక చేసికొని మరల జాబు వ్రాసెదము-"

ఇలాగ రెండేళ్లు ఉత్తరప్రత్యుత్తరాలతోనే గడిచింది అప్పుడా కళావతి తండ్రి పేరుతో 'మేమెన్ని ఉత్తరాలు రాసినా మీరు వచ్చుట గురించిరాయరు వివాహమై రెండు సంవత్సరాలయింది. లోకులు నిందించుతున్నారు మీకు వచ్చుటకు వీలులేనిచో మాచిన్నదానినే పంపుతాను. శుభముహూర్తానికి కార్యం జరిపించుకోండి ఈడొచ్చిన ఆడపిల్ల అత్తవారింట వద్ద కదా ఉండాలి?" అని ఉత్తరం పంపింది

మీరు వ్రాసిన విషయములకు సమ్మతించితిమి ఇక్కడే అన్ని కార్యాలూ జరిపించుకుంటాం. ఆమెను పంపండి " అని జవాబు రాసి పంపారు, రాయలూ తిమ్మర్సూ

కళావతి తండ్రికి చెప్పి కొంతసైన్యాన్నీ దాసీజనాన్నీ వెంట బెట్టుకుని అత్తారింటికి వెళ్తున్నట్లే బయలుదేరింది ఇంతలో – తిమ్మర్సు బాల్యస్నేహితుడూ, విచిత్ర వస్తువులను చేయుటలో నేర్పరీ అయిన చిత్రకారుణ్ని పిలిపించి రాయలువంటి విగ్రహం చెయ్యమని బోదించగా అతను దానిని చేసి ఒకగదిలో మంచంమీద ఉంచాడు దానిని చూసిన వారు కృష్ణదేవరాయలే నిద్రపోతున్నాడనుకోకమానరు ఆగదిలో ఒకమూల నేలసొరంగమేర్పరిచాడు అందులోని వారెవరికీ కనపడరు అవేవీ యితరులకు తెలియదు

కళానిలయవచ్చాక ముహూర్తమంటూ రెండు నెలలు ఆలస్యం చేసి చివరకు ముహూర్తం పెట్టారు ముహూర్త సమయానికి ముందుగా రాజభటులు ఆమెను నివాసంనుంచి తీసుకువచ్చారు

ఎట్టకేలకు కళావతి ఆగదిలోకిపోయి తలుపుమూల నిలబడింది రాజు తిమ్మర్సునేల సొరంగంలో ఉండి ఆమె చేస్తున్న వన్నీ చూడసాగారు గాజుదీపాలతో ఆగదిపట్టపగల్లా ఉంది

భర్త ఎంతకీ పిలవకపోవడంతో – అతనికి నిద్రపట్టేసిందని భావించి – సంతోషించి ఆమంచం దగ్గరకి వెళ్లి, కన్నులు మూసుకుని ఉండడంతో గాఢంగా నిద్రిస్తున్నాడనుకుని తనరవికలో మడతలలో

దాచిన కత్తితీసి ఆ విగ్రహం మీద వేటు వేసింది విగ్రహంలో పోసి ఉంచిన వసంతం ఆమెకళ్లల్లోకి ఎర్రగా చిందింది కళ్లుతుడుచుకుంటూ ఆమె కత్తిని పడేసినంతలో తిమ్మర్సు రాయలు ఆమె వద్దకు వచ్చారు.

రాయలు తిమ్మర్సు చేతినుంచి కత్తిని తీసుకుని ఆమెపైకెత్తి – "ఘాతుకురాలా. చూడు నన్ను చంపడానికి తెచ్చిన కత్తి నీప్రాణాలే తీస్తుంది దేవుణ్ణి ప్రార్థించుకో." అన్నాడు కోపంగా ఆమె గజగజ వణికిపోతూ – "దేవా! నేనిప్పుడు నీ ఆధీనంలో ఉన్నాను నేను విన్నవించుకునేది విన్నాక నన్ను వధించు స్త్రీపురుష తారతమ్యం వలన కొంత పరిశీలించదగును ఒక్కొక్క కారణంవల్ల పుట్టిన కోపం ఆపనితోనే తీరుతుంది " అంటూ ఏడిచింది

'సరే చెప్పు కాని నిన్ను వధింపక మానేదిలేదు దుర్మార్గుల పట్ల కనికరము లోకానికపకారం " అన్నాడు రాయలు "దేవా. మీరు నిష్పక్షపాతంగా ఆలోచించండి నామానాన నేను పండిత గోష్టిలో ఉండగా కపటంగా వచ్చి మీరు నావ్రత భంగం చేశారు మొదటి తప్పుమీరే చేశారు ఆడదాన్నే అయినా రాచపుట్టుక పుట్టిన దానను కనుక ప్రతీకారం చేయదలుచుకోడం తప్పుకాదు కదా అయినా అధిక విద్యాగుణరూప సంపన్నుడగు భూపాలుడు వచ్చి వరిస్తానంటే – కాదనడం నాతప్పంటే ఒప్పుకుంటాను ఇందుకే నాకు కోపం వచ్చింది. ఐతే మునుపు మీమీదెంత కోపమో యిప్పుడంత ప్రీతిజనించింది ఇక మీకు ద్రోహం తలపెట్టను యదార్థముగా మిమ్ము పెళ్లాడి – మీకు ద్రోహంచేసి నాకాపురంలో నీళ్లు పోసుకుంటానా? మనుపంటే – నేను మిమ్మల్ని వరింపలేదు కనక అలా చేశాను నామాట నమ్మండి. దైవసాక్షిగా మిమ్మల్నే భర్తగా సేవించుకుంటాను మునుపు నామీద మీకున్న మోహం గుర్తు తెచ్చుకోండి నామనసెలా ఉందో గ్రహించగల తిమ్మర్సు నామాటలలోని నిజానిజాలు గ్రహించగలరు బాగా ఆలోచించండి ' అని ఆమె వేడుకుంది

"ఆమె మాటలు నిజమే ' అని తిమ్మర్సు రాజుకు బోధించాడు ఆమెను చంపుట మాన్పించి ఆమెకు కొన్ని బుద్ధులు చెప్పి - భార్యాభర్తలవడానికి వాళ్లిద్దరినీ ఒప్పించాడు. తిమ్మర్సు కళానిలయ తండ్రి అయిన గోపాల వల్లభునికి వార్త పంపి త్వరలోనే వైభవంగా వారి వివాహం జరిపించాడు

తిమ్మర్సులాటి మంత్రి కల రాయలుకి ఏ కోరిక తీరదు?

తరువాత చిత్రకారుడు వచ్చి - 'దేవా నేనెంతో శ్రమపడి అందంగా తయారు చేసిన విగ్రహం యిలా విచ్ఛిన్నం కావడం నాకు చాలా విచారంగా ఉంది. దీనిని వృధాగా పారేస్తే నామనసు కష్టపడుతుంది విగ్రహపు పొట్ట మళ్లీ బాగుచేస్తాను అది మీ ఆకారమే కనుక సప్తసంతానములవలె భూమిమీద చిరకాలముండేటట్లు ఏర్పాటు చేయండి " అని కోరాడు

రాయలు, తిమ్మర్సు చాలా సంతోషించి - ఒక ఆలయంలో - పడుకున్నట్లున్న ఆవిగ్రహాన్ని స్థాపించి, దానికి నిత్యోత్సవాలు జరగడానికి అగ్రహారాలిచ్చి పరిచారకులను నియమించారు

ఆనాటి నుండి ఆవిగ్రహానికి ఉత్సవాలు జరుగుతున్నాయి. చాలాకాలమైపోయింది కనుక యిప్పుడు దానిని దేవతా విగ్రహమని ప్రజలు భావించుచున్నారు చిత్రకారుని రచనాచమత్కృతి వలన అది యిప్పటికీ చెక్కు చెదరకుండా ఉంది ఆ విగ్రహ రహస్యం ఎవరికీ తెలియదు. నా గురువిచ్చిన రత్నప్రభావం వల్ల నాకు తెలిసింది

కథైపోయింది లే గోపాలా పొద్దెక్కింది మళ్లీ మనం ప్రయాణం సాగించాలి " అన్నాడు మణిసిద్ధుడు

ప్రణవాక్షర ఓం జపంచేస్తూ గురువుగారూ వారిననుసరించి శిష్యుడూ తరువాత మజిలీ చేరుకున్నారు

# కాశీ మజిలీ కథలు

## 8. వ మజిలీ

### 19. సింహదమనుని కథ

గోపాలుడు చూసిన చాలా పెద్ద పుర్రె వెనక కథని మణిసిద్ధుడు చెప్పసాగాడు.

కళింగదేశరాజధానయిన విజయపురాన్ని శత్రుంజయుడనే రాజు పరిపాలించేవాడు. చాలాకాలం వరకూ పిల్లలు కలగక అతనేడుగురిని వివాహమాడాడు వాళ్లవల్లా సంతానం కలగలేదు అప్పుడతను విజ్ఞాన సిద్ధుడనే యోగినాశ్రయించగా అతనొక మామిడి పండిచ్చి అతనికిష్టమైన భార్యకిచ్చి తినిపించమన్నారు. ఏడుగురు భార్యలమీదా సమానమైన ప్రేమకలరాజు ఎవరికివ్వాలో తేల్చుకోలేక ఏడుగురికీ భాగాలు చేసిచ్చాడు

రాజొకనాడు వేటకి వెళ్లి అనేకమృగాలను చంపి, తనకి చిక్కకుండా పారిపోయిన అడవిపందిని తరుముతూ ఒంటరిగా అడవిలో చాలాదూరం వెళ్లాడు. అక్కడ ఆపందిమాయమై పోయింది. కన్నుల పండుగగా ఉన్న ఉద్యానవనం కనిపించింది అతనా ఉద్యానవనంలో విహరిస్తూంటే ఒక పొదరింటి దగ్గర వనదేవతలాటి సుందరొకతె కనిపించింది

ఆమె అందానికి ఆశ్చర్యపోయి - ఆమెను సమీపించి - “సుందరీ నువ్వెవరవు? ఇక్కడ ఒంటరిగా ఎందుకున్నావు? నీతల్లితండ్రులెవరు? భర్తెవరు?” అని అడిగాడు

ఆమె మాట్లాడలేదు

"మాట్లాడవేం? నన్ను చూసి సిగ్గుపడుతున్నావా? నన్నుపై వాడిగా భావింపక నీవృత్తాంతం నాకు చెప్పు " అన్నాడు

"నాతోమీకేంపని? వెళ్లండి ఒంటరిస్త్రీని పలకరించ వచ్చునా? మగవారిమాయలు నేనెరగనివి కావు మీతోవన మీరు వెళ్లండి." అంది

అప్పటికీ అతను వదల్లేదు 'నేను సామాన్యుడిని కాను" అన్నాడు.

"రాజుల మాటలు అసలు నమ్మదగినవి కావు. అడవిలో ఏకాంతంగా ఉన్న శకుంతలని దుష్యంతుడు మోసం చేయలేదూ?" అంది. అయినా అతను విడవక – "నన్ను విశ్వసించు నువ్వు నన్ను స్వీకరిస్తే అన్ని పనులలోనూ నువ్వు చెప్పినట్లే నడుచుకుంటాను." అని ప్రమాణం చేశాడు.

అప్పుడామె తన గురించి చెప్పింది

"అవంతి రాజుకుమార్తెను నాపేరు సూర్యప్రభ. మగవారి ద్రోహకృత్యముల నెరిగిన దానినవడంవల్ల నాకు పెళ్లంటేనే విముఖత్వం కలిగింది మా తండ్రి ఎంత చెప్పినా నేను వివాహం చేసుకోలేదు. కన్యాత్వవ్రతం పూనియుండగా సిద్ధవ్రతుడను యోగి వచ్చాడు మాతండ్రి నన్నతని సేవలకు నియోగించాడు నేను భయభక్తి వినయాలతో శుశ్రూషలు చేయగా అతను వెళ్తూ నన్నొకవరం కోరుమన్నాడు మనోహరమైన ఉద్యానవనంలో ఏకాంతంగా విహరించాలని కోరుకున్నాను.

ఆయోగి యీ ఉద్యానవనం సృష్టించియిచ్చాడు మాతండ్రి అనుమతితో నేనిక్కడుంటున్నాను ఇంతవరకూ దీనిలో ప్రవేశించిన వారు మీరే. మిమ్మల్ని చూస్తే నాలో కోరిక పుడుతూంది. కాని మగవారి దుశ్చేష్టలను తలుచుకుంటే వైరాగ్యం కలుగుతూంది నువ్వు చెప్పినట్లే చేస్తానంటే నీవెంట వస్తాను కాని బాగా ఆలోచించుకోండి ఇప్పుడున్న భార్యలవల్ల మీకు చిక్కులు రాగలవు సుమా "

'నువ్వొస్తే చాలు నీకెవరూ సాటిరారు నా మాటలలోని నిజానిజాలు నీకే తెలుస్తాయి ' అని అనగానే అతడినామె గట్టిగా కౌగలించుకుంది, అతని ఊపిరాగిపోయేలా అదంతా తనపై ప్రేమ అనుకుని ఆమెను వెంటపెట్టుకుని సేనను కలసి పురానికి వెళ్లాడు నిజానికదొక బ్రహ్మరాక్షసి రాజును మోసం చేయాలని ఆ రూపం ధరించింది రాజామెకు అందమయిన భవనం కట్టించి దాసదాసీల నేర్పరిచాడు మంచిమంచి ఆహారపదార్థాలు నిత్యమూ పంపుతున్నా ఆకలితీరని ఆ రాక్షసి రాత్రివేళ రహస్యంగా యిల్లు వదిలి సాలలోని ఏనుగునో గుర్రాన్నో, ఒంటెనో తినేసి వచ్చేది. కావలివారొకనాడు రాజువద్దకు వెళ్లి –

'దేవా పదిరోజులనుండి ఒక బ్రహ్మరాక్షసి మన జంతువులని తినేస్తూంది రక్తమాంసాలు పీల్చి ఎముకలు మాత్రం వదులుతూంది తమరు దీనికేమైన ప్రతిక్రియ చెయ్యకపోతే మనజంతువులు మిగలవు ' అన్నారు.

రాజామాటలకు – "బ్రహ్మరాక్షసివస్తూందా! దానిని వెళ్ళగొట్టడం కష్టమే " అని గస్తీతిరగడానికి ఎక్కువమంది శూరులని నియమించాడు. ఐనా జీవహింస తగ్గలేదు ఆవేళ రాజు తన ప్రియురాలితో యిలా అన్నాడు.

"మావూరికొక బ్రహ్మరాక్షసి వచ్చి జంతువులని తినేస్తూంది ఎంతమందిని కాపుంచినా పలితం లేకపోతూంది నువ్వు తెలివైనదానివి ఏదైనా ఉపాయం చెప్పవూ?"

"మీకు కోపంరాదంటే ఒకనిజం చెబుతాను బ్రహ్మరాక్షసి ఎక్కడినుంచో రావడంలేదు , మనింట్లోనే ఉంది " అందామె నవ్వుతూ

"ఎవరో చెప్పు తీవ్రంగా దండిస్తాను

"రేపు సూర్యోదయానికి రండి పట్టిస్తాను.' అందామె "సరే " అని వెళ్లాడు రాజు

ఆ రాక్షసి రాత్రి పట్టపుటేనుగును చంపి, మాంసంముక్కలు కొన్నిటిని రాజుగారి భార్యల వంటగదిలో ఉంచింది. మర్నాడు రాజడగగానే – "మనింటనున్న రక్కసులు మరెవరూ కారు మీ భార్యలే దృష్టాంతం కావాలంటే వారి వంటశాల చూడండి." అంది "నాభార్యలి లాటి పనిచేస్తారంటే నమ్మలేకపోతున్నాను "అంటూ వంటశాలకి వెళ్ళి రాజు భటులచే పరీక్షింపజేసి అక్కడ ఏనుగు మాంసం ముక్కలని చూసినట్లు వారు చెప్పగా – రాజస్త్రీలనుకున్నాను కాని రక్కసులను కోలేదు వారికేం శిక్ష విధించాలో నువ్వేచెప్పు." అన్నాడామెతో 'స్త్రీలచర్యలు స్త్రీలకే తప్ప తెలియవు వారు గర్భవతులు కనక చంపించడం తగదు మహారణ్యంలో కనుగ్రుడ్లు పీకి వదిలివేయుటయే యుక్తము అందామె

రాజభటులు ఏడుగురికీ ఏమీచెప్పక అరణ్యంలోకి తీసికెళ్లి కళ్ళు పీకివదిలేశారు. ఆనవాలుగా ఆకనుగుడ్లను ఆమెకిచ్చారు

అడవిలో రాజభార్యలు దుఃఖంలో మునిగిపోయారు. అంతలో పెద్దావిడకు ప్రసవవేదన ప్రారంభమయింది. ఒక పుత్రుడు జన్మించగా తల్లుల అంధత్వాన్ని కనిపెట్టి దగ్గరలో ఉన్న జంతువులా శిశువును తినేశాయి అలాగ ఆరుగురుకన్న శిశువులనీ జంతువులు తినెయ్యగా ఏడవ ఆమెకికూడా ప్రసవవేదన మొదలయింది

అప్పుడు మూడవది తెలితేటలతో తక్కిన వారికిలా చెప్పింది "సోదరిలారా! మనమిక్కడెంత ఏడ్చినా ఓదార్చేవారెవరు? ఆరుగురు కన్న పిల్లలనీ జంతువులపాలు చేశాం. ఏడవదానికి పుట్టబోయే శిశువుని కూడా ఏదో జంతువు తినేస్తుంది. అందుచేత మనం యీామె చుట్టూ చేతులు కట్టి వలయాకారంలో రక్షణనిద్దాం ప్రసవించిన తోడనే శిశువు నెత్తుకుందాం ఒక చిన్నవాడినయినా దక్కించుకోలేకపోతే మనలని కాపాడేదెవరు? ఆ బిడ్డని మెల్లగా పెంచుకుందాం "

ఆమె చెప్పినట్లే చేసి ఆబిడ్డను వాళ్లు దక్కించుకున్నారు. చక్కని రూపం కల ఆ కుర్రవాడు క్షణక్షణ ప్రవర్ధమానుడై ఐదేళ్ళవానివలె

ఉండేవాడు పరాక్రమశాలి అయిన అతను అయిదేళ్లకే తల్లులకు ఫలములు తెచ్చి యిచ్చేవాడు ఆ గుడ్డివారిని అడవిలోని తాపసులు తమ ఆశ్రమంలో ఉంచుకుని కాపాడేవారు

ఒకనాడాకుర్రవాడు అడవిలో తిరుగుతుండగా ఒక సింహం ఎదురయింది సాధారణ మయిన ఆయుధంతోనే అతను దానిని చంపెయ్యడం చూసి, అతని పరాక్రమానికి మెచ్చుకుని సింహదనుడని పిలవసాగారు అతనికి పదేళ్ళురాగానే కొండవాళ్ల వద్ద విల్లంబులు సంపాదించి రకరకాల మృగాలను చంపుతూ తల్లులకు మాంసం యిచ్చేవాడు అడవిలోని కిరాతకులను రప్పించి వారితో పనులు చేయిస్తూ వారికి నాయకుడై - రాత్రి వేళ తల్లులనుంచి లోకజ్ఞానం నేర్చుకుంటూ అరణ్య రాజ్యం చెయ్యసాగాడు

ఒకనాడతను తన తల్లుల వృత్తాంతం అడుగగా - వారు తాము శత్రుంజయ మహారాజును వివాహం చేసుకున్నది మొదలు అంతవరకూ జరిగినది దుఃఖిస్తూ చెప్పారు

అదివిన్న ఆబాలుడికి చాలా కోపమెచ్చింది. పాపమని సంకోచించాడు కాని తండ్రిని చంపేసేంత ఆవేశమొచ్చింది అయినా నిగ్రహించుకున్నాడు

కిరాతకులచేత కట్టబడిన సవారీలో తల్లుల నెక్కించి వారిచేత మోయిస్తూ చివరకి తండ్రిగారి పట్నం చేరాడు ఒక సామాన్యమయిన యిల్లు తీసుకుని అందులో తల్లుల నుంచాడు

ఒకనాడొక గుర్రమూ, కత్తీ అమ్మకానికి వచ్చాయి గుర్రం ముఖానికి కప్పబడిన పలక మీద - "ఈ గుర్రమూ కత్తీ కలిపి పదివేలరూపాయలు కత్తిని సులభంగా ఎత్తగలవారు తప్ప గుర్రాన్నెక్కలేరు గుర్రం ఆకాశంమీద కూడా వేగంగా వెళ్లగలదు అసమర్థులు కొంటే పరాభవం పొందుతారు " అని ఉంది

రాజుతో సహా ఎందరో యెధులా కత్తినెత్తలేక వెనుదిరిగి పోయారు. సింహదనుడా కత్తినిట్టే ఎత్తి గుర్రంమీద క్షణంలో చాలాదూరం

పోయివచ్చాడు ఈ విషయం రాజుకి తెలిసింది అతను సింహదమనుని వద్దకొచ్చి "మీదేశమేది? మీ తల్లితండ్రులెవరు? మీకు తగిన జీతమిస్తానంటే ఉంటారా?" అని అడిగాడు అతను తనతండ్రే అని తెలిసినా తన తల్లి తండ్రుల వివరాలు చెప్పక - "ఆ గుర్రాన్ని నాకు ఇచ్చి నెలకి నూరుమాడలు జీతమిస్తే ఉంటాను." అన్నాడు

రాజు సంతోషంగా అతనికి గుర్రాన్ని కొనిచ్చి తన కొలువులో పెట్టుకున్నాడు సింహదమనుడా గుర్రాన్నెక్కి వెళ్తుంటే ఎలాటి వాళ్లకేనా భయం పుట్టకమానదు.

భూపాలుని మోసగించి అతని భార్యలనడవికి పంపించిన ఆరక్కసి రాజుకి నమ్మకం పుట్టించడానికి జీవహింస మానినా - కొన్నాళ్లలోనే మళ్లీ మొదలుపెట్టింది ఎన్ని ప్రయత్నాలు చేసినా రాజు అపలేకపోయాడు

సింహదమనుడు కొలువులో చేరాక ఒకనాడా రక్కసి బాధ తొలగించమని కోరాడు.

"ఈ రాత్రి దానిపనిపడతాను నిశ్చింతగా నిద్రపో రాజా." అని అతను పెందరాళే భోంచేసి చంద్రహాసం చేతబట్టి గుర్రమెక్కి గస్తీతిరగసాగాడు. రాక్షసి మామూలు వేళకు వచ్చినా సింహదమనుణ్ని చూసి అతని పరాక్రమం అప్పటికే విని ఉండడంవల్ల భయపడి వెనక్కి వెళ్లిపోయింది. ఆరాత్రి జంతుహింస జరగలేదని తెలిసి రాజు అశ్చర్యపడుతూ అతన్ని రోజూ గస్తీ తిరగమని వేడుకున్నాడు

అలా కొన్ని దినాలయ్యేసరికి రాక్షసి ఆహారంలేక చిక్కిపోయి - 'వీడినెలాగో ఒకలాగ ఊరినుండి వెడలగొట్టకపోతే లాభంలే' దని - ఆ రాత్రి తలకి కట్టుకట్టుకుని ఏడుస్తూ పడుకుంది అది తెలిసిరాజు పరుగున వచ్చి ఏమని అడగగా - నాకు భ్రమరవాణి అనే చెల్లులుంది. అదినాప్రాణమే అదిప్పుడు రోగపీడిత ఐనట్లు కలవచ్చింది పోయిచూద్దామంటే దగ్గరకాదు. దాని క్షేమంచూసి వచ్చి చెప్పగల వారెవరు?" అంది ఏడుస్తూ

"కలవచ్చినందుకే విచారించాలా? మన వీరుణ్ని పంపితే ఎంత దూరమయినా వెళ్ళి యిట్టే రాగలడు " అన్నాడు రాజు

"నేనతనికి కొన్ని మాటలు చెప్పాలి " అనగానే సింహ దమనుణ్ని రమ్మని రాజు కబురంపాడు సింహదమనుడు అది బ్రహ్మరాక్షసి అని తెలియక.. "అమ్మా! నువ్వెక్కడికెళ్ళమన్నా వెళ్తాను." అన్నాడు

"నీ పరాక్రమం విన్నాను నువ్వు తప్ప మరెవరూ వెళ్ళలేరు ఇక్కడినుండి దక్షిణదిక్కుగా వెళ్తే మళయాళదేశం. లవణసముద్రం కనిపిస్తాయి ఆ సముద్రందాటి నూరుయోజనాల పిమ్మట ఒకలంక కనిపిస్తుంది. దానిలోని రాజమార్గం మీదుగా పోగా నూరు యోజనాల అవతల మూడు పర్వతాలు కనపడతాయి. వానిలోని మధ్యదాని శిఖరమెక్కితే విశాలమైన పాషాణం కనపడుతుంది ఆరాతిమీద అగ్నిని చేసి నేనిచ్చిన పొడినా అగ్నిలో వేయగానే రాయి పగిలి దారిస్తుంది ఆదారిన వెళ్తే మా చెల్లెలు మందిరం కనిపిస్తుంది. దానిని చూసి, యీ ఉత్తరం ఇచ్చి అదియిచ్చు ఉత్తరమును తీసికొని రావాలి " అని ఉత్తరం యిచ్చింది

అతనామెనుండి సెలవు తీసికొని తల్లులకు జాగ్రత్తలు చెప్పగా వారు పోవద్దన్నారు వారినెలాగో ఒప్పించి జట్టివేషం ధరించి చంద్రహాసం చేతపట్టి దేవతాశ్వమెక్కి పరమేశ్వరా అంటూ దక్షిణదిశగా ఆకాశమార్గాన పోసాగాడు సాయంత్రాని కొక పట్నం కనిపించింది. ఆనగరం మీదుగా ఎగురుతూంటే ఒక భవనంపైన సఖులతో చల్లగాలి సేవిస్తున్న మణి మంజరి సింహదమనుణ్ని చూసింది

# ౨౦. మణి మంజరి కథ

మణిమంజరి ఆ నగరాధీశుని కుమార్తె అతని రూపం మనసుని రంజింప జేసే సరికతన్ని తనవద్దకు రమ్మని చేయి ఊపింది. అతనామెకు దగ్గరగా దిగాడు. ఆమె చెలికత్తెలతో లేచి "నువ్వు మన్మధుడివా? జయంతుడివా? వసంతుడివా?" అని అడిగింది.

"నాపేరు సింహదమనుడు. నేనొక రాజకుమారుణ్ని. తండ్రిగారు పంపగా ద్వీపాంతరం వెళ్తున్నాను తియ్యని పానకమిస్తే తాగి వెళ్తాను." అన్నాడతను.

అందుకామె నర్మ గర్భంగా తన కతని మీద కోరికను తెలియజేస్తూ తన అధరామృతం అందుకుందుకేం చేయాలో చెప్పింది. అతను తన అంగీకారాన్ని అలాగే తెలియజేశాడు ఆమె చెలికత్తెలు గ్రహించి వారినేకాంతానికి వదిలి తాము తప్పు కున్నారు

వారిద్దరూ మన్మధకేళిలో మునిగి ఆనందపు అంచులు తాకారు అలసిసొలసిన రాజకుమారుడు నిదురలోకి జారగా ఆమె అతని పాదాలొత్తసాగింది. అప్పుడతని అంగీ జేబులోని ఉత్తరం ఆమె కంటపడింది. అదిపైశాచిక భాషలో ఉన్నా ఆమెకా భాష వచ్చును కనుక కుతూహలంగా చదివింది

"రాజును వంచించి అతని భార్యల నడవికి తోలించి నేను యధేచ్ఛగా ఏనుగులు మొదలయిన జంతువులను తింటూ సుఖంగా ఉన్నానని నీకిదివరకే తెలిపాను నాలుగు నెలలకిందట శత్రుంజయుడి వద్ద చేరిన యీ వీరుడు ప్రతిరాత్రీ గస్తీ తిరుగుతూ నా ఆహారానికాటంకం కలిగిస్తున్నాడు. వీడు సాధారణుడు కాడు. వాడిని నేను చంపలేను. అందుకే ఒక మిషమీద నీవద్దకు పంపుతున్నాను వీడిని చంపి ఆశుభవార్త నాకు తెలియజెయ్యి ఎదురుచూస్తూంటాను".

మణిమంజరికంతా అర్థమైపోయింది రాజకుమారుడికి మేలు చేసేందుకే దేముడు యితనిని తనవద్దకు పంపాడని తలచింది

"ఇతను నాకు పుత్రతుల్యుడూ, అత్యంత ప్రాణమిత్రుడూ, ఇతనికి మనింటిలోని వింతలన్నీ చూపి మనగుట్టంతయూ నిస్సందేహంగా చెప్పు ఇతన్ని సంతోషపెట్టు. నీ క్షేమం తెలుసుకుందామనే యీ ఉత్తరం పంపుతున్నాను " అని రాసి మొదటి ఉత్తరానికి బదులు దీనినతని జేబులో ఉంచింది మొదట ఉత్తరం తనదగ్గర దాచి ఉంచింది

అతనికి తొందరగానే మెలకువొచ్చింది అతను ప్రయాణానికి సిద్ధమౌతూంటే - "రేపు వెళ్ళవచ్చును కదా? మీ వృత్తాంతం చెప్పండి" అందామె.

అతను తన కథ టూకీగా చెప్పి - అనవాలుగా తన ఉంగరమిచ్చి - గుర్రమెక్కి ఆకాశమార్గంలో వెళ్ళిపోయాడు లవణ సముద్రం దాటి పర్వతశిఖరం మీద అగ్ని రాజిల్లజేసి చూర్ణం వేయగానే రాయి పగిలి దారి యిచ్చింది లోపలకి వెళ్లే సరికి విచిత్రమాల కనిపించింది అవి - కంకాళి మాయచేసి చంపిన రాజుల పుర్రెలు.

సింహదమనుడి ప్రవేశంతో నరవాసన కొట్టి - రక్కసి అతన్ని మింగడానికి వచ్చింది. అతను ఉత్తరం యిచ్చాడు చదువుకుని అతన్ని ఆనందంగా కౌగలించుకుని - "నువ్వు మాసోదరి పెంచుకున్నవాడివనీ, దానికెన్నో ఉపకారాలు చేశావనీ తెలియక నిన్ను చంపబోయాను కోపం తెచ్చుకోకు మా అక్కకి యిలాగని చెప్పకు నీకు రాచమర్యాదలు చేస్తాను, రా ' అంటూ అక్కడి వింతలన్నీ చూపించి పుర్రెలమాల గురించి చెప్పింది.

దానితో అతనికి తనతండ్రి భార్య రాక్షసి అనీ తండ్రి మూఢుడై ఆమె చేతిలో మోసపోయాడనీ, తనతల్లుల గుడ్లు పీకించింది కంకాళనీ అంతా అర్ధమయింది తన బాధ భరించలేక తనని వదుల్చుకుందుకా రాక్షసి యిక్కడికి పంపి ఉంటుందనీ. కాని. తోవలో మణిమంజరి ఆ ఉత్తరాన్ని మార్చి ఉంటుందనీ ఊహించాడు తను నాటక మాడాలని నిశ్చయించుకుని."అమ్మా! మా అమ్మ నిన్ను చాలాచాలా అడిగినట్లు చెప్పింది ఆవిడకేమీ లోటులేదు. ఈ మధ్య సింహదమనుడనేవాడు గస్తీతిరిగినా మొన్ననే తనదేశానికి పోయాడు నీపాతాళ గృహం గురించి

చెప్తూంటే నేను ముచ్చటపడ్డానని నన్నిక్కడికి పంపింది. నాకింకా మనుష్య భోజనం అలవాటు లేదు " అన్నాడు.

భోజనం చేశాక – "మనింటిలో ఉన్న వింతలన్నీ నాకు చూపించు మాఅమ్మ ఏంచూశావని అడిగితే ఏం చెబుతాను?' అని తొందరచేశాడు ఆమె అక్కడి రత్నరాశులు, బంగారం,చూపించింది. ఒకగదిలో తళుకుమని మెరుస్తూ కనుగ్రుడ్లున్నాయి.

"ఇవి ఎవరివో చెప్పుకోగలవా? ' అడిగింది. అతను తెలియదన్నాడు అప్పుడామే చెప్పింది 'ఇవి రాజుగారి భార్యల కనుగుడ్లు ఒకపొడిజల్లి ఉంచడం వల్ల పాడవకుండా ఉన్నాయి."

"అమ్మా. ఈ గుడ్లు వారికమర్చినచో చక్కబడునా?" అడిగాడతను

'తులసాకుపసరుతో అంటిస్తే యివి మామూలుగా పని చేస్తాయి ఐనా అలాటి అవసరమేమొస్తుంది?" అంటూ రెండు పంజరాలు చూపించింది వాటిలో చిలకా గోరింకా ఉన్నాయి. అవి అలా ఎందుకున్నాయని అడిగాడు ఆమె యిలా చెప్పింది "వీటి గురించివిను. ఈ చిలకలో మీ అమ్మప్రాణాలూ, గోరింకలో నాప్రాణాలూ ఉన్నాయి. వీటి కపాయంకలిగే వరకూ మాకేమీ భయం–ఉండదు." అప్పుడామె పక్కనున్న గదిలోకి తీసుకెళ్లింది. అక్కడ బంగారు బొమ్మలాటి – పదహారేళ్ళ ప్రాయం కల చిన్నదొకామె మంచం మీద ఉంది అతనాశ్చర్యపోయి– 'ఈ బొమ్మ నెందుకుంచావు పిన్నమ్మా?" అని అడిగాడు

ఆమెనవ్వుతూ – "అది బొమ్మకాదు. అంతచక్కగా ఉన్న నిజమైన అమ్మాయి ఆమె కథ వింటావా? పూర్వం ఒకప్పుడు మీ అమ్మ దేశ సంచారం చేస్తూ ఒక సంస్థానం మీద పడి దానిలోని జనాలని తినెయ్య సాగింది దానికళ్లకి చాలా అందంగాకనిపించిందొక.... అమ్మాయి దానిని చంపక తన చిత్రశాలలో ఉంచవచ్చునని తెచ్చింది ఆపిల్లే యీ అమ్మాయి దీనిని నేనే పెంచి పెద్దచేసి తెలివితేటలు నేర్పాను ' అంది ఆ అమ్మాయి అందచందాల కాశ్చర్యపోయిన సింహదమనుడు,

"అ . గుర్తొచ్చింది మా అమ్మ ఒకసారి దీనిగురించి చెప్పింది నేనేమో అంత చక్కనిదైతే నాకు పెళ్ళి చెయ్యమన్నాను. ఆమె అలాగే .నీకోసమే ఆ బంగారుబొమ్మ." అంది ."

"ఐతే ...నీకిష్టమైతే చెప్పు. మీ యిద్దరికీ పెళ్లిచేసేస్తాను " అంది పిన్నమ్మ

"అమ్మముందే ఒప్పుకుంది నువ్వూ ఒప్పుకుంటే అలాగే చేసుకుంటాను." అన్నాడతను.

అప్పుడారాక్షసి – "చిన్నదానా నువ్వదృష్టవంతురాలివి. ఇలాటి నరసంచారంలేని చోటున్నా మంచి మగణ్ణి పొందుతున్నావు మీకు కావలసిన సుఖాలనుభవించండి." అని ఆమెకు చెప్పి తాను భోజనానికి వంటింట్లోకి పోయింది.

అప్పటికే ఒకరిపై ఒకరికి అనురాగం కలిగిన వారిద్దరూ గాఢంగా కౌగలించుకున్నారు.

"నీపేరేమిటి? ఈ పాతాళ గృహంలో ఒంటరిగా ఉంటూ యౌవనాన్ని వృధా చేసుకుంటున్నావేం"? అని అడిగాడతను

ఆమె తనకేమీ తెలియదనీ, రాక్షసి యిక్కడికి తీసుకొచ్చి మోహిని అనే పేరు పెట్టిందనీ – తనకింత వరకూ మగవాడే కనిపించలేదనీ చెప్పింది తరువాత మోహిని తనసందేహం బయట పెట్టింది – 'నువ్వు రాజకుమారుడివి. మరి రాక్షస స్త్రీకి కుమారుడివెలా అయ్యావు?" సింహదమనుడు కంకాళి తన తండ్రిని మాయచేయడం, తన తల్లులకు పట్టించిన గతి మొదలైనవన్నీ చెప్పాడు తల్లినీ తండ్రినీ తానొచ్చిన పనినీ అన్నిటినీ మరచి అతనామెతో ఏడురోజులు పగలు, రాత్రి తెలియనంతగా సుఖాలలో మునిగిపోయాడు అప్పుడు ఏదోపనిమీద తనతల్లులకనుగుడ్లున్న పెట్టెను తెరవగా అతనికి అంతా గుర్తుకొచ్చి . వచ్చిన పని మరచినందుకు పశ్చాత్తాపపడి – చిలకపంజరాన్ని, కనుగుడ్లున్న పెట్టెనీ మాత్రం పట్టుకుని మోహినితో

గుహద్వారానికొచ్చి మునపటి వలెనే నిప్పులో పొడివేశాడు. గుహద్వారం తెరచుకుంది గుఱ్ఱంమీద ఆకాశమార్గంలో ప్రయాణం చేయసాగాడు.

మోహినికి భూలోకం వింత కనుక మెల్లగా పోతూ, మజిలీలు చేస్తూ సాయంత్రానికొక అడవి చేరుకున్నారు ఒకచెట్టుక్రింద విశ్రమించి సరస సల్లాపాలాడుతూంటే గర్జిస్తూ ఒకసింహం అక్కడికి వచ్చింది దానిని వెంటాడుతూ సింహదమనుడు తెల్లవారేవరకూ పరుగెడుతూనే ఉన్నాడు అప్పుడా సింహం మాయమైపోయింది

మోహినిని ఒంటరిగా విడచి వచ్చినందుకు చింతిస్తూ. . ఆమె కేమయిందో అని పరితపిస్తూ. అతను తాను బసచేసిన చెట్టువేపు రెండుమూడు క్రోసుల దూరం నడవగా ఒక పట్నం కనిపించింది. ఆ పట్నానికి ముందున్న కాలువను తనగుఱ్ఱంమీద దాటగా – రాజభటులు వచ్చి "ఈ కాలువలో దిగకుండా ఎవరు దాటుతారో వారిని తమముందు ప్రవేశపెట్టమని రాజశాసనం " అంటూ అతన్ని రాజువద్దకు తీసుకు పోయారు

ఆవార్తవినడంతోటే రాజు సింహదమనుడికెదురొచ్చి – అతనికుశలమడిగి – మర్యాదలు చేసి – తనబంధువులను, మంత్రులను, పౌరులను రప్పించి –

"అయ్యా! నాపేరు ప్రతాపరుద్రుడు నాకు పుత్రసంతానం లేదు కాని కాంచనమాల అనే పుత్రిక ఉంది రూపంలోనూ గుణంలోనూ గొప్పదయిన ఆమెకు తగిన వరుని తేలేక విసిగిపోయి – కాలువలో దిగకనే దానిని దాటినవానికి కాంచనమాలతోపాటు రాజ్యమును కూడా యివ్వాలని నిర్ణయించుకున్నాను. ఇంతవరకూ అటువంటి మహానుభావుడు తారసపడక పశ్చాత్తాపపడుతూంటే నాప్రతిజ్ఞకు భంగం కలగకుండా నేటికి నువ్వు అలా కాలువను దాటావు నా కూతుర్నీ రాజ్యాన్నీ స్వీకరించు అని సింహదమనుణ్ని కోరాడు

సింహదమనుడు అంగీకరించి - కాంచనమాలను వివాహం చేసుకుని ఆ దేశానికి రాజయి ప్రజలను చక్కగా పాలిస్తూ .గతం, మోహిని మణిమంజరి, తల్లితండ్రులు అందరినీ మరచి పోయాడు ధనమదం ఎక్కిన వారికి గతం గుర్తురాదు కదా.?

గోపాలా ఆకథ అలా ఉండనీ చెట్టుక్రింద మోహిని గురించి చూద్దాం " అన్నాడు సిద్ధుడు

గోపాలుడు - సరే చెప్పండి." అన్నాడు.

## 21. మోహిని కథ

సింహాన్ని తరుముకుంటూ వెళ్ళిన భర్త తిరిగొస్తాడని ఎదురుచూస్తూ దిక్కులు చూస్తూ తెల్లవారేవరకూ ఎలాగో గడిపింది. అతను రాలేదు. అతను వెళ్లిన వేపు కొంతదూరం నడిచి - అతనొచ్చితనని వెదుక్కుంటాడేమో అని మళ్లీ ఆ చెట్టుక్రింద చేరి - ప్రాణనాథా! అంటూ అరచిఅరచి. .జవాబురాక దైవాన్ని తిట్టుకుంటూ కొంతసేపు ఆమహారణ్యంలో తిరిగింది

ఆమెగొంతువిని కొందరు దొంగలు వచ్చి ఆమె వొంటిమీది వస్తువులన్నీ దోచుకుని తమ అమ్మవారికి బలివ్వడానికామెను బంధించి తీసుకుపోయారు.

ఆమెను బలివ్వబోతూండగా వారిలో ఒకడు - 'ఈమె చాలా అందంగా ఉంది. నిష్కారణంగా ఎందుకు బలిస్తారు? నావంతు సొమ్ము వొదిలేస్తాను. దీన్ని నాకిచ్చేయ్యండి, భార్యగా చేసుకుంటాను " అన్నాడు

దానితో మరొకడు - "నీవేనా మగాడివి? నాకూ దీనిమీద మనసుగానే ఉంది. దీనిని నాకు భార్యగా చేస్తే నావంతు సొమ్ము వదిలేస్తాను " అన్నాడు

'అమ్మవారికి బలిస్తామన్నారనికాని – నాకుమాత్రం దీనిమీద వలపులేదా?' అంటూ మూడోవాడు తయారయ్యాడు

అలాగే అందరికందరూ ఆమె తనకే కావాలంటూ. కయ్యానికి దిగి చివరి కొకరినొకరు చంపుకున్నారు

ఒక్కరుకూడా మిగలకుండా అందరూ దొంగలూ తన కారణంగా చంపబడడంతో ఆశ్చర్యపడుతూ – "దైవమా నన్నెందుకు బతికించావు? ఇంకా ఎన్నో బాధలు పెట్టడానికా?" అంటూ ఆ కోవెలలోకి వెళ్ళి తలదాచుకుంది

కొంతసేపటికి తెల్లవారింది పూజారి వచ్చి ఆమెను చూసి – "ఎవరవు?' అంటూ అడిగాడు ఆమె జరిగిన దంతా చెప్పి దుఃఖించింది "మీయింట్లో ఉంచి నన్ను కొన్నాళ్ళు కాపాడగలరా? అంతలో నాభర్త వస్తాడేమో?" అని ప్రార్థించింది

ఆమె మాటలకి అతని మనసు కరిగిపోయింది 'అలాగే. నిన్ను నాకూతురిలా చూసుకుంటాను మా యింట్లో ఉందువుగాని " అంటూ ఆమెను తనయింటికి తీసుకువెళ్ళాడు

ఆపూజారి భార్య పరమ గయ్యాళి భర్త ఎంత చెప్పినా వినిపించుకోకుండా "ఇది అందంగా ఉందని తెచ్చావు ఏవేవో కథలు చెబుతున్నావు ఇది నాకంటె చక్కనిదా? ఇప్పటికెందరిని విడిచిపెట్టిందో. ఇలాటి దింట్లో ఉంటే మనపరువుపోతుంది ఈ వూళ్లో విటులకేమీ కొదువలేదు మరోయింటికి తీసుకెళ్లు ' అంది

ఆ మాటలకు మోహిని చెవులు మూసుకుని – 'మీరునన్నా ఉద్దేశంతో తీసుకొచ్చారా?" అని పూజారిని నిందిస్తున్నట్లు అడగగా" – నువ్వు నాకు కూతురితో సమానం నా భార్య మర్యాద తెలియని మనిషి దాని మాటలు పట్టించుకోకు మా యింటిలో స్వేచ్ఛగా ఉండు " అన్నాడు మోహిని అక్కడ అవసరమైన పనులు చేస్తూ నిరంతరం భర్తని తలచుకుంటూ కాలక్షేపం చేయసాగింది

ఆ పూజారి భార్యకు ఒక కోమటితోనూ కంసాలితోనూ సాంగత్యముంది రాత్రివేళ వాళ్ళువస్తూంటారు ఇది పూజారికి తెలియదు

ఒకరాత్రి మోహినేదో పనుండి వాకిట్లోకి రాగా – గోడపక్కన పొంచి ఉన్న కంసాలిని చూసి – “దొంగ దొంగ” అని అరిచింది పూజారి దీపం పట్టుకుని వచ్చాడు తప్పించుకుందుకు మరోమార్గంలేక ఆవిటుడు పూజారి ముందునుంచే పారిపోయాడు వాడు దొంగ కాదనీ తనభార్యకోసం వచ్చినవిటుడే అనీ గ్రహించి ఆనాటినుండీ పూజారి తన భార్యని ఏదో ఒక నెపంమీద దండించడం మొదలుపెట్టాడు

మోహినివల్లనే తనగుట్టురట్టయిందని ఆమెను చంపడానికి పూజారి భార్య ప్రయత్నించసాగింది ఎలాగో విషం సంపాదించి మిఠాయిలో కలిపి, విషంకలిపిన ఉండనూ, మంచి ఉండనీ గుర్తుగా ఒక పెట్టెమీద పెట్టింది

ఆరాత్రి కంసాలి వచ్చి మంచంక్రింద దాగున్నాడు పూజారి చాలాసేపటివరకూ నిద్రపోలేదు విటుడి ఉనికి తెలియకూడదని ఆమె దీపం ఆర్పివేసింది భర్త దీపం వెలిగించమనగా అగ్గిపెట్టె కనిపించ లేదనేసింది ‘నాకు నిద్ర రావడంలేదు ఇందాకా చేసిన మిఠాయిపెట్టు అన్నాడు ఆమె అతనికి కొన్ని ఉండలిచ్చి – మంచంకింద దాగున్న విటుడికి కూడా రెండుండలందించింది చీకటిలో పొరపాటు జరిగి విషం కలిసిన ఉండ విటుడి కెళ్ళింది అదితిని వాడప్పటికప్పుడే చచ్చాడు మగనికి నిద్రపట్టాక మంచంక్రింద చేయిపెట్టి అతన్ని పైకి రమ్మని సంజ్ఞ చేసింది కాని జవాబు లేకపోడంతో నిద్రపోతున్నాడని ఊరుకుంది

తెల్లవారు జామున అర్చకుడు కోవెలకు వెళ్లాడు దీపం వెలిగించి కంసాలిని లేపబోయింది కాని అతనిలో చలనం లేదు తాను పొరపాటుగా విషం కలిపిన మిఠాయుండ యిచ్చాను కాబోలు అనుకొని పశ్చాత్తాపం విటుడు చనిపోయినందుకు దుఃఖం, రాజభటులు చూసి శిక్షిస్తారన్న భయం వీటితో ఆమె ఏడవసాగింది

అంతలో - తెల్లవారుజామున వచ్చు కోమటి విటుడొచ్చాడు ఆరహస్యం అతనికి చెప్పి - 'ఎలాగైనా రక్షించు' అంది ఆమాట వినడంతోనే వణికిపోతూ "నాకు చేతులూ కాళ్ళూ ఆడడంలేదు రాజభటులు చూస్తే నిన్నూ నన్నూ కూడా పట్టుకుపోయి జైలులో పెడతారు కావలసినంత డబ్బిస్తాను నన్నెలాగైనా యింటికిచేర్చు" అన్నాడు భయంగా

'భయపడకు నీకు మాట రానివ్వను నేరాన్ని మోహిని మీదకి తోసెద్దాం. ఈ శవాన్ని దాని యింట్లో పడేద్దాం రా" అంది అతను ఎలాగో సాయంచేయగా - శవాన్ని మోహిని గదిలో ఆమె మంచంకింద పెట్టి - తలుపులు వేసి వెళ్ళిపోయారు. అయినా కోమటికి ఏమౌతుందో అన్న భయమే

పూజారి భార్య తెల్లవారగానే "మోహినీ! లే ఇంకా పడుకున్నావేం? రాత్రేం చేశావ్?" అంటూ అరిచింది మోహిని లేవగానే కాలికి శవం తగిలింది 'ఇక్కడెవరో ఉన్నారు -" అని అరిచింది అప్పుడు పూజారి భార్య అక్కడికి వచ్చి 'కంసాలి యిక్కడున్నాడేం?" అని అడిగింది

'ఏమో నాకేమీ తెలియదు.' అందామె " 'ఎంతటక్కులాడివే వీడిని పెట్టుకుని ఉన్నావా. నీ గుణం తెలిసింది వీడినింటికి పంపు-' "నిజంగా నాకేమీ తెలియదు - " మొత్తుకుంది మోహిని

"ఇంతజరుగుతున్నా వీడింకా లేవడేం? అయ్యో! వీడు చచ్చాడు నిజం చెప్పు నీవల్ల మాకు కూడా మాటొస్తుంది నీకులగోత్రాలు తెలుసుకోకుండా యింట్లో పెట్టుకున్నందుకు నామగనికి శాస్తి జరగవలసిందే అని ఆమెను నిందిస్తూ - 'ఓ రాజభటులారా. పెద్దమనుషులారా రండి మా యింట్లో ఉండేతొత్తు హత్య చేసింది అంటూ కేకలు వేసింది

వాళ్ళు వచ్చి కంసాలి శవాన్నీ, నిశ్చేష్టగా మిగిలిన మోహినినీ చూశారు "ఈమె ఎవరు? అని వారడగగా ఆమె తనభర్త మోహినిని తీసుకురావడం చెప్పి - "ఇది వచ్చింది మొదలు విటులు మాయింటి చుట్టూ తిరగడం మొదలుపెట్టారు కంసాలి కూడా వొచ్చేవాడు

నాకెందుకులే అని వూరుకున్నాను రాత్రి ఏమయిందో యీమె అతన్ని చంపింది అది తెలియని నేను ఎప్పట్లాగే దీన్ని లేపాను తలుపు తెరిచేసరికి శవం కనిపించింది నేనెంత అడిగినా నోరు మెదిపింది కాదు భయపడి మిమ్మల్ని కేకవేశాను అంది

అప్పుడు వాళ్ళు "నువ్వేం చెబుతావు? ' అని మోహిని నడిగారు దేవుడు తనకితెచ్చిన చిక్కుగురించి విచారిస్తూ ఎలాగైనా చావాలనే సిద్ధపడింది కనుక ఆమె నేరం అంగీకరిస్తున్నట్లు మౌనంగా ఉండి పోయింది వారామెను నేరస్తురాలిగా ఎంచి సంకెళ్ళు వేసి బందికానాకి తీసుకుపోయారు

వైద్యులది విషప్రయోగమని తేల్చగా రక్షకభటులుపూజారి భార్యను సాక్ష్యం చెప్పడానికి న్యాయాధిపతిముందుకు తెచ్చారు అతను అంత తెలివైనవాడు కాదు కనుక మోహిని మౌనాన్ని నేరం అంగీకారంగా భావించి ఉరితీయడానికి ఉత్తర్విమ్మని రాజుకి రాశాడు '

ఒకతడవాగి – మణిసిద్ధుడు – "గోపాలా సింహదమనుడు క్రీడించడం గుర్తుందా? ఆమణి మంజరి గర్భం దాల్చింది రాజు అదితెలిసి – పండితులను పిలిపించి – మణిమంజరి దోషా? – అని అడగగా "రాజస్త్రీలకు గాంధర్వవివాహం ధర్మమే. శకుంతల మొదలయినవారే అందుకు దృష్టాంతం " అన్నారు ఆమె యజ్ఞదత్తుడనే కొడుకును కంది మనవడికి రాజ్యాన్నిచ్చేసి రాజు తపోవనానికి వెళ్లిపోయాడు

న్యాయాధిపతి రాసిన ఉత్తరం చూసి యజ్ఞదత్తుడు 'నేను సింహాసనమెక్కి కొద్దిరోజులే అయింది మొదటే ఒకస్త్రీకి ఉరిశిక్ష విధించడమా! అదీకాక ఆమె మౌనం తప్ప ఆమె నేరాన్ని బలపరిచే మరే ఆధారమూ లేదు అందరినీ సభకు పిలిపించి నేనే న్యాయవిచారణ చేస్తాను ' అని భావించి కొలువు కందరినీ రప్పించాడు జారిణికి విటుని మీద ఉండే ప్రేమ మరెవరిమీదా ఉండదు అలాటి విటుణ్ని స్వయంగా

ఎందుకు చంపుతుంది? సాధారణంగా యిలాటి సందర్భాలలో స్త్రీయే మోసపోతుంది అనుకుంటా సింహదమనుడిచేతిలోతనతల్లిమణిమంజరిలా

మోహినిని చూసి – "అమ్మా! నువ్విలా మౌనంగా ఉండిపోదమే నీమీద నేరాన్ని ఆపాదిస్తూంది నువ్వెందుకో వైరాగ్యంపూని ప్రాణత్యాగానికి తలపడుతున్నావు ఊరకే లోకాపవాదం ఎందుకు భరించడం? జరిగినది చెప్పు తల్లీ " అని చల్లగా మాట్లాడాడు

"రాజయిన మీరెరుగని దుండదు నన్ను అపదలలో ముంచదలచిన దైవ సంకల్పాన్ని నేను మార్చగలనా? అపరాధం బాపుకున్నా, బతికినా ప్రయోజమేముంది? నాకు వేగంగా ఉరితీతకు అనుజ్ఞ యివ్వండి." అంది మోహిని."నావృత్తాంతంతో మీకు నిమిత్తం లేదు "

"అమ్మా! అన్యాయంగా నిన్నురితీయించేంత దుర్మార్గుణ్నానేను? నిజం చెబితే నీకేంలోటు?"

ఇకతన వృత్తాంతం చెప్పకుండా ఉండలేక పోయిందామె అంతా వినగానే అతనామె పాదాలమీద పడి – "అమ్మా. నేను నీకొడుకుని నీభర్త సింహదమనుడు నా తండ్రే నువ్వు చెప్పిన మణిమంజరి యందు జన్మించి రాజయ్యాను మాతండ్రి బతికే ఉన్నాడు కదా. నేను వెతికించుతాను నీకర్మ పరిపక్వమైనట్లే తోస్తూంది అందుకే నువ్వు నీ కొడుకుని చేరుకున్నావు " అని, ఆ పూజారి భార్యనోటనే నిజంచెప్పిద్దామని ఇనుపకడ్డీ కాల్చి అంటించమన్నాడు

అప్పుడామె భయపడి నిజం చెప్పేసింది ఆమెనురితీయమని ఆజ్ఞాపించినా మోహిని సానుభూతి చూపడంతో సామాన్యశిక్షతో రాజు పూజారి భార్యను వదిలేశాడు

మోహినిని సగౌరవముగా తనతల్లి మణిమంజరి ఉన్న అంతః పురానికి తీసుకువచ్చాడు. వారిద్దరూ నిరంతరమూ సింహదమనుని గురించి చెప్పుకుంటూ కాలక్షేపం చెయ్యసాగారు

వారి సంతాపం చూడలేక యజ్ఞదత్తుడు తన తల్లుల రూపాలు చిత్రఫలకాలు రాయించి - వాటిని తదేకంగా చూసిన వారిని తనవద్దకు తీసుకు రమ్మని భటులను దేశదేశాలు పంపాడు ఇది యిలా ఉండగా

ఇక్కడ సింహదమనుడు కాంచనమాలతో సుఖాలనుభవిస్తూ రాజ్యభారంలో మునిగి గతంమరిచిపోయి ఒకనాడు ఉద్యానవనానికి వెళ్తూ - తోవలో జనం గుమిగూడి ఉండడం చూసి అదేమిటో కనుక్కురమ్మని భటులను పంపగా - వారు తెలిసికొని 'అయ్యా. అడవినుండి చెంచులొక చిలకపంజరాన్నీ, పెట్టెనూ అమ్ముతా మంటున్నారు ఆపెట్టెలో తళుకుమంటున్న వేమిటో ఎవరికీ తెలియడంలేదు " అన్నారు

రాజువారిని తనవద్దకు తీసుకురమ్మన్నాడు చిలకపంజరాన్నీ, ఆపెట్టెనీ చూసేసరికతనికి గతమంతా గుర్తుకొచ్చి మూర్ఛపోయాడు తెలివొచ్చాక - 'అయ్యో ఎంతమరపుచెందాను మోహినేమయిందో? నాకురాజ్యమెలా వొచ్చింది? మోహినీ నేనూ పాతాళలోకంలో కదా ఉండేవాళ్ళం? అహ ఈ గుడ్లు మాతల్లులివి, ఈ చిలక నేను తెచ్చిందే అయ్యో ఎంత మరపుకి లోనయ్యాను - అని దుఃఖిస్తూ - ఆ చెంచులని - 'ఇవి మీకెక్కడ దొరికాయి?' అని అడిగాడు

'స్వామీ మేమివి దొంగతనం చెయ్యలేదు అడవిలో తిరుగుతూంటే ఒకచెట్టు క్రింద దొరికాయి దొరికి చాలా దినములయింది " అన్నారువాళ్లు

' ఆ చెట్టుక్రింద ఒక స్త్రీ లేదా?

'మాకెవరూ కనపడలేదు ఈ పంజరం, పెట్టె మాత్రమే ఉన్నాయి మనుషుల జాడలున్నాయి మీకివికావాలంటే తీసేసుకొండి ' అన్నారు భయపడుతూ

సింహదమనుడు ప్రధానమంత్రిని పిలిచి - "ముఖ్యమైన పనిమీద దేశాంతరం వెళ్తున్నాను నేను తిరిగొచ్చేవరకు రాజ్యం

పాలించండి " అని తన ముద్రికలిచ్చి, కాంచన మాలనెలాగో ఒప్పించి – చిలక పంజరం పెట్టి పట్టుకుని ఒక్కడే అడవిలోకి వెళ్లి మునుపు తాను మోహినిని వదిలిన చోటంతా తిరిగాడు కాని ఆమె కనపడలేదు.

అంతులేని విచారంతో శరీరమంతా బూడిద పూసుకుని బైరాగిలా తయారై ఆరెండు వస్తువులూ పట్టుకుని అడవులూ నగరాలూ తిరుగుతూంటే – ఒక గ్రామంలో – వెదురుకు పటాలు కట్టి తిరుగుతున్న రాజభటులా చిత్ర పటాలనతనికి చూబించారు వాటిలో – మోహినిన తను గుర్తుపట్టి విరహవేదనతో ఆపటాన్ని పట్టుకుని హత్తుకుంటూంటే – రాజ భటులతన్ని బలాత్కారంగా యజ్ఞదత్తుడిముందుకి తీసుకెళ్ళి హాజరుపరిచి జరిగినది చెప్పారు.

"అయ్యా తమరెచ్చటివారు? ఆ పటాన్ని చూసి ఎందుకు శోకించారు?" అని రాజడిగాడు మొదట ఆ బైరాగి చెప్పలేదు. కాని – రాజు – "మీ పుత్రునిగా భావించి – యీపటమును చూసి శోకించిన కారణం చెప్పండి " అని వత్తిడి చేసేసరికి తనకథంతా చెప్పాడు అంతావిని ఆనందం పట్టలేక అతనికాళ్లమీద పడి "నేను మీ కొడుకుని యజ్ఞదత్తుడను మీకు మణిమంజరియందు జన్మించాను. కొద్దిరోజుల క్రిందట మోహినికూడా యిక్కడికే వచ్చింది " అంటూ వారి వృత్తాంతాలు చెప్పాడు రాజు

సింహదమనుడు సంతోషం పట్టలేక పోయాడు. మణిమంజరినీ, మోహినినీ చూసి అతను పరవశించి పోయాడు. మణిమంజరి తాను దాచిన ఉత్తరం తెచ్చి చూబించింది "నాజీవితాన్ని రక్షించిన దానవు నువ్వే అంటూ ఆమెను ప్రశంసించాడు

తరువాత తన తల్లులనీ తండ్రినీ తలచుకుని వారి చిక్కులు తొలగించడానికి తొందరగా పయనమయ్యాడు చతురంగ బలాలతో కొన్నాళ్లకు విజయపురం చేరుకుని ఊరవతల బసచేసి రహస్యంగా తన తల్లులను రప్పించి వారి కళ్లకు తనుతెచ్చిన కనుగుడ్లు తులసిరసంతో అంటించాడు వారి కన్నులు ప్రకాశించసాగాయి

ఊరిబయట వ్యూహం పన్ని ఉన్న సింహదమనుడి గురించి విని ఊరు విడచి పారిపోదామని రాజు రక్కసియింటికెళ్ళి దానితో చెప్పాడు 'మీకేమీభయంలేదు నాకు యుద్ధం తెలుసు అతను యుద్ధానికే వచ్చాడో మరెందుకొచ్చాడో కనుక్కోండి " అందామె

రాజొక బుద్ధిమంతుడిని పంపాడు సింహదమనుడు నవ్వుతూ - మీరాజుతో కొన్ని రహస్యాలు మాట్లాడాలి. ఇక్కడికి తీసుకురండి." అన్నాడు రాయబారితో అతను వెళ్ళి రాజు కావిషయం చెప్పాడు

"నేను శత్రువులమధ్యకు వెళ్ళాలా. వాళ్ళు నన్ను బందిస్తే? వాళ్ళ బలా బలాలెలా ఉన్నాయి? వాళ్ళు కోపంగా ఉన్నారా? శాంతంగా ఉన్నారా?" అంటూ ప్రశ్నలు వేశాడు

వాళ్ళ ఉద్దేశం మీతో సంధిమాటలు మాట్లాడాలన్నట్లే ఉంది వారు తలచుకుంటే మీరెలాగూ పారిపోలేరు కొన్ని కానుకలు తీసుకెళ్ళి వారిని ప్రసన్నులను చేసుకోండి' అని రాయబారి చెప్పాడు

రాజు అక్కడికి వెళ్ళాడు సింహదమనుడతనిని సాదరంగా గౌరవంగా ఆహ్వానించాడు యజ్ఞదత్తుడు మొదలైన సామంతులతని చుట్టూ కూర్చున్నారు పలకరింపులయ్యాక "రాజా మీకు సంతానం ఉన్నారా?" అని అడిగాడు సింహదమనుడు రాజు విచారంగా తన ఏడుగురు భార్యలూ గర్భవతులు కావడం ఒకస్త్రీ మాటలువిని వారిగుడ్లు పీకించి అడవులలో వదలివెయ్యడం మొదలైనవన్నీ చెప్పాడు సింహదమనుడతనిని అంతఃపురానికి తీసుకెళ్ళి ఏడుగురు తల్లులనీ చూపించి వారిని గుర్తు పట్టగలరా?" అని అడిగాడు గుర్తుపట్టినా, వాళ్ళకి కళ్ళుండడం వలన ఎరుగనని అనుమానంగా చెప్పాడు. అప్పుడు సింహదమనుడు జరిగినదంతా చెప్పాడు

భార్యలు కొడుకు, కోడళ్ళు మొదలగువారు తనకు చేసే మన్ననల బట్టి రాజు నమ్మాడు అతను చాలా సంతోషించాడు దైవఘటనకాశ్చర్యపడ్డాడు

తండ్రి అనుమతి తీసికొని పంజరంలోంచి చిలుకను తీసి దానిని చంపి విసిరేశాడు మాయ వనిత వేషంలో ఉన్న రక్కసి ఉన్నపళాన కూలి చచ్చింది. దాని కిందపడి అనేక జీవులుమరణించాయి. దానిని బట్టి దానిశరీరమెంత ఉందో ఊహించుకోవలసిందే అదిచూసి పౌరులందరూ భయపడుతూంటే...దానికథ చెప్పగా...వారు సింహ దమనుని ఎంతగానో పొగిడారు

ఎందరో వీరులు వచ్చి దాని అవయవాలన్నీ ముక్కలుగా నరికి దహనం చేయించారు తలమాత్రం నరకబడలేదు ఆతలను అడవిలోకి దొర్లించారు.

శత్రుంజయుడు తనవారిని కోటలోకి తీసుకెళ్ళి కొడుక్కి పట్టాభిషేకం చేసి - తాను తపోవనానికి వెళ్ళిపోయాడు. సింహదమనుడు కాంచనమాలను రప్పించి ముగ్గురుభార్యలతోనూ సుఖంగా జీవిస్తూ చాలాకాలం రాజ్యం చేశాడు.

గోపాలా! నువ్వ చూసిన పుర్రె ఆరాక్షసిదే. చిరకాలమై మాంసము, కందలు ఎండిపోయాయి. అవి ఉన్నప్పుడు మార్గస్తులు పర్వతమే అనుకునేవారు. కథ చక్కగా అర్థమయిందా?" అడిగాడు మణిసిద్ధుడు. గోపాలుడు అర్థమయిందన్నాడు.

వాళ్ళు మళ్ళీ ప్రయాణమై తరువాత మజిలీ చేరుకున్నారు.

# కాశీ మజిలీ కథలు

## 9. వ మజిలీ

### 22. సోమశర్మ కథ

గురుశిష్యులు ఒకవిశాలమైన వీధిలో వెళ్తూంటే ఇనపస్థంబం మీద ఒక బ్రాహ్మణుడు నిలుచున్నట్లు కనపడింది అలాటి వింతకనపడితే అడక్కుండా ఊరుకుంటాడా గోపాలుడు? దానివెనుక కధని అక్కడికక్కడే చెప్పసాగాడు గురువు

కొండపల్లి అనే అగ్రహారంలో నిరుపేద బ్రాహ్మణుడు సోమశర్మ అతనొకనాడు భార్యతో "నేనెన్ని వ్యాపారములు చేసినా లాభించలేదు. మనయిరుగుపొరుగునున్న భాగ్యవంతులని చూస్తూంటే నాకెంతో బాధగా ఉంది వారు చక్కని భవనాలలో భార్యలతో కూడి హంసతూలికా తల్పాలమీద సుఖాలనుభవిస్తున్నారు నువ్వేమో ఎప్పుడూ మాసినగుడ్డలే కట్టుకుని తలదువ్వుకోక అసహ్యంగా ఉంటావు మనిల్లు పేడతోనూ తొక్కుతోనూ అసహ్యంగా ఉంటుంది చీకటి పడ్డా దీపముంచవు కుక్కిమంచం నల్లులు మనకీవారికీ ఎందుకింత తేడా? భగవంతునికి వారు బంధువులూ, మనము శత్రువులమా. ? మనకిమాత్రం అలాటి ఐశ్వర్యముండకూడదా? ఇలాటి దరిద్రపు బ్రతుకు బతకడంకంటె చావడంమేలు దీనంతటికీ కారణంనువ్వే ఎందుకంటే – మగవాడి ఐశ్వర్యానికైనా దరిద్రానికైనా ఆడదేమూలం ఇందుకు నిదర్శనంగా ఒక కథ చెబుతాను, విను.

పూర్వం – విక్రమార్కుడు, భట్టి దేశసంచారం చేస్తూంటే – ఒక అడవిలో యిసుకమీద పాదచిహ్నాలు చూసి – 'భట్టీ వీటిని చూస్తే మనకంటె గొప్పవాడైన మహారాజు నడచి వెళ్ళినట్టుంది. వేగంగా పద, అతనెవరో చూద్దాం ' అన్నాడు విక్రమార్కుడు.

అందుకు భట్టి "ఈ అడుగుపక్కన స్త్రీ అడుగులు కూడా కనపడుతున్నాయి ఇవి చూస్తే ఐశ్వర్యవంతుల పాద చిహ్నోల్లా కనపడవు శ్రమపడి నడచినట్లు కనపడుతుంది పోయిచూద్దాం" అన్నాడు అడుగు జాడల బట్టి పోగా అడుగులవారొక అగ్రహారంలో అరుగుమీద పడుకుని ఉన్నారు

ఆ బ్రాహ్మణుని లేపి అతని వివరాలడగగా - 'మాది రాయవరం బాల్యాన్నే దీనినిచ్చి పెళ్ళి చేశారు జ్ఞానం వచ్చింది మొదలు దరిద్రమే నన్ను పీడిస్తూంది ఎంత కష్టపడినా పొట్టనిండదు మీరు చాలా మంచి వారిలా కనపడుతున్నారు మాకీపూటకు భోజనసదుపాయం చేయగలరా?" అని ప్రార్థించాడు

అతని దరిద్రానికి హేతువు భార్యే అని ఊహించి, ఆమె అవలక్షణాలను పరిశీలించిన వారు "ఎంత దరిద్రం వచ్చినా ఆడదాన్ని యిల్లు కదుపుతారా? మీతో ఈమె కష్టాలనుభవిస్తుంది మేము కొంత దబ్బిస్తాం యీవిడనింటికిపంపు, మీరు మాతోరండి ఏదైనా వ్యాపారంకోసం దనసహాయం చేస్తాం ' అన్నారు

ఆవిడ అందుకు సంతోషంగా ఒప్పుకుంది ఆమె కోరినంత ధనమిచ్చి ఆమెను యింటికిపంపి అతన్ని వెంటబెట్టుకుని ఉజ్జయినీ నగరం చేరారు అక్కడ అతనికి వేరొక కన్యని పెళ్ళిచేసి కట్టుగుడ్డలతో 'మీమానాన మీరుపొండి" - అని వదిలివేశారు కాని వారిని రహస్యంగా వెంటాడుతూనే ఉన్నారు

ఆదంపతులు నడిచి నడిచి మద్యాహ్నానికొక అగ్రహారంచేరి ఒక గృహస్థుని అరుగుమీద కూర్చున్నారు వారు చేరిన నిముషానికే - నాలుగు రోజులనుండి ప్రసవముకాక బాదపడుతున్న ఆయింటియిల్లాలు సుఖంగా ప్రసవించింది అదిచూసి ఆయింటి యజమాని ఆదంపతులు రావడం వల్లనే తనకా శుభం కలిగిందని వారికి మర్యాదలు చేసి చక్కని భోజనం పెట్టడమే కాక వారికి పట్టుబట్టలిచ్చి వారిరాక శుభప్రదమని ఊరంతా చాటించాడు

అది విని - అలాటి చిక్కులోనే ఉన్న మరొక గృహస్థువారిని పల్లకీమీద ఊరేగిస్తూ తనింటికి తీసుకు వెళ్లాడు వారి పాదమహిమ

కాబోలు ఆ యిల్లాలు పుత్రుణ్ని కన్నది యింటివారు అదంపతులని పార్వతీ పరమేశ్వరులుగా భావించి పూజిస్తూ కొన్ని రోజులు తమింట ఉంచుకున్నారు వాళ్ల ఖ్యాతి దశదిశలా వ్యాపించింది ఎవరికే చిక్కులొచ్చినా వీరిని తీసుకెళ్తే తొలగిపోయేవి ఎక్కడా ఒక్కపూటేనా నిలవనియ్యక వారిని పల్లకీలో తీసుకుపోయేవారు ఒకనాడు వారు పల్లకీలో పక్కగ్రామానికి వెళ్తూంటే - ఒక ఏనుగు వచ్చి అతనిమెడలో పూలమాల వేసింది బంగారు కలశంలోని నీటితో అభిషేకం చేసింది

పుత్రశూన్యుడైన రాజు చనిపోతే ఏనుగు వరించినవానిదే రాజ్యం అనేది ఆదేశ సంప్రదాయం అలాగ అతను రాజయ్యాడు అతనికి పట్టాభిషేకం జరిగింది దానితో - భట్టి విక్రమార్కులు పురుషుని భాగ్యం స్త్రీ మూలంగానే జరుగుతుందని ధృవపరుచుకున్నారు

ఇప్పుడు అతను తమకన్న గొప్పరాజు కనుక అతని వద్దకు పోయి జరిగిందంతా చెప్పారు ఆ బ్రాహ్మణుడు ఎంతో సంతోషించి వారికి తన కృతజ్ఞతలు తెలుపుకుని పూజించాడు భట్టి విక్రమార్కులు కూడా తమ ప్రయత్నం ఫలించినందుకు సంతోషించారు

కనుక యిల్లాలా కొన్ని దినములు నీతో విడిపోయి దేశాంతరమెళ్లి ధనం సంపాదించుకొస్తాను దారిభత్యమేమైనా యివ్వ - 'అన్నాడు సోమశర్మ

ఆమె తెల్లబోయి - 'ఏముంది?" అంది

'నీమెడలోని మంగళసూత్రం అమ్మి అరిసెలు చేసివ్వ ధనంసంపాదించగానే నీ మెడని బంగారంతో నింపుతాను-" అన్నాడు

ఆమె తన మంగళసూత్రం అమ్మి కోమటి కొట్టుకు వెళ్ళేసరికి చీకటి పడింది బెల్లం పిండి నూనె యాలకులు, జాపత్రి , జాజికాయ యిచ్చుట తొందరలో షావుకారు జాజికాయకి బదులు వసనాభి దుంప యిచ్చాడు వాటితో ఇల్లాలు అరిసెలు చేసింది ఇచ్చిన అరిసెలను ఒక్కటయినా తాను రుచి చూడక మూటకట్టించి వేకువనే పయన మయ్యాడు

జాముపొద్దెక్కేసరికొక చెరువు కనపడింది స్నానం చేసి తిందామని - అమూటని చెట్టుకొమ్మకి తగిలించి స్నానం చేయసాగాడు

అంతలో ఇరవైనలుగురు దొంగలు గాడిదలమీద బోలెడంత డబ్బు పట్టుకొచ్చి చెట్టుకింద రాశిగా పోసి - చాలా ఆకలిగా ఉందనీ, నీరేనాతాగుదామనీ చెరువులోకి దిగగా సోమశర్మ కనిపించాడు

వారతన్ని చంపబోగా - అతను ధైర్యంగా - 'నన్నెందు కనవసరంగా చంపుతారూ? నేను జ్యోతిష్కుడిని మీరిక్కడి కొస్తారనీ ఆకలితో ఉంటారనీ ముందే తెలిసికొని మీకు సరిపడిన అరిసెలను తెచ్చి మీకోసం ఎదురు చూస్తున్నాను కావాలంటే చెట్టు కొమ్మకున్న మూట విప్పిచూడండి.' అన్నాడు

ఒకదొంగ మూటవిప్పి చూడగా ఇరవైనాలుగు అరిసెలే ఉన్నాయి దొంగలూ యిరవైనలుగురే

అతని దివ్యజ్ఞానానికాశ్చర్యపడి అతన్ని తమ గురువుగా ఉండమని కోరారు వారాచెరువులో స్నానం చేసి - కత్తులన్నీ పోగుగా పెట్టి ఒక్కొక్కరూ ఒక్కొక్క అరిసె చొప్పున తిని నీరుతాగి చెట్టుకిందే పడుకున్నారు. అరిసెలలో ఉన్న విషం తలకెక్కి నిద్రలోనే ప్రాణాలు వదిలారు

వారిచావుకి సోమశర్మ ఎంతో సంతోషించాడు 'దైవం నాకీ ద్రవ్యం ప్రసాదించాడు లోకమంతా దైవం చేతిలోనే ఉంది కాని యీ ధనాన్నంతా ఎలా పట్టుకెళ్ళడం? ఎవరినైనా సాయం పిలిస్తే భాగం అడుగుతారు ఇది రాజుగారి దనంలా ఉంది వారికి తెలిస్తే నా పని పట్టేస్తారు ఏంచెయ్యాలి?-' అని ఆలోచిస్తూ ద్రవ్యంచుట్టూ తిరుగసాగాడు పహరా కాయసాగాడు

అంతలో రాజభటులు వస్తున్నారు ఎవరు నువ్వు? ఈదనం సంగతేమిటి?'' అని అడిగారు వారు

సోమశర్మ ధైర్యం తెచ్చుకుని 'మీరెవరు? ఇక్కడి కెందుకు వచ్చారు?'' అని ధైర్యంగా తిరిగి ప్రశ్నించాడు సోమశర్మ

'మేము భూరిశ్రవుడను రాజుభటులం ఈ దనం దొంగలు మాకోటనుంచి దొంగిలించారు'

నేను సోమశర్మ అనే బ్రాహ్మణుడిని నాకు దైవ బలం ఉంది భూత భవిష్యద్వర్తమానాలు చెప్పగలను ఈ దొంగతనం గురించి ముంగ..

తెలిసే ఇక్కడికి వచ్చాను ధనం పంచుకుంటున్న దొంగలని చంపేశాను అదిగో వారి శరీరాల భాగాలు మీరంతా అశ్రద్ధగా ఉండబట్టే కదా యీ దొంగతనం జరిగింది? నేను రక్షించకపోతే దొంగలే ధనమంతా ఎత్తుకు పోయిండేవారు నేను దీనిని తీసుకెళ్లనివ్వను మీరాజుగారికి చెప్పి వారిని తీసుకురండి సోమవర్మ అలా హుంకరించే సరికి వారు" వెళ్ళి రాజుకి చెప్పారు అతను సైన్యంతో వచ్చి సోమశర్మని ధనరాశిచుట్టూ పహరా కాస్తూండగా చూసి - అయ్యా తమరెవరు? ఇక్కడికెలా వచ్చారు? ఇరవైనాలుగు మంది దొంగలను ఎలా చంపారు? నాయందు మీకింత దయెందుకు కలిగింది?'' అని అడిగాడు.

సోమశర్మ ఏమాత్రమూ జంకక - "నామహిమ నేను చెప్పుకోడం ఎందుకు? అదిగో దొంగలకళేబర ఖండాలు ఇవిగో వారికత్తులు ఇదుగో ద్రవ్యరాశి మీ భటులిక్కడికి వచ్చారు ఇంతపనికి మాలిన పరిచారకులను పెట్టుకున్నారేం? క్షణం దాటితే అంతా పోయేది కదా? చూసుకోండి ఒక్కనల్లపూసయినా తరిగిందేమో ' అన్నాడు

రాజు చాలా సంతోషించి - 'మీమేలెన్నటికీ మరువను మీరు నా దగ్గరుండండి మీకేంకావాలో కోరుకోండి ' అన్నాడు

"మీవద్ద ఆరులక్షల సేన ఉందని తెలిసింది అంతమంది వృథా రెండు లక్షల మందిని తగ్గించి వారి జీతం మాకిప్పించండి ' అన్నాడు సోమశర్మ రాజు అలాగే చేశాడు సోమశర్మని తన రాజధానికి తీసుకెళ్ళి ఒక మేడయిచ్చాడు సోమశర్మ భార్యని పిలిపించుకుని - వాగ్దానం చేసినట్లే - ఆమె మెడ, మేను బంగారు మయం చేశాడు

రాజుగారి దివాణంలోని ఉద్యోగులందరికీ అతనంటే అసూయ కాని అతన్నేమీ చేయలేక పోయారు రాజుగారిచే తీసివేయబడిన రెండులక్షల మందిసైనికులూ శత్రురాజుని ఆశ్రయించారు

ఇలా ఉండగా ఒకనాడు కొందరువచ్చి - మాగ్రామానికి సింహమొకటి వచ్చి మనుషులనీ జంతువులనీ తినిపోతూంది మాకు ప్రాణభయంగా ఉంది " అని మొరపెట్టుకున్నారు

రాజు సింహాన్ని చంపడానికి యోధులను పంపబోగా - మంత్రి సోమశర్మ మీదున్న పగతీర్చుకుందుకవకాశం వచ్చిందని - ' మనదగ్గర

సేన తక్కువగా ఉంది ఈ కార్యమునకు మన వైదిక బ్రాహ్మణుడే సమర్ధుడు అతనినే పంపండి'. అనగా రాజు సోమశర్మను పిలిపించి సింహాన్ని వధించి రమ్మన్నాడు.

సోమశర్మ రాజాజ్ఞను శిరసావహించి, దైవమే తనకు అండ అని భావించి - ఇంట్లో దాచిన దొంగల కత్తులిరవైనాలుగూ తీసుకుని సింహంతిరిగే ప్రాంతంలో ఒక తాటిచెట్టుమీద చేర్చి తానూ కూర్చున్నాడు

బొబ్బలుపెడుతూ జంతువులని భక్షిస్తూ తోకూపుతూ సింహం వచ్చింది "రావే సింహమా రా ' అని అతనరిచేసరికి అది ఆ తాటిచెట్టుక్రిందకొచ్చి నోరుతెరచి అతని పైకి ఎగరసాగింది అది నోరు తెరచినప్పుడల్లా అతనొక కత్తి జారవిడవడం, సింహందాన్ని మింగెయ్యడం అలా అన్ని కత్తులూ మింగడంతో దాని కడుపులో పేగులు తెగి అదికొట్టుకుంటూ చచ్చింది

అది చచ్చిందని ధృడపరచుకుని చెట్టుదిగి దానిని నరికి శరీరమంతా రక్తం పూసుకుని భయంకరంగా తయారై ఆమాంసరాశి చుట్టూ తిరగసాగాడు

తెల్లవారగానే జనం వచ్చి సోమశర్మ పరాక్రమాన్ని పొగిడి ఆ వార్తను రాజుకు చేరవేశారు రాజు మంత్రితోనూ పరివారంతోనూ వచ్చి - అతన్ని కౌగలించుకుని - "మీ పరాక్రమం అద్వితీయం మీకేంకావాలో కోరుకొండి" అన్నాడు సంతోషంలో

"రాజా మీకు నష్టమొచ్చేలా నేనేమీ కోరను. మనసంస్థానంలో ఊరికే జీతాలు తీసుకుంటూ పనిపాటులులేని సైన్యం నాలుగులక్షలుంది వారిలో రెండు లక్షలమందిని తగ్గించి ఆజీతాలు నాకివ్వండి చాలు " అన్నాడు సోమశర్మ

రాజు అంగీకరించాడు అతనికి సోమశర్మ మీద మునుపటి కంటె ప్రీతి పెరిగిపోయింది

సోమశర్మ ఆకత్తులనీ సింహం చర్మాన్నీ తనింట్లో రహస్యంగా దాచాడు

సర్వకార్యాలూ అతని చేతి మీదగానే జరగసాగాయి మంత్రికి మరీ అసూయ పెరిగింది రాజుచేత తీసివేయబడిన సైనికులు

శత్రురాజును ఆశ్రయించారు వారిసేనానాయకులు రాజు వద్దకు వెళ్ళి – "ఇప్పుడు భూరిశ్రవుడి దగ్గర రెండు లక్షల సైన్యమే ఉంది మనదగ్గర పది లక్షల సైన్యముంది మనమిప్పుడు యుద్ధం చేస్తే సులభంగా జయించవచ్చు " అన్నారు

రాజు చతురంగబలాల తోనూ బయలుదేరి చక్రవ్యూహంపన్ని యుద్ధపత్రిక పంపాడు అదిచూసి భూరిశ్రవుడు ఒకదినము వ్యవధికోరి మంత్రికి ఉత్తరమిచ్చి కర్తవ్యం ఆలోచించమన్నాడు

అప్పుడామంత్రి – "రాజా యుక్తాయుక్తాలు తెలుసుకోక ఉద్యోగములిచ్చు రాజునకు ఆపదలు కాక మరేంవొస్తాయి " అంటూ ఒకకథ చెప్పాడు.

## ౨౩. మంగల మంత్రి కథ

పూర్వం ఒకరాజు తనకి క్షవరం బాగా చేశాడని మంగలివానికి వరమివ్వగా – వాడు మంత్రిపదవడిగాడు ఆడిన మాట తప్పలేక రాజు అప్పటి మంత్రిని తీసి యీ మంగలిని మంత్రిగా నియమించాడు

ఆ వార్త శత్రురాజులకు తెలిసింది ఇన్నాళ్లూ ఆ మంత్రి బుద్ధిబలం వలన కోట చేరలేకపోయారు ఇదే అదనని వారు ముట్టడిచేశారు

'ఇప్పుడేంచేయాలి?" అని రాజు మంగలి మంత్రినడిగాడు అందుకు – 'అయ్యా నా తల్లికి నేనొక్కడినే మీరూ అంతే బతికుంటే బలుసాకైనా తినొచ్చు ఈ శత్రురాజుల నెవరు గెలువగలరు ? నా దగ్గర మాతాతిచ్చిన రెండు పొదులున్నాయి ఒకటి మీకు రెండోది నాకు మంగలి వేషములతో పారిపోతే మనని శత్రురాజులు పట్టుకోరు ఏవూరైనా పోయి రోజుకిద్దరికి క్షవరం చేసినా పొట్టగడవక పోదు దీనికింత విచారించాలా?" అన్నాడు మంగలిమంత్రి

"నీకు మంత్రిత్వ మిచ్చినందుకు నాకు బాగా బుద్ధి చెప్పావు దౌర్భాగ్యుడా. ఫో ' అని వాడిని తిట్టి పంపి పూర్వపు మంత్రి పాదాలమీద పడి పరిస్థితి చెప్పి రక్షించమన్నాడు

కృతజ్ఞత కల ఆ మంత్రి – "నేను మీకు వ్యతిరేకినని భావించి శత్రురాజులు కోట ముట్టడించడానికి నాసహాయం కోరారు వారికి నేను జవాబురాస్తాను ' అంటూ–

'ఇప్పుడు మీ యిష్టప్రకారం కోట పట్టిస్తాను ఐతే కోట స్వాధీనమయ్యాక దీనికి మీలో రాజెవరో తెలియజేయండి ' అని ఉత్తరం రాసి పంపాడు

ఆకోట నాకు కావాలంటే నాకు కావాలంటూ రాజులు ఒకరితో ఒకరు యుద్ధంచేసి అందరూ మరణించారు

అలాగే నువ్వూ వైదికుడికి భోజనమో, బట్టో, అగ్రహారమో యివ్వక సేనను తగ్గించి మంత్రిని చేశావు. నేను చెప్పినా విన్లేదు రెండు లక్షల సేనతో ఏం యుద్ధం చేస్తాం? దీనికంతకూ కారకుడైన సోమశర్మనే అడుగు అతను చచ్చాకే నేను యుద్ధం చేస్తాను " అని నిర్మొహమాటంగా చెప్పేశాడు.

రాజు సోమశర్మని పిలిపించాడు అతనంతా విని ధైర్యంగా – 'నావంటి బంటుండగా మీరు చింతించడమా. హాయిగా వినోదించండి ఒక్కరోజులో శత్రువులని జయించి వస్తాను నాకు సైన్యమేమీ అక్కర్లేదు. దొంగలని చంపినప్పుడూ సింహాన్ని చంపినప్పుడూ ఎవరు సాయంచేశారో వారే యిప్పుడూ తోడుంటారు " అని రాజునుత్సాహ పరిచాడు

ఆరాత్రే చక్రవ్యూహానికి దగ్గరలో ఒక గొయ్యి తవ్వించి సింహచర్మం కత్తులతో తాను రహస్యంగా ఆగోతిలో ప్రవేశించి – అర్ధరాత్రి శత్రుసేనలు నిద్రలో ఉండగా గోతినుండి పైకొచ్చి 'పొడు . పొడువు ' అంటూ గట్టిగా కేకలు వేస్తూ సింహచర్మాన్ని ఏనుగులమీదకి విసిరాడు ఆ చర్మం పచ్చి వాసన వదలలేదు కనుక ఏనుగులు గొలుసులు తెంపుకుని సేనలమీద పడి కలియదొక్క సాగాయి.

చతురంగ బలమువారు నిద్రనుండి మేల్కొని జరుగుతున్న దేమిటో తెలియక, శత్రువులు తమమీద పడ్డారనుకుని ఆచీకటిలో ఒకరినొకరు చంపుకోసాగారు ఈ విధంగా అల్లకల్లోలమైన ఆ సేనంతా ఒక జాములో అంతమై పోయింది

సోమశర్మ అకళేబరాల మధ్యనుంచి శత్రురాజు శిబిరానికి వెళ్లి నిశ్చేష్టుడై చూస్తున్న అతనిమీదపడి కత్తితో శిరస్సు నరికేశాడు. యుద్ధభూమిలోని కళేబరాలను నరికి శవాల అవయవాలను రాసులుగా పెట్టి, రక్తంపూసుకుని శవాలమధ్య శివుడిలా తిరగసాగాడు

ప్రజలవలన విజయం తెలుసుకున్న రాజక్కడికి వచ్చి సోమశర్మని కౌగలించుకుని "నువ్వు మనుష్య మాత్రుడివికావు ఒక మనిషి యింత పనిచెయ్యలేడు నువ్వుసాక్షాత్తూ దేముడివే నీరుణం తీర్చుకోలేను నమస్కరిస్తున్నాను –" అంటూ పాదాలమీద పడ్డాడు

"ఇదంతా మీకటాక్షమే ముల్లోకాలూ వచ్చినా జయించగలను– అన్నాడు సోమశర్మ రాజతన్ని పల్లకీమీద మేళతాళాలతో యింటికి తీసుకెళ్లి "ఏమైనా కోరుకో అన్నాడు 'మంత్రితో సహా మిగిలిన రెండు లక్షల సేననూ తీసివేసి ఆ జీతాలు నాకిప్పించండి ' అన్నాడు రాజతను చెప్పినట్లు చేసి అంతటితో తృప్తి పడక సోమశర్మ రూపాన్ని లోహంతో పోత పోయించి, యీ నడివీధిలో చిరకాలముండునట్లు యినపస్థభం మీద ఉంచాడు

గోపాలా శిల్పవైచిత్ర్యం బట్టి నిజంగా బ్రాహ్మణుడు నిలుచున్నట్లు కనపడుతూంది కాని అది సోమశర్మ శిల్పమే ఈ పట్నం ఆభూరి శ్రవునిదే అతని సంతతి వారందరూ నశించినా యీ విగ్రహం మాత్రం మిగిలిపోయింది " అన్నాడు

వారు కొంతసేపు విశ్రమించి మళ్ళీ ప్రయాణం సాగించారు

# కాశీ మజిలీ కథలు

## 10. వ మజిలీ

### 24. బుద్ధిసాగర, కామపాలుర కథ

పదకొండవ మజిలీలో ఎదురైన - తలవెంట్రుకలున్న శిలావిగ్రహం వెనక కథ అడిగాడు గోపాలుడు మణి మహిమతో ఆ కథను మణిసిద్ధుడు చెప్పసాగాడు

కాంచీపురంలో విష్ణు చిత్తుడనే రాజుండేవాడు. అతనిమంత్రి దీర్ఘదర్శి తనకి తగిన కన్యలేదని రాజు చాలాకాలం అవివాహితుడిగానే ఉండిపోయాడు. ఒకనాడు దీర్ఘదర్శి "రాజా మీరు పెళ్లి చేసుకోకపోడం వలన యువరాజు లేడే అని ప్రజలు చింతిస్తున్నారు అందానికి హద్దెక్కడ? సరిపెట్టుకోడమే త్వరగా పెళ్ళాడివంశం నిలపండి " అన్నాడు "మనంలోకంలో స్త్రీలను చూస్తున్నాం. చక్కని దానికి శీలముండదు శీలముంటే ప్రేముండదు నాకు పెళ్లి చెయ్యదలుచుకుంటే - చక్కదనం, శీలం, మంచిమనసు కల కన్యని చూడు లేదా యిలాగే ఉంటాను." అన్నాడు రాజు మంత్రి సరే అని రాజు రూపాన్ని చిత్రపటాలు రాయించి నాలుగు దేశాలకీ పంపాడు

పాండ్యదేశమహారాజు కూడా సుశీల అనే తనకూతురు రూపాన్ని చిత్రపటాలు వ్రాయించి ఆమెకు తగిన వరుణ్ని వెతకమని దూతలని పంపాడు

వారూ వీరూ తారసపడి ఒకరికొకరు తగినవారని తలచి - అవివరాలు తమరాజులకి చెప్పారు విష్ణుచిత్తుడు సుశీల యందను రాగబద్ధుడై - "సుశీలపేరు సార్ధకమై చిత్రపటమంత అందంగానూ ఉంటే

నాకామెతో పెళ్ళిచెయ్య"యని మంత్రికి చెప్పాడు మంత్రి పాండ్యదేశరాజుకి శుభలేఖ రాశాడు  పాండ్యదేశపు రాజు కోరికకూడా అదే తనకు మంత్రి రాసిన ఉత్తరానికి సంతోషించి ముహూర్తం కూడా నిశ్చయించి ఆహ్వానం పంపాడు  సుశీల తనకి వివాహ ప్రయత్నాలు జరుగుతూండగా గురుదక్షిణ నీయదలచి సాయంకాలం చక్కగా అలంకరించుకుని పళ్ళెంతో బంగారు నాణాలు పట్టుకెళ్ళి ఆయనకు నమస్కరించి యిలా అంది "గురువర్యా నేను మీదగ్గర విద్యనేర్చాను  ఈ రాత్రి నాకు వివాహం జరగబోతూంది వివాహమైన తరువాత నేను మీ యింటికి రాకూడదు  మీరీ దక్షిణస్వీకరించి నేను వివాహం చేసుకోడానికి కనుజ్ఞ యివ్వండి "

ఆ గురువామె సౌందర్యాన్ని చూసి కామపీడితుడై - "నాకీధనమక్కరలేదు  నీ అనుగ్రహముంటే చాలు " అన్నాడు  అతనికి కోపమొచ్చిందేమో అనుకుని 'ధనమక్కరలేనిచో ఏమి కావాలి? ఇస్తాను చెప్పండి " అందామె

తీరా అడిగాక యివ్వవేమో? '

'తప్పకుండా యిస్తాను, అడగండి " అందామె.

'నీలాటి వారు మాటతప్పరు  నిన్ను చూసినప్పుడల్లా నాలో కోరిక జనించేది  నీకు యౌవనం రాలేదని ఊరుకునేవాడిని  ఇప్పుడు నా మనసు నిన్ను కోరుకుంటూంది "అన్నాడు గురువు

ఆమె చెవులు మూసుకుందా మాటలు వినలేక "నీవు నాకు తండ్రివికావా? ఇలాటి కోరికకోరవచ్చునా? నీనీచబుద్ధి తెలిసింది ఇష్టమైతే డబ్బుతీసుకో లేకపోతే మానెయ్ " అని వెళ్ళిపోయిందామె

ఆ గురువు ఆమె అలా తిరస్కరించి పోయినందుకు ఆమెకు మగనితో సంబంధం లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ పట్టాడు

దీర్ఘదర్శిచే తేబడిన కత్తికీ సుశీలకీ శుభముహూర్తంలో పెళ్ళయింది  ఆమె అత్తారింటికి వెళ్ళిపోయింది

గురువు పండితుడి వేషంలో విష్ణుచిత్తుని దర్శనం చేసుకున్నాడు అతనిది తన అత్తవారి ఊరే కావడం వల్ల రాజు 'మీరాజుకూతురు

సుశీలగురించి మీకేమైనా తెలుసా? ఆమె గుణశీలాలెలాటివి?" అని అడిగాడు

'అయ్యా. నేనారాజుగారి కొలువులో ముఖ్యపండితుణ్ని సుశీలకు చదువు చెప్పిన గురువుని నేనే ఆమెగుణశీలాలు నాకు తెలిసినట్టామె తల్లితండ్రులకే తెలియవేమో. మీరడిగినప్పుడు నిజం దాచకూడదు. ఆమె కప్పుడప్పుడు మూర్ఛరోగం వొస్తూంటుంది మీ వంటి వారికామెతగదు " అన్నాడు గురువు – మనసులో సంతోషిస్తూ

విష్ణుచిత్తుడి మనసు చివుక్కుమంది దానికలాటి రోగముందా. శీలం గురించి కూడా అనుమానంగానే చెప్పారు. పాండ్యరాజెంత మోసం చేశాడు ఇన్నాళ్లూ పెళ్ళి చేసుకోక చివర కొక రోగిష్టిదాన్ని పెళ్ళాడానా సరే ఆరాజు చేసిన మోసానికి ప్రతీకారంగా – అతని కూతురి మొహం చూడను చూశానో మాతృద్రోహం చేసినట్లే ' అని ప్రతిజ్ఞ పూనాడు

సుశీల అత్తవారింటికి రాగా – ఆమెభర్త ఆదరించక కోపంతో ఆమె ఉండడానికొక మేడ చూపించాడు. పరిచారిక ఆమెను ఆమేడలో ఉంచింది. సంవత్సమైనా ఆమెకు భర్త దర్శనం కాలేదు అప్పుడామె దీర్ఘదర్శికి కబురుపంపి యిలా అంది 'వివాహమై ఏడాదిగడిచినా నాకు నాభర్త దర్శనం కాలేదు ఆయనకు నామీద కోపమేమో? కారణం నాకు తెలియదు. మీరూ రాజుగారూ చక్కని మిత్రులు మీవద్ద నాకు కూడా కొంచెం చనువుంది కనక యీ విషయం చెప్పాను యదార్థం చెప్పండి."

"తల్లీ! నాకివేమియూ తెలియదు. రాజు నీయందనురాగం కలిగున్నాడనే అనుకున్నాను. పరమ సాధ్వీఅయిన నీలో దోషమే ముంటుంది? అతని అభిప్రాయం కనుక్కొని చెబుతాను " అని మంత్రి – తరువాత రాజుదగ్గర యీ సంగతి కదిపాడు

రాజు అపరిమితమైన కోపంతో "మరెప్పుడూ యిటువంటి ప్రసంగం తేవద్దు " అని కచ్చితంగా చెప్పేశాడు

మంత్రి సుశీలతో 'నీభర్తకు నీమీ దెందుకో కోపంగా ఉంది. కారణం తెలుసుకుని మెల్లగా అతని మనసును నీపైకి మళ్ళిస్తాను " అన్నాడు

సుశీల గురువు, చేసిన దానితో తృప్తిపడక మళ్ళీ ఒకనాడు విష్ణుచిత్తుని వద్ద కొచ్చి "విక్రమసేనుడనే రాజుకూతురు దేవయాన అతిచక్కని 'దని చెప్పి పొగిడాడు రాజతని మాటలకు మోసపోయి ఆమెను తనకి పెళ్ళిచేయమని బతిమాలాడు గురువు విక్రమసేనుడి వద్దకు వెళ్ళి విష్ణుచిత్తుని పలువిధాల పొగిడి అతనికి దేవయాననివ్వడానికి అంగీకరింపజేశాడు

తిరిగివచ్చి "అయ్యా మీకింతవరకూ పెళ్ళికాలేదని చెప్పాను అలాకాకపోతే అతను తన పుత్రికనివ్వడు కనుక యిప్పుడున్న భార్యను అడవిలో వదిలేసే ఏర్పాటు చేయండి". అన్నాడు

దీర్ఘదర్శికి సుశీల నడవికి పంపడం యిష్టంలేకపోయినా రాజశాసనం ధిక్కరించలేక అడవిలోనే విశాలమైన మేడకట్టించి పరిచారికల నేర్పాటు చేశాడు సుశీల మరణించ ప్రయత్నించగా ఆమెకు మంచిమాటలు చెప్పి విరమింపజేశాడు

విష్ణుచిత్తుడు దేవయానని పెళ్ళాడినా ఆమెరూపం అతనికంత అపురూపంగా తోచలేదు ఒకనాడతడు వేట కేర్పాటు చేయమంటే దీర్ఘదర్శి సుశీల ఉన్న అడవిలోనే వేట కేర్పాట్లు చేశాడు

వేట ముగియకుండానే పెద్ద గాలివాన మొదలయింది నిలువునా తడిసి, చలికి వొణుకుతూ ఒక చెట్టుకింద నిలబడ్డారు రాజూ, మంత్రీ అప్పటికే సేన చెల్లాచెదురై పోయింది వారు నిలుచున్న చెట్టు కొమ్మలు ఫెళఫెళ మంటూ విరిగిపడసాగాయి

దైవం అలా అనుకూలించినందుకు దీర్ఘదర్శి చాలా సంతోషిస్తూ – "దేవా ఈ ప్రాంతంలో ఒక రాజకుమార్తె నివసిస్తూందనీ, ఆమె మార్గస్థులకి సదుపాయాలు చేస్తుందనీ విన్నాను అక్కడికి వెళ్దామా?" అని అడిగాడు

"ఈ రాత్రి అన్నము, పొడిగుడ్డలు యిచ్చువారెవరయినా దైవసమానులే పదండి – అన్నాడు రాజు

మంత్రి అతన్ని కొంతసేపటూ ఇటూ తిప్పి చీకటిపడేవేళకా మేడకి తీసుకెళ్లాడు సుశీలకు అంతకుముందే కబురు పంపాడు ఆమె మేడంతా దీపాలతో అలంకరించి ఉంచింది.

రాజు ఆమేడ చూసి ఆశ్చర్యపోతూ 'ఈవింతసౌధమెవరిది? ఇందులో ఉండే చిన్నదెవరు? ఎవరికూతురు? మగనితోడనే ఉన్నదా?" అని ప్రశ్నించాడు

"దేవా ఈమె మళయాళ దేశ చక్రవర్తి కుమార్తె అనీ, విహారార్థం యిక్కడి కొచ్చి గాలిబాగుందని మేడకట్టుకుందనీ విన్నాను ఈమె మగడెక్కడున్నాడో, ఉన్నాడో, లేదో నాకు తెలియదు మార్గస్తులకి మంచి సదుపాయాలుచేస్తుందట కొన్నాళ్లుండి తనదేశం వెళ్ళిపోతుందట ఐనా అవన్నీ మనకెందుకు? ఈరాత్రికి భోజనం పెట్టి పొడిగుడ్డలిచ్చిన చాలదా?" అన్నాడు మంత్రి.

ఆమేడ ద్వారపాలకుల వద్దకు వెళ్లి పరిస్థితి చెప్పగా, వారు ఆవర్తమానాన్ని యజమానురాలైన సుశీలకి చెప్పారు. ఆమెవారిని సత్కరించి స్వాగతించడానికి పరిచారికలను పంపింది వారు పట్టువస్త్రాలిచ్చారు. అవి కట్టుకుని సంతోషిస్తూ – "దుఃఖం తరువాతి సుఖమే సుఖము ఎండలో నడిచాక దొరికేనీడ ఎంతహాయి!" అంటూ వేదాంతం చెప్పాడు రాజు

సుశీల బంగారు పాత్రలలో పంచభక్ష్యపరమాన్నాలు వడ్డించింది. ఆమె చాలా అందంగా అలంకరించుకుని మెరుపు తీగెలా కదులుతూ మధ్యమధ్య రాజు వేపు ఓరచూపులు చూస్తూ స్వయంగా వడ్డించింది. ఆమెను చూసి రాజుకి మదన వికారాలు కలిగాయి.

భోజనమయ్యాక మంత్రి రాజును ఒక గదిలోకి తీసుకెళ్ళాడు హంసతూలికాతల్పం మీద రాజును కూర్చో బెట్టాడు పరిచారికలు తాంబూలం అందించివెళ్లారు.

అప్పుడు రాజు – "మిత్రమా! నువ్వు తలవంచుకుని భోంచేశావు నీకేమీ తెలియదు. కాని ఆ చిన్నదెంత అందంగా ఉందని! ఆమెచిన్నె లేమని చెప్పేది? మోహినీదేవతలా ఉందామెరూపం నన్నిక్కడికెందుకు తీసుకొచ్చేశావు? నేనక్కడికివెళ్లాలి. అక్కడ పురుషులెవరూలేరు ఏం జరిగినా మంచిదే." అన్నారు.

ఆ మాటలకు - తన పథకం పారుతూందని మనసులో సంతోషిస్తూ - " మీసౌందర్యం చూసి ఎవరు కామించరు? నీ రూపం చూసే యీామె సుశీల ఐననూ నిన్ను మోహించింది పరిచారికలు వెళ్ళిపోయారు ఆమె ఒంటరిగానే ఉంటుంది దాహం నెపంతో వెళ్ళి ఆమె మనసెరిగి మసలుకొండి - ' అన్నాడు మంత్రి

రాజు వంటశాలలోకి వెళ్ళగా ఆవెం అక్కడే ఉంది దాహంకావాలని అడిగిన రాజు కా ప్రౌఢ నర్మగర్భంగా తన కోరిక తెలియజేసింది రాజు కూడా చతురతతో మాట్లాడాడు వాళ్ళిద్దరూ ఏకమయ్యారు.

రాత్రి గడిచింది రాజుకామెను వదలివెళ్ల బుద్ధికాక విష్ణుచిత్తుడి అనుమతితో అక్కడకొన్నాళ్లుండి పోయి ఆమెతో స్వర్గసుఖాలనుభవించాడు

అప్పుడతని భార్య దేవయాన పరిచారకులను రాజువద్దకు పంపి తన విజ్ఞాపన తెలియపరిచింది రాజు తాను వెళ్ళడానికనుజ్ఞ యిమ్మని సుశీలను కోరగా ఆమె తొందరగా తిరిగి రావాలంటూ ఆనవాలుగా అతని ఉంగరం తీసుకుంది

సుశీల గర్భవతి ఐ చక్కని బాలుణ్ని కంది దీర్ఘదర్శి ఆ బాలుడికి కామపాలుడని పేరు పెట్టించాడు అతను పెరిగాక అంతేయీడు గల తనకొడుకుతో కలిపి ఒక గురువుదగ్గర చేర్పించాడు మంత్రికొడుకు బుద్ధిసాగరుడు రాజుకొడుకు కామపాలుడు, కొన్నాళ్లు సుశీల దగ్గరా కొన్నాళ్ళు దీర్ఘదర్శి దగ్గరా ఉండేవారు వారిద్దరిదీ ఒకే ప్రాణం అన్నంతమైత్రి.

విద్యాభ్యాసమయ్యాక వారు దేశాటనం వెళ్లారు సుశీల దగ్గరున్నారని మంత్రి సుశీల భావించడంతో వారు వెళ్ళిన కొన్నాళ్లకి కాని విషయం తెలియనేలేదు కొడుకు గురించి సుశీల దిగులు చెందగా మంత్రి ఊరడించి, వారిని వెదుకుటకు మనుషుల్ని పంపాడు

రాజు ఒకనాడు సుశీల వద్దకు వచ్చాడు కుశలప్రశ్నలు వేయగా - "మీరిక్కడి నుంచి వెళ్ళి పదహారేళ్లయింది ఇప్పటికి నాకుశలం

కావలసివచ్చింది ఒక ఉత్తరమైనా పంపలేదు' - అని నిష్ఠూరమాడగా రాజు ఏదో మిష చెప్పాడు. భోజనం చేసి - పడకగది చేరాక -

"నీ గురించి నాకేమీ తెలియదు ఒంటరిగా యీ అడవిలో ఎందుకున్నావు? నీ మగడెవరు? ప్రేమగానే ఉంటారా?" అంటూ అడిగాడు.

"ఇద్దరికీ ఒకరి గురించి ఒకరికి తెలియవలసిందే. మీకు భార్యలెందరు? వాళ్లయందు ప్రేమగానే ఉంటారా?" అని తిరిగి ప్రశ్నలు వేసింది

'నాకిద్దరు భార్యలు పెద్ద దానిగురించి తలవక్కర్లేదు రెండవది దేవయాన దీనికి నాయందు మక్కువ ఎక్కువే కాని అది చక్కనిదికాదు. సంతానం లేదు." అన్నాడు రాజు.

"పెద్ద భార్య గురించి ఎందుకు తలవక్కర్లేదు? ఆమె ఏం తప్పుచేసింది?"

అతను తప్పించుకోజూశాడు కాని ఆమె వదలలేదు. చివరకిలా చెప్పాడు."

ఆమెపేరు సుశీల. దాని తండ్రి కపటముగా చిత్రపటం రాయించి పంపాడు అందంగా ఉందనుకుని పెళ్ళాడాను కాని - దానికి చదువు చెప్పిన గురువు నావద్ద కొచ్చి దానికి మూర్ఛరోగం ఉందనీ, గుణశీలాలు మంచివి కావనీ చెప్పాడు ఆమె ముఖం చూడనని ప్రతిజ్ఞ చేసి దానినడివికి పంపాను అదేమయిందో ఎక్కడుందో తెలియదు మరినీ వృత్తాంతమేమిటి?"

ఆమె - గురువెంత దుర్మార్గుడు! - అని విచారిస్తూ - మౌనంగా ఉండిపోయింది "నీకథ చెప్పవేం?" రాజు రెట్టించాడు

"దేవా! మీరు చెప్పిన వానిలో నాకు కొన్ని సందేహాలు కలగడం వలన మౌనంగా ఉన్నాను గురువు రోగిష్ఠి అని చెప్పగానే నిజానిజాలు తెలుసుకోకుండా విడచి పెట్టెయ్యడమేనా అతనికేదయినా కోపముండి అలాచెప్పి ఉండొచ్చుకదా? మీరు చేసిన పని నాకు నచ్చలేదు - " అందామె నిర్మొహమాటంగా

ఆ మాటలకు - తన పథకం పారుతూందని మనసులో సంతోషిస్తూ - " మీసౌందర్యం చూసి ఎవరు కామించరు? నీ రూపం చూసే యీమె సుశీల ఐననూ నిన్ను మోహించింది పరిచారికలు వెళ్ళిపోయారు ఆమె ఒంటరిగానే ఉంటుంది దాహం నెపంతో వెళ్ళి ఆమె మనసెరిగి మసలుకొండి - " అన్నాడు మంత్రి

రాజు వంటశాలలోకి వెళ్ళగా ఆమె అక్కడే ఉంది. దాహంకావాలని అడిగిన రాజు కా ప్రౌఢ నర్మగర్భంగా తన కోరిక తెలియజేసింది రాజు కూడా చతురతతో మాట్లాడాడు వాళ్ళిద్దరూ ఏకమయ్యారు.

రాత్రి గడిచింది రాజుకామెను వదలివెళ్ల బుద్ధికాక విష్ణుచిత్తుడి అనుమతితో అక్కడకొన్నాళ్లుండి పోయి ఆమెతో స్వర్గసుఖాలనుభవించాడు

అప్పుడతని భార్య దేవయాన పరిచారకులను రాజువద్దకు పంపి తన విజ్ఞాపన తెలియపరిచింది రాజు తాను వెళ్ళడానికనుజ్ఞ యిమ్మని సుశీలను కోరగా ఆమె తొందరగా తిరిగి రావాలంటూ ఆనవాలుగా అతని ఉంగరం తీసుకుంది

సుశీల గర్భవతి ఐ చక్కని బాలుణ్ని కంది దీర్ఘదర్శి ఆ బాలుడికి కామపాలుడని పేరు పెట్టించాడు అతను పెరిగాక అంతేయీడు గల తనకొడుకుతో కలిపి ఒక గురువుదగ్గర చేర్పించాడు మంత్రికొడుకు బుద్ధిసాగరుడు, రాజుకొడుకు కామపాలుడు కొన్నాళ్లు సుశీల దగ్గరా కొన్నాళ్ళు దీర్ఘదర్శి దగ్గరా ఉండేవారు వారిద్దరిదీ ఒకే ప్రాణం అన్నంతమైత్రి.

విద్యాభ్యాసమయ్యాక వారు దేశాటనం వెళ్లారు సుశీల దగ్గరున్నారని మంత్రి, సుశీల భావించడంతో వారు వెళ్ళిన కొన్నాళ్లకి కాని విషయం తెలియనేలేదు కొడుకు గురించి సుశీల దిగులు చెందగా మంత్రి ఊరడించి, వారిని వెదుకుటకు మనుషుల్ని పంపాడు

రాజు ఒకనాడు సుశీల వద్దకు వచ్చాడు కుశలప్రశ్నలు వేయగా - "మీరిక్కడి నుంచి వెళ్ళి పదహారేళ్లయింది ఇప్పటికి నాకుశలం

కావలసివచ్చింది . ఒక ఉత్తరమైనా పంపలేదు"- అని నిష్ఠూరమాడగా రాజు ఏదో మిష చెప్పాడు భోజనం చేసి - పడకగది చేరాక -

"నీ గురించి నాకేమీ తెలియదు ఒంటరిగా యీ అడవిలో ఎందుకున్నావు? నీ మగడెవరు? ప్రేమగానే ఉంటారా?" అంటూ అడిగాడు

"ఇద్దరికీ ఒకరి గురించి ఒకరికి తెలియవలసిందే. మీకు భార్యలెందరు? వాళ్లయందు ప్రేమగానే ఉంటారా?" అని తిరిగి ప్రశ్నలు వేసింది

"నాకిద్దరు భార్యలు పెద్ద దానిగురించి తలవక్కర్లేదు రెండవది దేవయాన దీనికి నాయందు మక్కువ ఎక్కువే కాని అది చక్కనిదికాదు. సంతానం లేదు ' అన్నాడు రాజు.

"పెద్ద భార్య గురించి ఎందుకు తలవక్కర్లేదు? ఆమె ఏం తప్పుచేసింది?"

అతను తప్పించుకోజూశాడు కాని. ఆమె వదలలేదు. చివరకిలా చెప్పాడు '

ఆమెపేరు సుశీల. దాని తండ్రి కపటముగా చిత్రపటం రాయించి పంపాడు అందంగా ఉందనుకుని పెళ్ళాడాను. కాని - దానికి చదువు చెప్పిన గురువు నావద్ద కొచ్చి దానికి మూర్ఛరోగం ఉందనీ, గుణశీలాలు మంచివి కావనీ చెప్పాడు ఆమె ముఖం చూడనని ప్రతిజ్ఞ చేసి దానినడివికి పంపాను. అదేమయిందో ఎక్కడుందో తెలియదు. మరినీ వృత్తాంతమేమిటి?"

ఆమె - గురువెంత దుర్మార్గుడు - అని విచారిస్తూ - మౌనంగా ఉండిపోయింది "నీకథ చెప్పవేం?" రాజు రెట్టించాడు.

"దేవా. మీరు చెప్పిన వానిలో నాకు కొన్ని సందేహాలు కలగడం వలన మౌనంగా ఉన్నాను గురువు రోగిష్టి అని చెప్పగానే నిజానిజాలు తెలుసుకోకుండా విడచి పెట్టెయ్యడమేనా అతనికేదయినా కోపముండి అలాచెప్పి ఉండొచ్చుకదా? మీరు చేసిన పని నాకు నచ్చలేదు - ' అందామె నిర్మొహమాటంగా.

"నిజమే అప్పుడు నేనలా ఆలోచించలేకపోయాను ఆసుశీల పటంలో వ్రాసినట్లే ఉండి ఉంటే నీలా ఉండేది ' అన్నాడు రాజు

'దేవా! మగవారేం చేసినా చెల్లుతుంది ఆ సుశీల నాకు స్నేహితురాలే దాని చరిత్రంతా నాకు తెలుసు. దానిలాటి చక్కనిదీ గుణవంతురాలూ భూమ్మీద లేదు వివాహదినం నాడు అలంకరించుకుని గురుదక్షిణ యివ్వడానికి వెళ్ళగా గురువది యిచ్చే కానుకలు కాదని తనతో క్రీడించమన్నాడు ఆమె అందుకంగీకరించక, ఆపళ్ళెం అక్కడే వదిలేసి యింటికి వచ్చేసింది ఆ కోపంకొద్దీ గురువు మీతో అలా అబద్ధాలు చెప్పి మనసు విరిచేశాడు ఒక్కటాలోచించండి. గురువు పనికట్టుకుని వచ్చి మీరడగకుండానే అలా చెప్పవలసిన అవసరమే ముంది? సుశీల అన్ని విధాలా సార్ధకనామధేయ. పాపం ఆమె తనగురువు చేసిన అవమానం నాకు చెప్పుకుని ఏడ్చింది–"

'అయ్యో! ఆ గురువు నన్ను మోసం చేశాడా? ఎంత తప్పు చేశాను – " అంటూ పరిపరివిధాల చింతిస్తున్న రాజుతో – "జరిగిపోయిన దానికి ఎంత విచారించినా ఏం లాభం? ఆమె యిప్పుడు నా అధీనంలోనే ఉంది సెలవైతే పిలుస్తాను" అంది.

'ఆమె యింత వరకూ నిర్దోషిగానే ఉంటే పిలిపించు ఆమె కాళ్ళమీద పడి నాదోషం మాపుకుంటాను ' అన్నాడు రాజు. అతని పశ్చాత్తాపం నిజమే అని ధ్రువపరచుకుని – "ఆ సుశీల నెక్కడినుంచో పిలిపించక్కర్లేదు. నేనే ఆసుశీలని." అంటూ జరిగినదంతా చెప్పింది.

అతనానందం పట్టలేక ఆమెను కౌగలించుకుని – "సాధ్వీ! చింతింపకు దైవప్రతికూలం వలన అలా జరిగింది. ఆ గురువెంత మోసగాడు కాలము, ప్రాయము వృధా అయ్యాయి." అన్నాడు.

ఆమెను పట్టణానికి తీసుకుపోయి, దీర్ఘదర్శికి అతను చేసిన మేలు కెన్నో విధాలకృతజ్ఞతలు తెలుపుకుని – సుశీలనొక చక్కని అంతః పురంలో ఉంచి కుమారుణ్ణి వెదకడానికి దూతలను దేశదేశాలకీ పంపాడు.

# ౨౫. భేరుండ పక్షి కథ

గోపాలా బుద్ధి సాగరుడూ, కామపాలుడూ యిల్లువదలి అడవులు దాటి మధ్యార్జునమనే పట్నంచేరుకున్నారు. ఒకపూటకూళ్ళ పెద్దమ్మింట్లో భోజనంచేసి - 'పీధరుగుమీద పడుకుంటాం " అన్నారు

ఆమె గుండె బాదుకుంటూ - "అమ్మో పైన పడుకుంటే గండభేరుండం వచ్చి చంపేస్తుంది లోపలే చోటుచూబిస్తాను." అంది.

"అది మమ్మల్నేమీ చెయ్యలేదు. దానికాయువుమూడితే మాదగ్గరకొస్తుంది " అంటూ, ఆమె ఎంత చెప్పినా వినకుండా వారుఅరుగు మీదే పడుకున్నారు

అర్ధరాత్రి ఆ పక్షి దొరికిన జీవులనన్నిటినీ చంపేస్తూ వీరి మీదకురికుంది బుద్ధిసాగరుడు తటాలున లేచి కటారితో దానిరెక్కలూ, తల నరికేశాడు అది గిల గిలా కొట్టుకుని చచ్చింది తెల్లవారు జామున వారు పెద్దమ్మకి చెప్పి వెళ్ళిపోయారు.

అప్పుడే అటువస్తున్న చాకలి చచ్చిపడున్న ఆ పక్షిని చూసి, రాజు చేసిన ప్రతిజ్ఞ జ్ఞాపకంరాగా .భుజానున్న గొడ్డలితో దాని అవయవాలు ముక్కలుగా నరికి పోగులు పెట్టాడు

అంతలో తెల్లవారింది. నలుగురూ వచ్చి చూసి అది చచ్చినందుకు సంతోషించి చాకలివానిని పొగిడి రాజుకీవార్త చేరవేశాడు

ఆదేశానికి రాజయిన సింహకేతుడు వచ్చి ఆ మాంసం ఖండాలు చూసి - "ఇన్నాళ్ళు చంపలేని వాడివి యిప్పుడెలా చంపావ్?" అని చాకలి వానినడిగాడు

అందుకతను - 'ఈ దినమున తెల్లవారు జామున అడవికి పోతూంటే యిది నామీద పడింది గొడ్డలితో నరికాను ' అంటూ వివరించి చెప్పాడు.

"సామాన్యుడు చంపలేడని, యీ పక్షిని చంపినవారికి నా కూతురినిచ్చి వివాహం చేస్తానని ప్రతిజ్ఞ చేశానే. ఈ చాకలికి ఎలా

యివ్వను? ప్రతిజ్ఞాభంగం కావించలేను ఈ పక్షిని వీడు చంపలేదను కుందామంటే, చంపినవాడు కనిపించడు ”

అని మనసులో మధనపడుతూనే వివాహ ప్రయత్నాలు చెయ్యమని ఆజ్ఞాపించాడు. ఆవార్త గ్రామమంతా వ్యాపించింది

పూటకూళ్ళమ్మ అదివిని – కొడుకుతో – జరిగినదంతా చెప్పగా అతనురాజువద్దకు వెళ్ళిచెప్పాడు. రాజతనికి బహుమతి యిచ్చి భేరుండపక్షిని చంపినవారిని వెదికి తీసుకురాడానికి నలుదిక్కులకూ మనుషులని పంపాడు

వారిలో కొందరు – ఒక సత్రంలో – పూటకూళ్లమ్మ చెప్పిన ఆనవాళ్ళు కల రాజకుమారులను గుర్తించి – “మీరీమధ్య భేరుండ పక్షిని చంపారా?” అని అడిగారు.

‘ఏం? అదినేరమా?” అన్నారు వారు.

రాజుగారి మనుషులు జరిగినదంతా చెప్పి “మీలో ఎవరాపక్షిని చంపారో వారికి రాజుగారు తన కూతురినిచ్చి షెళ్ళిచేస్తారు. సౌందర్యములోనూ సౌశీల్యంలోనూ ఆమెకామే సాటి.” అన్నారు

అందరూ కలసి రాజుగారి వద్దకు వెళ్ళారు బుద్ధిసాగరుడే పక్షిని చంపాడని కామపాలుడు చెప్పాడు రాజాచాకలిని పిలిపించి గద్దించగా – వాడునిజం చెప్పేశాడు వాడినురి తీయమని రాజు ఆజ్ఞాపించినా, రాజకుమారులు దయకలవారు కనుక వాడిని వదలెయ్యమన్నారు.

బుద్ధిసాగరుడు సుగుణవతికి తగినవాడని సంతోషిస్తూ రాజువారికి వివాహంజరిపించాడు కొన్నాళ్ళక్కడున్నాక, బుద్ధిసాగరుడు సుగుణవతికి నచ్చజెప్పి కామపాలుడితో మళ్ళీ దేశాటనానికి బయలు దేరాడు

ఒకరాత్రి వారు ఊరు వదిలారు. ఆ దారిలో ఎక్కడా పట్నమే కనిపించలేదు దారీ కనిపించలేదు ఎక్కడేనా నివాసయోగ్యమైన ప్రదేశముంటుందేమో అని వాళ్ళు నాలుగువేపులా చూడసాగారు

# ౨౬. శరభ సాళ్వము కథ

ఆ రాజకుమారులకు ఒకచోట విశాలమైన మర్రిచెట్టు కనపడింది దానికింద నేలంతా చక్కగా బాగుచేయబడి ఉంది మనుష్య సంచారం లేని యీ చెట్టుక్రింద యిలా శుభ్రంగా ఎలా ఉంది? రాత్రులెవరేనా వచ్చి ఉంటారా? – అనుకుంటూ వాళ్ళిద్దరూ చెట్టుకొమ్మెక్కి కూర్చున్నారు

సాయంత్రం అయ్యేసరికి – కోతులూ, ఎలుగుబంట్లూ వొచ్చి ఆనేలను మరింత శుభ్రం చేశాయి. కొంతసేపటికి నక్క, పులి, పంది, తోడేలు మొదలయినవి జాతికొకటి చొప్పున వచ్చి విరోధంకల జంతువులు కూడా ఒకదానితో ఒకటి ముచ్చట్లాడుకోసాగాయి అంతలో శరభ సాళ్వమనే అద్భుతమైన మృగం వచ్చింది జంతువులన్నీ లేచి స్వాగతం పలికాయి

జంతువులన్నీ ఆ మృగానికెదురుగా కూర్చున్నాయి దానిపక్క ఒక ఆసనం కాళీగా ఉంది అప్పుడామృగం – "అందరూవచ్చారు కాని నా మంత్రి రాలేదే. వచ్చుసమయంకూడా మించిపోయింది దాని గురించి మీలో ఎవరికేనా తెలుసా?' అని అడిగింది.

అప్పుడు నక్క యిలా చెప్పింది – "మీమంత్రి భేరుండం మధ్యార్జున మనే వూరిలోని జీవకోటిని తినేది నెలకిందట యిద్దరు రాజపుత్రులనది తినబోగా వారు దానిని చంపేశారు ఇది మాచుట్టాలు చెప్పారు నమ్మదగినవార్తే"

శరభ సాళ్వ అదివిని చాలా విచారించింది 'మనుషులు అసాధ్యులు దానిని చంపేశక్తి ఎవరికీ లేదనుకున్నాను నేను శ్రీరంగ పురంలో జీవహింస చేస్తున్నాను"

అప్పుడు నక్క యిలా చెప్పింది 'మనం ఏడాది కోసారి కలుసుకుంటాం. కిందటేడు వచ్చిన గంధ భేరుండం యీఏడు రాలేదు.

అలాగే ఈసారి వచ్చిన వాళ్ళలో వొచ్చేఏడెందరొస్తారో? దేవరవారుకూడా గంధభేరుండంలా జీవహింస చేస్తున్నట్లు చెప్పారు మాకు – దేవరకేదైనా ముప్పొస్తే మాగతేమిటని భయమేస్తోంది మీరు లేకపోతే మా జంతువుల మధ్య కట్టుండదు మృగజాతిలో కట్టుంటే మనుష్యులెంత? ఏలికా! మీరు శ్రీరంగ పురానికి వెళ్ళడమేనా మానీండి, లేదా మాకు ధైర్యమేనా చెప్పండి '

శరభసాళ్వము నవ్వి – "నాబల పరాక్రమాలు భేరుండం వంటివికావు దానికిలా కాక నాఆయువు నావద్ద కాక వేరొక చోటున్నది ఈ చెట్టుతొర్రలోని ఎలుకని చంపిన కాని నేను చావను ఈ అడవిలోనికి మనుషులు రానేరారు వచ్చినా వారికి ఎలుక సంగతి తెలియదు. తెలుసుకున్నా ఆహార పదార్థాన్ని తొర్రలోకి జారవిడిస్తే తప్ప అది బయటకు రాదు కనుక నాకేమీ ముప్పుండదు మీరు నిశ్చింతగా ఉండండి ' అంది. జంతువులానందించాయి

తెల్లవారేసరికి అక్కడ ఒక్క మృగం కూడా లేదు మృగభాష తెలిసిన ఆ రాజకుమారులు చెట్టుచివరవరకూ ఎక్కిచూసినా ఏజంతువూ కనపడలేదు వాళ్ళు శరభసాళ్వం చెప్పిన తొర్రవెదికి అందులో తాముతెచ్చిన మిఠాయుండ ఒకటి జారవిడిచారు. ఎలుక పైకొచ్చింది వారు దానిని పట్టుకుని తాళ్ళతో బంధించి శ్రీరంగ పురం బయలుదేరారు.

అక్కడొక బ్రాహ్మణుని యింట బసచేసి ఊరివిశేషాలడగ్గా అతను శరభసాళ్వం నుంచి ఎదుర్కొంటున్న ముప్పు గురించి చెప్పాడు

"ఆ మృగాన్ని చంపిన వాడికి రాజు తనకూతురు పద్మావతి నిస్తానని చెప్పాడు. రాత్రులు వీధిలో పోవడానికి వీలులేదు ఎందరో రాజకుమారులు దానిని చంపాలని వచ్చి తామే బలయిపోయారు దానికి '

మీ వూరి ఆపదను మేం తొలగిస్తాం ' అంటూ బ్రాహ్మణుడెంత చెప్పినా వినకుండా వాళ్ళిద్దరూ రాత్రి గస్తీ తిరగసాగారు " శరభసాళ్వం నోరు తెరుచుకుని వారి మీద పడబోయింది కామపాలుడు ఎలుకను గొంతు నొక్కి చంపగా ఆపక్షి నేలకూలి చచ్చింది తరువాత కత్తితో

దానిమెడనరికి – బ్రాహ్మణుని వద్ద కెళ్ళి తాము చేసిన కార్యం చెప్పారు. అతను రాజుకి తెలియజేయగా రాజు వారినెంతగానో పొగిడి – "మీలో ఎవరు దానిని చంపారో చెప్పండి, నాకూతురు నిచ్చి వివాహం చేస్తాను." అన్నాడు.

వారు తమగురించి వివరించారు. బుద్ధిసాగరుడికి రాజు తనకూతురు నిచ్చి వివాహం చేశాడు. కొన్నాళ్ళక్కడ ఆనందంగా గడిపి మళ్ళీ దేశాటనం సాగించారు.

## 27. చిత్రసేన కథ

చంద్ర గుప్తం అనే నగరంలో – కోట ప్రాంతంలో బుద్ధిసాగరుడు, కామపాలుడు తిరుగుతూంటే కామపాలుని శరీరంమీద శుభసూచకంగా ఒకతల వెంట్రుక పడింది అది బారకంటే ఎక్కువుంది

ఇంతపొడవైన జుత్తుకల ఆమె ఎంత సుందరో అనుకుంటూ తలపైకెత్తి చూసేసరికి – ఆ రాజుకూతురు చిత్రసేన జలకమాడి తల ఆరబెట్టుకుంటూ చెలికత్తెలతో ముచ్చట్లాడుతూ – క్రిందకి చూసింది ఇద్దరి దృష్టులూ కలుసుకున్నాయి

కామపాలుడు బుద్ధి సాగరుడితో ఆమె అందాన్ని తెగవర్ణించి ' – మళ్లీ ఆచంద్రబింబాన్ని చూసేవరకూ యిక్కడే ఉండిపోతా"నన్నాడు. తలవెంట్రుకను బట్టి ఆమె సౌందర్యం ఊహించాననీ, ఆమె చూపుని బట్టి అనురాగం కలిగే ఉండొచ్చనీ చెబుతూ కామపాలుడి ఉద్దేశాన్ని బుద్ధిసాగరుడు బలపరచి కొంతసేపుందామన్నాడు.

ఆమె, అతను మళ్ళీ చూసుకున్నారు. దానితో వారి సందేహాలు తీరిపోయాయి.

చిత్రసేన ఒక ఉత్తరం రాసి – పూలదండలో పెట్టి కామపాలుని మీదకు విసిరింది. దానిలో – "నాతండ్రి దుర్మార్గుడు పోతుటీగని కూడా అంతఃపురంలోకి రానివ్వడు నేను నీపై మోహాన్నాపుకోలేక పోతున్నాను.

నువ్వు బలవంతుడివైతే నన్ను రాక్షస వివాహం చేసుకొని తీసుకుపో లేదా గోడమీదుగా గొలుసువేసి దిగి నేనే నీ దగ్గరకు వచ్చేస్తాను. వ్యవధి లేదు కనుక వెంటనే జవాబివ్వు. ఇంతకంటె ఎక్కువ రాయలేక పోతున్నాను తప్పులుంటే క్షమించు " అని రాసి ఉంది

తొందరగా జవాబు రాయమని కామపాలుడు బుద్ధి సాగరుణ్ని తొందర చేసినా, అతను చక్కగా ఆలోచించి – "నాకు కూడా నీమీద అంత ప్రేమగానూ ఉంది నీ అందం నన్ను బందీని చేసింది కాని – నువ్వు సూచించిన మార్గాలు రెండూ సరైనవి కావు కొంచెం ఆగు నీ అంతఃపురానికే వచ్చి నిర్భయంగా నీతో క్రీడిస్తాను " అని జవాబు రాశాడు

బుద్ధిసాగరుడు రాజు విశేషాలు సేకరించాడు. అతను సూర్యప్రతాపుడనే రాజుకి కప్పంకడతాడని తెలిసి, యిద్దరూ అతని వద్దకువెళ్ళి తమవిద్యాపాటవంతో మంత్రిని మెప్పించి అతడు – "ఏంకావాలో కోరుకొండి." అనగా "సూర్యప్రతాపుని సేనాబలము బిరుదములు, కొన్ని దినాలు మాతో ఉండనివ్వండి. ' అని వేడుకున్నారు మంత్రి అంగీకరించి సేనాధిపతులను వాళ్ళతో వెళ్ళమన్నాడు.

బుద్ధిసాగరుడు సూర్యప్రతాపుడి వేషమూ, కామపాలుడతని భార్య వేషమూ వేసికొని చంద్రగుప్త నగరం చేరుకున్నారు అంతకుముందే – సూర్యప్రతాపుడు తనకింద దేశముల యోగక్షేమాలు చూడడానికి వస్తున్నాడనీ, ఆ రాజులు సిద్ధంగా ఉండాలనీ ఆజ్ఞాపత్రికలు పంపబడ్డాయి చంద్రగుప్తుడు రాజురాక కోసం ఎదురు చూస్తున్నాడు

వారు రాగానే అపూర్వమైన మర్యాదలు చేశాడు రెండు రోజులయ్యాక సూర్యప్రతాపుడు "మాకేమైనా కప్పమీయవలసి ఉన్నావా?" అని చంద్ర గుప్తుణ్నిడిగాడు

తానేమీ బాకీలేననీ, లెక్కలు చూబించగలననీ చెప్పాడు. అక్కర్లేదంటూనే ఏదో ఆలోచనలోపడినట్లూ అడగడానికి సందేహిస్తున్నట్లూ సూర్యప్రతాపుడు నటించగా –

'నేను మీ భృత్యుడిని నాకేం చెప్పదలచినా సందేహించకండి "
అన్నాడు చంద్రగుప్తుడు

మరేమీలేదు మేమిక్కడకు రాణితో కూడా వచ్చాం ఇక మీదటామెను తీసుకెళ్ళలేను మేము తిరిగి వచ్చేవరకూ మీ యింట్లో ఉంచాలి. నాదేవి వయసులో ఉంది ఆ వయసు కలవారు మీ యింట్లో ఉన్నారా?" అని కపట సూర్యప్రతాపుడడిగాడు

'చిత్రసేన అనునాకూతురు పదహారేళ్ళది దాని అంతఃపురము చాలా భద్రంగా ఉంటుంది మీరు దేవినామెతో పాటుంచవచ్చును వారికి ఏకొరతారానివ్వను మీరు తిరిగివచ్చునప్పుడామెను తీసికొని పోవచ్చును." అన్నాడు చంద్రగుప్తుడు

అప్పుడే మంచి ముహూర్తమని స్త్రీ వేషంలో ఉన్న కామపాలుణ్ని రాజువెంట పల్లకీలో అంతఃపురానికి పంపించాడు ఇలా అతను వొస్తాడని ముందే తెలిసిన చిత్రసేన పల్లకీలోంచి లేవనెత్తి అంతఃపురంలో ఉచితాసనం మీద కూర్చో బెట్టింది

అంతఃపురంలోపలి కెవ్వరూ పోకూడదని పరిచారికలకు చెప్పింది దానితో వారిద్దరే అయ్యారక్కడ. మూడు నెలలపాటు వాళ్ళనుభవించని సుఖంలేదు

బుద్ధిసాగరుడు సేనలను వెనక్కిపంపుతూ తాను పిలిచినప్పుడు రావాలని చెప్పి తాను కొంతదూరం పోయి తిరిగి చంద్రగుప్తం వొస్తూ బల్జివేషం వేసుకుని - "దూది యిస్తే స్వల్ప వెలకే అతిచక్కని పరుపులు కుడతాననీ, కోటగోడ ప్రక్కనే ఉంటా"నని ప్రకటించాడు దానితో అందరూ పరుపులలో దూది పీకి మరీ తెచ్చారు కోటగోడప్రక్కనే దూదిరాసి పోగయింది మంచి ముహూర్తంచూసి పరుపులు కుడతానన్నాడు బుద్ధిసాగరుడు

ఒకనాడు చంద్రగుప్తుని కుమారుడు సత్యవంతుడు దాసీవల్ల తన చెల్లెలు స్త్రీ వేషంలో ఉన్న పురుషునితో అంతఃపురంలో క్రీడిస్తూందని

విని - అర్ధరాత్రి అంతఃపురానికి వెళ్ళి - గది తలుపులు మూసి ఉంటే బద్దలు కొట్టాడు కామపాలుడి కతన్ని గెలవగలిగిన శక్తి ఉన్నా వేరొక అద్దం తలుపులు బద్దలుకొట్టి దూదిరాసి మీదకు గెంతాడు. సత్యవంతుడు కూడా దుమికాడు అప్పుడతన్ని కత్తితో చంపి- బుద్ధిసాగరుణ్ని లేపి జరిగినదంతా చెప్పగా అతనా దూదిరాశికి నిప్పంటించి - కామపాలుడితో కలసి సూర్యప్రతాపుడి పట్నానికి వెళ్ళాడు బల్లీ కనపడకపోడం, దూది తగలబడిపోడం చూసి పౌరులు పశ్చాత్తాపడ్డారు

మర్నాడు చిత్రసేన తన తండ్రి కిలా వ్రాసింది 'తండ్రీ నిన్నరాత్రి మా అన్న నా అంతఃపురానికి వచ్చి సూర్యప్రతాపుని భార్యని చూచిమోహించాడు నేను వారించినా వినకుండా ఆమెపై పడబోగా ఆమె కోటగోడదూకి పారిపోయింది ఇంతవరకూ రాలేదు "

అది చదివిన చంద్రగుప్తుడికి మతిపోయింది సూర్యప్రతాపుడు తిరిగివొచ్చి నప్పుడతనికేం చెప్పాలి? జరిగినది తెలిస్తే అతను తనని బ్రతకనిస్తాడా?

ఒక ప్రాతఃకాలంలో భేరీధ్వనులు వినిపించాయి దానితో రాజుగుండెలు పగిలిపోయాయి సూర్యప్రతాప మహారాజు తోటలోవిడిది చేసి తనని తీసుకు రమ్మన్నాడనగానే ముఖం చిన్నది చేసుకుని వణుకుతూ వెళ్ళాడు

చంద్రగుప్తుని గౌరవించి - 'ఇన్నాళ్ళూ నా భార్యని కాపాడినందుకు చాలా కృతజ్ఞతలు నాకామెను చూడాలని ఆత్రంగా ఉంది వెంటనే రప్పించు -" అన్నాడు మహారాజు అతను నీళ్ళు నములుతూంటే - 'నా మాటలు వినపడలేదా? ' అని గద్దించాడు

చంద్రగుప్తుడు వొణికిపోతూ - 'నాకొడుకు సత్యవంతుడు మీ భార్యని మోహించి ఎక్కడికో తీసుకుపోయాడు మీరేం శిక్షవిధించినా భరిస్తాను-' అన్నాడు తలవంచుకుని

నిన్ను నరికేస్తాను ' అని కత్తందుకున్నాడు మహారాజు కోపం పట్టలేక మంత్రి అతన్ని శాంతింపజేసి - 'పొరపాటెవరికైనా వస్తుంది నిదానించండి " అన్నాడు

"నా భార్యని నీకొడుకు అధీనం చేసి నాటకాలాడితే ఊరుకుంటానా? అయ్యో .నా భార్యంటే నాకెంతో ప్రేమ ఆమె లేకుండా ఎలా బతికేది?"

"నేనబద్ధమాడలేదు మహారాజా! మోసమూ చెయ్యలేదు. నిజంగా అలాగే జరిగింది. మీరంగీకరిస్తే. ఆమె వయసుతో పాటిదే అయిన నాకూతురు చిత్రసేనను మీకిచ్చి వివాహం చేసి నా తప్పు దిద్దుకుంటాను నా కూతురు అతిచక్కనిదే." అంటూ రాజు అతని పాదాలమిద పడ్డాడు.

మొదట కాదన్నా చివరకాతని మాటకంగీకరించి - "నీ కూతురు నిజంగా చక్కనిదా కాదో చూస్తాను రప్పించు " అన్నాడు.

చంద్రగుప్తుడు బతుకు జీవుడా అనుకున్నాడు. సూర్యపాలుడామెను పరిశీలించడానికి తన మంత్రివేషంలో ఉన్న కామ పాలుణ్ణి పంపాడు. వారిద్దరికీ ఏకాంతం లభించింది

"నీ సోదరుని చంపానని కోపం పెట్టుకోకు మనరహస్యం కాపాడడానికి అలా చెయ్యక తప్పలేదు." అని ఆమెకు చెప్పి కొంతసేపామెతో ప్రేమ మాటలాడాడు.

సూర్యప్రతాపుడు - "చంద్రగుప్తా! భార్యా వియోగ శోకంలో నేనొక తప్పు చేశాను. పరపురుషుడైన మంత్రిని నీ కూతురు చక్కదనాన్ని చూడ్డానికి పంపాను. మరొకరికంట పడిన దానిని పెళ్ళాడడం యిష్టంలేదు నామంత్రి కామపాలుడు నాకు మిత్రుడు మాత్రమే కాదు. నాకంటె చాలా అధికుడు. నీకూతురినతనికిచ్చి పెళ్ళిచెయ్యి" అన్నాడు.

"నేను మీ సెలవు ప్రకారం నడుచుకునేవాడిని దేవా!" అన్నాడు రాజు వినయంగా.

"నేను త్వరలో వెళ్ళిపోవాలి తొందరగా వివాహం జరిపిస్తే చూసి వెళ్తాను "

చంద్రగుప్తుడు తన గండం గడిచినందుకు సంతోషిస్తూ తొందరలో ముహూర్తం పెట్టించి వివాహం జరిపించాడు. కొత్త దంపతులు

పదిరోజులు ఆనందంగా గడిపాక – సేనలను పంపించేసి మళ్ళీవొస్తామని వాళ్ళిద్దరూ మళ్ళీ దేశాటనం బయలు దేరారు

ఒకనాడు శ్రీరంగపురం సమీపంలో చల్లగాలి వీస్తూందని ఒక చెట్టుక్రింద చేరగా కామపాలునికి నిద్ర పట్టేసింది చెట్టుమీదున్న పక్షులలో ఆడది మగపక్షిని విశేషాలు చెప్పమని అడిగింది

"విశేషాలు లేవు కాని చెట్టుకింద పడుకున్న అతనత్తవారింటికి వెళ్ళడంతోటే కోట బురుజు విరిగి మీద పడి మరణిస్తాడు ' అంది మగపక్షి

"అయ్యో! ఆగండము తప్పితే .?' అడిగిందాడపక్షి

"రాత్రి భోజనం చేస్తూంటే తొలిముద్దలో చేపముల్లు గొంతుక కడ్డంపడి చనిపోతాడు "

"ఆ ప్రమాదం కూడా దాటితే?

"భార్యతో తాంబూలం తింటూండగా తొలి ఆకులోని పురుగువల్ల చచ్చిపోతాడు "

"అదికూడా దైవసంకల్పం వల్ల దాటగలిగితే?'

"అది దాటదు తప్పకుండా అతను భార్య చేతిలోనే చస్తాడు. చస్తాడు చస్తాడు " అని ముమ్మారు చెప్పి – "మనమాటలు వినినవారు యీ రహస్యం అతనితో చెబితే – రాయి ఐపోతారు సుమీ " అని ఆడపక్షిని వెంట బెట్టుకుని ఎగిరిపోయింది

పక్షిభాష ఎరిగిన బుద్ధిసాగరుడు నెత్తిమీద పిడుగు పడ్డట్లే చలించిపోయాడు ఈ ఆపద నాకు రాక నా మిత్రుడి కెందుకొచ్చింది? పక్షిమాట తప్పదు నేను మిత్రవియోగం భరించలేనే సరే జరగబోయేది జరుగుతుంది అని మనసు కుదురు పెట్టుకున్నాడు

అంతలో కామపాలుడు నిద్రలేచాడు 'మిత్రమా నాకు నిద్రలో ఒక పాడుకలొచ్చింది " పగటికలలు నిజంకావు " అన్నాడతను

"నువ్వెందుకలా విచారంగా ఉన్నావు

"ఏమీ లేదు కాని..మనం శ్రీరంగపురం వెళ్లొద్దు " అన్నాడు

"ఎందుకని? నాకు పద్మావతిని చూడాలని తహతహగా ఉంది. నా భార్య నాకోసం ఎంత విరహం అనుభవిస్తూందో."

'నా మాటవిను. మనం మరలిపోదాం. శ్రీరంగపురం వెళ్లొద్దు."

"కారణం చెప్పు "

ఇక అక్కడికెళ్ళక తప్పలేదు. బుద్ధిసాగరుడు కామపాలుడిని నీడలా అనుసరించిసాగాడు కోటవద్దకు రాగానే బురుజు పెళపెళమని విరిగింది బుద్ధిసాగరుడు తోసెయ్యడంతో అతనికి ప్రమాదం తప్పింది. అక్కడున్న వారతనికి పునర్జన్మే అన్నారు.

శ్రీరంగరాజు అల్లుడి రాకవిని ఎదురొచ్చి ఉచిత సత్కారాలతో ఆహ్వానించాడు ఆ రాత్రి మంచి పిండివంటలతో విందు చేశాడు. కామపాలుడు మొదటి ముద్దతినబోతుంటే 'అన్నా నాకీముద్ద పెట్టు, తినాలనుంది ' అని అడగగా మిత్రుడికిచ్చేశాడు అతడు దానిని తినకుండా దాచాడు.

భోజనాలయ్యాక – బుద్ధిసాగరుడు కామపాలుడితో "అన్నా! ఇల్లు వదిలింది మొదలు మనం పక్క పక్కన పడుకుంటున్నాం ఇవాళ నాకేమైందో, భయంగా ఉంది నువ్వు నీ భార్యతో పడుకుంటేనే నొంటరిగా ఎక్కడ పడుకోను?" అన్నాడు. "నా గదిలోనే పడుకుంటావు –" అన్నాడు కామపాలుడు

"చాలా కాలానికి వచ్చి భార్యతో కాక వేరే గదిలో పడుకుంటా నంటే భావ్యం కాదు నీ గది దగ్గరే నాకు మంచం వేయించు."

" నాగదిలోనే వేయిస్తాను."

"మనమెంత మిత్రులమైనా నీభార్యపద్మావతి అందు కంగీకరించదు. నీదగ్గరగావేయించు చాలు "

అంతలో పద్మావతి వచ్చి తన భర్తను హంసతూలికా తల్పంమీద కూర్చో బెట్టగా బుద్ధిసాగరుడు కూడా అతని పక్కనే కూర్చున్నాడు ఆమె సందేహాలని కామపాలుడు తీర్చగా – ఆమె భర్తకు

తాంబూలమందించింది బుద్ధి సాగరుడేదో మిషతో మొదటాకు తాను తీసుకున్నాడు

నిముషాలు గడుస్తున్న కొద్దీ తనమిత్రుడికి మరణకాలం దగ్గరపడుతూందన్న దుఃఖం ఎక్కువౌతూ బుద్ధి సాగరుడికి కన్నీళ్ళాగడం లేదు కామపాలుడు గదిలోకి వెళ్తూంటే కౌగలించుకుని "కామపాలా." అని అరుస్తూ ఏడిచాడు

"బుద్ధి-సాగరా! ఇంత పిరికి వాడివయ్యావేమిటి? మనని భూతాలేం చెయ్యగలవు? అంత భయంగా ఉంటే యిక్కడే పడుకో.' అన్నాడు.

చివరకు మిత్రుని వదలలేక వదలగా – కామపాలుడు గదిలోనికి వెళ్ళి చాలా అలసిపోయి ఉండడంవల్ల రతిక్రీడలు లేకుండానే గాఢనిద్రలో మునిగిపోయాడు

బుద్ధి సాగరుడికి పక్షిమాటలే గుర్తుకొస్తూ నిద్ర పట్టడం లేదు. కామపాలుడి భార్య చేతిలో ఎలా మరణిస్తాడో అని కిటికీలోంచి చూడ్డసాగాడు.

## 28. పద్మావతి కథ

పద్మావతి – భర్త గాఢ నిద్రలో ఉన్నాడని నిశ్చయం చేసుకుని గదిలో ఒక మూలనున్న తలుపుతెరచి నేల సొరంగంలోకి వెళ్ళింది బుద్ధి సాగరుడామెననుసరించ సాగాడు ఆమె అతోవన వెళ్ళి ఒక మేదరి యింటికి చేరి అరుగు మీద నిద్రపోతున్న అతన్ని లేపింది.

వాడు లేస్తూనే – "దౌర్భాగ్యులారా ఇంతాలస్యం చేశావేం? తిండితినకుండా మేలుకుని ఉండగలననుకున్నావా? "అని అరిచాడు కోపంగా ఆమె చెంపమీద ఒక దెబ్బ కొట్టాడు

పద్మావతి – తనభర్తా, బుద్ధి సాగరుడూ రావడం మొదలైనవి తన ఆలస్యానికి కారణాలని చెప్పి తాను తెచ్చిన పిండివంటలతనికి పెట్టింది అవి తిని – "తొందరపడి కొట్టాను, క్షమించు." అన్నాడు.

"నీదెబ్బ నన్ను బాధింపలేదు కాని. నా మొగుడు నన్ను తన వూరికి తీసుకుపోతాడేమో అని భయంగా ఉంది నువ్వేం చెబుతావో చెప్పు." అంది పద్మావతి.

"నీ మగడితో పోతే నేనేం చేస్తాను? ఆ. అతనిప్పుడు నీ గదిలోనే నిద్రపోతున్నాడు కదా మనకిక ఆటంకం లేకుండా దీనితో చంపేయ్." అని తన మేదరి కత్తినిచ్చాడు

"ఉపాయం బాగుంది. బుద్ధిసాగరుడుండడం కూడా మంచిదే అయింది." అంటూ ఆమె ఆకత్తి పట్టుకుని వెనక్కి వెళ్ళింది

బుద్ధిసాగరుడు తానే ముందుపోయి కామపాలుడ్ని లేపాలనుకున్నాడు కాని సొరంగంలో ఆమె అడుగుముందయింది. అతను చేరే సరికే ఆమె అతన్ని చంపేసింది

అది చూసి అతను, "హా! మిత్రమా. నన్ను ఒంటరి వాడిని చేసిపోయావా?" అంటూ ఏడవసాగాడు

అతను తనననుసరించి అంతా తెలుసుకున్నాడన్న సంగతి తెలియని పద్మావతి తన శరీరం మీదున్న నగలు విరజిమ్మి "అయ్యో! చెలులారా! వేగం రండి. ఈ బుద్ధి సాగరుడు నా మగనిని చంపి నన్ను బలాత్కరిస్తున్నాడు." అని గట్టిగా కేకలు వేసింది. చెలులందరూ క్షణంలో అక్కడికొచ్చి కామపాలుని కళేబరంపై పడి ఏడుస్తున్న బుద్ధి సాగరుణ్ణి చూశారు.

"అంతఃపురంలో తనకి కూడా మంచం వేయమంటే స్నేహంకొద్దీ యితను నాభర్తని విడవలేక అలా కోరాడేమో అనుకున్నాను. కాని నా భర్తకి నిద్రపట్టగానే అతన్ని చంపి తన కోర్కెను తీర్చమని బలాత్కారం చేయసాగాడు మీరొచ్చేసరికి ఏమీ ఎరగని వాడిలా నాభర్తశవం మీద పడి ఏడుపు నటిస్తున్నాడు." అంటూ ఏడిచింది పద్మావతి.

రాజుకా వర్తమానం తెలిసింది అతను తనకుమార్తె చెప్పినవి నమ్మి – అతనిని ఉరి తీయమని భటులనాజ్ఞాపించాడు

మర్నాడు పొద్దున్న రాజభటులు బుద్ధిసాగరుణ్ణి బంధించి వీధులవెంట తిప్పుతూ – 'వీడే మిత్ర ద్రోహి అంటూ వధ్య భూమికి తీసుకెళ్ళారు వాడుక ప్రకారం – "నిన్నిప్పుడు ఉరి తీయబోతున్నాం బతుకుతప్ప మరేదేనాకోరుకో తీరుస్తాం " అన్నారు భటులు

అప్పటికి స్పృహవచ్చిన బుద్ధి సాగరుడు 'నన్నెందుకు ఉరితీస్తున్నారు? నేనేం తప్పు చేశాను? నా ప్రాణమిత్రుడు కామపాలు డేడీ?" అని రోదిస్తూ అడిగాడు

"దొంగవేషాలు చాలించు " అంటూ వాళ్ళతనికి జరిగినదంతా చెప్పారు అది విని అతను 'సరే, నన్ను వేగంగా ఉరితీయండి, నా మిత్రుణ్ణి కలుసుకుంటాను " అన్నాడు భటులలో కొందరు బుద్ధిమంతుల కనుమానం వచ్చి – నిజంగా నువ్వు నేరం చేయకపోతే రాజుగారికి నిదర్శనం చూపు వదిలేస్తారు." అన్నారు చూపుతాను నన్ను రాజువద్దకు తీసుకెళ్ళండి " అని అతననేసరికి వారతన్ని రాజుముందుకి తీసుకెళ్ళారు రాజు ముందు 'అయ్యా! నా ప్రాణమిత్రుడు మరణించాడు కనుక నాకు ఉరిశిక్ష ఉచితంగానే ఉంది కాని నిందతో చావకూడదని నిజం చెప్పడానికొచ్చాను నాతో అంతఃపురానికొస్తే మీకు నిదర్శనాలు చూపుతాను " అన్నాడు

రాజంగీకరించగా బుద్ధి సాగరుడు పద్మావతి గదిలోని సొరంగమార్గం, మేదరి యింట ఆమె చేరవేసిన విలువైన వస్తువులు, కామపాలుణ్ణి నరికిన కత్తి మొదలైన వన్నీ చూబిస్తూ రాత్రి జరిగిన కథ చెప్పాడు

అది విన్న రాజు చాలా పశ్చాత్తాపంతో – బుద్ధి సాగరుని కాళ్ళమీద పడి తనని క్షమించమన్నాడు. తన కూతురిని ఉప్పు పాతర వేయమని భటుల నాజ్ఞాపించాఢు

బుద్ధిసాగరుడు – "రాజా! నాకెవరిమీదా కోపం లేదు మా దినాలలా ఉన్నాయంతే పద్మావతిని దండించినా కామపాలుడు మళ్ళీ బతికి రాడుకదా? ఆమె నేమీ చేయకండి నా మిత్రుడి కళేబరం ఒక పెట్టెలో అమర్చి యివ్వండి అది పట్టుకుని నేను తీర్థయాత్రలకి పోతాను " అన్నాడు

కామపాలుడి శరీరం చెడకుండా తైలంరాసి సరిపడిన పెట్టెలో ఆ మొండాన్నుంచి అతనికిచ్చాడు ధానిని నెత్తిమీద మోస్తూ – తన భార్య చర్యలెలా ఉన్నాయో చూద్దామని తన అత్తవారింటికి వెళ్ళాడు

శ్రీరంగరాజెందరెన్ని విధాల చెప్పినా వినకుండా ఆ మేధరినీ, పద్మావతినీ చంపించి ఉప్పుపాతర వేయించి – అపకీర్తి భయంతో కృశించి చనిపోయాడు.

## ౭౪. సుగుణావతి కథ

బుద్ధి సాగరుడత్తవారింటికి వెళ్ళేసరికి మామగారు చాలా సంతోషించి అతనిరాక కుమార్తెకు తెలియజేశారు రాత్రి విందు భోజనం అనంతరం భార్య అతని పాదాలొత్తుతూ – ఎంతో ప్రేమా, విధేయతా ప్రదర్శించింది. అతను గాఢంగా నిద్ర పోతున్నట్లు నటించాడు.

అతను నిద్ర పోతున్నాడని – ఆమె బంగారు పళ్ళాలలో తినే పదార్థాలు సర్ది యిల్లు వదిలింది బుద్ధి సాగరుడామెను వెంటాడుతూ – 'ఆవులు కొత్త గడ్డికోసం ప్రయత్నించినట్లు స్త్రీలు కొత్త పురుషుడి కోసం చూస్తారు ' అని తాను చదివిన శ్లోకం గుర్తు తెచ్చుకున్నాడు. ఆమె ఊరిబయటనున్న చండికాదేవి ఆలయానికి వెళ్ళి – "మాతా నీవల్లనే లోకాలు నిలచిఉన్నాయి నాకోరిక ప్రకారం నామనోహరుని రప్పించావు. ముందు జన్మలో కూడా వీరినేనాకు భర్తగా ప్రసాదించు నీ మొక్కుగా నా తలబలియిస్తున్నాను ' అంటూ దుర్గపాదాలకు తన తలకొట్టుకుని ప్రాణంవదలడానికి ప్రయత్నించింది

దేవి ఆమె పాతివ్రత్యానికాశ్చర్యపడుతూ 'సాధ్వీ నీ సాహసం మాను నీ సత్యానికి మెచ్చుకుంటున్నాను ఏదేనా కోరిక కోరుకో " అంది

"నామగడింటి దగ్గర పడుకున్నారు వారినడిగి వస్తాను " అని అనుమతికోరగా దేవి "సరే' అంది

ఇదంతా గమనించిన బుద్ధి సాగరుడు – ఆమె గుణ సౌశీల్యాలకు చాలా సంతోషించి – ఆమెకంటే ముందే యింటికెళ్ళి నిద్రపోతున్న వాడిలా నటించసాగాడు ఆమె మెల్లగా అతన్నిలేపి జరిగినదంతా అతనికి చెప్పగా – "నువ్వు చెయ్యి వేసినంత మాత్రాన చచ్చినవారు బతుకునట్లు వరమడుగు. అన్నాడు.

ఆమె వెళ్ళి దేవికది చెప్పగా – "జననమరణాలు పూర్వజన్మల కనుగుణంగా సంభవిస్తాయి వాటిని మార్చడం నాతరం కాదు. ఐనా నాకు కల శక్తి నంతా వినియోగించి – నువ్వు ముట్టుకున్నంతలో ఒక్కరు మాత్రం బ్రతుకుతారు తరువాత నావరం చెల్లదు అని మాయమై పోయింది.

అది ఆమె భర్తకు చెప్పింది అతను కొంతసేపామెతో ముచ్చట్లాడి – 'కాశీపురం నుంచి నీకోసం ఒక వింత వస్తువుని తెచ్చాను ఆపెట్టెలో ఉంది, చూడు. అని తాను తెచ్చిన పెట్టెను చూపించాడు

ఆమె ఆపెట్టెతెరచి చేతితో తడిమేసరికి కామపాలుడు నిద్రలోంచి లేచినట్లు లేచి – ఆసుగుణావతినే తనభార్య పద్మావతి అనుకొని – 'మిత్రమా నువ్వింత పాపకృత్యాని కొడిగట్టావా " అంటూ నిందించాడు బుద్ధిసాగరుడు నవ్వుతూ జరిగినదంతా వివరించాడు

'అన్నా, మనమిల్లు విడచి చాలాకాలమయింది మనదేశం పోదాం " అన్న కామపాలుడితో 'అలాగే కాని ఒంటిగాకాక భార్యలతో పోతే బాగుంటుంది " అన్నాడు బుద్ధి సాగరుడు

'జరిగినదానితో నాకు స్త్రీ జాతియందే విరక్తి కలిగింది నేనిక స్త్రీ ముఖం చూడను నాకు భార్య అక్కర్లేదు " అన్నాడు కామపాలుడు

"కామపాలా. నేనూ నీలాగే అనుకున్నాను. కాని సుగుణావతి ప్రవర్తన నా ఉద్దేశం మార్చేసింది". రాజభటులు వెళ్ళి చంద్రగుప్తుడికి కామపాలుని ఉత్తరం చూపించి చిత్రసేనను తీసుకువచ్చారు వాళ్ళు తమదేశం వెళ్తూ ఎన్నో మజిలీలు చేశారు. ఒక మధ్యాహ్నం ఒక చోటలో బస చేశారు. బుద్ధిసాగరుడు కూర్చున్న చెట్టుమీద - మునపటి పక్షులు వచ్చి మాట్లాడుకోసాగాయి.

## ౩౦. చిత్రసేన కథ

"ఈ రాత్రి వీరిలో కామపాలుడను వాని భార్య చిత్రసేన నిద్రపోతూంటే, రవిక విడియున్న స్తనం మీద ఒక నాగు విషం కక్కిపోతుంది. ఈమె వొత్తిగిలగానే - రెండవ స్తనంమీద ....... రక్తంతో విషం కలిసి చనిపోతుంది." అంది మగపక్షి. అప్పుడు అవి ఎగిరిపోయాయి.

ఆ మాటలు విన్న బుద్ధి సాగరుడు - రహస్యం చెబితే రాయయిపోతారని - అతను రాత్రి పాముకోసం ఎదురు చూడసాగాడు. చిత్రసేన, కామపాలుడు రతికేళిలో తేలి గాఢనిద్రలో మునిగి ఉండగా ఒక పామువచ్చి ఆమె స్తనములమధ్య విషం కక్కి వెళ్ళిపోయింది. బుద్ధి సాగరుడు మెల్లగా వెళ్ళి నాలుకకు గుడ్డ చుట్టుకుని ఆ విషాన్ని అద్దడం మొదలు పెట్టాడు

ఆమె అదిరిపడి లేచి తననెవరో ముట్టుకుంటున్నారని అరిచి అతను తనను కామిస్తున్నాడని నిందించింది.

కామపాలుడప్పటికేమీ అనకపోయినా అతనితో మాట్లాడడం మానేశాడు.

ప్రాణస్నేహితుడికంతకంటె శిక్ష ఏంకావాలి? అతను మాట్లాడకపోయినా బుద్ధిసాగరుడతన్ని వదల్లేదు. చిత్రసేన చెప్పగా - తనతో రావొద్దనేశాడు కామపాలుడు

రాజుకా వర్తమానం తెలిసింది అతను తనకుమార్తె చెప్పినవి నమ్మి - అతనిని ఉరి తీయమని భటులనాజ్ఞాపించాడు

మర్నాడు పొద్దున్న రాజభటులు బుద్ధిసాగరుణ్ణి బంధించి వీధులవెంట తిప్పుతూ - వీడే మిత్ర ద్రోహి' అంటూ వధ్య భూమికి తీసుకెళ్ళారు వాడుక ప్రకారం - "నిన్నిప్పుడు ఉరి తీయబోతున్నాం బతుకుతప్ప మరేదేనాకోరుకో తీరుస్తాం " అన్నారు భటులు

అప్పటికి స్పృహవచ్చిన బుద్ధి సాగరుడు 'నన్నెందుకు ఉరితీస్తున్నారు? నేనేం తప్పు చేశాను? నా ప్రాణమిత్రుడు కామపాలు డేడీ? ' అని రోదిస్తూ అడిగాడు.

'దొంగవేషాలు చాలించు " అంటూ వాళ్ళతనికి జరిగినదంతా చెప్పారు అది విని అతను 'సరే, నన్ను వేగంగా ఉరితీయండి నా మిత్రుణ్ణి కలుసుకుంటాను అన్నాడు భటులలో కొందరు బుద్ధిమంతుల కనుమానం వచ్చి - నిజంగా నువ్వు నేరం చేయకపోతే రాజుగారికి నిదర్శనం చూపు వదిలేస్తారు ' అన్నారు "చూపుతాను నన్ను రాజువద్దకు తీసుకెళ్ళండి ' అని అతననేసరికి వారతన్ని రాజుముందుకి తీసుకెళ్ళారు రాజు ముందు "అయ్యా! నా ప్రాణమిత్రుడు మరణించాడు కనుక నాకు ఉరిశిక్ష ఉచితంగానే ఉంది కాని నిందతో చావకూడదని నిజం చెప్పడానికొచ్చాను, నాతో అంతఃపురానికొస్తే మీకు నిదర్శనాలు చూపుతాను అన్నాడు

రాజంగీకరించగా బుద్ధి సాగరుడు పద్మావతి గదిలోని సొరంగమార్గం, మేదరి యింట ఆమె చేరవేసిన విలువైన వస్తువులు, కామపాలుణ్ణి నరికిన కత్తి మొదలైన వన్నీ చూబిస్తూ రాత్రి జరిగిన కథ చెప్పాడు

అది విన్న రాజు చాలా పశ్చాత్తాపంతో - బుద్ధి సాగరుని కాళ్ళమీద పడి తనని క్షమించమన్నాడు తన కూతురిని ఉప్పు పాతర వేయమని భటుల నాజ్ఞాపించాడు

బుద్ధిసాగరుడు - "రాజా! నాకెవరిమీదా కోపం లేదు మా దినాలలా ఉన్నాయంతే పద్మావతిని దండించినా కామపాలుడు మళ్ళీ బతికి రాడుకదా? ఆమె నేమీ చేయకండి నా మిత్రుడి కళేబరం ఒక పెట్టెలో అమర్చి యివ్వండి అది పట్టుకుని నేను తీర్థయాత్రలకి పోతాను ' అన్నాడు

కామపాలుడి శరీరం చెడకుండా తైలంరాసి సరిపడిన పెట్టెలో ఆ మొండాన్నుంచి అతనికిచ్చాడు ధానిని నెత్తిమీద మోస్తూ - తన భార్య చర్యలెలా ఉన్నాయో చూద్దామని తన అత్తవారింటికి వెళ్ళాడు

శ్రీరంగరాజెందరెన్ని విధాల చెప్పినా వినకుండా ఆ మేదరినీ, పద్మావతినీ చంపించి ఉప్పుపాతర వేయించి - అపకీర్తి భయంతో కృశించి చనిపోయాడు

## ౨౨. ఘృణావతి కథ

బుద్ధి సాగరుడత్తవారింటికి వెళ్ళేసరికి మామగారు చాలా సంతోషించి అతనిరాక కుమార్తెకు తెలియజేశారు. రాత్రి విందు భోజనం అనంతరం భార్య అతని పాదాలొత్తుతూ - ఎంతో ప్రేమా, విధేయతా ప్రదర్శించింది అతను గాఢంగా నిద్ర పోతున్నట్లు నటించాడు.

అతను నిద్ర పోతున్నాడని - ఆమె బంగారు పళ్ళాలలో తినే పదార్ధాలు సర్ది యిల్లు వదిలింది బుద్ధి సాగరుడామెను వెంటాడుతూ - 'ఆవులు కొత్త గడ్డికోసం ప్రయత్నించినట్లు స్త్రీలు కొత్త పురుషుడి కోసం చూస్తారు ' అని తాను చదివిన శ్లోకం గుర్తు తెచ్చుకున్నాడు ఆమె ఊరిబయటనున్న చండికాదేవి ఆలయానికి వెళ్ళి - "మాతా! నీవల్లనే లోకాలు నిలచిఉన్నాయి నాకోరిక ప్రకారం నామనోహరుని రప్పించావు. ముందు జన్మలో కూడా వీరినేనాకు భర్తగా ప్రసాదించు. నీ మొక్కుగా నా తలబలియిస్తున్నాను." అంటూ దుర్గపాదాలకు తన తల కొట్టుకుని ప్రాణంవదలడానికి ప్రయత్నించింది

దేవి ఆమె పాతివ్రత్యానికాశ్చర్యపడుతూ "సాధ్వీ! నీ సాహసం మాను. నీ సత్యానికి మెచ్చుకుంటున్నాను ఏదేనా కోరిక కోరుకో " అంది

"నామగడింటి దగ్గర పడుకున్నారు వారినడిగి వస్తాను." అని అనుమతికోరగా దేవి "సరే' అంది

ఇదంతా గమనించిన బుద్ధి సాగరుడు - ఆమె గుణ సౌశీల్యాలకు చాలా సంతోషించి - ఆమెకంటే ముందే యింటికెళ్ళి నిద్రపోతున్న వాడిలా నటించసాగాడు ఆమె మెల్లగా అతన్నిలేపి జరిగినదంతా అతనికి చెప్పగా - "నువ్వు చెయ్యి వేసినంత మాత్రాన చచ్చినవారు బతుకునట్లు వరమడుగు." అన్నాడు.

ఆమె వెళ్ళి దేవికది చెప్పగా - "జననమరణాలు పూర్వజన్మల కనుగుణంగా సంభవిస్తాయి వాటిని మార్చడం నాతరం కాదు. ఐనా నాకు కల శక్తి నంతా వినియోగించి - నువ్వు ముట్టుకున్నంతలో ఒక్కరు మాత్రం బ్రతుకుతారు తరువాత నావరం చెల్లదు." అని మాయమై పోయింది.

అది ఆమె భర్తకు చెప్పింది అతను కొంతసేపామెతో ముచ్చట్లాడి - "కాశీపురం నుంచి నీకోసం ఒక వింత వస్తువుని తెచ్చాను. ఆపెట్టెలో ఉంది, చూడు." అని తాను తెచ్చిన పెట్టెను చూపించాడు.

ఆమె ఆపెట్టెతెరచి, చేతితో తడిమేసరికి కామపాలుడు నిద్రలోంచి లేచినట్లు లేచి - అసుగుణావతినే తనభార్య పద్మావతి అనుకొని - మిత్రమా నువ్వింత పాపకృత్యాని కొడిగట్టావా " అంటూ నిందించాడు బుద్ధిసాగరుడు నవ్వుతూ జరిగినదంతా వివరించాడు.

"అన్నా! మనమిల్లు విడచి చాలాకాలమయింది మనదేశం పోదాం " అన్న కామపాలుడితో "అలాగే కాని ఒంటిగాకాక భార్యలతో పోతే బాగుంటుంది " అన్నాడు బుద్ధి సాగరుడు

"జరిగినదానితో నాకు స్త్రీ జాతియందే విరక్తి కలిగింది నేనిక స్త్రీ ముఖం చూడను నాకు భార్య అక్కర్లేదు." అన్నాడు కామపాలుడు

"కామపాలా, నేనూ నీలాగే అనుకున్నాను. కాని సుగుణావతి ప్రవర్తన నా ఉద్దేశం మార్చేసింది". రాజభటులు వెళ్ళి చంద్రగుప్తుడికి కామపాలుని ఉత్తరం చూపించి చిత్రసేనను తీసుకువచ్చారు. వాళ్ళు తమదేశం వెళ్తూ ఎన్నో మజిలీలు చేశారు. ఒక మధ్యాహ్నం ఒక చోటల్లో బస చేశారు. బుద్ధిసాగరుడు కూర్చున్న చెట్టుమీద - మునపటి పక్షులు వచ్చి మాట్లాడుకోసాగాయి.

## ౩౦. చిత్రసేన కథ

"ఈ రాత్రి వీరిలో కామపాలుడను వాని భార్య చిత్రసేన నిద్రపోతూంట్లే, రవిక విడియున్న స్తనం మీద ఒక నాగు విషం కక్కిపోతుంది. ఈమె వొత్తిగిల్లగానే - రెండవ స్తనంమీద . రక్తంతో విషం కలిసి చనిపోతుంది." అంది మగపక్షి. అప్పుడు అవి ఎగిరిపోయాయి.

ఆ మాటలు విన్న బుద్ధి సాగరుడు - రహస్యం చెబితే రాయయిపోతారని - అతను రాత్రి పాముకోసం ఎదురు చూడసాగాడు చిత్రసేన, కామపాలుడు రతికేళిలో తేలి గాఢనిద్రలో మునిగి ఉండగా ఒక పాముపచ్చి ఆమె స్తనములమధ్య విషం కక్కి వెళ్ళిపోయింది. బుద్ధి సాగరుడు మెల్లగా వెళ్ళి నాలుకకు గుడ్డ చుట్టుకుని ఆ విషాన్ని అద్దడం మొదలు పెట్టాడు.

ఆమె అదిరిపడి లేచి తననెవరో ముట్టుకుంటున్నారని అరిచి - అతను తనను కామిస్తున్నాడని నిందించింది

కామపాలుడప్పటికేమీ అనకపోయినా అతనితో మాట్లాడడం మానేశాడు.

ప్రాణస్నేహితుడికంతకంటె శిక్ష ఏంకావాలి? అతను మాట్లాడకపోయినా బుద్ధిసాగరుడతన్ని వదల్లేదు. చిత్రసేన చెప్పగా - తనతో రావొద్దనేశాడు కామపాలుడు

అది భరించలేక బుద్ధి సాగరుడు తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు "నిజం చెబితే తాను రాయైపోతాడు. చెప్పకపోతే అతనికి శత్రువులా మిగిలిపోతాడు ఏం చేయాలి? మిత్రుడికి శత్రువుకావడం కంటె రాయిగా ఉండడమే నయం' అనుకున్నాడు భార్యను కామించిన వానిమీద కోపం రావడం సహజమే తప్పతనిది కాదు."

నిజం చెప్పెయ్యాలని నిశ్చయించుకుని అతని వద్దకు వెళ్ళాడు "నువ్వలా పెడమొహం పెట్టకు నా మాటలు విను. నామాటలు పూర్తవడమేమిటి, నా జీవితమూ మనస్నేహమూ కూడా అంతమౌతాయి." అన్నాడు.

కామపాలుడు చెప్పమని తలూపాడు. బుద్ధిసాగరుడు జరిగినది చెబుతూంటే క్రమంగా శిల కాసాగాడు

అప్పటికి నిజం తెలుసుకున్న కామపాలుడు – మిత్రుణ్ని చంపుకున్నానే అని పరిపరి విధాల దుఃఖించాడు. ఇదంతా స్త్రీవల్లనే జరిగిందని నిందించుకుంటూ చనిపోవాలని ఆ శిల పాదాలకు తల బాదుకున్నాడు చిత్రసేన ఎలుగెత్తి ఏడవసాగింది.

అదివిని సుగుణవతి అక్కడికి వొచ్చి తన భర్త శిలా విగ్రహాన్ని పట్టుకుని రోదించసాగింది.

"చనిపోయిన నన్ను నా మిత్రుడు బతికించాడు నేనేమో అతన్ని చంపుకున్నాను. నేనతన్ని కలుసుకుందుకు పోతాను " అన్నాడు కామపాలుడు.

అప్పటికే సుగుణవతి భర్తకోసం చనిపోడానికి సిద్ధపడింది. ఆ హత్యానేరం కూడా తనదే ఔతుందని అతనిలా అన్నాడు. "మనం చచ్చిపోయినా అతను బ్రతికి రాడు కనుక మనం యీ అడవిలోనే తపస్సు చేసి అతని శిలాత్వం పోగొడదాం నీచిత్తశుద్ధి వలన అతడు తప్పకుండా బతుకుతాడు"

ఇద్దరూ యోగి, యోగిని వేషాలు ధరించి తపస్సు చేయసాగారు. చిత్రసేనను కామపాలుడామె యింటికి పంపేశాడు. ఆ అడవిలోనే తానుండి పోయాడు

గోపాలా! నువ్వు చూసిన విగ్రహం బుద్ధి సాగరుడిదే రహస్యం చెబుతూ నోరువరకూ శిల అయిపోయాక ఆపైన చెప్పలేదు కదా? అందుకే జుత్తు శిల అవక ఉండిపోయింది. నీకు సంతోషం కలుగుతుందంటే అతనికి పూర్వరూపం తెప్పిస్తాను.'' అన్నాడు మణిసిద్ధుడు

గోపాలుడు – "అతనికి మనిషిరూపం రావడం నాకానందమే" అన్నాడు

మణిసిద్ధుడు అక్కడికి వెళ్ళి మంత్రాక్షతలు విగ్రహంపై జల్లగా బుద్ధిసాగరుడు నిజరూపం లోనికివచ్చి, అతనివల్ల తనకి శాపవిమోచన మైందని సిద్ధుడి పాదాలమీద పడ్డాడు అతనికి తెలియడానికి మణిసిద్ధుడు గోపాలుడి చేత బుద్ధి సాగరుడికతని వృత్తాంతమంతా చెప్పించాడు.

అతను తన గురువుగారి అద్భుతశక్తిని మెచ్చుకుని అడవిలో యతివేషంతో తిరుగుతున్న కామపాలుడినీ, సుగుణవతినీ వెదికి అక్కడికి తీసుకొచ్చాడు వారు ముగ్గురికీ ఆనందంతో కొంతసేపటివరకూ నోటమాటే రాలేదు

సిద్ధుడి అనుమతి పొంది వారు ముగ్గురూ తమ దేశానికి వెళ్ళిపోయారు

# కాశీమజిలీ కథలు

## 11. వ మజిలీ

### 31. చేపనవ్విన కథ

ఒక తోటలో యినప చిక్కాలు వేలగట్టబడి వాటిలో – స్త్రీల ఆకారంలో ఉన్న పురుషులు గోపాలుడికి కనిపించారు గురువు ఆ కథ చెప్పసాగాడు

గోపా. ఇది కళింగదేశానికి రాజధాని అయిన ధర్మాపురం దీనికిరాజు సింహధ్వజుడు మంత్రి ప్రభుకీర్తి

ఒకనాడు కొందరు పల్లీయులు రాజువద్ద మంచి పారితోషిక మందాలని అద్భుతమైన చేపను ప్రాణంతోనే తెచ్చారు

వింత వస్తువులంటే ప్రీతికల రాజు దానిని మిత్రులకీ సామంతులకీ చూబించగా – మా జీవితంలో యింత పెద్ద చేపని చూడలేదు అని వారు మెచ్చుకున్నారు ఆ చేపని అంతఃపురానికి పంపి తన భార్యలకు కూడా చూబించాలనుకుని – "ఈ చేప ఆడదా, మగదా?" అని పల్లీయులనడిగాడు

ఆ రాజుకి చక్కనివారు యువతులూ అయిన భార్యలు అనేకులున్నారు స్త్రీలను నమ్మని అతను అంతఃపురంలోకి పోతుటీగ నయినా పోనివ్వకుండా కాపలా పెట్టాడు ఆ చేప మగదయితే అంతః పురంలోకి పోనివ్వరాదని అతని ఉద్దేశం

ఆ పల్లెవారు – "అయ్యా చేపలలో ఆడ, మగ కనిపెట్టడం కష్టం ఇది ఆడదో మగదో మాకు తెలియదు " అన్నారు

అప్పటికే కొన ప్రాణంతో ఉన్న ఆ చేప ఫక్కున నవ్వి – ప్రాణం వదిలింది చేప నవ్వుకి అందరూ ఆశ్చర్యపోయారు

రాజు - 'ఈ చేప ఎందుకు నవ్విందో చెప్పగలరా?" అని మంత్రినడిగాడు.

'మనుషుల నవ్వుకే కారణం తెలిసికోడం కష్టం అలాటిది ఇతర జాతిదయిన చేప నవ్వడానికి కారణం ఎవరు చెప్పగలరు? చిన్నపిల్లల్లా యిలాటి ప్రశ్నలు వేసి మంత్రులని చిన్నబుచ్చడం తగదు - 'అనేశాడు మంత్రి

ఆ మాటలకు కోపగించిన రాజు "మంత్రీ! చేప ఊరికే నవ్వదు ఆకారణం చెప్పడానికి నీ కారునెలలు గడువిస్తున్నాను. అప్పటికీ చెప్పలేక పోతే నీకు శిక్ష ఖాయం " అని అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు.

ఇంటికి పోయిన మంత్రి - పరిచారికలు, భార్య, లవంగి అనేకూతురు - ఎవరుపిలిచినా భోజనానికి లేవలేదు అప్పుడతని కొడుకు ప్రద్యుమ్నుడు వచ్చి బతిమాలగా - జరిగినది చెప్పి - "ఈ అవివేకపురాజు నన్ను ఉరితీయడమేకాక మన ఆస్తి అంతా లాక్కుంటాడట. మీరేమైపోతారో అని నా భయం"

అని కొడుకుని పట్టుకుని ఏడిచాడు

"ఇంకా ఆరుమాసాలు గడువుంది కదా నేను దేశాటనం చేసి ఆకారణం తెలుసుకుంటాను. మీరు ధైర్యంగా ఉండండి." అని చెప్పగా మంత్రి లేచి భోజనం చేశాడు.

"అన్నా నువ్వెప్పుడూ యిల్లు విడిచిన వాడవు కావు. ఒంటరిగా దేశాటనం చేయలేవు నీకు తోడుగా నేను వస్తాను " అని అన్నతో బయలు దేరుతానంది లవంగి

'ఈ ఆరు నెలలు మీరు కనపడరంటె నాప్రాణం యిప్పుడే పోతుంది " అన్న తండ్రి నెలాగో సమాధాన పరచి వాళ్ళిద్దరూ దేశాటనానికి బయలుదేరారు. గుర్రపు స్వారిలో ప్రావీణ్యత కలవాళ్ళు యిద్దరూ - ఊరూర తిరుగుతూ - చేపనవ్విన కారణం అడిగారు ఆ ప్రశ్న విన్నవాళ్ళు నవ్వారే తప్ప ఏమీ చెప్పలేదు.

ఆ వేళ – " ఈ వూరిలో చేపనవ్విన కారణం చెప్పగల బుద్ధిమంతులు కనిపించలేదు కాని – ఒక శాసనం చూశాను రాజు తన కూతురు ప్రభావతిని చదరంగంలో ఓడిస్తే ఆమెనిచ్చి పెళ్ళి చేస్తాడట ఓడిపోతే ఉరితీస్తారట నేను ఆమెతో ఆడతాను ' అన్నాడు

'జయాపజయాలు దైవాధీనాలు చదరంగంలో నువ్వు దిట్టవే ఐనా ఒకపనిమీదొచ్చిన మనం పక్కదారి పట్టడం ఎందుకూ?" అందిలవంగి

అతనామె నొప్పించి పోటీకి బయలు దేరాడు ఎవరెన్ని విధాల -- చెప్పినా ఉరి అని భయపెట్టినా వినక ప్రభావతితో చదరంగానికి కూర్చున్నాడు ఆమె సౌందర్యానికీ, తళుకులకీ మతిపోయి రెండాటలు ఓడాక బుద్ధివచ్చి మూడవ ఆటలో గెలిచాడు

రాజభటులు ప్రద్యుమ్నుణ్ని రాజు వద్దకు తీసుకుపోగా – "అయ్యా! శాసనంలో మూడాటలు ఓడిపోయినవారి నురి తీస్తారని ఉంది నేను మూడాటలు కాక రెండేఓడిపోయాను మళ్లీ ఆడితే అన్నాటలూ నేనే గెలుస్తాను నన్ను ఉరి తీయించడం శాస్త్రం ప్రకారం న్యాయం కాదు ' అన్నాడు

రాజు అతని మాటలు న్యాయమేఅని విచారించదగినవే అని భావించి సందేహం తీరేవరకూ ఉరితీయొద్దన్నాడు

'దాని అందం మోసం చేసింది కాని మా అన్నను చదరంగంలో గెలిచేవారు ముల్లోకాలలోనూ లేరు సరే నేను రేపుపోయి దానినోడించి అన్నను విడిపించుకుంటా ' నని నిశ్చయించుకుని – మర్నాడు పురుషవేషంలో వెళ్ళి ప్రభావతితో చదరంగపు పోటీకి తలపడింది పురుషవేషంలో ఉన్నా ఆమెస్త్రీకనుక ప్రభావతి అందచందాలూ తళుకు బెళుకులూ ఆమెనేమీ చేయలేక పోయాయి మూడాటలూ ఆమే గెలిచింది

రాజు సంతోషించి వారి వివాహానికి ముహూర్తం పెట్టేశాడు

మర్నాడు ప్రద్యుమ్నుడి విషయమై కొలువుతీర్చగా లవంగి కూడా పురుషవేషంలో వచ్చి కూర్చుంది. ప్రభావతిని గెలిచి తనకల్లుడు కాబోతున్న అతన్నే ధర్మం చెప్పమన్నాడు రాజు

అప్పుడు శాసనమంతా చదివి – “దీని ప్రకారం మూడాటల్లూ ఓడిపోతే ఉరితీయాలని ఉంది రాసినవాడి తెలివిలోపం అయినా యిప్పుడు మనమేమీ చెయ్యలేం ఇతనిని ఉరి తీయించడం న్యాయంగా కనిపించదు అతని చేత మళ్ళీ ఆడించి జయాపజయాలు నిర్ణయించడం ధర్మం ” అంది లవంగి

అతని ఉపన్యాసానికి సభ్యులంతా సంతోషించారు ప్రద్యుమ్నుణ్ని చెరవిడిపించేశాడు రాజు.

పురుష వేషంలో లవంగి ప్రద్యుమ్నుడిలాగే ఉండడంతో అతనికి ప్రభావతితో వివాహం నిరాటంకంగా జరిగిపోయింది కొన్నాళ్ళు హాయిగా గడిపాడు

అప్పుడు లవంగి అతనికి కర్తవ్యం గుర్తు చేసింది పితృభక్తి కలప్రద్యుమ్నుడు ఆ రాత్రే చెల్లెలితో కాలినడకన ఒక అడవి మార్గంలో ప్రయాణం చేయసాగాడు నడిచినడిచి అలసటతో ఒక చెరువు దగ్గర ఆగి మళ్ళీ నడచినా ఏ పల్లె కూడా కనపడలేదు

ఒక మర్రిచెట్టు కనపడగా దానికింద లవంగి నిద్రలోకి జారిపోయింది ఆమె లేచి నీరడిగితే అందించాలని చెరువుకోసం చూడదానికి ప్రద్నుమ్నుడు చెట్టెక్కుతూంటే ఒక నల్లత్రాచు పైకొమ్మకెక్కుతూ కనిపించింది తనకత్తితో దానితలను నరికి చంపేశాడు ఆ మానుచివర భైరవపక్షులు గూడుకట్టుకుని కాపరం చేస్తున్నాయి ఆడపక్షి సంవత్సరానికి రెండుసార్లు గుడ్లు పెట్టినా యీపాముతినేసేది. దానిని చంపాడు కనుక ప్రద్యుమ్నుడి కవి ఉపకారం చేయదలిచాయి

మగపక్షి అతని వద్దకు వెళ్ళి మానవభాషలో కృతజ్ఞతలు తెలిపి అతని వృత్తాంతం అడిగింది అతను తాము చేపనవ్వినకారణం

తెలుసుకుందుకు తిరుగుతున్నామని చెప్పగా – "ఈ కృష్ణ సర్పం తలలో ఒక మణి ఉంది దానిని తీసుకుని ఆ కోటమార్గంలో వెళ్తే పాతాళలోకం కనపడుతుంది. అక్కడ నీకొక సుందరి కనిపించి వశమౌతుంది. మణిని విడిచావో ఆమె దూరమౌతుంది ఆ పాతాళలోకవాసులు చేపనవ్విన కారణం చెప్పగలరనుకుంటాను–" అందా పక్షి అతను తలుచుకున్నప్పుడు రావడానికంగీకరించింది. ప్రద్యుమ్నుడు పాతాళలోకం వెళ్ళాడు

లవంగి మేలుకుని చూసేసరికి అన్నకనిపంచక పరిపరి విధాలయిన ఆలోచనలు భయ పెడుతూంటే 'ప్రదుమ్నా త అన్నా" అని అరుస్తూ అక్కడే తిరిగింది

చీకటి దట్టమైంది అది చాలనట్లు ఉరుములతో మెరుపులతో వర్షం కురువ సాగింది. ఆమె ఆమ్రి మానుకింద తలదాచుకుంది. ఆ మెరుపులో గుర్రంమీదెక్కి ఉన్న ఒక పురుషుడు కనిపించాడు. ఆమె సంతోషంతో "ప్రద్యుమ్నా! ఇటురా నేనిక్కడున్నాను ." అంటూ అరిచింది

ఆ కేకలు ఏదో పిశాచం మానవ భాషలో వేస్తున్నదని పారిపోదలచి – అంతలో మెరుపు మెరియగా లవంగిని చూసి ఆ పురుషుడు గుర్రం దిగి ఆమెను సమీపించాడు

"ఎక్కడికి పోయావు? నేనెంత భయపడ్డానో అన్నా!" అంటూ అతన్ని కౌగలించుకుంది నీకీ గుర్రమెక్కడ దొరికిందన్నా? మాట్లాడవేం?"

అతను వెళ్ళబోతూ – "నేను మీ అన్న ప్రద్యుమ్నుడిని కాను మత్స్య దేశాధీశుని కుమారుడిని జయసేనుడు నాపేరు మాతండ్రి వద్దంటున్నా వేట కొచ్చాను పెనుగాలి వీచి మా శిబిరాలెగిరిపోయాయి భోరున వర్షం మొదలైంది పిడుగులు పడి మా భృత్యులు కొందరు చనిపోగా మిగిలినవారు పారిపోయారు ఇంటికి పోదామని గుర్రమెక్కి దారి తప్పి యిటు వచ్చాను అంతలో నువ్వు కనిపించావు ఈమహారణ్యంలో ఒంటరిగా ఎందుకున్నావు? నువ్వెవరివి? నీ పేరేమిటి? నీవృత్తాంతమేమిటి?" అని అడిగాడు

లవంగి తన కథంతా చెప్పి – "నా అన్న ఎక్కడికి పోయాడో తెలియదు. నాకు చాలా భయం వేస్తూంది. నన్ను రక్షించు " అని వేడుకుంది.

అంతలో పెద్ద మెరుపు మెరిసి ఒకరినొకరు చూసుకుని ఎదుటవారి సౌందర్యాని కాశ్చర్యపోతూ ఒకరినొకరు వరించారు.

ముందుగా రాజకుమారుడే తన అనురాగాన్ని ప్రకటించగా ఆమె కౌగిలితో తన అంగీకారం తెల్పింది. ఆ రాత్రి వారు సుఖంగా గడిపారు.

తెల్లవారాక ఆమెను తీసుకుని అతను గుర్రంమీద తన వూరికి బయలుదేరాడు. కాని గుర్రందారితప్పి – ఎప్పటికీ తన దేశం జాడ కనపడకపోడంతో దైవంమీద భారంవేసి ముందుకి సాగిపోయాడు.

నాలుగోరోజున వారికొక ఉద్యానవనం కనిపించింది. వారక్కడ కొంతసేపు గడిపి – మళ్ళీ కొంతదూరం వెళ్ళేసరికి ఒకమేడ కనిపించింది. వాళ్ళు లోపలికి వెళ్ళారు అక్కడెవరూ లేరు. కాని ఆహార పదార్థాలున్నాయి. ఆకలితీర్చుకుని ఆమేడలోని విచిత్ర వస్తువులని చూశారు.

సాయంకాల మయ్యేసరికి ఎవరూ వెలిగించకుండానే కాంతులు విరజిమ్మాయి మణిదీపాలు ఆమేడలోని హంసతూలికా తల్పంమీద వాళ్ళిద్దరూ మన్మథకేళి జరిపారు. మూడు రాత్రులు గడిచాయి

నాలుగోరోజు లవంగి కన్ను తెరిచేసరికి ఆ ప్రాంతమంతా మహారణ్యంగా వుంది. మేడలేదు. జయసేనుడు లేడు అది కలకాదని నిజమే అనీ ధ్రువపరచుకునే సరికి ఆమె దుఃఖానికంతులేదు

కొంతసేపు దుఃఖంలో గడిచాక – ఈ లోకంలో సర్వకాలాలూ దుఃఖంతో కూడుకున్నవే ఏ సుఖమూ స్థిరం కాదు – అనే వైరాగ్యం కలిగింది దానితో తెగింపు వచ్చింది.

అరణ్యంలో నిర్భయంగా తిరుగుతూ దొరికింది తింటూ కాలికొద్దీ నడుస్తూంటే ఒకనాడొక గొప్ప కోట కనిపించింది. అది దేవాలయమని గ్రహించి - పెద్ద తలుపు మూయబడి ఉండడంతో చిన్న తలుపు తోసింది. అదృష్టవశాత్తూ అది తెరచుకుంది

ఆ దేవిపేరు సంయోగినీ దేవి దేవినవరాత్రులకు గొప్ప ఉత్సవం జరుగుతుంది అది చాలా రహస్య ప్రదేశం అని శాసనం చదివి తెలుసుకుంది పూజారి తలుపు వేసేటపుడు గడియ తగులుకోక కాని లేకపోతే యితర దినాలలో ఆలయంలోకి వెళ్ళడం బ్రహ్మతరం కూడా కాదు ఆలయంలో ఆహారపదార్థాలు, రత్నాలనగలు ఎన్నో ఉన్నాయి

లవంగి ఆ ఆహారం తింటూ తటాకం దగ్గరున్న మంటపంలో కూర్చుని తపస్సు చేసుకోసాగింది

ఒకనాడు దేవలోకం నుంచి రంభ మొదలైన వారాదేవిని సేవించడానికి వచ్చి లవంగిని చూశారు యోగినిగా కూడా ఆమె ఎంత అందంగా ఉంది - అనుకున్నారు ఊర్వశి దివ్యదృష్టితో లవంగి చరిత్ర గ్రహించి రంభ మేనకలకు చెప్పింది

చేప నవ్విన కారణమేమిటని మేనక ఊర్వశి నడిగింది ఆమె దివ్యదృష్టితో చూసి 'సింహధ్వజుడు తన భార్యలను మగవారి కంటపడకుండా కాపాడుతున్నా ననుకుంటున్నాడు కాని అంతఃపురంలో ఉన్న దాదులాడవారో మగవారో అతనికి తెలియదు దాదులలో కొందరు స్త్రీ వేషంలో ఉన్న పురుషులు వారు రాణులతో క్రీడిస్తున్నారు అది తెలియని మూఢునకు చేప ఆడదో మగదో కావలసి వచ్చిందా అని ఆ చేప నవ్వింది ' అంది.

"దివ్యదృష్టి కల నీకు తప్ప యితరుల కెలా తెలుస్తాయి యిలువంటి విశేషాలు? మరి - యీ చిన్నది అలాటి పనిమీద వచ్చి యిలా యోగినెందుకయింది దీని భర్తెవరు? ' అడిగింది మేనక

దీనిభర్త జయసేనుడు. మత్స్యదేశానికి పోతూ దారితప్పి యక్షిణీ వనానికి పోయారు నాలుగో రోజున యక్షిణి వచ్చి తనశయ్యమీద పడుకున్న ఆ యిద్దరినీ చంపకుండా చెరో అడవిలోకీ మార్చేసింది ”

“మరీమె తన భర్తనీ సోదరుణ్నీ కలుసుకుంటుందా?”
“సంయోగినీ దేవి సార్ధకనామ ధేయురాలు. వాళ్లు ముగ్గురూ త్వరలోనే కలుసుకుంటారు మనకి వేళయిపోయింది. పదండి.” అని వాళ్ళు వెళ్ళి పోయారు

వారి మాటలు విన్న లవంగి సంతోషం పట్టలేక పోయింది. దైవాన్ని ప్రార్ధించింది కృతజ్ఞతలు తెల్పింది

ఆమె తటాకంలో ఘునిగి – మంటపంలో జపానికి కూర్చోబోయేంతలో గోపురం దగ్గర మనుషుల సందడి వినిపించింది

ఆమె అటు తొంగి చూడగా – ఒక సుందరిని చెరపట్టి తెచ్చిన దొంగలను తరుముతూ ఒక బాలయోగి కనిపించాడు అతడు తన యోగదండంలో అమర్చబడిన కత్తితో దొంగలని నరికేశాడు

అతనా సుందరితో ఆలయంలోకి ప్రవేశించబోతున్నారని లవంగి మండపంలోకి పోయి జపం చేసుకోసాగింది. ఆ యోగి సుందరితో దేవాలయ ప్రదక్షిణం చేస్తూ జపంలో ఉన్న లవంగిని ఆశ్చర్యంగా చూసి ఆమె, తను లవంగికి మ్రొక్కి అక్కడ కూర్చున్నారు. లవంగిని అతనికి మ్రొక్కి ఏదో అడగబోయేంతలో – ఎక్కడినుంచో ఒక పురుషుడు తటాకంలో పడ్డాడు అచప్పుడు విని ముగ్గురూ త్రుళ్ళి పడ్డారు

బాలయోగి తటాకం లోంచి అతన్ని పైకి తెచ్చాడు, అప్పుడతను తనని రక్షించి నందుకు కృతజ్ఞతలు తెలిపి – “నావంటి పాపాత్ముడెక్కడా ఉండడు. నేను మరణించి ఉంటేనే బాగుండేది –” అని వైరాగ్యంగా అన్నాడు

బాలయోగి అతని వృత్తాంతం అడగగా – “అయ్యా. నేను ప్రభుకీర్తి అనే మంత్రికొడుకును. నా పేరు ప్రద్యుమ్నుడు. “అంటూ

పాతాళలోకం వెళ్ళడం అక్కడ పగలు రాత్రి అనే భేదం లేకపోడం చెప్పి – "అక్కడ ఒక ఉద్యానవనంలో ఒక సౌందర్య రాశిని చూశాను భైరవ పక్షి మాటలు గుర్తుకొచ్చి నాగశిరోమణిని చేతిలో పెట్టుకుని ఆమెను సమీపించాను ఆమె నన్ను చూసి ఎంతో సంతోషంతో కౌగలించుకుంది ఆ కౌగిలి సుఖంలో నన్ను నేను మరచిపోయాను. ఆమె నాకు ఎన్నో సేవలు చేసింది నేనామె వివరాలడిగాను

"ఆర్యా నాపేరు రత్నాంగి నేను నాగకాంతను నా తండ్రి మణిమంతుడు గొప్ప తపస్సుచేసి నన్ను కన్నాడు నేనొకనాడు చెలికత్తెలతో ఆటలాడుచుండగా అత్రేయుడనే మహర్షి వచ్చాడు ఆటలో పడిన నేనాయనను పలుకరించకపోవడంతో కోపగించి – 'ఈమెకు మనుషుడు భర్తఔతాడు!" అని శపించాడు. నేనాతని పాదాలమీద పడి ప్రార్థించగా మానవ భర్త నీకు తప్పదు. నాగశిరోమణి చేతికి ధరించిన వాడిని చేసుకో. సుఖపడతావు ' అని వెళ్ళిపోయాడు

నేటికి మీరు వచ్చారు గాంధర్వ వివాహం చేసుకుని సుఖాలనుభవించండి . అందామె. నేనామెతో స్వర్గసుఖాలనుభవిస్తూ అడవిలో విడచిన నాచెల్లిలి సంగతీ మాతండ్రి సంగతీ విస్మరించాను

ఒకనాడు రత్నాంగి నాకథ అడిగింది చెప్పి – లవంగి ఏమైందో అని పరుగెడుతూంటే – రత్నాంగి నవ్వి – "ఎప్పుడో వదిలివచ్చి యిప్పుడు తలచుకుని రక్షించడానికి వెళ్తున్నారా రేపు వెళ్దరు గాని" అని అంతఃపురానికి తీసుకుపోయింది

మర్నాడు నేనెంత చెప్పిన వినకుండా వెంట పడింది. మునుపు వచ్చిన తోవనే భూలోకానికి వచ్చాను. ఎంత వెదికినా లవంగి కనపడలేదు విచారించుతూ నడుస్తూ ఒక చెరువు కనపడగా బట్టలూ నగలూ వొడ్డున పెట్టి స్నానాలు చేయసాగాం అంతలో ఒక గెద్ద నాగశిరోమణిని తన్నుకుపోయి ఒక చెట్టుమీద వాలింది నేను రత్నాంగికి చెప్పకుండానే అచెట్టు దగ్గరకి పరుగెత్తాను. ఆ గ్రద్ద ఒక చెట్టునుంచి

మరో చెట్టుమీద కెగురుతూ రాత్రింపవళ్ళు నన్ను చాలాదూరం తీసుకు పోయింది వెన్నెల రాత్రులవడం వల్ల రాత్రి కూడా దానిని వెంబడించాను చివరకది ఉద్యానవనంలోని ఒక మేడమీద వాలింది అది మళ్ళీ ఎగర బోయేంతలో కాలిపట్టు వదలి ఆ మణి జారిపడింది.

పట్టరాని ఆనందంతో నేనామణినందుకున్నాను. కాని రత్నాంగిని వదిలి ఎంత దూరం వచ్చానో తెలుసుకోలేక విచారించాను. నాకు చాలా ఆకలిగా ఉండి ఆమేడలోకి వెళ్ళి వెదుకగా తినుబండారాలనేకం కనిపించాయి ఆకలి తీర్చుకుని గదులు తిరుగుతూంటే హంసతూలికాతల్పంమీద పదహారేళ్ళ అమ్మాయి నిద్రపోతూంది

నేనామె రూపాన్ని కాశ్చర్యపోయి ఆమెయిక్కడ ఒంటరిగా ఎందుకుందా అని ఆలోచిస్తూంటే ఆమె మేలుకుని పళ్ళు పటపట కొరుకుతూ – “ఈ మనుషులకి సిగ్గులేదు ఏం చేసినా మళ్ళీ వస్తూంటారు ’ అంటూ నేను చూస్తుండగానే తన శరీరంపెంచేసి – నాకాళ్ళు రెండు పట్టుకుని పైకెత్తి గిరగిరా తిప్పి విసిరేసింది. నీటిలో పడ్డాను కనుక బతికాను. ఇదీ నా వృత్తాంతం చెల్లెలిని పోగొట్టుకున్నాను. భార్యని దూరం చేసుకున్నాను. తండ్రిని బతికించుకోలేక పోయాను. ఇంకెందుకు బతకడం?” అని దుఃఖిస్తూంటే –

బాలయోగి చేత రక్షింపబడిన రత్నాంగి “హా,నాధా!” అంటూ అతన్ని కౌగలించుకుంది.

‘నువ్విక్కడికెలా వచ్చావ్?’ అని అతనాశ్చర్యంగా ప్రశ్నించాడు.”

అప్పుడామె – “మీరు నన్ను తటాకంలో వదలి మణికై పక్షి వెంట వెళ్ళాక కొంతసేపు మీకోసం చూసి మీరు వెళ్ళిన దారి వెంట వెళ్ళాను. మీ జాడ తెలియలేదు. రాత్రవగా ఒక చెట్టు క్రింద పడుకున్నాను. అలాగ మూడు రోజులు తిరిగాక నన్ను దొంగలు పట్టుకున్నారు.

జాముకిందట యీ పుణ్యాత్ముడు రక్షించగా వీరితో గుడిలోకి వచ్చి ఈ యోగిని వద్ద కూర్చున్నాక మీరు చెరువులో పడ్డారు " అని చెప్పింది

ప్రద్యుమ్నుడు ఆ బాలయోగికి నమస్కరించి "మీరు మమ్ముకాపాడిన దైవమే. మీరెవరు? మీ వృత్తాంతమేమిటి?" అని ప్రార్థించాడు

"మీ చరిత్రలు వింటే మీతో నాకు బంధుత్వమున్నట్లే తోస్తోంది నేను మత్స్య దేశ రాజకుమారుడు జయసేనుడను వేటకడవికి వచ్చి వర్షంలోనూ చీకటిలోనూ దారితప్పి తిరుగుతుండగా – 'ప్రద్యుమ్నా ఇటురా' అని పిలుపులు వినపడి అటు వెళ్ళగా ఒక సుందరి నన్ను ప్రద్యుమ్నుడిగా భావించి కౌగలించుకుంది నేను నా వివరములు చెప్పగా – ఒక పురుషుని ముట్టుకొని వేరొక పురుషుని పెండ్లాడ కూడదు కనుక అమె నన్ను గాంధర్వ వివాహం చేసుకుంది. ప్రద్యుమ్నుని వెదుకుతూ మీరిప్పుడు చెప్పిన ఉద్యానవనంలోని మేడ కనిపించగా లోపలికి పోయాం నాలుగోరోజు లేచేసరికి మేడాలేదు, లవంగీ లేదు.

భార్య వియోగం భరించలేక యోగినై తిరుగుతూండగా ఒక యోగి పుంగవుడు కనిపించాడు నేనతనికి మొక్కి నా భార్యతో వియోగం గురించి చెప్పగా – సంయోగినీ దేవి నారాధించినచో మరల కలుసు కుంటారని చెప్పాడు ఆ అరణ్యంలోని ఆలయానికి గుర్తులు చెప్పాడు నిన్నరాత్రి కిక్కడికి చేరాను దొంగలను వధించి యీమెను కాపాడాను. తరువాత యిక్కడికి వచ్చి చెరువులో పడిన నిన్ను తీశాను " అంటూ తన వృత్తాంతం చెప్పగా ప్రద్యుమ్నుడు అతన్ని కౌగలించుకుని – "నీవు నాబావవు లవంగి నా చెల్లెలు దానిని మనం ఎలా కలుసుకోగలమో?" అన్నాడు

అప్పుడు యోగిని – 'అన్నా ప్రద్యుమ్నా! నాథా నేనేలవంగిని ఈ సంయోగినీ దేవి దయవలన మన మందరమూ కలుసుకోగలిగాం " అంది

ప్రద్యుమ్నుడు పట్టరాని సంతోషంతో ఆమెను కౌగలించుకుని – అంతలోనే. "మనం తండ్రి మాట మరచిపోయాం. ఆయన బ్రతికుంటే మనందరిని చూసి ఎంత సంతోషించే వాడో –" అన్నాడు విచారంగా.

"అన్నా! దైవికంగా చేపనవ్వుకి కారణం నాకు తెలిసింది. కాని యీ సాయంకాలమే మన తండ్రిని ఉరితీస్తారే. ఇంటికెలా వెళ్ళగలం? తోవయినా తెలియదు " అని దుఃఖించింది లవంగి. ప్రద్యుమ్నుడు పూర్వం వరమిచ్చిన భైరవపక్షులని స్మరించాడు అవి వచ్చి వారిని తమ వీపుల మీదెక్కించుకుని అతి వేగంగా ఎగిరి సాయంకాలానికి ధర్మాపురం తీసుకెళ్ళాయి అప్పటికా గ్రామమంతా కల్లోలంగా ఉంది. మంత్రి నురికంబం దగ్గరకి తీసుకుపోతూంటే భార్య ఏడుస్తూ ఆ బండి వెనుక వెళ్తూంది "

"సంతానాన్ని చూసుకుంటాను. అంతవరకూ బతకనివ్వండి – అని మంత్రి కోరినా కాదనేశాడు రాజు "ఎంతదుర్మార్గం!" అని జాలిపడుతున్న ప్రజలమాటలు విని – ప్రద్యుమ్నుడు పక్షులను తిన్నగా ఉరికంబం దగ్గరకే నడిపించాడు.

సరిగ్గా ఉరితాటిలో మంత్రి తల బిగించే క్షణంలో అక్కడ పక్షులు వాలాయి "ఉరితీయకండి " అని ప్రద్యుమ్నుడరిచాడు ఉరిఆగింది

అక్కడి అధికారి – "ఉరితియ్యొద్దని అరిచావు నీకేం అధికారముంది? చేపనవ్విన కారణం చెప్పగలవా?" అని అడిగాడు

"చెబుతాను సభ తీర్చండి". అన్నాడు ప్రద్యుమ్నుడు

ఆ వార్త రాజుకి తెలియచేశారు

రాజు సభ ఏర్పాటు చేయగా లవంగి, ప్రద్యుమ్నుడు, జయసేనుడు, రత్నాంగి ఉచిత స్థానాలలో కూర్చున్నారు. మంత్రి కూడా రప్పించబడ్డాడు

చేప నవ్విన కారణం చెప్పడానికి ప్రద్యుమ్నుడు లవంగిని నియోగించాడు. భర్త అనుమతి పొంది ఆమె సభనుద్దేశించి యిలా చెప్పింది

'రాజా చేప నవ్విన కారణం చెప్పమని మీరు మంత్రి నాదేశించారు. నేనాయన కూతురు లవంగిని ఆకారణం వింటే మీకు కోపం రాక మానదు అందుకు నన్ను దండిస్తే మరో ఆపదొస్తుంది కనుక నన్ను క్షమిస్తానని ముందుగా అభయ పత్రిక యివ్వండి

"చేప నవ్విన కారణం నిదర్శనంగా చెబితే ఎంత అపరాదాన్నయినా క్షమిస్తాను " అని రాజు అభయమిచ్చాడు.

లవంగి యిలా చెప్పింది "భగవంతుడు పశు పక్షి మృగాదులకేదో ఒక జ్ఞానం మాత్రమే సంపూర్ణంగా యిస్తాడు మనుషులకి సకల విధాలయిన జ్ఞానాన్నీ యిస్తాడు అందుచేత మనుషులు మూర్ఖంగా ప్రవర్తిస్తే యితర జాతికి నవ్వొస్తుంది

పురుషులకంటె స్త్రీలకు కామమెక్కువ సాహసమూ ఎక్కువే అందుకే మీరు మీ స్త్రీలనంతఃపురంలో పెట్టి పోతు టీగను కూడా చొరనివ్వకుండా రక్షణ నేర్పరచి వారు పవిత్రంగా ఉన్నారని భావిస్తున్నారు.

పల్లీయులను అందుకే మీరు "చేప మగదా, ఆడదా?" అని అడిగారు. అది మగదైతే మీ భార్యలకు మానహానిజరుగుతుందని మీ భయం అది చూసే చేప నవ్వింది.

"ఇది మాకు తెలుసు. సరయిన సమాధానం చెప్పలేకపోతే మంత్రిని ఉరి తీయిస్తాను " గద్దించాడు రాజు

లవంగినవ్వుతూ - "మీ భార్యల అంతఃపురం కాస్తున్న స్త్రీలనందరినీ తక్షణం రప్పించండి వారి చేతే చెప్పిస్తానా కారణం " అంది

అంతఃపుర పరిచారకులందరూ అక్కడ ప్రవేశ పెట్టబడ్డారు ఆమె వారిని పరీక్షించి "వీరికి సన్నని బట్టలు కట్టి స్నానం చేయించి తీసుకురండి " అంది. అందుకు వాళ్ళొప్పుకోలేదు

రాజు శాసించగా - వాళ్ళు పలచని బట్టల్లో స్నానం చేసి వచ్చారు వాళ్ళలో పురుషచిహ్నాలే తప్ప స్త్రీత్వమే లేదు

'ఆర్యులారా! వీరిని చూశారు కదా. పాపం, యీ రాజుగారు అంతఃపుర స్త్రీలను ఆడవారిచే కాపలాకాయిస్తున్నాననుకుంటూ వచ్చారు. నాలాటి చేపను ఆడదా, మగదా అని అడుగుతున్నాడు. చేపను - నేనేం చెయ్యగలను? చెయ్యవలసిందేదో కాపలావాళ్ళే చేస్తున్నారు. అది తెలుసుకోలేని రాజెంత మూర్ఖుడో అని నవ్వింది చేప. ఇలాటి దేవ రహస్యం చెప్పమని అడగడం..చెప్పకపోతే ఉరి తీయించడం - మరింత మూర్ఖత్వం అలాటి మూర్ఖుడి దగ్గర కొలువు చేయడం మహాపాపం." అనేసి కూర్చుంది లవంగి

సభ చప్పట్లు కొట్టారు రాజు కళతప్పిన మొహంతో మంత్రి పాదాలమీదపడి - "నన్ను క్షమించు. నీకూతురు నాకు చక్కగా బుద్ధి చెప్పింది. నాకీ రాజ్యమొద్దు. నువ్వేపాలించు." అనగా మంత్రి ప్రసన్నుడై అతను సంతోషించే సమాధానం చెప్పాడు. రాజు అంతఃపుర ద్రోహులందరినీ యినప చిక్కాలలో పెట్టి బిగించి ఒక తోటలో వేలాడ దీయించాడు. తన భార్యలని నరికేస్తానని వెళ్తున్న రాజు నద్దుకుని లవంగి ఎంత చెప్పినా వినక వారిని పరాభవం చేసి - రాజ్యాన్ని మంత్రి కిచ్చేసి తపోవనానికి వెళ్ళిపోయారు.

మంత్రి తనవారందరితోనూ సుఖంగా గడిపాడు.

గోపా! నువ్వు చూచిన యినపచిక్కాలలోని వారు అంతః పురద్రోహులే ' అని ముగించాడు మణిసిద్ధుడు. అతను శిష్యుడితో - ఒకనాటి సాయంకాలానికి జగన్నాథం చేరుకున్నాడు.

మొదటి భాగం సమాప్తం

# కాశీ మజిలీ కథలు

## రెండవ భాగము ప్రారంభం

# కాశీమజిలీ కథలు

## 12 . వ మజిలీ

## 2. వ భాగం

మణిసిద్ధుడు జగన్నాథం చేరాక – "సుభద్రతో జగన్నాథు డిక్కడే జీవించాడు' ఈ జీవుడి ప్రసాదాన్ని నిందించిన వారు వెంటనే కష్టాలు పడతారు. ఈ స్వామిప్రభావం అద్భుతం." అన్నాడు "నేనూ మీవెంట వస్తాను – " అన్నాడు గోపాలుడు.

"అలాగే" అన్నాడే కాని తన భక్తిలో అతని మాట మరిచిపోయాడు మణిసిద్ధుడు అతను తిరిగి వచ్చేసరికి గోపాలు డలిగాడు 'నీ మాటమరిచిపోయాను లోపలికి పోదాం రా నీ కులదేవత వెన్నదొంగను చూద్దువుగాని."

"కావిడి మోతకేతప్ప నేను మీకిప్పుడు జ్ఞాపకం వొస్తానా? సరేలెండి మీ వెనుకనే నేనూ గుడిలోకి రాబోతే బెత్తాలవా రడ్డుపెట్టారు. స్వామీ – అని అరచినా మీరు వినిపించుకోలేదు. తరువాత ఒక పండా వచ్చి లోపలి సమ్మర్దం తగ్గగానే గుడిలోకి పంపాడు

దేవుని చూసిన మొదట నాకేమీ తెలియలేదు కళ్లూ, మొహమూ కల మూడు మొండి విగ్రహాలే కనిపించాయి నలుగురిలా నేనూ మొక్కేశాను అంతలో బెత్తాల వారు నన్ను బయటకు పంపేశారు. నేనెక్కడా యిలాటి వింత దేవుళ్లని చూడలేదు. దీనివెనుకేదో కారణం ఉండకపోదు అదేమిటో చెప్పండి. అన్నాడు గోపాలుడు

# ఇంద్రద్యుమ్నుని కథ

నిరావతి అనే పట్నంలో ఇంద్రద్యుమ్నుడనే రాజుండేవాడు అతని భార్య చంద్రసేన

ఒకనాడారాజు కొలువుతీరి ఉండగా కొందరు కిరాతకులు వచ్చి - పులిగోళ్ళు నెమలి పింఛాలు, కస్తూరి మొదలైన వస్తువులు కానుకలుగా యిచ్చి -

“దేవరా! మేము వింధ్యాటవిలో ఉంటాము మాకు చిన్నతనం నుంచే బాణాలు వేయడం అబ్బుతుంది కనక మేము మృగాలకు భయపడకుండా బతుకుతాం కాని, యీమధ్య ఒక పెద్ద సింహం అడవిలో తిరుగుతూంది అలాటి దాన్ని మేమెప్పుడూ చూళ్ళేదు అది మమ్మల్ని పెట్టే బాధలన్నీ యిన్నీ కావు దానిని చంపాలంటే తమరే రావాలి ” అని వేడుకున్నారు

రాజు చిరునవ్వు నవ్వుతూ “భయపడకండి మాకు అడవులు తిరుగుతూ వేటాడాలనే ఉంది దారిచూబించడాని కిద్దరుండి మిగిలిన వారు పొండి, మేం వస్తాం. అన్నాడు వేటకి అన్నీ సిద్ధం చెయ్యమని మంత్రికి చెప్పాడు. అంతఃపురానికి వెళ్ళేసరికి రాణి ఎదురొచ్చి కూర్చో బెట్టింది. అప్పుడొక సఖి రాణికి ఆమె కల గురించి రాజునడగమని జ్ఞాపకం చేసింది

రాణి - “నాథా తెల్లవారు జామున నాకో కలవచ్చింది. అది మిమ్మల్నడగాలని ఏమీ మరచిపోకుండా రాసి ఉంచాను. చూడండి” అంటూ ఆపత్రం అందించింది

రాజది చదివి బాగా ఆలోచించి తలపంకిస్తూ ” తొందరలో మనకి వియోగం కలుగుతుంది చాలా కష్టాలు పడ్డాక గొప్పకీర్తి వస్తుంది అన్నాడు

రాణి అతన్ని కౌగలించుకుని మనకి వియోగమా’ అంటూ ఏడ్చింది

"ఊరికే అన్నాను కాని కలనిజమౌతుందా! రేపు వేటకెళ్ళి పెద్ద సింహాన్ని తెస్తాను అంతవరకూ జాగ్రత్తగా ఉండు." అన్నాడు.

"మిమ్మల్ని విడచి ఉండలేను. మీరు వేటయినా మానేయండి, లేదా నన్నూ మీతో తీసుకునయినా వెళ్ళండి"?

"వాళ్ళకి మాటిచ్చాను వెళ్ళక తప్పదు. సరే నువ్వురా" అన్నాడు రాజు

మంచి ముహూర్తంలో బయలు దేరి కొన్ని రోజులు ప్రయాణం చేసి వాళ్ళు వింధ్యాటవి చేరారు. అక్కడ తిరుగుతూ వింతపిట్టలనూ జంతువులనీ రాణికి చూబించాడు. అంతలో సాయంత్రమైంది "సింహం ఎక్కడ? దాని గుర్తులేమిటి?" అడిగాడు రాజు.

"ఈ పాటికే వొచ్చి భీభత్సం చెయ్యాలి దేవరా! తమరొస్తున్నారని అది భయపడి రావడం మానేసిందేమో." అన్నారు కిరాతకులు.

"అదికాదు. ఎక్కడేనా దాగొని ఉండవచ్చు అడవి నల్లకల్లోలం చెయ్యండి. వలలు పన్నండి. వేటకుక్కల నుసి కొల్పండి జంతువులను వేటాడండి" అని తానునూ భార్యా శిబిరంలో ఉన్నారు.

ఉదయమయింది. వాళ్ళు వచ్చి – "మీరు చెప్పినట్లే చేశాం. కాని ఆ సింహం జాడలేదు మావేటలో దొరికిన వింత జంతువులివిగో" అని రాజుకీ రాణికీ చూబెట్టారు.

"మనం నగరానికి పోదాం సేనలను సిద్ధం చెయ్యండి ' అని రాజు అంటూంటే – దూరంనుంచి – "హా ప్రాణనాథా! ఏమై పోతివి? నేఎంత పాపాత్మురాలను " అంటూ ఏడుపు వినిపించింది

వాళ్ళు దృష్టి నటుపెట్టేసరికి మళ్ళీ అలాగే ఆక్రందన వినిపించింది భృత్యులను పంపగా వారు చూసివచ్చి "దివ్యాంగనవంటి ఒక స్త్రీ ఉరిపోసుకోబోతూంటే ఆపాము. ఆమె పక్కన చక్కని గుర్రం అలసిఉంది. మేమెంత అడిగినా ఆమె ఏమీ చెప్పింది కాదు." అన్నారు.

రాజు స్వయంగా బయలు దేరాడు తననికూడా తీసుకు పొమ్మని రాణి కోరినా అతను వినిపించుకోక వెళ్ళిపోయాడు ఆమెని చూసి 'నీవెవరవు? నీపతిఎవరు? అసామాన్య రూపం కల నువ్వు యీ అరణ్యంలో కెందుకొచ్చావు? నేను ఇంద్రద్యుమ్నుడను రాజును నన్ను తండ్రిలా భావించి నీ వృత్తాంతం చెప్పు అని అడిగాడు

ఆమె – 'మీమాటలతో నా దుఃఖం కొంత ఉపశమించింది నా కష్టాలు వింటే మీ మనసు బాధపడుతుంది అయినా చెబుతాను ' అందామె

## విశాలాక్షి కథ

"కాశీ రాజయిన హేమాంగదుని పుత్రికను నా పేరు విశాలాక్షి జగద్రక్షకి అయిన విశాలాక్షి కలలో కనిపించడం వల్ల నాకా పేరు పెట్టారు లేకలేక కలిగిన దానినని నన్ను తల్లితండ్రులెంతో గారాబంతో పెంచారు

కాశీపురమంటే విద్యామందిరమే కదా చక్కని పండితులచే నాకు విద్యలు నేర్పించారు పదహారేళ్ళకే నాకు విద్యలన్నీ పూర్తయ్యాయి

నాకు తగిన వరుని కోసం ఆలోచించ సాగాడు నా తండ్రి ఒక్కొక్క రాజకుమారుని వద్ద ఒక్కొక్క సుగుణముండేది తప్ప అన్నిటా అధికుడైన వాడు కనిపించలేదు నాకెట్టి వరుడు కావాలని నా తండ్రి అడిగినప్పుడు – వరునిలో విద్యా శీల, రూప, సంపదలుండాలి మొదటిది విద్య మొదటి మూడుదూ ఉంటే సంపదనెలాగైనా పొందవచ్చు" అని రాశాను మాతండ్రి దూతలను దేశాలు పంపాడు

ఒక సాయంత్రం కేదారేశ్వరుణ్ని అర్చిద్దామని వెళ్తూంటే గంగా తీరంలో కొందరు పండితులు శాస్త్ర వాదాలు చేస్తూ కనిపించారు పల్లకీ ఆపి కిటికీలోంచి చూశాను చుక్కల్లో చంద్రుడిలా ఒక బ్రాహ్మణ

యువకుడు కన్నుల పండుగగా కనిపించాడు మన్మధుని కంటె అందంగా తోచాడు అతని పెదవులు చూస్తే ఎన్నో శాస్త్రాలు చదివినట్టనిపించాయి. రూపంకలచోట సుగుణాలుంటాయనే ఆర్యోక్తి మెదడులో మెదిలింది

ఇంత చక్కని వాడిక్కడే ఉండగా నా తండ్రి ఎక్కడికో దూతలని పంపాడెందుకో? ఇతన్ని నేను పెళ్ళి చేసుకుంటే యితనే రాజువుతాడు కదా?

అతనే నాకు భర్త అని నిశ్చయించుకున్నాను అతని వివరాలు తెలుసుకురమ్మని సఖిని పంపాను కోవెలకి వెళ్ళి ఇంటికి పోయాను.

సఖి వచ్చి – 'పండితుల సభలో అతను ఒక్కసారీ నోరెత్తలేదు." అంది 'గంభీరస్వభావమై ఉంటుంది " అన్నాను నేను

"అందరితోపాటూ అతనూలేచాక – మీగ్రామంపేరేమిటి? మీపేరేమిటి?" మీరెందుకీ పట్నం వొచ్చారు? ఏం చదువుకున్నారు?– అని అడిగాను.

" నాగ్రామం పేరు నాకు తెలియదు నేనేం చదువుకున్నానో ఎరుగను. ఇప్పుడు శబ్దాలు చదువుతున్నాను. మా గురువు నన్ను కింశుక శాస్త్రి అని పిలుస్తారు – అన్నాడు ఆ మాటలకి నాకాశ్చర్యం వేసి –

ఊరిపేరు మరచిపోతారా ఎవరైనా? పరిహాసంచేయకండి నేనొక పనిమీద వచ్చాను యదార్థం చెప్పండి" – అన్నాను అతనేమీ అనకుండా వెళ్ళిపోయాడు నేను మీ దగ్గరకొచ్చాను.

"చూడబోతే అతను వెర్రివాడిలా ఉన్నాడు. మీకు తగడు." అంది సఖి.

"ఇంతేనా నీ తెలివి? అతను గంభీర హృదయుడూ, ధీరుడూ నీవంటి వారిముందు బయట పడతాడా? అతని జవాబుల అంతరార్థం గ్రహించలేక పోయావు విద్వాంసుల కొక దేశమూ, ఒక నామమూ స్థిరంగా ఉండవు. శబ్దాలు చదువుతున్నానంటే సకల శాస్త్రాలూ శబ్ద జాలమే కనక అలా అన్నారు అవి గ్రహించలేక తేలికగా వెర్రివాడనేశావు" అని ఎగతాళిచేశాను

దాసిద్వారా మాతల్లి, ఆమె ద్వారా మా తండ్రి - నా అభీష్టం తెలుసుకుని విద్యావిషయాలు పరీక్షించకుండానే ఆ సుందరుడితో నాకు వివాహం చేశారు

రాజా! ఇకపై జరిగిన విషయాలు చెప్పదగినవికాకపోయినా తండ్రి వంటి వాడివని సిగ్గువిడచి చెబుతున్నాను

నేనెంతో చక్కగా అలంకరించబడి వెళ్ళినా మొదటి రాత్రి అతను నన్ను కన్నెత్తయినా చూడక గుర్రుపెడుతూ నిద్రపోయాడు

రెండవ రాత్రి కూడా అంతే అయింది అప్పుడు ప్రౌఢ అయిన చెలికత్తె - "ఈ రాత్రి కూడా మీరు మదనకేళీసుఖాలు పొందకపోతే - మీ అమ్మగారికి చెబుతాను ' అంది.

ఆ రాత్రి నేనే అతని బట్ట పట్టుకున్నాను "కోపమా?" 'అని అడిగి మధుర భక్ష్యాలందించగా అతను తిన్నాడు "పాలుకావాలా, నీళ్ళు కావాలా?" అని అడిగితే పాలు చూబించాడు తాంబూలాన్ని చేత్తో అందుకున్నాడు అతని మంచంమీద నేను కూర్చుంటే - దూరంగా జరిగిపోయాడు.

"నాలో తప్పుంటే క్షమించండి. మన్మధ బాధా పీడితనై శరణు వేడుతున్నాను-' అని పాదాలమీద పడ్డాను

"నాకోపపు పనులేం కన్పించాయి నీకు? నువ్వు పెట్టినవన్నీ తిన్నాను. పాలు తాగాను. తాంబూలం నమిలాను. నువ్వు గొప్పదానివి నా కాళ్ళు ముట్టుకోవద్దంటే తప్పా? పెళ్ళి చేస్తామని తీసుకొస్తే వచ్చాను కాని యిలా నిందిస్తావంటే ముందే రాక పోదును ఇప్పుడైనా పొమ్మంటే పోతాను " అన్నాడతను.

ఆ మాటలకు కొంతసేపటి వరకూ నాకు మతిపోయింది నేను గోతిలో పడ్డానని తెలిసిపోయింది ఇతనికి ప్రపంచం ధోరణేమీ తెలియదు అందుకే అలాటి జవాబులు చెప్పాడు ఇప్పుడు నాగతేమిటని ఏడిచి - ఆశవదలక - "ఊరికే మీతో అలా అన్నాను కాని, మీ పేరేమిటి? వూరేది? దేశమేది? ఏంచదువుకున్నారు? ఏంచదువుతున్నారు?" అంటూ అడిగాను.

"అమ్మా నాకవేమీ తెలియవు మా గురువు గారు నన్ను కింశుకశాస్త్రీ అని పిలుస్తారు ఆరు నెలలనుంచీ రామ శబ్దం చదువుతున్నాను ఏ రోజు చదివిం దారోజే మరచిపోతాను "

'నేను మీ భార్యను. అమ్మా అని పిలవకూడదు. భార్యంటే తెలుసా?" అడిగాను ' "తెలియదు" అన్నాడతను

నాదుఃఖాని కంతులేదు భర్తకానందం యివ్వలేని నా సౌందర్య యౌవనాలు అడవి కాసిన వెన్నెలలే దైవమా! ఎందుకిలా చేశావు?

శోకించి.. . మనసు రాయి చేసుకుని .. "బ్రాహ్మణుడా! భార్య అనగా ఎప్పుడూ విడవకూడనిది నన్ను ఎప్పుడూ వదలకు నేను కొన్ని చెబుతాను, చేస్తావా?" అని అడిగాను అతనంగీకరించినట్లు తలూపాడు

నేను పువ్వులు నలుపుకుని శరీరంమీద దంత నఖక్షతాలు ఏర్పరచుకుని గుట్టు బయట పడితే నలుగురూ నవ్వడమే తప్ప ప్రయోజముండదని---స్వయంకృతా పరాధమని చింతిస్తూ నిద్ర పోయాను.

కలలోకి ఒక ముత్తయిదువ వొచ్చి – "చింతింపకు త్వరలోనే నీకు మేలు జరుగుతుంది ' అని అంది.

ఇలాటి మొగుడు దొరికాక యింక నాకు జరిగే మేలేమిటను కున్నాను మర్నాడు చెలికత్తెలు నామేనియందలి గుర్తులు చూసి ఎకసెక్కెమాడారు

అది మొదలు కింశుక శాస్త్రినెక్కడికీ పోనివ్వక, రోజూ లోక వ్యవహారాలు నేర్పుతూ వచ్చాను కాని ఏరోజుకారోజే అతనికి కొత్త నా దురదృష్టం కొద్దీ తల్లితండ్రులు చనిపోగా మంత్రులు నా మగనికి పట్టాభిషేకం చేశారు. అతని తెలివిహీనత అందరికీ తెలిసిపోయింది.

శత్రురాజులు ఏకమై దండెత్తి రానున్నట్లు తెలిసింది మనమంత్రులితను రాజుగా ఉండుటకు తగదని చెబుతున్నారు ఏం చేయమంటారని రాసిన ఉత్తరానికి మీరు జవాబివ్వలేదు శత్రురాజులేకమై చతురంగ బలంతో మనపట్నం ముట్టడించారు ఈ రాత్రి కోటని

ముట్టడిస్తారని తెలిసింది వారితో యుద్ధం చేయడానికి మనకి సేనలు లేవు. కనుక ఎవరి తోవవారు చూసుకోవలసిందే అని రెండోఉత్తరం వచ్చింది.

ఆ రాజ పుత్రులందరూ నన్ను వరించినవారే నేను వరించలేదని యీర్ష్య పెట్టుకుని యిలా దండెత్తారు నేనిక్కడే ఉంటే నన్ను చెరపట్టక మానరు

ఇలాటి ఆపదలలో కోటదాటి పోడానికి రహస్య మార్గాలుంటాయి అని గుర్తుకొచ్చి ఆ పుస్తకాలు వెతికించగా - తప్పించుకుపోయే మార్గం గురించి తెలిసింది

ఎవరికీ తెలియకుండా నా మగనినీ, విలువైన రత్నాలనీ తీసుకుని గుర్రమెక్కి రహస్య ద్వారం వద్దకు పోయి, పుస్తకంలో రాసిన ప్రకారం తలుపు తెరవగా, గుహలాటి ఒకబిలం కనిపించింది ద్వారం మూసి - ఆ బిలం ద్వారా గుర్రం మీద ప్రయాణించసాగాను

ఆ బిలం కాంతివంతంగా ఉంది నా మగనికి గుర్రపు స్వారి తెలియదు నేనేమాత్రం వేగంపెంచినా అతను భయంతో అరిచేవాడు తొందరగా వెళ్ళకపోతే బిలం దాటలేము గుర్రాన్ని మెల్లగా నడిపిస్తూ. మధ్యమధ్య తెచ్చుకున్నవి తింటూ, పగలూ రాత్రీ తేడా తెలియకుండా ఎన్నాళ్ళు ప్రయాణించామో మాకే తెలియదు

నిన్న సాయంకాలానికి యీ అడవిలోని ఒకకొండ శిఖరానికి వచ్చాం అక్కడొక విచిత్రమైన కవాటముండగా పుస్తకం చూసి అందులో చెప్పినట్లుగా దానిని తెరిచాను ఆపుస్తకాన్ని గుమ్మంచాటునపెట్టాను

కొండమీంచి దిగేసరికి చీకటి పడింది క్రూర మృగాల భయంతో మేమా గుర్రంమీదే ఉండిపోయాం అంతలో ఏదో జంతువు భయంకరంగా అరవడంతో గుర్రంబెదిరి - నేనెంత గట్టిగా లాగినా ఆగకుండా వేగంగా పరుగెత్తింది దాని మొదట గంతుల్లోనే నా మగడు కింద పడిపోయాడు ఏంచేసినా గుర్రాన్నాపలేకపోయాను ఇక్కడి కొచ్చాక గుర్రం ఆగింది.

నేనేం చెప్పినా కాదనలేదాయన. అటువంటి మగని చంపుకున్న దోషానికి నేనురిపోసుకుని చద్దామనుకున్నాను. మీరు వచ్చారు.

రాజా! దయచేసి నన్ను చావనివ్వండి. మీ పాదాలకు మ్రొక్కుతాను." అని ఏడ్చిందామె.

"అయ్యో! నువ్వా! నీతండ్రి నాపినతల్లి కొడుకు. అతను చనిపోయిన సంగతే నాకు తెలియదు. నువ్వు చాలాకష్టాలు పడ్డావు. నీ భర్త సురక్షితంగా ఉన్నాడని నీముఖమే సూచిస్తూంది. నేనతన్ని వెదికితెప్పిస్తాను. నువ్వు నాతోరా. శిబిరానికి వెళ్దాం " అని రాజంటుండగా -

శిబిరం వేపు కోలాహలం వినపడింది. కొందరు రాజభటులు పరుగెత్తుకొచ్చి 'స్వామీ! సింహం మనసేనలన్నిటినీ చెల్లాచెదురు చేసేసింది ఏనుగులు, గుర్రాలు కట్లు తెంపుకుని పరుగెడుతున్నాయి. సింహం ముందుగా ఏనుగులని తినేస్తూంది రాణిగారి కేమౌనో అని సేనాపతులు కంగారు పడుతున్నారు " అని చెప్పగా - రాజు గుర్రమెక్కి అటుపోసాగాడు. అంతలో మరికొందరొచ్చి "సింహం యిటు పోయింది అదెక్కడా స్థిరంగా ఉండదు." అన్నారు.

రాజు ఆదిక్కుగా గుర్రాన్ని పరుగెత్తించాడు. రెండవరోజుకు కూడా సింహం కనిపించలేదు. పదిరోజులకి ఒక కోయపల్లె కనిపించింది. రాజు అక్కడ వారిని ఈ అడవిలో తిరుగుతున్న సింహం మీవేపు రాలేదుకద?" అని అడిగాడు.

అందుకువారు. "సింహం చచ్చి పదిరోజులయింది. దానిమాంసం మేమే తిన్నాము. సింహం చచ్చింది కనకనే హాయిగా పడుకోగలుగుతున్నాం ' అన్నారు.

"సింహం చచ్చిపోయిందా! దానిని చంపిందెవరు? మాయోధుడా, మరొకడా?"

"అది మాకు తెలియదు పదిరోజులకిందట మావాళ్ళకి పుంతదారిలో ఒకడు పడుండి కనిపించాడు. వానిమొలలో కత్తుంది.

మంచిబట్టలు వేసుకున్నాడు. అతనికి స్పృహ లేదు మావాళ్ళతనికి చికిత్స చేశారు అతను మాట్లాడబోతూంటే – "సింహం, సింహం ' అని అరుస్తూ యీ పల్లె వాళ్ళంతా పారిపోతున్నారు. అతను తటాలునలేచి - "భయపడకండి." అంటూ వరలోంచి కత్తితీసి సింహానికికెదురెళ్ళి చంపేశాడు. దానిమీద కసికొద్దీ యివాళ్టికీ దానిమాంసమే తింటున్నాం.

ఆవీరుడేదో ధ్యానించుకుంటూ . మేమెంత పొగిడినా పట్టించుకోక తనతోవను పోయాడు." అన్నారు.

అతను విశాలాక్షి భర్తేమో అనిపించింది రాజుకొకక్షణం అంతలోనే – ఆమె భర్త –––అలాటి వీరుడైతే విశాలాక్షికి దిగులెందుకు? – అనుకుంటూ ––– సింహం ధ్యాసలో విశాలాక్షిని వదిలివచ్చినందుకు విచారిస్తూ – ఆదిక్కున వేగంగా పోయాడు

నాలుగు రోజులకక్కడికి చేరగా - శిబిరాలు ముక్కలై; ఏనుగులు, గుర్రాలు, కాల్బలం నుగ్గయి కనపడ్డాయి భటులెవ్వరూ లేరు. రాణి నడవిపాలు చేసినందుకు శోకిస్తూ – కొంచెం దూరం వెళ్ళగా ఒక చెట్టుమీంచి అతని పరిచారకుడు "స్వామీ ' అంటూదిగి సింహం ఏమైంది?" అని అడిగాడు.

"అది చచ్చిపదిరోజులైంది నాపట్టమహిషి క్షేమంగా ఉందా?" అని ఆత్రంగా అడిగాడు రాజు

'సింహం విజృంభించడం తోనే రాణిగారి చుట్టూ బలగం ఉండి వారిని పల్లకీలో పట్నం చేర్చారు నేను మీకోసం ఎదురుచూస్తూ యీ చెట్టుమీద ఉన్నాను. దేవరవారు కనుక ఆ సింహాన్ని చంపగలిగారు. అన్నాడు వాడు

భార్య సురక్షితంగా ఉన్నందుకు సంతోషించి – సింహం ఎలా చచ్చిందో వాడికి చెప్పి – తనకుమారుడు విజయుని కిమ్మని ఒక చీటి రాసి వాడితో పంపాడు.

తాను విశాలాక్షిని వెదుకుతూ బయలుదేరాడు. గుర్రపు టడుగులని బట్టి కొంతదూరం అడవిలోపోయి – "విశాలాక్షీ!" అని కేకలు వేశాడు. కోయపల్లెలకు పోయి ఆమె గురించి అడిగాడు.

ఆ అరణ్యం అతి పెద్దది. అతను వెదకడానికారునెలలు పట్టింది అప్పటికీ ఆమె కనిపించక విసుగెత్తి ఆమె గుర్తులు చెప్పిన కొండ శిఖరం ఎక్కి ఆ పుస్తకం చూశాడు. ఆ పుస్తకంలో రాసిన దానిని బట్టి ఆకోటనెవరూ వశం చేసుకోలేరు. అంతకట్టు దిట్టంగా ఉన్న కోటను వదిలి వచ్చినందుకు విశాలాక్షిని ధైర్యంలేని దానిగా భావించాడు.

తలుపు తెరవలేదు కనుక విశాలాక్షి బిలంలోకి వెళ్ళలేదని నిశ్చయించుకుని ఆ చుట్టుప్రక్కలే ఉండవచ్చనీ ...ఆమెనువెదికాక యీ బిలంగుండాపోయి శత్రువులను సంహరించాలనీ అనుకున్నాడు.

ఇన్నాళ్ళయ్యాక ఆమె యిక్కడెందుకుంటుంది? ఆమె భర్త మాత్రం అడవిలో ఎందుకుంటాడు? వాళ్ళిద్దరినీ కలిపికాని యింటికి పోనని శపథం చేశాను కదా? వాళ్ళు బ్రతికే ఉన్నారని నా అంతరాత్మ చెబుతూంది. వాళ్ళని వెదికి తీరతాననుకుంటూఅతనడవి వదిలి, పల్లెలు, పట్నాలలో వారిగురించి అడుగుతూ పోయాడు.

ఒక పట్నంలో ఒక పురుషుడెదురవగా – "అయ్యా! ఈ దేశం పేరేమిటి? ఈ పట్నం ఎవరిది? ఇక్కడి రాజధర్మము లేమిటి? అని అడగగా – అతనిలా చెప్పాడు

# మళయాళ దేశం కథ

"అయ్యా ఇది మళయాళదేశం దీనిని సంవత్సరం నుంచీ చండవర్మ అల్లుడు సింహకేతుడనే రాజు పరిపాలిస్తున్నాడు ఇక్కడి వారు శక్తినారాధిస్తూ - విదేశీయులు వొస్తే వారిని బంధించి, నవరాత్రులలో బలియిస్తారు. స్త్రీల పెత్తనం అధికం సింహకేతుడీ దురాచారాన్ని కొంత తగ్గించాడు. నీవెవరి యింటా బస చేయకు విదేశీయులకోసం రాజేకట్టించిన సత్రముంది. అక్కడికిపో నేనూ విదేశస్థుడనే స్త్రీల వద్ద జాగ్రత్తగా ఉండకపోతే మోసం చేస్తారు నేను మా దేశం పోతున్నాను."

ఇంద్రద్యుమ్నుడు పట్నంలో ప్రవేశించాడు అక్కడన్నీ మేడలేకాని మామూలు యిల్లేలేదు స్వర్గంలా ఉంది గ్రామస్తులంతా ఐశ్వర్యవంతుల్లా ఉన్నారు

ఒక మేడ ముందాగి "విదేశీయుల సత్రం ఎంతదూరంలో ఉంది?" అని అడిగాడు

ఆయింట్లోంచి ఒకామె వచ్చి ఎంతోవినయంగానూ, ఆదరం గానూ - "అది చాలా దూరం మీరు పరదేశస్తులు కాబోలు. ఈరాత్రి యిక్కడుండండి. మీరు కోరినట్లు భోజనం పెడతాం. మాయిల్లు పవిత్రం చేసి పొద్దున్నే పోవచ్చు " అని ప్రార్థించింది.

"నేను సత్రానికే వెళ్ళాలి. ' అని అతను ముందుకు సాగి మరో మేడముం దడగ్గా ఆయింటి స్త్రీకూడా అతన్ని ఆరాత్రి తమింటఉండమని కోరింది "నాకాసత్రంలో పనుంది" అని సాగిపోయాడు ఏమేడ ముందడిగినా వారు తమింట ఆతిధ్యం తీసుకోమనే అన్నారు కాని అతనాగలేదు కాని ప్రజ్ఞావతి అనేఆమె ఎంతో ఆదరాభిమానాలతోనూ గౌరవంతోనూ ఆహ్వానించే సరికి ఇంద్రద్యుమ్నుడు కాదనలేక పోయాడు ఒక్కరాత్రిలో వారేం మోసం చేయగలరనుకున్నాడు వారింట అడుగు పెట్టాడు

పరిచారికలు బంగారుకలశాలతో కాళ్ళు కడుక్కొందుకు నీళ్ళిచ్చారు. తనపుస్తకము, మూట చావిడిగుమ్మంపై నున్న అరలో ఉంచి

లోపలికి వెళ్ళాడు. ప్రజ్ఞావతి అతన్ని మేడమీదకు తీసుకెళ్ళి బంగారు పీఠంమీద కూర్చోబెట్టి ఉపచారాలు చేసి ఎన్నో పిండివంటలతో భోజనం పెట్టింది. తరువాత పరిచారిక లతన్ని పడకగదికి తీసుకెళ్ళి హంసతూలికా తల్పంమీద కూర్చో బెట్టారు.

అప్పుడు ప్రజ్ఞావతి తాంబూలమందించి వీణపై పాట పాడుతుండగా పరిచారికలు మెల్లగా వెళ్ళిపోయారు.

పాట చాలించి ఆమె – "చాలా దూరం నుంచి వచ్చుంటారు. అలసట తీరేలా పాదాలొత్తనా?" అని అడిగింది.

'ఆమె ఒంటరిగా తన ముందుండడమే సబవుకాదు. పరపురుషుని పాదాలొత్తడం పతివ్రతకు తగదే. మళయాళదేశంలో జారత్వ సంకోచం లేదని వాడుక' – అని మనసులో అనుకుని – "సాధ్వీ! నాకేమీ శ్రమలేదు. చేసిన ఉపచారాలే ఎక్కువ. నాపాదాలు అంటకూడదు –" అన్నాడు.

ఆమెపైట సవరించుకుంటూ – "మా దేశాచారం మీకు తెలియదు కాబోలు అతిధిని దైవంగా భావించి అతనేంకోరినా యిస్తాం " అందామె.

అతను తటాలున మంచం దిగిపోబోతూంటే – ఆమె – "రండి. మంచం మీదపడుకోండి. మిమ్మల్ని ముట్టుకోను, ఒట్టు." అని అతను నిద్రపోయాక మరోయింటికి వెళ్ళింది.

ఉదయం లేచేసరి కతని కాళ్ళకీ చేతులకీ సంకెళ్ళు వేయబడి – తాళం వేయబడిన బోనులాటి గదిలో ఉన్నాడు. తననెందుకు జైలులో పెట్టిందో అర్థం కాలేదు.

ఆ విదేశీయుని మాట నమ్మక యీామెకు చిక్కాను. నన్ను శక్తికి బలిస్తారు కాబోలు. నాకు విచారం లేదు. ఎప్పటికైనా మరణించవలసిందే. కాకపోతే విశాలాక్షిని భర్తతో కలపలేకపోయానే అన్న చింతుంది. విదేశసంచారము, పర్వతారోహణము, సముద్రయానము,

గుహలో ప్రవేశము, కారాగారప్రాప్తి దైవవశాన ప్రాప్తిస్తాయంటారు. దానిని తప్పించుకొనుటకు నేనెంతటివాడిని? – అని సరిపెట్టుకున్నాడు.

ఆవూరి సభాపతులు రహస్యంగా సభచేసి – "సింహకేతుడు మునుపటి రాజులా కాక మన మంత్రశాస్త్ర పుస్తకాలన్నీ లాక్కున్నాడు. బలులను సాగనివ్వడంలేదు. విదేశీయులు మనయిళ్ళకు రాకుండా సత్రం కట్టించాడు. ఇక మన ఐశ్వర్యం ఎలా నిలుస్తుంది? నవరాత్రులు దగ్గర పడుతున్నాయి. ఈ పాటికి మనిళ్ళన్నీ విదేశీయులతో నిండి ఉండ వలసింది. అమ్మకానికి తెచ్చేవారు కూడా రాజభీతితో తేవడంలేదు ఈ సంవత్సరం ఉత్సవమెలా జరపాలో తెలియడంలేదు మనిళ్ళలో నూటపదముగ్గురు విదేశీయులున్నారు అన్నారు."

"నిన్నచాటింపు విన్నారు కదా! మనిళ్ళన్నీ సోదా చేస్తారు. ఏంచెయ్యాలో ఆలోచించండి దొరికామంటే రాజు మనని శిక్షించక మానడు."

"వీళ్ళందరినీ మరో చోట రహస్యంగా దాచాలి. అడవిలో ఒకపాతాళ గృహం ఉంది దానిలో రెండు గదులున్నాయి. ఒకదానిలో మగవారినీ, రెండోదానిలో స్త్రీలనూ దాచుదాం పరీక్ష అయ్యాక మళ్ళీ యిళ్ళకు తెచ్చుకుందాం." అన్నాడు సభాధ్యక్షుడు

"వారందరూ ఏకమై పరిచారకుల నెదిరించి పారిపోతే?"

"సంకెళ్ళతో కాలు చేతులు బంధించాంకదా?"

'ఔను. ఒక్కొక్కర్నీ రహస్యంగా పాతాళ గృహంలో చేరుద్దాం '

అలాగ వాళ్ళిళ్ళల్లో బంధించబడిన వారందరూ పాతాళ గృహంలోకి చేర్చబడ్డారు. ఇంద్రద్యుమ్నుడు –తనలాగే బంధించబడిన వారు చాలా మందుండడం చూసి – వాళ్ళెలా చిక్కారో తెలుసుకుందామని ఒక్కక్కరినీ అడగసాగాడు.

ఒకయోగి దివ్యతేజంతో . గడ్డాలు మీసాలు పెంచి – ఏదో ఆలోచిస్తూంటే – అతన్నీ అడిగాడు .– అతనడుగగా తన గురించి చెప్పి

"విశాలాక్షిని అమె మగనివద్దకు చేరుస్తానని శపథం పట్టాను -" అని ముగించాడు.

అది వినడంతోనే ఆయోగి - "హా! విశాలాక్షీ! నీకు నాయం దెంత పతిభక్తి! రాజేంద్రా! ఆసింహాన్ని చంపిన వాడిని నేనే. పరులకోసం యింత పాటు పడుతున్న నువ్వు చాలా పుణ్యాత్ముడివి" అన్నాడు.

" కాని...విశాలాక్షి నీ తెలివి తేటలగురించి మరోలా చెప్పిందే?" సందేహం వెలిబుచ్చాడు ఇంద్రద్యుమ్నుడు.

## మదనుని కథ

"విశాలాక్షి చెప్పింది నిజమే. నాకథ వింటే మీసందేహం తీరుతుంది." అంటూ అతను తన కథ చెప్పసాగాడు.

"మాది గోదావరీ తీరానున్న వీరభద్రపురమనే అగ్రహారం. మా తండ్రి సోమశేఖరుడు. చిన్నతనంలోనే కాశీ వెళ్ళి అనేక విద్యలు చదివి ఆచార్య బిరుదం పొంది-- యింటి కొచ్చి యజ్ఞాలు చేశాడు.

మా తల్లి కొడుకును కోరుకుంటూంటే - ఆయనొక యజ్ఞంచేసి ఆ ప్రసాదంతో నన్ను కన్నాడు. నా రూపం చూసి ప్రజలంతా నన్ను మదనుడనేవారు పదిహేనేళ్ళకే మాతండ్రి నాకన్ని విద్యలూ నేర్పాడు. అధర్వణ వేదం నేర్చుకోడం కోసం విశ్వనాధ భట్టు వద్ద చేర్చారు

వారి భార్య సురుచి అతి చక్కనిది. వయసుపైబడ్డాక విశ్వనాధ భట్టామెను వివాహం చేసుకోడం వల్ల వారిదాంపత్యం ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. ఆమె నన్ను వాత్సల్యంతోనే చూసేది.

ఒకనాడు భట్టుగారు పనిమీద ఊరెళ్ళడంతో యింట్లో నేనూ ఆమే మిగిలాం. ఆమె బుద్ధి మారిపోయింది. భోజనం పెడుతూ శ్లేషతో ..రెండర్థాలు వచ్చే మాటలు మాట్లాడింది. నేను అమాయకంగా బదులు చెప్పి విద్యామందిరానికి పోయాను.

రాత్రయింది. ఆమె నన్ను భోజనానికి పిలిచి తనభర్త కట్టుకునే పట్టు వస్త్రమివ్వబోయింది నేను వద్దంటే మరొకటి సిద్ధంగా లేదంది. నేను భోంచేశాక తనకు ఒంటరిగా భయమని - తమగదిలోకి తీసుకెళ్ళి తాంబూలం అందించింది

"బ్రహ్మచారిని. తాంబూలం వేసుకోకూడదు-" అని నేనంటే - "ఏగ్రంథంలో ఉందో చూబించు. అవసరమైతే ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చులే." అని నవ్వింది.

ఆమె స్పష్టంగా బయట పడితే నీతులు చెబుదామనుకున్న నాకామెచర్యలు తాపం పుట్టించసాగాయి. నేనామెకు వశమయ్యాను.

తెల్లవారకుండానే గురువుగారొచ్చారు. "కళ్ళెర్రగా ఉన్నాయేం?" అని అడిగారు. అతుకునట్లు అబద్ధపుమాటలాడాను. వారింకేమీ అనలేదు

ఆమె ఏదో ఒక మిష మీద నావద్దకు వచ్చి పలకరించసాగింది. కొద్దిరోజులలోనే ఆమె ప్రవర్తనవల్ల నా సహాధ్యాయులకి అనుమానం వచ్చింది.

"ప్రజలు నిన్ను నిందిస్తున్నారు గురువుగారికి కూడా తెలిసిపోగలదు." అని హెచ్చరించారు.

ఆవేళ గురువుగారు మళ్ళీ ఊరెళ్ళారు. చీకటి పడేవేళకి విద్యార్థులు వెళ్ళిపోయారు. ఆరాత్రి మేమొకరినొకరు పెనవేసుకుని పడుకుని ఉండగా గురువుగారు వచ్చేశారు మమ్మల్ని పట్టుకున్నారు. అప్పుడు సురుచి "నాధా! ఈతప్పు నాదికాని మదనునిది కాదు నా ప్రోద్బలంవల్లనే అతనిలా చేశాడు. కనక అతనికి వేసే శిక్షకూడా నాకే వెయ్యండి." అంటూ ఆయనకాళ్ళమీద పడింది.

ఆయన మరింతగా మండిపడుతూ ఆమెను కురూపి అవమనీ, నన్ను చదివిన విద్యలన్నీ మరచి, పూర్వస్మృతి లేక వెర్రి వానివలె తిరగమనీ శపించాడు

నేను శాపవిమోచనానికై ప్రార్థించగా - ఆయన "చచ్చేంత గండం గడిచాక నీకు మళ్ళీ నీవిద్యలన్నీ గుర్తొస్తాయి " అన్నారు ఆశాపం

ఫలించేలోగానే అది నా ప్రారబ్ధమనుకొని కాశీకి పోయాను. విశాలాక్షితో నాకు పెళ్ళికావడమూ తరువాతి కథా మీకు తెలిసిందే గుర్రంమీంచి నేలమీదపడడంతోనే నాశాపం విమోచనమైంది పూర్వస్మృతీ, విద్యలూ వచ్చేశాయి

అయ్యా. విశాలాక్షి నన్నిలా చూస్తే ఎంత సంతోషించేదో! అన్నట్లు బాల్యంలో శస్త్రవిద్య నేర్చుకున్నాను అందువలనే సింహాన్ని చంపగలిగాను

విశాలాక్షిని వెదుక్కుంటూ దేశాలు తిరుగుతూ చివరకిక్కడ చిక్కుకున్నాను ఒకస్త్రీ వల్ల మోసపోయి యిలా బందీనయ్యాను." అన్నాడు మదనుడు

"మదనా చింతింపకు. ఆమెస్వప్నంలో దేవి మీకు మేలగునని చెప్పింది ఈ కష్టాలు తీరి ఆమెను తప్పకుండా కలుసుకుంటావని నాకు తోస్తూంది. దైవమే దారిచూపుతాడు-" అని ధైర్యం చెప్పాడు ఇంద్రద్యుమ్నుడు

వారిమాటలు వింటున్న ఒక పురుషుడు - 'దేవా. నేను మీమాటలు వినిమిమ్ము ఇంద్రద్యుమ్న మహారాజుగా తెలుసుకున్నాను నేను తమ సేవకుడిని. మీవంటి వారికిట్టి స్థితి కలుగుట విచారకరమే. మీకు మరింత విచారం కలిగించేదే అయినా ఒక విషయం చెప్పకతప్పదు " అన్నాడు

"తొందరగా చెప్పు " అన్నాడతను

"అడవిలో సింహభయంతో - చిత్రసేన రాణి తమ ఆజ్ఞ లేకుండానే సేనలను సమకూర్చుకుని పల్లకీలో పురానికి పోతూంటే - దారిలో శబర సైన్యమెదురుపడి మనసేనలను తరిమేసి - పల్లకీలో ఒంటరిగా ఉన్న రాణిని తీసుకుపోసాగారు ఒక్కడినే అని సందేహింపక నేను - "విడువండి.. విడవండి". అని వారివెంట పడ్డాను వాళ్ళునన్ను రెక్కలు కట్టేసి ఎక్కడో దాచి ఒకనాడిక్కడికి తీసుకొచ్చి ఒకగృహస్థుడి కమ్మేశారు వీళ్ళు నాకాహారం పెడుతూ బందీగా ఉంచి చివర కిక్కడికి

తీసుకొచ్చారు దేవీగారిని కూడా యిక్కడికే తీసుకొచ్చి ఉంటారని వాళ్ళమాటల ద్వారా తెలిసింది '

అదివిని మహారాజు మూర్ఛపోయాడు. తెలివొచ్చాక - "అయ్యో! నాభార్యెన్ని కష్టాలు పడుతూందో! నాకోసం ఎంత దుఃఖిస్తూందో.' దుశ్శకునాలు కనిపించినా వేటకెళ్ళడం మానలేదు కదా ఇప్పుడు చింతించి ఏం లాభం" అని అంతలోనే ధైర్యం తెచ్చుకున్నాడు

అప్పటి కర్ధరాత్రయింది కావలివారు మాట్లాడుకోసాగారు

పుళిందుడు కళింగా! ఇలారా. ఊరి విశేషాలేమిటి? బందీలందరూ నిద్రపోతున్నారులే. మనమాటలు వినరు నీ బావమరది పుర సంరక్షకులలో ఒకరు కదా నీకు చాలా విషయాలు తెలుస్తాయి

కళింగుడు వీళ్ళువింటేమాత్రం ఏంచెయ్యగలరులే. ఇవాళ ఉదయం ఊరంతా వెదికినా రాజభటుల కేమీ దొరకలేదు. కృష్ణదాసు ఇంట్లో ఒకపుస్తకం మాత్రం దొరికిందట

**పుళిందుడు** : అతను రాజశాసనం వినలేదా?

**కళింగుడు** . అది మంత్రశాస్త్ర పుస్తకంకాదు ఆలిపి యిక్కడెవరికీ తెలియలేదు.

**పుళిందుడు** : అదెక్కడి నుంచి వచ్చింది ?

**కళింగుడు** . ఏమో కృష్ణదాసు పెళ్ళాంకూడా పెద్దజాణ. ఏ బాటసారిని మోహపెట్టిందో

**పుళిందుడు** : తరువా తేమైంది?

**కళింగుడు** దానిని రాజుగారి ముందుంచారు. కృష్ణదాసు కొంచెం భయపడు తున్నాడట రేపు వీళ్ళని వెనక్కి తీసుకుపోవడమేనా? మరేమైనా పనుందా?

**పుళిందుడు** : మరేమీ ఉండదు. ఎల్లుండి మధ్యాహ్నం కృష్ణ దాసు ఇంట్లో దేవీపూజ. అప్పుడు దేవికి బలివ్వాలి.

**కళింగుడు** . అయినా మనకి మళ్ళీ జాబు రాకమానదు సరేలే పడుకో

ఆ మాటలు విన్న ఇంద్రద్యుమ్నుడు ఎల్లుండి తనకి మరణం తప్పదనుకుని వైరాగ్యంతో దేవుణ్ణి ధ్యానించ సాగాడు.

మర్నాడు వాళ్ళు మునపటిళ్ళకి చేర్చబడ్డారు, ఇంద్రద్యుమ్నుణ్ణి పూర్వపు గదిలోనే కట్టిపడేశారు. మర్నాడు ఉదయమే నవరాత్రి ప్రారంభం. ఆవేళ అతనికి తలస్నానం చేయించి..వొళ్ళంతా పసుపు పూసి "మెడలో వేపరొద్ద కట్టి – ఒక స్తంభం పాతి బంగారు గొలుసులతో అతన్ని దానికి కట్టారు.

తనశరీరం ఊరికేపోక శక్తికి బలిఔతున్నందుకు అతను సంతోషిస్తూ మరణం కోసం ఎదురు చూస్తూంటే తలుపులు తియ్యమని వీధిలో సందడయింది. కృష్ణదాసుతలుపు తెరవడంతోనే రాజు గుర్రందిగి లోపలకి వచ్చి –

"కృష్ణదాసెవ్వడు?" అని అడిగాడు.

"నేనే" అన్నాడతను.

ఆ పుస్తకం గురించి రాజు ప్రశ్నించగా అతను చెప్పిన సమాధానాలకు తృప్తిపడక అనుమానంతో యిల్లు వెదకమని భటుల కాజ్ఞ యిచ్చాడు.

ఆ అలజడి విని అప్పటికే అర్చకులందరూ పారిపోయారు

గొలుసులతో కట్టబడిన అతనెవరని అడగగా ఎవరూ ఏమీ చెప్పలేదు. కృష్ణ దాసునుంచి నిజం రాబట్టలేక – రాజు బందీనే అడిగాడు. ఇంద్రద్యుమ్నుడు తన వివరాలు చెప్పాడు. అంతేకాకుండా మిగిలిన బందీల గురించి కూడా చెప్పి – "ఇదేమిపాలన?" అన్నాడు.

ఆ రాజుకి తన పౌరుల దుశ్చర్యలకి చాలా కోపమొచ్చింది. ఊరిలో అన్ని యిళ్ళూ వెదికి అక్కడ దొరికిన వారినందరినీ తీసుకురమ్మని భటులకు చెప్పి – ఇంద్రద్యుమ్నుణ్ణి వెంట పెట్టుకుని తనకోటలోకి వెళ్ళాడు. సాయంత్రానికి రాజభటులు అందరినీ తీసుకురాగా అపరాధులకు కఠినశిక్ష విధించి – బలిపురుషులకు కానుకలిచ్చి వారిదేశం పంపారు.

ఇంద్రద్యుమ్నుడు చిత్రసేన నానవాలు పట్టగా, ఆమెనూ మదనునీ ప్రత్యేకంగా గౌరవించి అంతఃపురానికి తీసుకెళ్ళాడు

తరువాత వారినొక రహస్య స్థలానికి తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. "రాజా. మీరూ, మీ భార్యా విశాలాక్షి కోసం కదా యిన్ని కష్టాలుపడ్డారు? మీ పరోపకారబుద్ధి చాలా గొప్పది ఈ పుస్తకం మొదట విశాలాక్షిని రక్షించింది. తరువాత మిమ్మల్ని కాపాడింది దీనిని రాసిన వారు చాలా పుణ్యాత్ములు"

"అయ్యా. మీరు మమ్మల్ని మృత్యువునుంచి వెనక్కి తీసుకొచ్చారు మేము మీకు జీవితాంతమూ కృతజ్ఞులుగా ఉంటాం." అన్నాడింద్రద్యుమ్నుడు.

"రాజా! విశాలాక్షి నితడు శాపగ్రస్తుడై ఉండగా వివాహ మాడాడు. ఆమె యితనికి దూరమై చాలాకాలం గడిచింది. మీరామెను వెదికి తీసుకొచ్చినా యీ మదను డామెను స్వీకరిస్తాడా?" అని అడిగాడు.

"నా భార్యను కూర్చండి, మీకు కోటినమస్కారాలు చేస్తాను విశాలాక్షి మహాపతివ్రత ఆమె మనసు నాకు తెలుసు' అన్నాడు మదనుడు

సింహకేతుడు నవ్వుతూ "ఆమె మా యింట్లోనే ఉంది రప్పిస్తానుండండి. ' అని లోపలికి వెళ్ళాడు. లోపలినుంచి వచ్చిన ఆమె వాళ్ళకి నమస్కరించగా "హా! ప్రేయసీ. విశాలాక్షీ. ' అంటూ మదను డామెను కౌగలించుకున్నాడు

"అమ్మా! నువ్వు మా విశాలాక్షివే ఇక్కడికెలా వచ్చావు? ఎక్కడెక్కడ తిరిగావు? ఈ రాజు ఆశ్రయం ఎలా లభించింది?" అని ఇంద్రద్యుముడు అడగగా - ఆమె నవ్వుతూ - 'నా కథ చాలా అద్భుతమైనది సావధానంగా చెప్పాలి ఇప్పుడు పొద్దు పోయింది భోజనాలకురండి.' అని వారిని తీసుకు వెళ్ళింది

గోపా విశాలాక్షి కథను వొచ్చే మజిలీలో చెబుతాను ' అన్నాడు మణిసిద్ధయోగి

# కాశీమజిలీ కథలు

## 13. వ మజిలీ

## విశాలాక్షి ప్రవాహం కథ

"తండ్రీ! మీరు సింహాన్ని చంపడానికి వెళ్ళి ఎంతకీ రాకపోడంతో నాకు దుఃఖమొచ్చింది. నాతోపాటు నా కుపకారం చేద్దామనుకునేవారికి కూడా కష్టాలే - అని, చనిపోవాలని నిశ్చయించుకున్నాను. అంతలో చిన్ననిద్ర పట్టింది. కలలో ఒక స్త్రీ కనిపించి - "చింతించకు. నీకు మేలు జరుగుతుంది.' అని దయగా చెప్పింది.

సరే...కొంతకాలం చూద్దాం - అనుకుని గుర్రమెక్కి కనపడిన తోవన పోయాను ఆ అడవికంతు కనిపించలేదు.

ఒక సరోవరం కనిపించింది నేనందులో తనివితీరా జలకా లాడాను. అప్పుడు నాకు గాఢంగా నిద్ర పట్టింది. కళ్ళు తెరిచేసరి కొక పూలతోటలో ఉన్నాను. సూర్యచంద్రులు కనిపించలేదు. కాని వెలుగుగా ఉంది.

ఆ పూలతోట అందాలు చూస్తూ పోయాను. కొంతదూరం వెళ్ళాక ముంధుతోవ కనిపించలేదు. వచ్చిన తోవా కనిపించలేదు. తిరిగిన కొద్దీ సంతోషమే తప్ప అలసటా విసుగు అనిపించలేదు.

ఒకవింత ఫలం కనిపిస్తే కోసి తిన్నాను. అది మొదలు ఆకలీ - దాహం నన్ను చేరలేదు ఆ చెట్టుకి మరో పండుంటే కోసి మూట కట్టాను అలాగే ఒక వింత పుష్పాన్నీ దాచాను ఆతోటలో తిరుగుతూంటే

కాంతి పుంజమనిపించిన దేవాలయం కనిపించింది బంగారంతో కట్టినట్లుందా ఆలయం అక్కడ చాలామంది కూడి ఉండగా ఒక స్త్రీ వీణ సరిచేస్తూ కనిపించింది.

ఆమె మా అన్నపూర్ణమ్మను జ్ఞాపకం తెస్తూంటే నేనామె దగ్గరగా నిలబడ్డాను నన్ను కూర్చోమంది ఆ వీణమీద మధురంగా పాడింది ఆమె తుంబురుని వద్ద గానం నేర్చుకుందట.

ఆమె పాడినవి ఆమె రచించిన కృతులేనట భూలోకంలో నేను ఉత్తమగాయనిని. ఆమె స్వరవిశేషాలను సులభంగా గ్రహించాను

అవన్నీ కలలూ నిజాలూ కూడా!

నాకిక చింత అనిపించలేదు సాయంకాలానికేదైనా ఊరు చేరాలని వేగంగా పోగా ఒక అగ్రహారం చేరాను అక్కడ -

## భీమశర్మ అను బ్రహ్మచారి కథ

ఇరవయ్యేళ్ళ బ్రహ్మచారి ఉరితీసుకుందుకు సిద్ధంగా ఉన్నాడు. నేను వానినాపి ఎందుకు ఉరి తీసుకోబోతున్నావని అడిగాను

చీకటిలో నన్ను పురుషు డనుకుని – 'అయ్యా! పడిన కష్టాలు చాలు ఈ లోకంలో దరిద్రుడూ, విద్యాహీనుడూ బతికుండకూడదు " అన్నాడు వైరాగ్యంగా

"నిన్ను భాగ్యవంతుణ్ని చేస్తాను, నీకథ చెప్పు" అనగా అతను చివరి కిలా చెప్పాడు

'ఇక్కడికి దగ్గరలోనే వున్న విజయపురి అనే అగ్రహారం మావూరు నాపేరు భీమశర్మ ఏడుగురు అన్నదమ్ములలో నేను చివరివాడిని తల్లితండ్రులు నాచిన్నప్పుడే చనిపోయారు వదిన లందరూ

కాపరానికి వచ్చినా నా బానిసత్వం పోలేదు పని ఎక్కువే అయింది నేనెంతపని చేసినా చాలదని – వారు తిడతారు, కొడతారు.

బ్రాహ్మణార్ధంవెళ్ళి కడుపునిండా తినడంవల్ల ఆయా సమనిపించి విశ్రమించి వెళ్ళినందుకు నన్ను మావదినతిట్టి – కావడి ఎత్తుకు రమ్మంది.

"ఆయాసంగా ఉంది కొంచెంసేపయ్యాక వెళ్తాను అన్నాను 'నామాట ఎదిరిస్తావా? అంటూ రభస చేసింది. మిగిలిన వదినలూ ఆమె పక్షమే పలికారు. మా అన్న వచ్చాక ఏం చెప్పిందో – అతనునన్ను పొగరుమోతంటూ దుడ్డు కర్రతో బాదాడు. మిగిలిన అన్నలు నోరెత్తలేదు

నాకు చావు తప్ప గతిలేదనిపించి ఇక్కడికివచ్చి ఉరి తీసుకోయాను ' అన్నాడు దీనంగా.

"ఎన్ని బాధలున్నా చావకూడదు. జీవితం చాలా విలువైనది వటుడా! ఈఫలం తిన్నవారికి ఆకలి దప్పిక లుండవు దీనిని మీ రాజుగారికిస్తే నీకు బోలెడంత ధనమిస్తాడు ఆ ధనంతో సుఖంగా జీవించు –' అని పండిచ్చి పంపాను

మర్నాడు తూర్పు దిక్కుగా పోతూ – మధ్యాహ్నపు ఎండవేడికి – ఒక చెట్టుక్రింద కూర్చుని ఉండగా ఒక ముసలి బ్రాహ్మణుడు పదిమంది పిల్లలతో అక్కడికి నీడకోసం వచ్చి చేరాడు ఎవరు మీరని ప్రశ్నించగా – "నాపేరు కృష్ణశర్మ మాది విదర్భదేశం. ఈ పిల్లలు నాసంతానమే నాభార్య ప్రసూతి బాధతో మరణించింది వీరితో నేనెన్నో చిక్కులు పడుతున్నాను బీదవాడిని. ఆడదిక్కులేని వాడిని భిక్షాటనంతో కాలక్షేపం చేస్తూంటే మారాజ్యంలో కరువొచ్చింది బిచ్చందొరకడం లేదు ఎక్కడకైనా పోయి బతుకుదామని బయలు దేరాను కాని నాకంటె ముందర నాదురదృష్టదేవత నడుస్తున్నట్లుంది. ఎక్కడికి పోయినా పట్టెడు అన్నం దొరకడం లేదు అన్నం తిని రెండు రోజులైంది నిన్ను చూస్తూంటే గొప్పదానిలా ఉన్నావు నాకేమైనా దయచేస్తావా?" అని దీనంగా అడిగాడు

కృష్ణశర్మ మాటలకు నా మనసు కరిగిపోయి – ‘బ్రాహ్మణుడా! ఇది పారిజాతం వంటి దివ్యపుష్పం ఎన్నాళ్ళయినా వాడిపోదు దీనిని పైనుంచినచో పరిమళం ఆమడ దూరం వ్యాపిస్తుంది దీనిని తీసుకుని నీ కుటుంబాన్నంతటినీ ఎల్లకాలం పోషించే వాడికివ్వు – ” అని మూటలోని పువ్వు నిచ్చాను

నేను మళ్ళీ గుర్రమెక్కి ప్రయాణం సాగించాను ఆ దారి మళ్ళీ ఉత్తర దిక్కుగానే మళ్ళింది అటు అరణ్యాలే కాని గ్రామాలు లేవు దారి తప్పాను సరే చూద్దాం – అనుకుని ముందుకు పోయాను చీకటిపడిపోయింది అరణ్యంలో క్రూరమృగాలు నన్ను చంపెయ్యడం ఖాయమనుకున్నాను అంతలోనే ధైర్యం తెచ్చుకున్నాను మరికొంత దూరం వెళ్ళేసరికి –

## కోయ పల్లె కథ

పశువుల అరుపులు వినబడి అక్కడేదో పల్లె ఉండి తీరుతుందనుకున్నాను అక్కడ – రాక్షసుల్లాటి కోయదొరలున్నారు ఆ వేళేదో ఉత్సవం కాబోలు – ఒక చావడిలో దీపం పెట్టి అందరూ తాగి అడవి వాయిద్యాలు వాయిస్తూ ఆడుతున్నారు అక్కడ తప్ప మరే యింట్లోనూ దీపం లేదు

వారిని చూసినాగుండె ఆగిపోయింది వాళ్ళందరూ ఉత్సవ సందడిలో ఉన్నారు నేను గుర్రందిగి దానినొక చోటకట్టి వేరొక మూలకు పోయాను ఆ గుడిసెలకు ఆవరణలు లేవు నా పుణ్యం వల్ల అక్కడుండే కుక్కలు కూడా సంబరానికే పోయాయి నేనొక గుడిసె తిన్నెమీద కూర్చున్నాను

కొంతసేపయ్యాక ఒక ఆడదిఆగుడిసెలోకి వచ్చి తన భాషలో ఏదో అడిగింది నాకు ఏభైయ్యారు భాషలొచ్చినా కోయభాష రాక ‘పరదేశిని దారి తప్పి వచ్చాను ప్రొద్దున్నే లేచిపోతాను ” అన్నాను

దానికి నామాటలు అర్థమవలేదు. "మనకొండదేవత మనింటి అరుగుమీదకొచ్చి కూర్చుంది రోయ్" "అంటూ అరుస్తూ చావడి వద్దకు పరుగెత్తింది

వాళ్ళొస్తే నేను చస్తాననుకున్నాను. కాని – అంతలోనే దేవత అని అరిచింది కదా అని నా తల విరగ బోసుకుని శివమెత్తిన దానిలా ఊగసాగాను.

వాళ్ళు వచ్చి నాతోపాటు చిందు వెయ్యసాగారు. కొంత సేపయ్యాక "మా గుడిలోకి రామ్మో..... బలులిత్తాం, పానకాలిత్తాం... మమ్మేలే అమ్మో.. రామ్మా రా " అని డప్పుమీద పదాలు పాడగా నేనా చావడికి పోయాను. అక్కడ అమర్చివున్న వెదరు బద్దల గద్దెమీద కూర్చుని – వారి నాడమన్నాను.

వారిలోని ఆడవాళ్ళు – కొండదేవత యీఏడు మంచి రూపంలో వచ్చిందనీ, తల వెంట్రుకలు చాలా పొడవనీ, సన్నచీర కట్టిందనీ పొగుడుతున్నారు.

ఈమెకు మగడుంటాడా అని ఒకామె సందేహం అడగగా. "లేకేం? ఈమె మొగుడు పోతురాజు. పిల్లలం మాత్రం మనమే " అంది.

వాళ్ళమాటల బట్టి – దేవత క్రిందటేడు పులిరూపంలో వచ్చిందనీ, తెల్లవారాక ఉండదనీ తెలిసింది.

తెల్లవారుతూంటే గద్దెదిగాను. 'అమ్మోరెళ్ళి పోతున్నా' రంటూ వారు కేకవేస్తూ నన్ను సాగనంపడానికి వచ్చారు. గుర్రంతో రాలేక వాళ్ళుండిపోయారు నేనక్కడి నుంచి బయటపడి – బతుకు జీవుడా అనుకున్నాను. నేను దేవతలా నటించకపోతే వీళ్ళు నన్ను బలిచ్చేసేవారే.

సాయంకాలాని కొక వూరు చేరాను. మర్నాడు శివరాత్రి కావడంతో కోటీశ్వరమనే ఆక్షేత్రానికి చాలామంది వచ్చారు నేనూ ఆలయంలోకి వెళ్ళాను.

అక్కడ నాకొకామె కనిపించింది. ఎక్కడో చూసినట్లనిపించి పట్టి పట్టి చూడగా – ఆమె – "అనాడు ఉద్యానవనంలో విశాలాక్షి

మండపంమీద నేను వీణ వాయిస్తూ పాడుతూంటే నువ్వు రాలేదూ? మనం సంగీతం ముచ్చట్లు కూడా చెప్పుకున్నాం అంతలోనే నువ్వు నిద్రపోయావు ” అని నవ్వింది

అప్పుడు నాకు కలో నిజమో కాని ఆ సంఘటన జ్ఞాపకం వచ్చింది.

“ ఆ ఫలాన్నీ పుష్పాన్నీ భద్రంగా దాచుకున్నావా?”

“వాటి మహిమ పూర్తిగా తెలియక ఇద్దరు బ్రాహ్మణులకిచ్చేశాను ’

“అయ్యో. అమ్మవారు నీకిచ్చినవి అలా మరొకరికివ్వవచ్చునా? ఉండు నేను ఆలయంలోకి వెళ్ళివస్తాను– ’ అని లోపలికి వెళ్ళింది తిరిగి రాలేదు. ఆలయంలోనూ లేదు. ఎంత వెదికినా కనిపించక – నాపై అమ్మవారి దయ ఉందని సమాధాన పడి మళ్ళీ ప్రయాణం చేసి మర్నాటి సాయంకాలానికి ధర్మపురి అనే రాజధానిచేరగా – ఆ ఊరి సత్రంలో – “ధర్మాంగద మహారాజుగారికే దివాణాని కొక అద్భుత ఫలం వచ్చిందట దానిజాతి ఎవరూ చెప్పలేకపోయారు. దానిని తింటే ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు దానిది చక్కని పరిమళమట.

ఈ రాజు స్నేహితుడు మళయాళ దేశపు రాజు చంద్రవర్మ అద్భుత పుష్పాన్ని తెచ్చాడట అది ఎన్నటికీ వాడదట దాని పరిమళం ఆమడ వరకూ వ్యాపిస్తుందట

ఈ రెండింటి గురించీ ఉపన్యాసాలూ, అనంతరం మదనమంజరి అనే వేశ్య సంగీతకచేరీ సభలో జరుగునట ” అని చెప్పుకోడం విని – పురుషవేషంలో నే నాసభకు వెళ్ళాను

ధర్మాంగద మహారాజు – ‘ లోకాతీతమైన వస్తువులు లభించి నప్పుడు వానివిశేషాలందరికి చెప్పడం రాజధర్మం ” అంటూ ఆ పువ్వు, పండు గురించి వివరించి – “వీటి గురించి మీకు తెలిస్తే చెప్పండి.” అని సభను కోరగా – భీమశర్మ అను బ్రహ్మచారి చెప్పసాగాడు.

# అద్భుత ఫలం కథ

"సభాసదులారా! నా పేరు భీమశర్మ మాది విజయపురి అగ్రహారం మా అన్నలు చేసిన అవమానం భరించలేక ఉరిపోసుకోబోతూంటే – పంచకళ్యాణిపై పోతున్న ఒక పురుషుడు నన్నాపి నా విషాదగాధ విని. ఈ ఫలంనాకిచ్చి – యిది మహిమకలదనీ, దీనిని రాజుకిచ్చి దరిద్రం తీరేలా ధనం తీసుకుని బతకమనీ అన్నాడు. అతని చెంగులో పుష్పం కూడా ఉంది నేనా ఫలం పట్టుకుని ధర్మపురి చేరాను. నేనెన్ని పొరలలో చుట్టి ఉంచినా దీని పరిమళం వ్యాపిస్తూనే ఉంది.

నేను వీధిలో పోతూండగా కుబేరదత్తుడను కోమటి ఆపరిమళానికి నన్ను పిలచి పండును చూబించమని – "దీనిని తినిన సంతానం కలుగునా? అని అడిగాడు"

నాకు తెలియదన్నాను సామాన్యుల కివ్వవద్దని ఆ పురుషుడు చెప్పి ఉన్నాడు కదా కాని ఆ కోమటి కొసరికొసరి లక్షరూపాయలిస్తాననే సరికి – రాజు గారంతకంటె ఎక్కువిస్తారా? అని నేనాశీర్వదిస్తూ ఆపండు నతని చేతిలో పెట్టాను.

అతడు దానిని పెట్టిలో దాచి "నావద్ద యిప్పుడంత ధనంలేదు. రేపురండి. మీ సొమ్ముకి భయంలేదు.' అన్నాడు.

వర్తకుల మాయమాటలు నాకు తెలియవు మర్నాడు పొద్దున్నే వెళ్ళగా – "తెల్లారకుండా వచ్చావే ఊరికెళ్ళిన వాడు సొమ్ము తీసుకురావద్దూ? సాయంకాలం రండి –' అన్నాడు. అలానాలుగు రోజులు తిప్పి వారం పోయాక రమ్మన్నాడు

అప్పుడు నేను – "మీకు సొమ్మున్నప్పుడే కొనవచ్చును నా ఫలం నాకిచ్చెయ్యండి." అన్నాను.

"వెర్రి బ్రాహ్మడా! నిజంగా ఆ పండుకి లక్షరూపాయ లిస్తాననుకున్నావా? పరిహాసంగా అన్నానంతే దీనితో సంతోషించి వెళ్ళు.' అంటూ పదిరూపాయలు చేతిలో పెట్టబోయాడు.

'ఇదినాకొద్దు నాపండునాకిచ్చేయ్ అన్నాను అది యిదివరకే తినేశాం చేదుగా ఉంది ఏమీ గుణం కనిపంచలేదు " అన్నాడు

నేను కేకలు పెట్టి పెద్దమనుషులని పిలిచి కోమటి చేసిన మోసం చెప్పాను

వారతనిని నిలదీయగా – "ఎక్కడైనా ఒకఫలం లక్షరూపాయలు చేస్తుందా? నేను పరిహాసమాడాను నేనది తినేసిన సంగతి తెలిసి యితను లక్షరూపాయలిమ్మంటున్నాడు పోనీకదా బ్రాహ్మణుడని పది రూపాయలిస్తే యిలా తగవు పెడుతున్నాడు " అన్నాడు కోమటి.

'ఏపండూ లక్షరూపాయలు విలువ చేయ"దంటూ వారతని పక్షమే మాట్లాడి నన్ను మందలించారు నేను రాజుగారికి చెప్పుకున్నాను. నిన్నటి రాత్రే కుబేరదత్తుని యిల్లు కొల్లగొట్టి దొంగలతని సొత్తంతా దోచుకు పోయారు

రాజు ఆఫలం గురించి భటుల ద్వారా కోమటిని నిలదీయగా అది వున్న పెట్టిని కూడా దొంగలెత్తుకుపోయారన్నాడు. తరువాత రాజెంతో ప్రయత్నించి యీ ఫలాన్ని పట్టుకున్నారు ' అని ముగించాడు

అప్పుడు కుబేరదత్తుడు లేచి – అయ్యా! ఈ బ్రాహ్మణుడు చెప్పినదంతా నిజమే ధనలోభంతో బ్రాహ్మణుని మోసం చేసినందుకు నాకు తగిన శాస్తే అయింది. ఇంకెప్పుడూ అలా చెయ్యను " అని చెంపలు వేసుకుని కూర్చున్నాడు

అప్పుడు భటులచే తీసుకురాబడిన దొంగలిద్దరు – 'కుబేరదత్తుని యిల్లు కొల్లగొట్టిన ధనం ఒక కంసాలి ఇంట పంచు కుంటూండగా ఈ పండు బయట పడింది. కంసాలి అడిగాడని మేమిచ్చేశాం. ' అన్నారు

"ఆ ఫలాన్ని నావద్ద రెండు మూడు దినాలుంచుకున్నాక తారావళి అనే వేశ్యకిస్తే బాగుంటుంది – "అని ఆమెకిచ్చాను అన్నాడు కంసాలి

ఆవేశ్య దానిని తినక బంతిలా మేడమీద వేలాడ దీసింది. అంతలో – రాజభటులు దానికోసం వెదుకుతున్నారని విని ఎక్కడైనా పారెయ్యమని కంసాలివిటు డామెకు సలహా యిచ్చాడు. ఆమె దాసికిచ్చి కందకంలో పారెయ్యమంది. ఆదాసి – పెట్టె నెత్తిమీద పెట్టుకుని వెళ్తూ – తనవిటుణ్ని చూడాలని వాడింటికెళ్తే వాడు పెట్టెలో ఏముంధని అడిగాడు.

"ఇదొక అద్భుతమైన పండు నీకోసం తెచ్చాను." అని ఆమె అతనికిచ్చింది. వాడు తనమీద ఆమెకు కల ప్రేమకి సంతోషించాడు. దాసి యజమానురాలికి కందకంలో పారేశానని చెప్పింది.

"నే నిలాటి పండుతింటే ఏంలాభం? అమ్ముకుంటే ఎక్కువ వెలవొస్తుందని అంగడికి తీసుకెళ్తుండగా – దీని పరిమళ మహిమకాబోలు రాజభటులు వచ్చి నన్ను పట్టుకున్నారు. నన్ను బందీ గృహానికి తీసుకు పోయి యదార్థం చెప్పేవరకూ చావబాదారు." అని చెప్పాడు దాసీవిటుడు.

సభ్యులు కరతాళధ్వనులు చేశారు. రాజు లేచి – "ఇలాగే అద్భుతపుష్పం వెనకవిధం కూడా తెలపండి" అని ఆజ్ఞాపించాడు.

ఒక వృద్ధ బ్రాహ్మణుడు లేచి చెప్పసాగాడు.

## అద్భుత పుష్పం కథ

"అయ్యా నేనొక మధ్యాహ్నంవేళ పిల్లలతో అడవినపడి పోతూంటే ఒక చక్కని చిన్నది చెట్టునీడన కనిపించింది. ఆమె పక్కన గుర్రముంది. నా దరిద్రం చెప్పుకునేసరికి దేవకన్యలా ఉన్న ఆమె నాకొక పువ్విచ్చి – "నీకుటుంబాన్ని కలకాలం పోషించే వారికే మహిమగల యీ పుష్పాన్నివ్వు–" అని చెప్పి వెళ్ళిపోయింది. ఆమెను నా భాగ్యదేవతగా భావించి – ఒకనాటి సాయంకాలానికొక వూరు చేరాను

ఇద్దరు మనుషులు విహారార్థం గుర్రాలమీద వెళ్తూ ఎదురయ్యారు నాసంచీలో ఉన్న పుష్పపరిమళం వాళ్ళని ఆపేయగా-

"నీవద్ద ఏమైనా పరిమళ ద్రవ్యముందా?'' అని అడిగారు

నేను పూవుని చూబించాను

'దీనిని మాకియ్యి " అని అడిగారు

నేనంతా చెప్పాను

నాకుటుంబాన్ని పోషించే బాధ్యత కంగీకరించి నన్ను కుటుంబంతో సహావారింటికి తీసుకుపోయి అన్నోదకాలివ్వసాగారు

దరిద్రుడినైన నాకదే రాజభోగంగా అనిపించింది.

వీరిద్దరికీ ఒకతే విటకత్తె దానివల్లనే వారికి మైత్రి కలిగింది ఇది తెలిశాక నేనా పుష్పాన్ని అలాటి అధములకిచ్చానే అని పశ్చాత్తాప పడ్డాను.

మరోపదిరోజుల్లో వారి కామెవల్లనే విరోధం కలిగి ముఖాలు చూసుకోడం మానేశారు ఒకరాత్రి వారొకరి నొకరు చంపుకున్నారు. ఆ ఇంట మమ్మల్ని పోషించేవారు లేకపోయారు

విటకత్తెను నాపుష్పం గురించి అడిగితే 'ఇది నాసొత్తయినది పో" అని గెంటేసింది నేను గ్రామాధికారులతో చెప్పుకున్నాను. వారి కేంచేయాలో తోచక మాదేశ ప్రభువగు చండవర్మ మహారాజు యిక్కడికి వొస్తూ ఆ గ్రామంలో బస చేసి ఉన్నందున వారికి ఈ సంగతి చెప్పారు

'శ్రేష్టమైన వస్తువులు రాజు వద్దనే ఉండాలి' అంటూ ఆపూవుని వశపరచుకుని మమ్మల్ని కూడా యిక్కడికి వెంట బెట్టుకొచ్చారు ' అని ముగించాడు

సభ చప్పట్లు కొట్టింది.

చండవర్మ మహారాజు లేచి - "అయ్యా ఈ అద్భుతఫలపుష్పా లెలా వచ్చాయో విన్నాం బ్రహ్మచారి - తనకీఫలమిచ్చినవాడు పురుషుడనీ, బ్రాహ్మణుడు తనకీ పుష్పాన్నిచ్చింది స్త్రీ అనీ చెప్పారు ఇది కొంత ఆలోచించవలసిన విషయం

"బ్రహ్మచారీ! నీకు ఫలమిచ్చిన పురుషుని పోలికలెలా ఉన్నాయి?' అని అడిగాడు.

"అప్పుడు కనుచీకటిగా ఉండుటచే నిదానంగా చూడలేదు. పురుషుడనుకున్నాను కాని నిశ్చయంగా చెప్పలేను. మూటవిప్పినప్పుడు పైటచెంగులాటిది కనిపించింది. గుఱ్ఱం మాత్రం పంచకళ్యాణి రంగుది." అన్నాడు.

"రెండింటినీ యిచ్చిన స్త్రీ ఒక్కరే ఆమె దేవకన్యే కాని మానవకన్య కాదు దేవిదయవలన లభించాయి వీటికి నిత్యమూ పూజలు జరిపించాలి. బ్రాహ్మణునికీ బ్రహ్మచారికీ తగు బహుమతులివ్వడం ఉచితమని నా అభిప్రాయం" అన్నాడు రాజు

తరువాత – పాడుటకై మణిమంజరిని పిలిచారు. ఆమె శ్రోతలకానందం కలిగించింది.

గాయకులకు ఎవరేనా పాడినప్పుడు తామూ పాడాలనే కోరిక కలుగుతుంది అలాటి ఉత్సాహంలో – సభాముఖానికి పోయి అగ్రాసనాధిపతితో "ముహూర్త మాత్రం నా గాంధర్వ విశేషం విని నన్ను కృతార్థుని చేయండి " అని ప్రార్థించి. అనుమతి పొంది" వీణావతి స్వరకల్ప నెత్తుకుని ఒక కృతి పాడాను

సభ్యులు బొమ్మల్లా ఉండిపోయారు కొందరు నాట్యం చేశారు. కొందరు తాము కూడా కూనిరాగాలు తీశారు అప్పుడు నేను మోహనరాగం పాడగా శ్రోతలు నిద్రలోకి జారిపోయారు

"ఇది దేవగానమే తప్ప మనుష్యగానం కాదు" అని మెచ్చుకున్నారు మణిమంజరి కూడా ఆశ్చర్యపోయింది

ధర్మాంగదుడు నన్ను పిలిచి మెచ్చుకుని నావివరాలడిగి – "అద్భుత ఫలపుష్పాలలాగే మీరూ అప్రయత్నంగా మాకు లభించారు. మా అదృష్టం మంచిది ' అన్నాడు

నాపేరు సింహకేతుడు నాది క్షత్రియజాతి మాదికాశీపురం దేశాటనం చేస్తూ యిలా వచ్చాను ఈ గానం స్వయం కృషితో నేర్చినదే కాని ఎవరి వద్దా అభ్యసించలేదు." అన్నాను

"వివాహమైందా?"

'లేదు "

'మీకేవిద్యలలో అభ్యాసం ఉంది?

"అన్ని విద్యలలోనూ - కొంచెం కొంచెంగా."

మర్నాడు శాస్త్ర ప్రసంగానికి రావడానికి నన్ను ప్రార్థించారు రాజుగారు

ఆ వాదనలో ప్రతివాదులే నన్ను ప్రశంసించగా - రాజు - రాజకుమారా నీ రూపం, సంగీతం, శాస్త్ర జ్ఞానం అన్నీ అమోఘాలే. నీకివ్వదగిన పారితోషికం మాదగ్గరలేదు. మా రాజ్యమంతా యిచ్చినా నీ ప్రతిభకు సరిరాదు. ఈ అద్భుల ఫలపుష్పాలు నీ వద్ద ఉంటే బంగారానికి పరిమళం అబ్బినట్టుంటుంది. దేవుణ్ణి పూలతో పూజించి, పళ్ళు నైవేద్యం పెడతారు కదా?" అంటూ వాటినిచ్చాడు.

ఒకనాడు నాగుర్రం రాజభటులకి దొరికి అక్కడికి తేబడింది. నేను దానిని చూచి చాలాసంతోషించి రాజుగారి అనుమతితో దానిని తీసుకున్నాను న్యాయమైన సొమ్ము నట్టేట పారేసినా నట్టింటికి నడచి వస్తాయన్నట్లు నా ఫల, పుష్ప, అశ్వాలు నన్ను చేరుకున్నాయి నేనక్క డొక నెల ఉన్నాక మళయాళ దేశ ప్రభువు చండవర్మ తన గ్రామం పోతూ నన్నూ రమ్మన్నాడు

ఈ గ్రామంలో - చండవర్మ విడిది యిచ్చిన మేడ మీద కూర్చుని వీణావతి నుండి తెలుసుకున్న స్వరాలని పాడుకుంటూ హాయిగా గడుపుతూంటే - ఒకరోజొక చిలకవచ్చి నాముందు వాలింది. పాటలో మునిగి నేను దానిని పట్టించుకోలేదు. నేను పాట ఆపినప్పుడది ముక్కుకి తగిలించుకున్న పత్రికను పడేసింది.

అది ఒక చతురఅయిన స్త్రీ రాసింది. నా గానానికి సంతోషిస్తూ అద్భుత ఫల పుష్పాలకూ అపూర్వగానానికీ అధిపతినైన నన్ను చూడాల నుందని శ్లోకంలో చమత్కారంగా రాసింది ఆవిద్యాంసురాలికి జవాబును నేను కూడా శ్లోక రూపంలో కల్పనా పటిమతో రాయగా ఆచిలుక దానిని తీసుకుని ఎగిరిపోయింది కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాక ఒక రాత్రి నేను మేడమీద కూర్చుని గానం చేస్తూండగా ఒక స్త్రీ వచ్చి నమస్కరించింది.

"ఎవరవు?" అని నేనడగగా -

"నాపేరు తిలోత్తమ. మారాజపుత్రిక వసంతతిలక తమ సంగీతం వినాలని వచ్చింది. మీరనుమతిస్తే ఆమెనిక్కడికి తీసుకొస్తాను." అంది వినయంగా.

"రాజపుత్రిక లిటువంటి రాత్రి పరులమేడకు సంగీతం వినడానికి రావడం తప్పుకాదా? ఎలాగూ వచ్చింది కనుక తీసుకురా" అన్నాను.

ఆమె వచ్చి కూర్చున్నాక నేను మోహనరాగం పాడి ఆమెను వివశువుని చేశాను.

అప్పుడామె సిగ్గువిడచి - తన మదన వికారం తెలుపగా - వలదని పంపేశాను.

మర్నాడు రాజు - తనకి పుత్రసంతతి లేదనీ వసంతతిలకని వివాహం చేసుకుని రాజ్యమేలమనీ కోరగా నేను సిగ్గుతో మౌనం దాల్చాను.

మా వివాహం త్వరలోనే జరిగిపోయింది.

"పెళ్ళయిన సంవత్సరంలోగా మనం కలిస్తే నేను మరణిస్తానని ఒకసన్యాసి శపించాడు కనుక ఏడాది వరకూ జాగ్రత్తగా ఉండాలి. ఆపైన మనిష్టమే" అని ఆమెకు చెప్పాను.

కొద్దిరోజులకే చండవర్మ స్వర్గస్థుడై నేను గద్దె ఎక్కాను శక్తి పూజపేరుతో జరుపుతున్న బలులు నాపకపోతే కఠిన శిక్షలు విధిస్తాననీ, మంత్ర శాస్త్ర పుస్తకాలు లాక్కోడానికీ, బలులిచ్చేవారిని కనిపెట్టడానికీ భటులని నియోగించాను. మొన్న నాకీ పుస్తకం తెచ్చివ్వడం వల్లే ఆయింటికి వచ్చాను ఇదంతా విశాలాక్షి కృప తప్ప మరొకటి కాదు" అని చెప్పి విశాలాక్షి అద్భుత ఫల పుష్పాలను తెచ్చి వారికి చూపించింది.

వాటిని చూసి ఆరాజు, మదనుడు ఆశ్చర్యపోయారు. ఆమె వసంతతిలకను పిలిపించి – ఆ వృత్తాంతమంతా చెప్పి – మనోహరుడితడే అనగా ఆమె చాలా సంతోషించింది

"ఈ ఫలాన్ని కలలో తింటేనే నాకు ఆకలి దాహం కలగడం మానేశాయి అంటూ దానిని నాలుగు ముక్కలు చేసి – ఇంద్రద్యుమ్నుడి దంపతులకీ, మదన వసంతతిలకలకీ పంచింది

ఇంద్రద్యుమ్నుడు – "అమ్మా. మేము దేశం విడిచి చాలా కాలమైంది మా కుమారుడు విజయుడి గురించి ఆత్రత పడుతున్నాము ఇప్పటికి మనమందరమూ క్షేమంగా ఉన్నాం కనుక మా ప్రయాణాని కేర్పాటు చేయి" అనగా

ఆమె --- 'మనమందరమూ కాశీపురం పోయి శత్రువులను తరిమేసి అప్పుడు మీరు మీ దేశానికి వెళ్ళాలని నా అభిలాష" అంది.

"అమ్మా నీయందు విశాలాక్షి దేవికి మిక్కిలిదయ. మీరు సేనలతో గుహామార్గంలో కోటలో ప్రవేశించండి శత్రువులను సులభంగా గెలుస్తారు నేను వచ్చి చాలా కాలమైంది మీరు కాశీపురం చేరాక మీవూరికివస్తాను" అన్నాడు ఇంద్రద్యుమ్నుడు

విశాలాక్షి అతని మాటల కంగీకరించి ప్రయాణానికి ఓడను సిద్ధం చేయించింది

# ఇంద్రద్యుమ్నుని సముద్ర ప్రయాణం

**ఓ**డలోని జనానికి సంవత్సరానికి సరిపడ భోజనసామగ్రితో, మంచిగాలి వీస్తుండగా మంచి ముహూర్తంలో బయలుదేరింది - ఇంద్రద్యుమ్ను డెక్కిన ఓడ. మూడు వారాలు ప్రయాణించాక ఓడనడిపే కర్ణధారుడు గాలివాన వచ్చు లక్షణాలను పసికట్టి - తెరచాపలు దించి, లంగరు వేయించాడు

మూడురోజులు ధైర్యంగా ఉన్నా - నాలుగోరోజున యింకా పెద్ద తుఫాను రావడం తథ్యమనీ, పడవ నిలవదనీ ఒడ సర్దారుడు చెప్పేశాడు అందరూ దేముడి మీద భారం వేసి భయంగా చూడసాగారు. పడవ సముద్రంలో మునిగిపోయింది ఇంద్రద్యుమ్నుడు చిత్రసేనను పట్టుకుని ఈదసాగాడు. కొంతసేపయ్యేసరికి ఆమె జారిపోయింది.

అతనెంతో విచారించి ఈదుతూంటే అద్భుతమైన పరిమళం వేసింది పడవ కర్ర అని గ్రహించి దానిని చేరి పైకెక్కి కూర్చున్నాడు అది మంచిగంధం కర్ర దానిమీద అప్పటికే అతని భార్యపడుకుని ఉంది

రెండు మూడు రోజులు గడిచాక ఆకర్ర వారిని ఒడ్డు చేర్చింది భూమి కనపడగానే వాళ్ళ ఆనందానికి అవధులు లేవు. వాళ్ళాదేశంలో తిరుగుతూంటే కొన్నాళ్ళకు సందడి వినపడి - ఆదేశమేదో తెలుసుకుందామని వారివద్దకు వెళ్ళి ' ఈ సేన ఎవరిది? ఈ దేశమేది? ఇది ఏ సంవత్సరం? ఈ రోజు తిధివారనక్షత్రాలేమిటి? ' అని ఇద్రుద్యుమ్ను డగగా - "ఈ సేన ఇంద్రద్యుమ్న మహారాజు కుమారులు విజయునిది వారు తండ్రిని వెదకుచూ - దైవజ్ఞుల మాటను బట్టి మూడు రోజులకిందట యిక్కడికి వచ్చారు ఇది చిత్రభాను సంవత్సరం. నేడు ఆషాఢశుద్ధ పాడ్యమి శుక్రవారం, పునర్వసు నక్షత్రం ఇప్పుడే బ్రాహ్మణుడు చెప్పిపోయాడు" అన్నారు వారు

రాజు ఆశ్చర్యపోయి - భార్యతో "విన్నావా! మనవిజయుడు మనని వెదుకుతూనే యిక్కడి కివచ్చాడట. భగవత్సంకల్పం వీడు చెప్పిన

దాన్ని బట్టి మనం మూడు సంవత్సరాల క్రిందట ఓడెక్కాం పద వెళ్దాం. ' అన్నాడు

వాళ్ళు విజయుని శిబిరంలోకి వెళ్ళబోతుంటే – ద్వారపాలకు అడ్డగించి 'అయ్యా! ఇప్పుడే కాశీరాజుగారూ మళయాళదేశపు రాజుగారూ లోపలికి వెళ్ళారు తమరిప్పుడు పోవుటకు సమయం కాదు' అన్నారు

'మీ తండ్రి ఇంద్రద్యుమ్నుడు వచ్చాడని చెప్పు' అన్నాడు రాజు వాడు తెల్లబోతూ – 'తమరుఇంద్రద్యుమ్న మహారాజుగారా ఈ వేషంలో ఉన్నారేమిటి? నా తప్పు మన్నించండి అంటూ లోపలికి పోయి చెప్పగా – విజయుడు పరుగు పరుగున వచ్చి వారిని కౌగలించుకున్నాడు అంతలో మదనుడు, విశాలాక్షి కూడా వచ్చారు

నాబంధువులందరూ యిక్కడే ఉన్నారే! నేడెంత సుదినం " అని సంతోషించాడు రాజు

వారు లోపలికి పోయి కూర్చున్నారు తండ్రి తన వృత్తాంతం చెప్పి – విజయుని – "నీవిక్కడి కెలా వచ్చావ్?" అని అడిగాడు. విజయుడిలా చెప్పాడు ' మీరు అరణ్యంలోకి వెళ్ళిన కొన్ని రోజులకి మనసైనికులొచ్చి అక్కడ జరిగిన దంతా చెప్పి మా అమ్మను దారిలో శబరసైన్యం అడ్డగించి తీసుకుపోయా రనగానే నేనెంతో విచారించి చతురంగ బలాలలతోనూ అడవులన్నీ తిరిగాను కానీ ఎక్కడా మా అమ్మజాడ కనిపించలేదు

దానితో నాకు మనసు చెదిరి రాజ్యం మంత్రి కప్పగించి – ప్రతి అడవీ ప్రతిపల్లే తిరుగుతూ అనేక దేశాలు వెళ్ళాను. విరాగిలా దేశాటనం చేస్తూ కాశీపురం చేరుకున్నాను అక్కడ గంగాస్నానం చేస్తూ విశ్వనాధుణ్ని అర్చిస్తూ కొన్నాళ్ళు గడిపాను.

ఒకనాడు విశ్వేశ్వర స్వామి దర్శనానికి పోగా – మహారాజు న్నాడని – ద్వారపాలకులు నన్ను నిలిపేశారు! చక్రవర్తి కుమారుడినైన నాకా అవమానం – అనుకుంటూ చింతిస్తూంటే ఒక సన్యాసి నన్ను పలకరించి నా వివరాలడిగాడు

నేనంతా చెప్పాను. అతనేదో గుణించి – "మీ తల్లి తండ్రులు నీటిలో చిక్కులు పడుతున్నారు. ఆషాడ శుక్ల పాద్యమినాడు ఓఢ్రదేశంలో యీ రేవుకి వస్తారు అప్పటికి నువ్వక్కడికి పో" అన్నా డాత్రికాలజ్ఞుడు.

మరునాడే నేను మనవూరికి బయలుదేరబోతూండగా – ఆ వూరిలో అల్లకల్లోలంగా ఉంది అదేశపు రాజుగారయిన హేమాంగదుని అల్లుడు, కూతురు వచ్చి కోటలో ప్రవేశించి శత్రురాజును వెడలగొడుతున్నారు. వారు పారిపోతున్నారు.

ఇది చెప్పిన వానికి నేను పారితోషిక మిచ్చాను హేమాంగదుని బంధువులతో ముచ్చటించి వెళ్దామని కోటలోకి పోయాను

అప్పటికే శత్రురాజులను పారద్రోలి – శత్రురాజుల స్త్రీలను చెరబట్టక గౌరవంగా పంపిన విశాలాక్షి దయార్ద్ర హృదయం గురించి చెప్పుకుంటున్నారు.

నేను దర్శనార్థం వచ్చానని తెలియగానే – మదనుడు నావద్ద కొచ్చి అంతఃపురానికి తీసుకుపోయి భార్యకి చూపాడు ఆమె ఆదరంతో తన వృత్తాంతం చెప్పి –నా గురించి అడిగి తెలుసుకుంది 'మీతల్లితండ్రు లిన్నాళ్ళు దేశం చేరక పోవడానికి కారణమేమిటో?' అని – వెదకడానికి వారు కూడా నాతో వచ్చారు.

దారిలో మీరు పడిన కష్టాలు చెప్పుకుంటూ మొదట మన పట్నానికి వచ్చాం. అప్పుడా సన్యాసి మాట తలుచుకుని మొన్నటి కీ రేవు చేరాం దేవుడే ఆ సన్యాసి రూపంలో మనను కలిపాడు '

అది విని ఇంద్రద్యుమ్నుడు – 'మన కర్మ యిన్నాళ్ళు తిప్పింది. ఇప్పటికి దైవానుగ్రహం కలిగింది మేము సముద్రంలో మునగకుండా కాపాడింది ఒక గంధపు కర్ర కనుక యీ స్థలాన్ని క్షేత్రంగా చేసి – ఆ కర్రతో విగ్రహాలు చేసి స్థాపిస్తాను. ఇక్కడ గొప్ప ఆలయాలు కట్టిస్తాను. అంతవరకూ నేను మనవూరు రాను. అంతా తొందరలో జరగాలి శిల్పులను పిలిపించు అని ఆ గంధపుకర్రను పైకి లాగించి దానికి పూజా సంస్కారాలు చేయసాగాడు

శిల్పకారులు వచ్చి కదు విచిత్రమైన ఆలయాలు కట్టారు ఆ కర్రను విగ్రహాలుగా చెక్కగల సమర్థు డెవరా అని ఆలోచిస్తూండగా - ఒకనాడొకశిల్పి వచ్చి - 'నేను శిల్ప శాస్త్రమంతా చదివాను విగ్రహాలని శాస్త్రీయంగా చేయగలను అన్నాడు

సామగ్రి ఏం కావాలి?" అని అడగ్గా ఏమీ అక్కర్లేదు ఈ విగ్రహాల నొకచోట తెరవేసుకుని రహస్యంగా చేస్తాను పూర్తయ్యాయని నేను చెప్పేవరకూ తెరలోపల కెవరూ రాకూడదు వస్తేప్రమాదం ఔతుంది' అన్నాడు

రాజందుకంగీకరించాడు. ఆ శిల్పికొక రహస్యస్థలం ఏర్పరిచాడు

శిల్పి విగ్రహాలు చెక్కడం మొదలు పెట్టినప్పట్నుంచీ ఇంద్రద్యుమ్నుడు ప్రతిదినమూ బ్రహ్మణులకి - కొమ్ములకీ డెక్కలకీ బంగారం ఉంచిన గోవులని దానం చేయసాగాడు గోవుల డెక్కల రాపిడిచేత ఆనేలంతా పల్లమై చివరికి చెరువయింది.

గోపా. అదే ఇంద్రద్యుమ్నం ఆ సరస్సులోనే మనం స్నానాలు చేశాం. రెండు మూడు సంవత్సరాలు గడిచినా ఆ శిల్పి తెరతీయలేదు 'ఆలయాలు సిద్ధంగా ఉన్నాయి విగ్రహాల పని పూర్తికాలేదు శిల్పి యివతలకి రాదు బతికున్నాడో లేదో అనుమానమే ఇన్నాళ్ళూరుకోవడమే తప్పు- అనుకుంటూ ఒక సాయంకాలం అత నాతెర ఎత్తి తొంగి చూశారు

అక్కడెవరూ కనపడలేదు విగ్రహాలు మాత్రం చేతులు కాళ్ళు కాక తక్కిన అవయవాలు చెక్కబడి ఉన్నాయి అవి చాలా చక్కగా ఉన్నాయి ఈ విగ్రహాల నెవరు పూర్తి చేయగలరని అతను దుఃఖిస్తుంటే - దేవుడు కలలో కనపడి - 'చింతింపకు నేనిలాటి రూపంలోనే భూమి మీద జగన్నాధస్వామి అనే పేరుతో ప్రసిద్ధి చెందుతాను నీ కీర్తి భూమ్మీద స్థిరంగా ఉంటుంది నీ భక్తికి మెచ్చాను - " అన్నాడు.

ఆ విషయం అందరికీ చెప్పి - ఆ స్వామికి తనపైగల ప్రేమకి సంతోషిస్తూ ఇంద్రద్యుమ్నుడు విగ్రహ స్థాపనకు శుభలగ్నం తెలిసికుందుకు - యోగబలంతో బ్రహ్మలోకానికి వెళ్ళాడు

అతని మాటలు విని బ్రహ్మ నవ్వుతూ – "పోపో అన్నీ ఐపోయాయి లగ్నంకోసం యింత దూరం వచ్చావా!" అన్నాడు

ఆ రాజు మళ్ళీ వచ్చి చూసేసరికి స్వామి మరొక ఆలయంలో స్థాపించబడి అద్భుతములైన ఉత్సవాలనుభవిస్తున్నాడు అక్కడ తననెరిగిన వారెవరూ లేరు.

ఆలయంలోకి పోబోతే – కావలివారు అడ్డుపెట్టారు.

ఇదేమికర్మ. నేను మహారాజునని గుర్తించక వీళ్ళు నన్ను తోసేస్తున్నారే ' అనుకుని వారికెన్ని విధాల చెప్పుకొన్నా అతని మొరవినలేదు

అప్పుడతను సముద్ర తీరానికి పోయి – భక్తితో స్వామిని ధ్యానించగా – "రాజా చింతింపకు. కారణాంతరాలవల్ల నేను నువ్వు రాకమునుపే ప్రతిష్టించబడ్డాను. ఏటేటా యిక్కడి కొచ్చి ఉత్సవాలు పొందుతాను నీ కీర్తి చిరకాల ముంటుంది. నువ్వు స్వర్గ సుఖాలు పొందుతావు చిరకాలమవడం వల్ల నీ బంధువులందరూ పరలోకం పోయారు నువ్వుఇక్కడి నుంచి వెళ్లి చాలాకాలమైంది కనుక నీకేమీ తెలియడం లేదు నీ కోసం ఎదురు చూస్తున్న నీ భార్యని కలుసుకుంటావు. అదిగో. దేవలోకం నుంచి విమానం వొస్తూంది ఎక్కిపో." అన్నాడు స్వామి.

విమానం తన దగ్గర నిలిచే సరి కతను భక్తి పూర్వకంగా దానినెక్కి దివ్యాంబరాలు ధరించి, దేవదూతలు సేవిస్తూంటే – స్వర్గానికి వెళ్ళాడు

గోపా! అందువలన జగన్నాధుని రూపం అలా ఉంది. సుభద్రాదేవి అతని భార్య, బలభద్రుడతని శేషుడు. దీనినే బుద్ధావతారమంటారు "

గోపాలుడా స్థల మహాత్యానికి ఆశ్చర్యపోతూ – ఆకథలను తలుచుకుంటూ – కావడెత్తుకుని గురువుతో తరవాతి మజలీకి బయలుదేరాడు.

# కాశీమజిలీ కథలు

## 14. వ మజిలీ

### సంగీత వృక్షం కథ

"స్వామీ. మీ జపానికంతరాయం కలిగించినందుకు మన్నించండి నేను చూసిన వింత విన్నాక మీరు కోపం చెయ్యరు

మీరెలాగూ జపం చేసుకుంటున్నారు కదాని, ఊరికే కూర్చోలేక ఊళ్ళో విశేషాలు చూసొద్దామని అటూ యిటూ తిరుగుతూంటే ఒక చోట దట్టమైన చెట్ల గుంపు కనిపించింది ఆ తోట – పర్వతం లాగే ఉంది. అదెంత గొప్పదో అని దగ్గరకు వెళ్ళాను దేనికేనా తినదగిన ఫలా లుంటాయేమో అని చూసేంతలో అద్భుతమైన గానం వినపడింది

ఆశ్చర్యంగా ఆపాట ఎక్కిడినుంచొస్తుందా అని అటూ యిటూ తిరుగసాగాను. అంతలో ఆ గానం మరోలా వినిపించింది. 'జనం లేరు ఇళ్ళు లేవు మరియిలాటి సంగీతం ఎక్కడినుంచొస్తూంది? దేవతలు విమానమెక్కి తిరుగుతూ పాడుతున్నారా?' – అని ఆకాశంలోకి చూస్తే అక్కడ ఎవరిజాడా లేదు అదీకాక సంగీతం చాలాదగ్గరునుంచి వస్తున్నట్లు వినపడింది ఆ సంగీతం రకరకాలుగా వినపడుతూంది

అచెట్లమీద ఎవరేనా ఉన్నారేమో అంటే అలాగాలేరు. నిముషానికొకలా వినపడింది అది మానవగానం కాదు దేవగానమే దానిగురించి తెలిసికొనే దాకా తోచడం లేదు అన్నాడు గోపాలుడు వినయంగా

జపభంగం చేసినందుకు వాడిమీద మొదట కోపం వచ్చినా – అంతలోనే అది మాయమై – ఫక్కున నవ్వి – "నీతో మహచిక్కుగా ఉందిరా సమయం చూడవు సరే ఇకమీదట అలా చేయకు ' అంటూ మణిసిద్ధుడు కథ చెప్పడం మొదలుపెట్టాడు

# రుచికుని కథ

పూర్వం జగన్నాధం పట్నంలో బలదేవుడనే మాలికుడు రోజూ పువ్వులదండలు కట్టుకుని అమ్ముకుంటూ బతికేవాడు. అతను ప్రతిరోజూ జగన్నాధస్వామి ఆలయానికి పోయి మంచిమంచి దండలర్పించి స్వామినర్చించి యింటికి వచ్చేవాడు. అందుచేత అతనికి హరిదాసనే పేరొచ్చింది ప్రజలతన్ని మహర్షిగా భావించేవారు.

ఒకనాడు కళింగ దేశపురాజు కుటుంబంతో యాత్రకురాగా – దాది ఎత్తుకున్న నాలుగేళ్ళ రాజకుమారుని చూసి – తనకీ అలాగ ముద్దులు మూటకట్టే కొడుకునిమ్మని పూజచివర బలదేవుడు ప్రార్థించేవాడు

అలా కొన్ని రోజులు గడిచాక అతని భార్య అందమైన కొడుకుని కంది బ్రాహ్మణులు ప్రేరేపించగా, వాడికి రుచికుడని పేరు పెట్టాడు

చిన్నప్పుడే యింత తేజస్సుతో అందంతో ఉన్నాడే, యౌవనంలో మరెంత చక్కగా ఉంటాడో అనుకునేవారు.

రుచికుడి కయిదేళ్ళురాకముందే వాడి తల్లి మరణించింది. బలదేవుడు వాడికి తల్లిలేని లోటు లేకుండా చాలా గారాబంగా పెంచసాగాడు

రుచికుడు చిన్నప్పటినుంచే తండ్రిలా దండలల్లేవాడు. ఎనిమిదేళ్ళు వచ్చేసరికి గౌతముడనే బ్రాహ్మణ పిల్లాడితో స్నేహం కలిసింది.

గౌతమున్ని సహాధ్యాయుడిగా చేసి తనయింటనే ఉపాధ్యాయులను రప్పించి బలదేవుడు రుచికుడికి విద్య నేర్పించసాగాడు రుచికుడు తెలివైనవాడు కావడం వల్ల త్వరలోనే అనేక విద్యలలో పాండిత్యం సంపాదించాడు

అతనికి దండలల్లడంలో కల నైపుణ్యం యింతా అంతా కాదు ముఖ్యంగా వారకాంతలు అతని దండలంటే తెగమోజు పడతారు.

ఒకనాడు గౌతముడు రుచికుడితో 'తమ్ముడూ నువ్వు కట్టిన దండలు అంగళ్ళలో విశేషంగా అమ్ముడౌతున్నాయి నీమీద కల ప్రేమతో నిన్ను మీ తండ్రి యిల్లు కదలనివ్వడు నువ్వు కాని స్వయంగా మాలలను అమ్మావో ఎక్కువ ధర వొస్తుంది మీ తండ్రి గుడికి పోయినప్పుడు మనం వేశ్యావాటికకు వెళ్ళి దండలమ్ముకొద్దామా?'' అన్నాడు రహస్యంగా. ఆమాటల కతను సంతోషించాడు

తండ్రి గుడికి వెళ్ళగానే చక్కగా అలంకరించుకుని రుచికుడు గౌతముడితో వేశ్యా వీధి కెళ్ళాడు అక్కడ సంగీతం పాడుతున్న వేశ్యలనీ, సౌందర్య రాశులనీ చూసి – మన వూరిలో యిలాటి వింతలున్నాయని చెప్పావు కావేం యిన్నాళ్లూ? ఇది స్వర్గం కాదుకద? వీరు అప్పరసలుకారు కదా?" అని ఆశ్చర్యపోయాడు

ఒకచోట వారాంగన కోసం యిద్దరు బ్రాహ్మలు పోట్లాడు కుంటూంటే వీరు వెళ్ళి విడిపించారు ఆ సందడిలో రుచికుని చేతిలోని పూలదండలు నలిగిపోయాయి.

అప్పుడతను గౌతముడితో 'అన్నా ఈ దండలు నలిగి పోయాయి ఎవరూకొనరు వేళవుతూంది. మా తండ్రి యింటికి వచ్చేస్తాడు మనం పోదామా? అన్నాడు అతనూ అంగీకరించాడు.

దారిలో వాళ్ళకొక వింతయిన మేడ కనపడింది అది చాలా అందంగా ఉంది ఆమేడని చూస్తూ వాళ్ళు నిలబడ్డారు లోపలినుంచి ఒక చక్కని స్త్రీ వచ్చి ఎవరికోసమో చూడసాగింది

వీధిలో ఒక విటుడు పోతూంటే – "రసికశేఖరా. ఇటు చూడకుండా పోతావేం నన్ను గుర్తు పట్టలేదూ? నువ్వుకొన్నాళ్ళు భార్యగా స్వీకరించిన తారావళి సఖిని అందామె అతనితో

"నువ్వు యిక్కడున్నావేం? ఇది చంద్రలేఖ యిల్లుకదా?"

'నేను ప్రస్తుతం తారావళి దగ్గరుండడం లేదు దానికీ నాకూ విరోధమెచ్చింది చంద్రలేఖ నా చుట్టం మాపనికత్తె అంగడికిపోయి రుచికుడు కట్టినవి కాక మరొకరు కట్టిన దండలు తెచ్చింది చంద్రలేఖ

రుచికుడు కట్టినవికాని పెట్టుకోదు అందుకని దానిని మళ్లీ అంగడికి పంపి దానికోసం ఎదురు చూస్తున్నాను."

"చంద్రలేఖ యింటి కెవరేనా సరసులు వస్తున్నారా? ఎవరేనా కన్నెరికం చేశారా? నాకు దాన్ని చూడాలని ఉంది అది తల్లి మాట వినక ఎప్పుడూ విద్యాగోష్టే చేస్తూంటుందని విన్నాను దాన్ని చూసే ఉపాయమేమిటి?

'బావా అది పట్టిన నియమం బ్రహ్మొచ్చినా వదలదు. రుచికుని గాని పెళ్ళాడదట సరసులని చూడదు. ఆడపండితులకు తప్ప కనపడదు. ఒక ఉపాయం చెబుతా విను రుచికునిలా పూలదండలు కట్టాలని ప్రయత్నం చేస్తూంది కాని కుదరడం లేదు ఈ వూరిలోనే ఉన్నాడట, రుచికుణ్ణి తీసుకొస్తే దర్శనం చేయిస్తాను '

"అలాగే". అని అతను వెళ్ళిపోయాడు – నవ్వుతూ

ఆ మాటలు విన్న రుచికుడు – ' మిత్రమా. మాలికలవల్ల నాకు మంచిపేరే వచ్చింది నేనిప్పుడు లోపలికి పోతే చంద్రలేఖ నన్ను గౌరవిస్తుంది కాబోలు పోయి ఆ పని దానికి నేర్పేదా?" అని స్నేహితుణ్ణడిగాడు

' చాలు చాలు పద. మీ తండ్రి వచ్చే వేళయింది. నువ్విప్పుడు లోపలికివెళ్తే తిరిగొస్తావా?' అని మందలించాడు గౌతముడు

"ఎలాగూ మా తండ్రి మందలిస్తాడు కొంతసేపుండి వింతలు చూసిపోదాం."

గౌతముడు మరికొంతసేపున్నా, రుచికుడు కదలలేదు దానితో – మీ తండ్రిని తీసుకొస్తాను " అని అతను వెళ్ళిపోయాడు

అంతలో పరిచారిక పువ్వులు తెచ్చిందేమో అని ఆ స్త్రీ మళ్ళీ వీధిలో కొచ్చింది రుచికుడామెతో ' నువ్వు రుచికుడు కట్టిన దండలకోసం చూస్తున్నావు అవి నాదగ్గరున్నాయి కాని – కొంచెం నలిగాయి. చూసుకో " అన్నాడు

ఆమె వాటిని చూసి ఇవి రుచికుడు కట్టిన దండలే బాగానే ఉన్నాయి వీటి నెంత కమ్ముతావు?" అని అడిగింది

"మీరు రోజూ కొనే ధరకే " అన్నాడతను

అది నాకు తెలియదు వీటి నెక్కడ కొన్నావు?'

కొనలేదు. నేనేకట్టాను ' అన్నాడు నవ్వుతూ నీయిష్టంవచ్చి నంతివ్వు "

అప్పుడామె - నీపేరేమిటి?' అని అడిగింది

రుచికుడు " చెప్పాడు.

దానితో ఆమె ఆశ్చర్యపడుతూ - ఏమిటీ దండలు కట్టే రుచికుడివి నువ్వేనా! మీ యిల్లెక్కడ? ఎప్పుడూ కనపడ్డావు కావేం? మా స్నేహితురాలు నీ దగ్గర మాలకట్టడం నేర్చుకోవాలని నిన్ను తీసుకురమ్మని ఎన్నోసార్లు నన్నడిగింది. నువ్వెక్కడుండేదీ నాకు తెలియలేదు లోపలి కెళ్దాం రా."

అంటూ దీపం వెలుగులో వాని చక్కదనం చూసి ఆశ్చర్యపడి అతన్ని చంద్రలేఖ ముందుకు తీసుకెళ్ళి - 'అమ్మా నువ్వు నిత్యం కలవరించే రుచికుడు" అంటూ పరిచయం చేసింది

వసంతుడి కంటె చక్కగా ఉన్న అతనిని చూసి మోహం చెంది ఉచితాసనం మీద కూర్చోబెట్టి యిలా అంది.

"నిన్ను చూడకపోయినా నువ్వు కట్టిన దండలు నిన్ను పరిచయం చేశాయి ఈ విద్యలోనే కాక రూపంలోనూ అద్వితీయుడివే నువ్వీవిద్య ఎక్కడ సంపాదించావు? నీ గురువెవ్వరు?' అంటూనే శృంగారం వొలకబోస్తూ చూసింది - చంద్రలేఖ

ఆ చూపులకు కరిగిపోయి మతితప్పి అతనేవో మాట్లాడ సాగాడు అతని చిత్త చాంచల్యం చూసి - మన్మధుడివంటి అతనే తన మనోహరుడని నిశ్చయించుకుని - బయట పడకుండానే సంగీతం పాడి, చందనతాంబూలాది సత్కారములు చేసి శృంగారంలో తేలించ సాగింది

అంతలో వీధి ద్వారం వద్ద సందడి వినపడింది రాజభటులు తలుపుతీయమని అరిచారు

అదివిని రుచికుడు – "గౌతముడు వెళ్ళి తన తండ్రినిక్కడికి తీసుకొచ్చాడు. నీ వల్లరి పాలవుతావు ఎంతప్రమాదం వచ్చింది!" – అని విచారిస్తూ తననెక్కడేనా దాచి అవమానం రాకుండా కాపాడమని చంద్రలేఖను వేడుకున్నాడు

ఆమె నవ్వుతూ – "రుచిరా! భయపడకు. మాయింట్లో దాక్కున్న వాడిని పరమేశ్వరుడు కూడా పట్టుకోలేడు " అని ఒక రహస్యమందిరం చూపించింది

'అదికాదు యింకా రహస్యమైనది" చూపమన్నాడు.

ఆమె ఎన్ని చూపించినా యింకొకటి అని అడుగుతూంటే చివరకి ఆమె తన యింటి నానుకున్న ఉద్యానవనం చూపించి "దీనికి రెండో దారిలేదు పదిరోజులు వెదికినా కనపడవు. దానిలోని ఒక గదిలో ఉండు " అని దొడ్డితలుపు బిగించి ఖువతలకు వచ్చింది.

గౌతముడు, బలదేవుడు రాజభటులతో వచ్చి నిలబడ్డారు.

ఈ అర్ధరాత్రి మీరంతా మా యింటికొచ్చారేం? అడిగింది చంద్రలేఖ

" ఈ బలదేవుని కొడుకు రుచికుడు మీయింట నున్నాడని తెలిసి – తీసుకుపోడానికి వచ్చాం మర్యాదగా పంపుతావా? పద్ధతు లవలంబించాలా?"

'రుచికుడెవరో మాకు తెలియదు పద్ధతినేపాటించండి." అందామె అప్పుడు వాళ్ళందరూ దీపాలు పట్టుకుని యిల్లంతా వెదికారు

తెల్లవారింది. ఉద్యానవన ద్వారం గౌతముడికి కనిపించి – దానిని తెరవమన్నాడు

'అది మాది కాదు దానిని తెరిచే అధికారం మాకు లేదు " అందామె

రాజభటులు బలవంతంగా దానిని తెరిచి తోటలో ప్రవేశించారు అది చూసిన చంద్రలేఖ కొంచెం పశ్చాత్తాపపడుతూ – తనపరిచారికను

అక్కడి విశేషాలు చూసిరమ్మని పంపింది ఆమె వెళ్ళేసరికే - రుచికుని కనుగొనలేక వాళ్ళు తిరిగొచ్చేస్తున్నారు

చంద్రలేఖ ఆశ్చర్యపోతూ అవమానం తప్పినందు కానందిస్తూ తనయిల్లు పరీక్షించినందుకు వారి మీద అభియోగం తెస్తానని బెదిరించింది

తరువాత ఆమె ఉద్యానవనంలో ఎంత వెదికినా రుచికుడు కనిపించలేదు అందుకు కారణం తెలియక రహస్యంగా ఊరంతా వెదికించింది అయినా రుచికుని జాడలేదు

ఒకనాడు గౌతముడామెవద్ద కొచ్చి - నువ్వు మామూలు వారకాంతవుకావు విద్యావతివి. బలదేవుడు కొడుకుమీది బెంగతో క్రుంగిపోతున్నాడు ఆ పాపం మూటకట్టుకోకు రుచికుణ్నివదిలిపెట్టు' - అని ప్రార్ధించగా ఆమె యధార్ధం చెప్పింది

ఆ తోటలో సంచార వృక్షాలున్నాయేమో అని శంకించాడతను

చంద్రలేఖ - "నేను రుచికుడిని పతిగా వరించాను బలదేవుడితో - అతనికుమారుణ్ణి వెదికి తెస్తానని చెప్పు నీకు కావలసినంత ధనమిస్తాను దేశాటనం చేసి అతని జాడ తెలుసుకో రుచికుడు నీకు మంచిమిత్రుడు కదా అంది

అతనందుకంగీకరించి బలదేవుడికి చెప్పి దేశాటనం మొదలుపెట్టాడు

కొన్నిరోజులకి చంద్రలేఖ కతని దగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది దానిలో

చంద్రలేఖా నేనెన్నోదేశాలు తిరిగానుకాని రుచికుని జాడ తెలియలేదు ఇప్పుడు సముద్రప్రాంతంలో ఉన్న రామచంద్రపురం అనే పట్నానికి వచ్చాను ఇక్కడొక విశేషం కనిపించింది

ఈ పట్నాన్ని పాలించే శూరసేనుడికి తిలోత్తమనే కూతురుంది విద్యా, రూప, గుణ శీలాలలో మిన్న ఏరాజకుమారుడు వచ్చినా - 'దివ్యప్రభావ సంపన్నుడైన వానిని కాని పెళ్ళాడనని నియమం పెట్టుకుంది

తండ్రి బలవంతంచేయగా ఒక అందగాడి బొమ్మగీసి - 'యిటువంటివాడినైతేనే అంగీకరిస్తాను" అందట.

అలాటివాడిని తెచ్చినవారికి పారితోషిక మిస్తానని రాజు ప్రకటించాడు ఆ చిత్రంలో రుచికుని పోలికలు చాలా ఉన్నాయి మన రుచికుడు ఆమె మనసులో కెలా వెళ్ళాడో? నేనా చిత్రాన్ని చూస్తూ, ఆలోచిస్తూండగా రాజు భటులు వచ్చి యితని నెరుగుదువా? తీసుకు వచ్చావంటే మంచి బహుమతిప్పిస్తాం అన్నారు

"వాడు కనపడితే అదేచాలు నేను మీకు బహుమతిస్తాను" అన్నాను

నువ్వొకసా రిక్కడి కొస్తే తిలోత్తమతో మాట్లాడవచ్చు" అని ఉంది.

రుచికుడి గురించి తిలోత్తమ ద్వారా ఏమైనా విశేషాలు తెలుస్తాయేమో అని చంద్రలేఖ రహస్యంగా రామచంద్రపురం చేరింది.

దేవాలయంలో రుచికుడి చిత్రం చూసి ముద్దులు పెట్టుకుంది. తిలోత్తమతో స్నేహం చేస్తే కాని వృత్తాంతం తెలియదని భావించి - తన విద్యామహిమతోనే అది సాధించవచ్చని - తానొక విద్యా వినోదసభ చేస్తాననీ దానిలో తనని జయించిన వారికి కానుకలిస్తాననీ, విద్వాంసులు, ప్రజలూ రావాలనీ ప్రకటన పత్రికలు రాసి పంపింది.

మొదటి సభకు సామాన్యులు తప్ప గొప్పవారు రాలేదు. కాని మంచి ప్రచారమే జరిగింది. దానితో మరల ఆమె సభ చేసినప్పుడు రాజుతో సహా పెద్దవారు వచ్చారు ఆ వూరిలోని విద్వాంసులను ఒకటి రెండు ప్రశ్నలలోనే ఓడించి అవధానం, విచిత్ర బంధం కవిత్వం వంటి ప్రక్రియలు చూపేసరికి రాజుకూడా ముగ్ధుడై సభానంతరం పారితోషికమివ్వబోగా చంద్రలేఖ అతని అనుగ్రహాన్నే కోరింది

ఆమె వినయానికీ మధురోక్తులకీ సంతోషించిన రాజు ఆమె కభయమిచ్చాడు

# తిలోత్తమ కథ

శూరసేనుడింటికి వెళ్ళిన కొంతసేపటికి రాజభటులు కొందరువచ్చి చంద్రలేఖతో – 'నిన్ను చూడాలని మారాజపుత్రిక తిలోత్తమ వేడుకపడుతోంది రాజుగారు మిమ్మల్ని తీసుకురమ్మన్నారు వెంటనే రండి ' అన్నారు

చంద్రలేఖ ఎంతో సంతోషించి, చక్కగా అలంకరించుకుని తన పరిచారికతో తిలోత్తమ అంతఃపురానికి వెళ్ళింది తన కోరిక నెరవేరబోతూందన్న ఆనందంతో ఉన్న ఆమెను రాజపుత్రిక పరిచారికలు సత్కరించారు

తిలోత్తమను చూడడంతోనే ఆమెకు చంద్రలేఖ నమస్కరించింది

నువ్వు నిన్నటి సభలో చేసిన వింతలు విని నేను చాలా సంతోషించాను నీ కులానికే గౌరవం తెచ్చావు నీకు విద్యలు చెప్పిందెవరు? ఏ విద్య లభ్యసించావు? చక్కని వరుణ్ణి వివాహం చేసుకోక యౌవనాన్నెందుకు వృధా చేసుకుంటున్నావు?" అంటూ ప్రశ్నించింది తిలోత్తమ

తనను రాజపుత్రి పొగడడాన్ని భరించలేనట్లు చంద్రలేఖ యిబ్బందిగా ముఖంపెట్టి – రాకుమారీ నేనొక్కొక్కరి వద్ద ఒక్కొక్క విద్య నేర్చాను చదివినవి సంపూర్ణంగానే చదివాను. నువ్వు నన్ను పొగడకు నేను నీకంటె విద్వాంసురాలిని కాను నన్ను నీ చెలికత్తెలతో చేర్చుకొంటే నాకంతకంటే వేరే అదృష్టముండదు " అని ఒకసారాగి "నేను వివాహమెందుకు చేసుకోలేదని అడిగావు తగిన వరుణ్ణి పొందడం దైవికంకదా? నేనీ విషయంలో నిన్నేమీ అడగను. ఒకరి మనసొకరు చెప్పుకుందు కభ్యంతర మేముంది? నెమ్మది మీద అన్నీ తెలుస్తాయి" అంది

తిలోత్తమ ఆమె నప్పటికప్పుడే తన ప్రాణసఖిని చేసికొన్నానని వాగ్దానం చేసింది చంద్రలేఖను కౌగలించుకుంది ఇద్దరికీ ఆనంద బాష్పాలు కురిశాయి

అది మొదలు వారిద్దరూ ఒక నిముషమైనా విడవకుండా విద్యా గాన, వినోదాలతో గడపసాగారు.

ఒకనాడు చంద్రలేఖ – “మనమిప్పుడు నూతన యౌవనంలో ఉన్నాం మనవయసు అడవికాచిన వెన్నెల్లా వృధాగా పోతూంది. మాది నీచకులం కనుక నాకు తగిన వరుడు లభించడు. నీకటువంటి సమస్యలేదు కదా అదీకాక నువ్వొక సుందరుడి చిత్రపటం గీసి అలాటివాడినే పెళ్ళాడతానన్నావట ఆ చిత్రం నేను చూశాను

అలాంటి వానినెక్కడేనా చూశావా, లేక ఊహేనా? రహస్యం కాకపోతే చెప్పు ’ అంది

తిలోత్తమకు కళ్ళల్లో నీళ్ళు వచ్చాయి. ఒకనిట్టూర్పు విడిచి – ‘నావంటి మందభాగ్యురాలి కనుకూలవరుడెలా దొరుకుతాడు? నువ్వొచ్చాకే నేను అన్నంతిని నీళ్ళు తాగుతున్నాను. అంతకు ముందు జీవచ్ఛవంలా పడుండేదాన్ని ఆ బొమ్మలోని మనోహరుడి గురించి చెబుతాను, విను” అని చెప్పసాగింది.

“నాకు యుక్త వయసురాగానే మాతండ్రి అనేక రాజకుమారుల పటాలు తెప్పించి చూపాడు వారి చరిత్రలూ రూపాలూ చూడగా వారు నాకు సరిపడరనిపించింది దివ్యప్రభావ సంపన్నుడిని పెళ్ళాడలని నా కోరిక

ఒకనాడు సాయంకాలం చక్కగా అలంకరించుకుని మేడపైన వీణవాయిస్తున్నాను ఆకాశంలో బంగారు చిరుగంటల ధ్వని వినిపించింది. అందరమూ తలెత్తి చూశాం. వెన్నెల్లాటి వెలుగు ముద్దకనిపించగా మేముదానికి నమస్కరించాం. ఆ కాంతి మామేడంతా వ్యాపించింది చూద్దామని కళ్ళు తెరవబోతే మిరుమిట్లు గొలిపి సాధ్యం కాలేదు. మెల్లగా ఆ మెరుపదృశ్యమైంది కళ్ళు తెరచి చూడగా –

మా ఎదుట ఒకపురుషుడు నిలబడి ఉన్నాడు అతని రూపం చూస్తే దివ్య పురుషుడే అనిపించి నమస్కరించాను అతనునన్ను లేవనెత్తాడు. ఆ స్పర్శకి నాశరీరం పులకించింది.

రాజుగారికి పుత్ర సంతానం లేదు కనుక అనంతరం రాజ్యం బలసింహుడిదే అతను నీపై ప్రేమ పెంచుకున్నాడు రూపంలో నీకు సాటిరాగలవాడు వారాంగనవే కదా నువ్వు? అతనికేం లోటొచ్చింది? నీ యౌవనం వృథా చేసుకోక ఒప్పుకో నీకు మేలు జరుగుతుంది-

అందుకు చంద్రలేఖ నవ్వి - "నువ్వు నిజంగా మంథరవే. నేను వారకాంతనైనా వ్యభిచారిణిని కాను నా భర్త మరో దేశంలో ఉన్నాడు కనుక యీమాటలు నీయజమానికి చెప్పు - మరెప్పుడూ యిలాటి రాయబారాలు తేకు " అంది

మంథర వెళ్ళి - 'రాజ పుత్రిక స్నేహం దొరికిందని తెగగర్వంగా ఉంది అది నీమాటా నామాటా లెక్కచేస్తుందా?' అని అతనికి కోపం తెప్పించింది కాని - ఆమె మీద వలపుకొద్దీ శాంతించి - "ఇంతమాత్రానికే విరక్తి చెందకు. జవరాళ్ళ చిత్తాలు క్షణక్షణమూ మారుతుంటాయి నువ్వు చంద్రలేఖ మనసు కనిపెడుతూ ఉండు" - అంటూ మంథరకు కానుకిచ్చాడు 'నిదానంగా ఉండి సమయం రాగానే నాకు చెప్పు " అని కూడా చెప్పాడు

ఏం చెయ్యాలో తోచక బలసింహు డావూళ్ళోని శకునాలు చెప్పే యోగిని వద్దకు వెళ్ళాడు రహస్యంగా ఆమెకంతా చెప్పుకున్నాడు చంద్రలేఖ తనకి వశమయ్యేటట్లు చేస్తే చాలా ధనమిస్తానన్నాడు

అందు కాయోగిని "ఇదెంతపని? ఆమె నీవొళ్ళో వాలిందే అనుకో ముందు సగం డబ్బివ్వు ఇప్పుడే ఆ ఓషధి సిద్ధంచేసి నీకిస్తాను స్నానం చేసిరా ఒక మంత్రం చెబుతాను, దానిని జపిస్తూ నువ్వు కోరిన చంద్రలేఖ శిరస్సుమీద చూర్ణం జల్లు నీకు వశమై నిన్ను వదలకుండా ఉంటుంది " అంది

అతనిచ్చిన డబ్బు తీసుకుంది అతనా చూర్ణాన్ని తీసుకుని, ఆ యోగిని చెప్పినట్లు మంత్రం జపిస్తూ - రాత్రి కాపలావాళ్ళకి లంచాలిచ్చి - మంథరతో కలసి అంతఃపురంలోని చంద్రలేఖ గదిలోకి

నెళ్ళాడు. ఆమెగాఢంగా నిద్రపోతూంది. అతనా చూర్ణం తీసి ఆమెతలపై ఏద్దాడు.

ఆమె అదిరిపడి లేచి ఎదురుగా బలసింహుని చూసి – ఎవరని అడిగింది.

అతను 'హాం హ్రీం క్లీం అంటూ మంత్రం చదువుతూ చూర్ణంజల్లి – 'రమ్మ్మ..రమ్మ్మ' అన్నాడు.

"అర్ధరాత్రి వచ్చి యీ దుమ్ము నాతలమీదెందుకు రాశావ్? ఫో" అనికసిరిందామె. అతను మళ్ళీ చూర్ణం ఆమె తలమీద జల్లాడు.

ఆమె "దొంగ, దొంగ" అని అరిచింది. ఆ కేకలకు అంతః పురంలోని వాళ్ళక్కడికి వచ్చారు. అతను పారిపోయాడు.

తిలోత్తమ వచ్చి అడిగినా – ఆమె చిన్నబోతుందని – అతనెవరో చెప్పలేదు.

బలసింహుడు అంతఃపురంలో గొడవ జరిగినందుకు రాజుతనని శిక్షిస్తాడేమో అని భయపడుతూనే – మందు తలకెక్కి చంద్రలేఖ తనకోసం వస్తుందేమో అన్న ఆశతో – ఏమాత్రం చప్పుడయినా – 'ఇటురమ్మ్మ ఇటురమ్మ్మ" అని మెల్లగా అంటూ రాత్రి గడపసాగాడు.

ఉదయం మంధర రాగా – "చంద్రలేఖలో నామీద కొంచెం అనురాగం కలిగిందా?" అని అడిగాడు.

అదినవ్వుతూ – " ఆమాంత్రికురాలు నిన్ను బాగా మోసం చేసింది. దానికి నీమీ దేమాత్రమూ యిష్టంలేదు. తిలోత్తమ దగ్గర నిజంచెప్పక బొంకినా, నాతో – "మంధరా! బలసింహుడు చేసింది నాకు తెలియకకాదు. రాజబంధువని యీసారి కూరుకున్నాను. మళ్ళీ మరోసారిలా చేస్తే రాజుగారికి చెప్పకమానను. అతన్ని బుద్ధిగా ఉండమని చెప్పు నీకిలాటి బుద్ధులు తగవు" అని మందలించింది.

తిలోత్తమ, చంద్రలేఖలు ఊరి బయటున్న ఉద్యానవనంలో కొన్ని రోజులు క్రీడిస్తారని తెలిసిన బలసింహుడు – ఆ పట్నంలో

గజదొంగలని పేరు పడిన మర్కట మారీచులని కలుసుకుని . . వారికి తనకథంతా చెప్పి చంద్రలేఖ ఉద్యానవనంలో నిద్రపోతూండగా మంచంతోకూడా తన రహస్యగృహానికి చేర్చమనీ, తగిన పారితోషికం యిస్తాననీ ఆశ చూపాడు.

ఆ ఉద్యానవనానికి చుట్టూ ప్రహరీ గోడుంది. లోపల విచిత్రమైన మేడలున్నాయి. అక్కడ వాళ్ళు నిరాఘాటంగా విహరిస్తున్నారు.

వాళ్ళ గుట్టంతా మంధరద్వారా తెలిసికొని బలసింహుడు మర్కట మారీచులకు చెప్పాడు. వాళ్ళు అర్ధరాత్రి ఉద్యానవనంలోని మేడమీదకు వెళ్ళి – అక్కడ నిద్రిస్తున్న యిద్దరిలో చంద్రలేఖ ఎవరో తెలియక, ఊహించి, తిలోత్తమ పడుకున్న మంచాన్ని ఆమెకు తెలియకుండా మెలకువ రాకుండా బలసింహుడి రహస్య గృహం చేర్చారు.

బలసింహు డామెను తిలోత్తమగా గుర్తించి, వొణిపోతూ, వెంటనే ఆమెను యధాస్థానంలో చేర్చమన్నాడు.

దొంగలు విసుక్కుంటూ మళ్ళీ ఆమంచం ఎత్తుకుని ఉద్యానవనంవేపు వెళ్ళబోయారు. కాని ఒక వీధిలో పెళ్ళి ఊరేగింపు, మరొక వీధిలో రాజభటుల పహరా, మరోవీధిలో మేలుకొన్న ప్రజలు. ఉండడంతో వాళ్ళకి ఉద్యానవనం చేరే మార్గం కనిపించలేదు. అప్పుడు

"బలసింహుడి భయం మనకేమిటి? తెల్లారిపోతూంది. రాజభటులు మనని చూస్తే పట్టుకుంటారు దీని వొంటిమీద విలువైన రత్నాలూ అవీ ఉన్నాయి. దీని నడవిదారిన తీసుకుపోదాం" అని వాళ్ళు తిలోత్తమని అడవిదారిన తీసుకుపోసాగారు

చంద్రలేఖ లేచి తిలోత్తమ కనిపించక – పరిచారికలతో అంతావెదుకుతుంటే – "గోడకి కన్నం చేశారు." అంటూ కొందరు కేకలు వేశారు.

రాజు, మంత్రి వచ్చి జరిగిన దానికి చాలా విచారించి – తిలోత్తమని వెదకడానికి భటులని నలుమూలలా పంపారు.

బలసింహహుడు వచ్చి – "మీరు చింతించకండి, నేను దీని గుట్టంతా గ్రహించాను" అన్నాడు, చంద్రలేఖను సాధించడానికిదే అవకాశమని.

"నువ్వేమెరుగుదువో చెప్పు" అన్నాడు రాజు.

అప్పుడు బలసింహుడు – "ఈ పనిచేసిన దొంగ యిక్కడే ఉంది. తప్పుమనదే. వేశ్యతో తిలోత్తమ సహవాసం చేస్తూంటే ఊరుకున్నాం. విద్యారూపసంపదలు విని తిలోత్తమని తీసుకొస్తే చాలా డబ్బిస్తామని చెప్పడంతో చంద్రలేఖ యిలా చేసింది. అది నేను విన్నా – మహారాజుగారే ఉపేక్షిస్తే నాకెందుకని నేనూ ఊరుకున్నాను. మంధర నడిగితే యదార్థం చెబుతుంది" అన్నాడు.

రాజు మంధరని రప్పించాడు. "దేవా! ఈ చంద్రలేఖ వచ్చింది మొదలు కపటాలోచనే చేస్తూంది. తిలోత్తమ నెక్కడికో తీసుకుపోవాలని దాని పన్నాగం, దానికి రోజూ ఉత్తరాలు వస్తూంటాయి. మొన్న నేను తెలివిగా ప్రవర్తించి దూతనుంచి ఉత్తరం తీసుకున్నాను. దానిలో –

"చంద్రలేఖా! నువ్వెళ్ళి చాలారోజులైంది. తిలోత్తమ నెప్పుడు తీసుకొస్తావో తెలియదు. నేను నీ విరహంలో క్రుంగిపోతున్నాను. ఎలాగేనా కార్యం సఫలం చేసుకురా. నీ జవాబుకోసం ఎదురు చూస్తుంటాను" అని ఉంది. అంతలో చంద్రలేఖ వచ్చి ఉత్తరం తీసేసుకోడంతో తరవాతేముందో తెలియదు.

నేనది చదివినందుకు చంద్రలేఖ చాలా కోపగించి – "తిలోత్తమకు చెప్పి నిన్ను దండింప జేస్తా"నంది.

ఈ విషయం మరెవరికీ చెప్పక మా అయ్యగారికి మాత్రమే చెప్పాను. నాకు తెలిసిందింత వరకే" అంది మంధర.

రాజు చంద్రలేఖను పిలిపించి, మంధర మాటలు చెప్పి – "నువ్వేమంటావు దీనికి?" అని అడిగాడు.

ఆ మాటలకు చంద్రలేఖ దిగ్భ్రాంతి చెందింది ఈ మంథర నాపై కోపం తీర్చుకుందుకి చెప్పింది. వీరికి నేను ఎలా నమ్మకం కలిగించగలను? విధినాకెలాటి ఆపద తెచ్చి పెట్టిందీ అని మనసులో విచారిస్తూ –

"అయ్యా! నేనలాటి పని చేస్తానని మీకు నమ్మకం కలిగితే – ...నే నాకు శిక్ష విధించండి" అని తలవంచుకుంది అప్పుడు మంత్రి ...ప్పలా అంటే కాదు. నేరం చెయ్యనట్లు నిదర్శనా లుంటే చెప్పు. లేకపోతే శిక్షించబడతావు నిజం చెప్పు" అన్నాడు

బలసింహుడు – "మీకా అనుమానమెందుకు? అది చెప్పిన మాటలలో నిజం తెలిసిపోలేదా? దీనిని తప్పకుండా దండించాలి" అన్నాడు.

"తొందరపడకు. ఈమె మొహం చూస్తే నేరం చేసినట్లు కనపడదు అలా చెప్పడానికి వేరే కారణముండవచ్చు" అన్నాడు మంత్రి అతన్ని శాంతపరుస్తూ. బలసింహుడామెను శిక్షించవలసిందే అని పట్టుపట్టాడు. అప్పుడు మంత్రి "మంథర చెప్పిన మాటలు నాకు నమ్మదగినవిగా అనిపించడం లేదు ఈమె తిలోత్తమ కంటే కూడా విద్యారూపాలలో అదికురాలు. ఈమెను మహారాజులైనా అంతఃపురంలో పెట్టుకుంటారు. ఈమెకు తిలోత్తమపై కల ప్రేమవలన, ఆమె వియోగ దుఃఖంలో అలా అంది చంద్రలేఖను దండింపదగదు " అనగా – బలసింహుడు సూచించినట్లామెను బండిమీద ఊరేగించి సముద్రతీర ప్రాంతంలోని మహారణ్యంలో వదిలివచ్చారు

భటులు వెనక్కి వెళ్ళిపోయాక బలసింహుడు రహస్యంగా అరణ్యంలో చంద్రలేఖ ఉన్న చోటుకి వెళ్ళాడు

చంద్రలేఖ నేలమీద పడి ఉంది ఆమెకేమీ తెలియడం లేదు. అతనామెకట్లు విడిపించి – "నేనిలా చేయించానని కోపగించకు. ఈ తప్పుకి నిన్ను తగినవిధంగా సుఖపెడతాను–" అంటూ ఆమెను లేవనెత్తబోతూంటే.

ఆ ప్రాంతంలో వేటకువచ్చిన కిరాతకు డతనిని చూచి ఏదో మృగమని పొరబడి బాణం వేశాడు.

"హా! చంద్రలేఖా!" అని అరుస్తూ అతను ప్రాణాలు విడిచాడు.

తన బాణానికి కూలినవాడు మనిషని గ్రహించడంతో వాడు భయపడి పారిపోయాడు. చంద్రలేఖకు తెలివొచ్చి, చనిపోయిన బలసింహుణ్ణి చూసి అతనే తనకట్లు విడిపించి, ఆహారపదార్థాలు సిద్ధంగా ఉంచాడని భావించి – దేముడికి తనమీద దయకలిగినందుకు సంతోషించి – ఆహారం తిని, అలసట తీర్చుకొని కనపడిన తోవన నడవసాగింది.

పోగాపోగా సముద్రం వచ్చింది. దానిని చూసి ఆమెకు భయమేసింది. కొండలంత కెరటాలను భయంగా చూస్తుండగా..ఒక ఓడ ఒడ్డుకు కొట్టుకువచ్చింది. అందులో ఉన్న వాళ్ళు వొడ్డుకి చేరినందుకు సంతోషించారు.

కర్ణధారుడు ప్రయాణీకులతో.."ఈ రాత్రి యిక్కడ వంటలు చేసుకుని తినండి. తూరుపుగాలి తిరగగానే ఓడ నడుపుతాను" అని గట్టిగా చెప్పాడు.

చంద్రలేఖ ప్రయాణీకులతో కలసిపోయి – మర్నాడు ఓడెక్కేసింది. రెండు రోజులకు ఓడ త్రిగర్త దేశరాజధాని అలకాపురం రేవు చేరింది. అప్పు డందరూ దిగినా – చంద్రలేఖ వద్ద పైకం చెల్లించిన పత్రిక లేనందున ఆమెను దిగడాని కనుమతించక – ఆమె ఓడ నెక్కిన స్థలం చెప్పగా "అలాంటి అరణ్యం లోకి ఒంటరిగా ఎలా వచ్చావు?" అంటూ ప్రశ్నించి, ఆమె నొక గదిలో ఉంచేటట్లు పనివాళ్ళ నాజ్ఞాపించాడు.

అందరూ దిగి వెళ్ళాక అతనామె వద్దకు వచ్చి శృంగారం చూపులతో ఆమె వివరాలడగ్గా వాడి అభిప్రాయం గ్రహించి – "అన్నా! నా నివాసం రామచంద్రపురం అంటూ అంతా చెప్పి – ఈమణి తీసుకుని నన్ను తీరంలో దింపు" అంది. "దీనికి రుసుమక్కర్లేదు. ఒక్కసారి నీ చెక్కిళ్ళు ముద్దాడి అధరామృతం గ్రోలనీ, చాలు" అన్నాడతను.

"సంసారుల కిటువంటి పనులు తప్పు" అంటూ ఆమె చెప్పినా వినిపించుకోకుండా అతనామెతో వాదించసాగాడు.

అంతలో కొత్తగా వచ్చిన ఓడలని పరీక్షించే రాజభటులు వచ్చి "ఓడ సర్దారెక్కడ?" అని అరవగా - ఆమె వారికి తన పరిస్థితి చెప్పుకుంది ఓడ సర్దారు - "నే నామె చెల్లించవలసిన రుసు మడుగుతున్నానంతే" అన్నాడు

రాజభటులు చంద్రలేఖను రేవులో దింపించారు. అప్పుడామె స్త్రీ జాతినే నిందిస్తూ - నా రూపమే నాకింత ముప్పు తెచ్చింది. పురుషవేషం వేసుకుంటే సుఖంగా ఉండొచ్చు - అంటూ అంగడికి పోయి, ఒక మణి అమ్మి కావలసిన వస్తువులు కొనుక్కుని వీరుడి వేషంలో వీరగుప్తుడని పేరు పెట్టుకుని ఆ రాజదానిలో తిరగసాగింది

# వీరగుప్తుని కథ

ఆ పట్నాన్ని ధర్మాంగదుడనే రాజు పరిపాలిస్తూండేవాడు హఠాత్తుగా అతని మంత్రి చనిపోగా ఆ ఉద్యోగం తమకిమ్మని ఎందరో వచ్చారు. కాని రాజు పెట్టిన పరీక్షలకి నిలబడలేక పోయారు.

"నేనడిగిన వెంటనే నా మాటలకు నా మనసుకి నచ్చేటట్లు ఎవరు జవాబివ్వగలరో వారినే మంత్రిగా చేసుకుంటానని సింహద్వారం పై ప్రకటన వేలాడదీశాడు .ఎవరూ అతని మాటలకు సరయిన జవాబు చెప్పలేక పోయారు

విలాసార్థం పురమంతా తిరుగుతున్న వీరగుప్తు డాప్రకటన చూసి తనపేరు రాసి తాను రాజుమాటలకి సమాధానమివ్వగలనని రాశాడు

రాజు అర్ధాంగీకారంతోనే అతని ననుమతించాడు. కాని వీరగుప్తుని ముఖ విశేషం చూసి - "ఇతను మంత్రికే కాదు,

రాజ్యాధికారానికీ తగినవాడే. ఇతన్నొక్క ప్రశ్న వేస్తాను చెప్తే వెంటనే మంత్రిగా నియమిస్తాను" అని మనసులో అనుకుని - "అయ్యా! పన్నెండులో నాలుగు పోతే ఎంత?" అని అడిగాడు.

వీరగుప్తు డాలోచించకుండానే - "సున్న" అన్నాడు ఈపాటి లెక్కరాని యితనేం మంత్రి అనుకున్నారు సభ్యులు.

అప్పుడు ధర్మాంగదుడు వీరగుప్తుని గౌరవిస్తూ - "నేటికి నాకు తగిన మంత్రివి దొరికావు. నేడు చాలా సుదినం. నువ్వే నా మంత్రివి." అని అతనికి అధికార ముద్రల నందజేశాడు.

సభలో కొందరు రాజును మూర్ఖుడని నిందించగా, కొందరు సాహసించి లేచి - "పన్నెండులో నాలుగు పోయిన ఎనిమిదికాదా? సున్నా ఎట్లగును?" అని అడిగారు

ధర్మాంగదుడు నవ్వుతూ - ఇందుకే నే నెవరినీ మంత్రిగా ఒప్పుకోలేదు. పన్నెండులో నాలుగు పోతే ఎనిమిదని అందరికీ తెలిసిందే. కాని నా అభిప్రాయం అదికాదు. పన్నెండనగా పన్నెండు మాసాలు. నాలుగంటే వర్షాకాలపు నెలలు. ముఖ్యమైనవి యీ మాసాలే ఇవిపోతే --- అంటే --- వర్షాలు పడకపోతే పంటలు పండవు కదా? అందువల్లనే పన్నెండులో నాలుగుపోతే సున్నా అయింది ఇంతగూఢార్థం కల నా ప్రశ్నకు వెంటనే జవాబు చెప్పిన మంత్రి సూక్ష్మబుద్ధి కింకేంనిదర్శనం కావాలి?" అన్నాడు.

సభ్యులందరూ తెల్లబోయారు. వీరగుప్తుడు మంత్రియై క్రమంగా తన సామర్థ్యాన్ని నిరూపించుకోగా రాజు రాజ్యభారమంతా అతని మీదే ఉంచి అతను చెప్పినట్లు తాను నడచుకోసాగాడు.

వీరగుప్తుడు మంత్రయ్యాక దేశం సుభిక్షంగా ఉంది ప్రజ లతన్ని అనేక విధాలుగా ప్రశంసించసాగారు "

అని ఆపి తరవాతి కథను తదుపరిమజిలీలో చెప్పాడు మణిసిద్ధుడు.

# కాశీమజిలీ కథలు

## 15. వ మజిలీ

### భక్తురాలి కథ

వీరగుప్తుడు మంత్రిగా పట్నంమంతా తిరుగుతూంటే – ఒక వీధిలో కోకిల స్వరంలో పాడుతున్నఒక స్త్రీ గానం వినిపించింది.

పరిచారకుణ్ని పిలిచి ఆ సంగీతం ఎక్కడినుంచి వొస్తూందో చూసి రమ్మన్నాడు.

వాడు వెళ్ళివచ్చి – "తారకేశ్వరుని ఆలయంలో ఒక భక్తురాలు పాడుతూంది" అని చెప్పాడు.

"మనమక్కడికి పోవచ్చునా?" అని అడగ్గా –

"దేవాలయానికి పోవడాని కెవరి అనుమతి కావాలి? అదీకాక ఆ దేవాలయం మన అధీనం లోనిదే" అన్నాడు భటుడు అంతేకాక – " ఏదేనా తలచుకుని యీస్వామికి మొక్కుకడితే ఆకార్యంతప్పకుండా సఫలమౌతుంది. ఇక్కడి కనేక దేశాలనుంచి ప్రజలు వస్తారు మీరు చూడదగినదే" అని చెప్పాడు

మంత్రి ఆలయంలోకి వెళ్ళేసరికి – కళ్యాణమండపంలో వీణానాదంతో మేళవించి పాడుతున్న భక్తురాలి గానానికీ రూపానికీ ఆశ్చర్యపడి రెప్పవాల్చకుండా ఆమెను చూసి ఎంతో సంతోషించాడు.

మంత్రి లోపలికి వెళ్ళడంతోనే ఆ భక్తురాలూ, అక్కడున్నవారూ బయటకు వెళ్ళిపోయారు. గుడి దర్మకర్తవచ్చి మంత్రికి ఆలయం చుట్టూ ఉన్నవింతలు చూబిస్తూ గర్భాలయంలోకి తీసుకెళ్ళి స్వామిని చూబించి వారి మహిమలు చెప్పి మళ్ళీ ముఖమండపం దగ్గరికి తీసుకొచ్చి ఆసనాలు వేసి కూర్చో బెట్టాడు.

"మేం వచ్చేసరికక్కడ గానం చేస్తున్న ఆమె ఎవరు?" అని అడిగాడు మంత్రి.

"ఆమె ఒక భక్తురాలు. కొన్ని రోజులనుంచి ఆలయంలోని విజ్ఞానయోగి నాశ్రయించుకుని ఉంది. ప్రతిసాయంత్రం స్వామిపై కీర్తనలు పాడుతుంది. ఆమెకు భోజనం స్వామినైవేద్యంలోనే ఏర్పాటు చేశాను" అని చెప్పాడు ధర్మకర్త.

"ఆమె కంఠ స్వరం చాలా చక్కగా ఉంది సుమీ" అన్నాడు మంత్రి.

"మీరు చెబితే ఆమెని పిలిపించి పాడిస్తాను. ఆమె మనస్వామి దాసురాలే" అని ఆమెవద్దకు పోయి

"మంత్రిగారు నీ గానం వినాలని ముచ్చటపడుతున్నారు. వేగంగా వచ్చి రెండు శివకీర్తనలు పాడు" అని చెప్పివచ్చాడు.

మొదట సంశయించినా అంతలోనే ఆమె వేగంగా వచ్చి - మంత్రికి నమస్కరించి శ్రుతిమేళవించి పాడసాగింది.

కాషాయ వస్త్రాలలో, విభూతిపూసుకునీ, రుద్రాక్షలు ధరించీ ఉన్నా ఆమెలో ఏదో అద్భుత తేజస్సు గోచరించింది మంత్రికి.

శివకీర్తనల మధ్య ఆమె పాడిన గీతం చంద్రలేఖ రచించి తిలోత్తమకు చెప్పినది. అదివిని - వీరగుప్తుని వేషంలో ఉన్న చంద్రలేఖ మనసు ఝల్లుమంది. ఈ భక్తురాలు తిలోత్తమ కాదు కద? ఈ కంఠ స్వరం ఆమెదే --- అనుకుంటూ ఆమెను గానం ఆపమని - మిగిలిన వారినందరినీ అవతలికి పొమ్మని - "తల్లీ! నువ్వు పాడిన గీతానికి ఎంతో ఆనందించాను నీ కులశీల నామములు తెలిసికొనాలని ఉంది. నువ్విక్కడి కెలావచ్చావు? ఇప్పుడు పాడిన గీతం ఎవరివద్ద నేర్చుకున్నావు? నీ నివాసమేది? నీ తల్లిదండ్రులెవరు?" అని మంత్రి ఆమెను వినయంగా అడిగాడు.

అందుకామె - "నా పూర్వవృత్తాంతమేమీ నాకు గుర్తులేదు. నేనొక భక్తురాలిని. విజ్ఞానయోగి శిష్యురాలిని" అంది. ఆకంఠస్వరం

విని ఆమె తిలోత్తమేఅని ధ్రువపడి – కళ్ళలో నీరు కమ్ముకోగా అతను – "తల్లీ! నన్నన్యురాలిగా ..అహ. అన్యుడిగా చూడకు. మనుషులు తెచ్చిన ఆపదలుంటే నేను తీరుస్తాను ఆపన్నుల రక్షించడమేకదా రాజధర్మం? నీవీయోగిని వేషం వేసి ఎన్నాళ్ళయింది?" అంటూ అడిగాడు మంత్రి.

ఆమె కోకిలస్వరంలో – "దేవా! నేను రామచంద్రపురప్రభువగు శూరసేన మహారాజు కూతురు తిలోత్తమను. నన్నొకనాడు దొంగలు మంచంతో సహా ఎత్తుకుపోయారు ఉదయం నేను లేచి చూసేసరికి అరణ్యంలో దొంగలు కనపడ్డారు.

'మీరెవరు? నన్నెందుకు తీసుకొచ్చారు? మీకేంకావాలి?" అని అడిగాను.

"మేము దొంగలం నీతో సావాసంగా తిరిగే చంద్రలేఖను ఎత్తుకురమ్మని బలసింహుడు పంపగా తెలియక నిన్ను తీసుకుపోయాం. నిన్ను యదాస్థానంలో ఉంచమని అతను చెప్పగా – దారిలో అలజడులకు వెరచి యిక్కడికి తీసుకొచ్చాం. నీ దగ్గరున్న వస్తువులన్నీ యిచ్చెయ్. ఇకనుంచి మేము నిన్నొక చోట కొన్నట్లు చెబుతాం. నువ్వూ అలాగే చెబుతానని ప్రమాణం చెయ్యి. లేదా యిప్పుడే నిన్ను నరికేస్తాం " అన్నారు వాళ్ళు

ప్రాణభయంతో నా నగలిచ్చి వారు చెప్పినట్లు నడుచుకుందు కంగీకరించాను.

వారితో తిరుగుతూండగా ఒకపట్నంలో ఒక వర్తకుడు నన్ను చూసి "ఈమె ఎవరు?" అని అడగగా – "పారశీకంలో వెయ్యి బంగారు నాణాలకు కొన్నాం. ఎవరికైనా కావాలంటే అమ్మేస్తాం" అన్నారు వాళ్ళు. అతను నన్నుకొని – "ఏం పనులు చేస్తావు?" అని అడిగాడు.

"లోకసమ్మత మయిన పనులు" – అని చెప్పాను. అతను నన్ను తన భార్య కప్పగించాడు. ఆమె నన్ను గౌరవంగా చూడసాగింది.

ఆ వర్తకుని కొడుకు దేవలుడు నన్ను మోహించి ఒకనాడు తన అభిప్రాయం నాతో చెప్పాడు. నేను మందలించాను.

అప్పటికి మరలిపోయి, రెండురోజులయ్యాక – "నీ చేత దాసీపనులు మాన్పించి మంచి స్థితిలోకి తీసుకెళ్తాను నేను చెప్పినట్లు చెయ్యి. మదనబాధ భరించలేక పోతున్నాను." అన్నాడు.

నేను పరుగున పోయి యజమానికి చెప్పగా – ఒక్కడే కొడుకు కనక అతన్ని దండించలేక – 'తరువాత దండిస్తాలే' అనేశాడు అతని తల్లికూడా కొడుకు నేమీ అనలేక – 'వాడున్న వేపు వెళ్ళకు' అని నాకు చెప్పింది

మరి రెండు రోజులు గడిచాక అతను మళ్ళీ నాదగ్గరకొచ్చి – "నా ప్రజ్ఞ చూశావు కదా ఇప్పుడేనా ఒప్పుకుంటావా?" అని నిలదీయగా నే నవతలకి పారిపోయి యిరుగుపొరుగులకు మొరపెట్టుకున్నాను.

ఆ వర్తకుడు చాలా ధనవంతుడు కనుక వారతని కేమీ చెప్పలేకపోయారు.

'రాజపుత్రికనైన నా కీకర్మయా! నా విద్య, రూపం – దాసీవృత్తికా! ప్రారబ్ధం' --- అనుకుంటూ ఆ రాత్రి బలవంతంగా చనిపోడానికి నిశ్చయించుకున్నాను

అర్ధరాత్రి యింటివారంతా నిద్రపోతుంటే – అంతకు ముందు నుయ్యి ఉండడం చూసిన దేవాలయానికి వెళ్ళి – లోపలకు ప్రవేశించి నూతిగోడపై ఎక్కి భగవంతుణ్ని స్మరించుకుంటూంటే ఒక మాట జ్ఞాపకం వచ్చింది.

తారకేశ్వరస్వామికి ప్రదక్షిణం చేసి చచ్చిపోతే ముక్తి లభిస్తుంది కదా అని నూతిగోడ దిగి ఉత్తరపు దిక్కుగా ప్రదక్షిణం మొదలుపెట్టాను.

అటువైపు మంటపంలో అగ్నికాంతులలో జనం మాట్లాడు కుంటున్నారు అటువెళ్తే వాళ్ళు నన్ను బలాత్కరిస్తారేమో..వాళ్ళు నిద్రపోయాక వెళ్దాం అని నిలుచుంటే వారిమాటలు వినిపించసాగాయి.

# బల దేవుని కథ

"జీవితం అశాశ్వతమైనది. సంపద, పేదరికం అన్నీ భ్రమలు, కొడుకులు కలిగే దాక ఒక చింత. కలిగాక మరో చింత. దీనికొక దృష్టాంతం చెబుతాను విను.

నేను పూర్వాశ్రమంలో జగన్నాథంలో నివసిస్తూ స్వామికి మాలికలు కట్టి ఆరాధించుకునే వాడిని. మొదట సంతానం లేదనే చింత. అందుకోసం దానాలూ ధర్మాలూ ఎన్నో చేశాను. మొత్తాని కొక కొడుకు కలిగాడు.

కాని - వాడు పుట్టిన కొద్దిరోజులకే తల్లి చనిపోయింది. వాడు చాలా అందంగా ఉండేవాడని రుచికుడని పేరు పెట్టాను.

వాడినెక్కడికీ కదలనివ్వక యింట్లోనే ఉంచి మాలలు కట్టే పని నేర్పాను. ఆ పనిలో వాడు నాకంటె ఎక్కువ పేరు సంపాదించాడు.

ఒకనాడు సాయంకాలం పూలదండలమ్మడానికి వెళ్ళినవాడు మళ్ళీ తిరిగిరాలేదు. ఊరంతా వెదికించినా ఫలితం లేకపోయింది.

ఆ ఒక్కబిడ్డకోసం చాలా విచారిస్తూ నిద్రాహారాలు మాని వాడినే తలచుకుంటూ చివరకి బలవంతంగా చనిపోవాలనుకున్నాను.

కాని నా ఉద్దేశం గ్రహించిన ఒక ముసలి బ్రాహ్మణుడు మంచి మాటలు చెప్పి నన్నా ప్రయత్నంనుంచి మరల్చాడు. నాకు చక్కని ఉపదేశం చేశాడు."

అమృతబిందువులలాంటి బలదేవుని ఆమాటలు నన్నెంతో మార్చాయి.

బలవన్మరణం వల్ల నరకప్రాప్తి ఔతుందట. నాలుగు రోజులెలాగో కళ్ళు మూసుకుంటే సహజమరణమే వస్తుంది అనుకున్నాను. పడినవాటికంటె ఎక్కువ కష్టాలు పడబోను కదా అనే ఆలోచించాను.

ఇంటివారు లేవకుండా పోదామని యింటికి బయలు దేరాను. బలదేవుడిలాగే, నేనూ ఆత్మహత్యాప్రయత్నం విరమించాను

దేవలుడిని తలచుకుంటే నాకింటికి పోవాలనిపించలేదు. కాని సొమ్మిచ్చి నన్ను కొన్న వర్తకుణ్ణి మోసం చెయ్యడానికి మనస్కరించలేదు.

నేనారాత్రి సాగించిన రాకపోకలెవరూ గమనించలేదు. మామూలుగా నా పనులు చేనే చేసుకుంటున్నాను.

ఒకనాడు అర్థరాత్రి దేవలుడు నేను పడుకున్న గదిలోకి కత్తిపట్టుకుని వచ్చి - నన్ను లేపి -

"ఇప్పుడు నువ్వొప్పుకుంటావా లేకపోతే యీ కత్తితో నరికేసేదా?" అని అడిగాడు.

నేను భయపడి - "దేవలుడు నన్ను చంపేస్తున్నాడు - " అని బిగ్గరగా అరిచాను.

ఆ కేకలకు అతని తల్లితండ్రు లొచ్చి చటుక్కున అతని చేతులు పట్టుకున్నారు.

"ఈ రండని చంపేస్తేకాని నాకోపం తీరదు. వదలండి" అని అతను తన చేతులు విదుల్చుకోడంలో - మిక్కిలి వాడికల కత్తి అతని మెడకు తగిలి తలతెగి పడిపోయింది.

అప్పుడు దేవలుడి తల్లి తండ్రులు చాలాశోకిస్తూ - "నువ్వమా కొంపతీశావు. నీమూలంగా నావంశం నాశనమైంది. నీకు పదివేల నమస్కారాలు. నీ యిష్టం వచ్చిన చోటుకి పో. మాయింట్లో ఉండకు" అని నిందించారు.

అందుకు నేను - "నన్నూరికే నిందించకండి. దేవలుని మరణానికి కారణం అతని దుర్బుద్ధే. మీ అనుమతిలేనిదే పోకూడదని ఉన్నాను. మీరే చెప్పారు కనుక - యిదే పోతున్నా" నని నేనా యింటినుంచి బయటపడ్డాను.

నాకు మరెక్కడికీ పోడానికీ యిష్టంలేక - తిన్నగా యీ ఆలయానికి వచ్చి విజ్ఞాన యోగి నాశ్రయించాను. ఆయన నన్ను శిష్యులలో చేర్చుకున్నారు.

ఆ యోగి పుంగవుడి బోధలతో తృప్తిపడుతూ, తారకేశ్వరుడిని గానం చేస్తూ హాయిగా బ్రతుకుతున్నాను. నాకు భక్తురాలని పేరు పెట్టి స్వామి ప్రసాదాన్ని ధర్మకర్త యిస్తున్నారు." అని తన కథని ముగించింది

మంత్రి వేషంలో ఉన్న చంద్రలేఖ - తిలోత్తమకు పట్టిన అవస్థకు విచారించి తన వృత్తాంతా న్నామెకు రహస్యంగా చెప్పాలనీ, అందుకు మార్గమేమిటా అనీ ఆలోచిస్తూంటే -

"అయ్యా! విదేశ బ్రాహ్మణుడెవరో తమతో ఏదో మనవి చేసుకోవాలని - ద్వారం వద్ద తమ దర్శనం కోసం ఉన్నాడు" అని రాజభటుడు చెప్పాడు.

"తక్షణం ప్రవేశపెట్టు-" అన్నాడు మంత్రి.

ఆ బ్రాహ్మణుడిని చూడడంతోనే మంత్రి ముఖం వికసించింది అతను తన వృత్తాంతాన్ని చెప్పసాగాడు

"నాపేరు గౌతముడు. కాపురం జగన్నాధం రుచికుడను మిత్రుడిని వెదకడాని కనేక నగరాలు తిరుగుతూ ఢిల్లీ చేరాను.

అదృష్టవశాత్తూ అక్కడ నామిత్రుడు దొరికాడు అతన్ని వెంట బెట్టుకుని నాలుగు రోజులకిందట యిక్కడికి వచ్చాను. ఇక్కడి నుంచి మాదేశం ఓడమీద పోవలసి ఉంది. విదేశీయుల నెక్కువ పరీక్షిస్తేకాని ఆజ్ఞాపత్రికలివ్వరని యిక్కడివారు చెబుతున్నారు.

మేము మా దేశం వదలి చాలాకాలమైంది. మా ప్రయాణం సాగేటట్లు ఆజ్ఞాపత్రముల నిప్పించ వలసిందిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. ఓడ సాయంత్రమే రేవుని వదిలేస్తుంది."

మంత్రి తన సంతోషాన్ని దాచుకుని - "మీరు యివాళే ఓడెక్కుతానంటే మిమ్మల్ని పరీక్షించాలి. మీ మిత్రుణ్ణి తీసుకుని మా యింటికి రండి. అవసరమైతే మీకోసం ఓడ కొంతసే పాగుతుంది" అని తన యిల్లు చూబించడాని కతని వెంట భటుణ్ణి పంపాడు.

తరువాత భక్తురాలిని చూసి 'నువ్వు రాచబిడ్డవై యిలాటి నీచవృత్తి, నవలంబించడం న్యాయం కాదు నీ తండ్రికి జాబురాసి నిన్ను

నీదేశం పంపుతాను. అంతవరకూ అంతఃపుర స్త్రీలతో కలసిఉందువుగాని, రా" అని ఒప్పించాడు. ఆమె అందలమెక్కి వారి మేడకి పోయే సరికి చంద్రలేఖ పురుషవేషం తీసి - భక్తురాలినక్కడికి రప్పించుకుంది. "ఓహో! ఈమె మంత్రి గారి భార్య కాబోలు, చంద్రలేఖలా ఉందే! ఆమె యిక్కడికెందు కొస్తుందీ? నన్ను వెదుకుతూ వొచ్చిందా?" అని ఆలోచిస్తూ నిలుచుంటే -

చంద్రలేఖ సంతోషం పట్టలేక - ప్రాణ సఖీ! నన్ను మరచిపోయావా? పలుకరించవేం? అంటూ కౌగలించుకుంది. వారిద్దరూ ఒకరి కథ ఒకరికి చెప్పుకున్నారు. అప్పుడు చంద్రలేఖ "సఖీ! మనకిప్పుడు కాలం మంచిదైంది. నీ ఖేద కొచ్చిన దివ్య పురుషుడిక్కడికొచ్చాడు. అతని వృత్తాంతం అతని నోటనే చెప్పిస్తాను. విను." అంటూ భటుణ్ణి పిలచి - "ఆ విదేశ పురుషులను ప్రవేశపెట్టు -" అంది.

వాళ్ళిద్దరూ లోపలికి వచ్చారు. అక్కడ స్త్రీలే తప్ప పురుషులు కనపడకపోవడంతో దారితప్పామేమో అని వాళ్ళు వెనక్కిపోబోతూంటే - "అయ్యా! వెళ్ళిపోకండి. వారే మిమ్మల్ని లోపలికి తీసుకురమ్మన్నారు" అంది చంద్రలేఖ అంతరంగిక సఖి.

వాళ్ళు సందేహిస్తూనే ఆ స్త్రీలున్న చోటికి వెళ్ళారు. మునపటికంటే మరింత తేజస్సుతో వెలుగుతున్న రుచికుడిని చూసి చంద్రలేఖా తిలోత్తమా మాట్లాడదానికి తడబడుతూంటే - గౌతముడు చంద్రలేఖని గుర్తుపట్టి - " ఇక్కడి కెప్పుడొచ్చావు? నేను గౌతముణ్ణి ఇతను నామిత్రుడు రుచికుడు. జ్ఞాపకమున్నామా?" అని అడిగాడు.

అమె వారిని కూర్చోబెట్టి - "గౌతమా! నువ్వు నన్ను గుర్తు పట్టగలవో లేవో అని పలకరించలేదు. నువ్వు రుచికుని గురించి చాలాశ్రమపడ్డావు. ఇతను నీకెక్కడ కనపడ్డాడు? ఆ వృత్తాంతమేమిటి?" అని అడిగింది.

"ముందు నీ కథ చెప్పు" అన్నాడు గౌతముడు. చంద్రలేఖ తన కథ చెప్పి - "నీ మిత్రుడి కథే విచిత్రంగా ఉంది. జగన్నాథంలో

అంతర్ధానమై, రామచంద్రపురంలో తిలోత్తమను లాలించి, ఢిల్లీలో నీకు కనపడ్డాడు! రెక్కలు కట్టుకు తిరిగేవారేనా యిలాటి చిత్రాలు చేయలేరు. అతను మమ్మల్ని మరచినా మేమతని కోసమే యాతనలు పడుతున్నాం" అంది.

"చంద్రలేఖా! మీరు నాకోసం చాలా కష్టాలు పడుతున్నారు. ఇందుకు మీకు చాలా కృతజ్ఞుణ్ని నా వృత్తాంతం వినండి." అని తన వృత్తాంతం చెప్పసాగాడు రుచికుడు.

## జయంతుని కథ

ఆ రాత్రి ఉద్యానవనంలోకి పోయి తలుపులు వేసుకోడం తెలుసుకదా? తరవాత నేను నలుమూలలా చూశాను. ఎక్కడ నిలబడినా కనపడిపోతాననిపించి దట్టంగా విస్తరించిన ఒక అశోక వృక్షమెక్కి కొమ్మలమధ్య నక్కాను. అంతలో దగ్గరలో ఎవరో మాట్లాడుకుంటున్నట్లు ధ్వని వినిపించింది. అదిరిపడి తలపైకెత్తి చూశాను.

మెరుపు తీగలు తెగి నామీద పడుతున్నట్లయింది. ఆశ్చర్యంతో చూస్తూంటే ఆ కాంతిపుంజం నేనున్న చెట్టు మానుదగ్గరకే వచ్చి నిలబడింది.

అప్పుడదొక బంగారు రథమని అర్థమైంది. వారిమాటలు వినపడసాగాయి.

"తిలోత్తమా! మన ప్రయాణానికాటంకం కలిగితే కలిగింది కాని మంచితోటలో ఆతిథ్యం దొరికింది. వేగంగా నీ యిష్టమొచ్చినపూలు కోసుకో."

"జయంతా! ఈ తోట ఎంత చక్కనిది కాకపోతే నిన్నిక్కడికి తీసుకొస్తాను?

మన దేవలోకంలో లాగే భూలోకంలోనూ మంచి పుష్ప జాతులున్నాయే! నువ్వు కూడారా" అంది తిలోత్తమ.

"నీకేమీ భయంలేదు. ఇది అర్ధరాత్రి ఇక్కడెవరూలేరు. యధేచ్ఛగా కోసుకో, నేనూవస్తున్నాను" అన్నాడు జయంతుడు.

వారిరూపాలు, అలంకారాలు, మాటలు చూసి దేవతలని తలచి – వారు మరోదిక్కుకు పోగానే – సాహసంతో కొమ్మమీద నిలబడగా – అరథం చేతికందింది. నేను దానిపై కెక్కి చూశాను. దానికి రెండు భాగాలున్నాయి. ఒకదానిలో రత్నస్థంభాలు. రెండవదానిలో రత్నాలతో శయ్య, విచిత్ర వస్తువులూ ఉన్నాయి.

నేను మొదటి దానిలో రత్నకంబళీల వెనక దాగున్నాను.

అంతలోవారు పువ్వులు కోసుకుని వచ్చారు. మాటాడుకుంటూ విమాన మెక్కారు. వారెక్కడ మేమిటి, మరతిప్పినట్లే అది ఎగర సాగింది.

నేను భూలోకాన్ని చూడాలని ప్రయత్నించానుకానీ అలుక్కు పోయినట్లు కనిపించింది. కుదుపు లేదు. స్థంభాన్ని కౌగలించుకుని కూర్చున్నాను. వాళ్ళు పువ్వుల గురించీ చెట్ల గురించి మాట్లాడుకుంటూ – "ఒక్క సంగీతవృక్షం తప్ప దేవలోకంలో ఉన్నవన్నీ భూలోకంలో ఉన్నాయి" అందామె.

అంతలో – ఆ ప్రాంతంలో వేగంగా పారిపోతున్న సిద్ధులకీ కింపురుషులకీ యిలాగ సంవాదం జరిగింది.

సిద్ధులు : కింపురుషులారా! అలా పరుగెడుతున్నారేం? స్వర్గంలో ఏదైనా విశేషం జరిగిందా?

కింపురుషులు : మీ కింకా తెలియదా? ఇప్పుడు స్వర్గంలో గొప్పఅలజడి రేగింది. ఇంద్రుడికిట్టి అవస్థ ఎప్పుడూ రాలేదు.

సిద్ధులు : ఆ! ఇంద్రుడికే? ఎవరివలన?

కింపురుషులు : రక్తాక్షుడను రాక్షసుడు వరగర్వంతో – అనేకమంది రాక్షసులతో వచ్చి స్వర్గాన్ని ముట్టడించాడు. ఇంద్రుడు వాడు తనకంటె

బలశాలి అని వాడికి భయపడి - ఎదురేగి - వినయ పూర్వకంగా ప్రార్థించి నందనవనంలో విడి దిచ్చాడు.

సిద్ధులు : తరవాత?

కింపురుషులు : ఇంద్రుడు వాడికీ వాడి అనుచరులకీ చేసిన ఉపచారా లేమని చెప్పను? వాడు పురం చూడాలని బయలు దేరాడు. వాడి భయంతో అందరూ తలుపులు మూసుకుంటే - నేనీవూళ్ళో తిరుగుతానంటే దేవకాంతలు హారతులతో రాక తలపులు మూసుకుంటారా! ఇలాటి కపటంనీదే. నీతో నాకు మైత్రెలాకుదురుతుంది? సుధర్మకి దారి చూబించు - అని హుంకరించాడు. ఇంద్రుడు కొంచెంసేపు తడబడుతూ అక్కడికి పోకూడదని చెప్పాడు.

సిద్ధులు : మరి రక్తాక్షు డేమన్నాడు?

కింపురుషులు : ఏమి ఇంద్రా! మాకు దేవసభకు పోవుట కర్హతలేదా! కానియ్. నిన్ను చంపి యీ రాజ్యం తీసుకుంటే - అప్పుడు అర్హుల మౌతామా? - అని పదేపదే హూంకరిస్తూంటే - ఇంద్రుడు దేవతలను వారితో యుద్ధానికి పురికొల్పాడు. దేవదానవులకు పెద్ద యుద్ధం జరిగింది.

సిద్ధులు : తరవాత?

కింపురుషులు : రక్తాక్షుడు ఇంద్రుణ్నోడించి - బంధించి - తనలోకానికి తీసుకుపోయాడు. దేవతలనాథలయ్యారు. రాక్షసులు కనపడిన దేవతలనందరినీ అల్లరి పెడుతున్నారు. వారి బాధ పడలేక మేము పారిపోతున్నాము. మీరిప్పుడు స్వర్గానికి వెళ్తే మీకూ ఆబాదలు తప్పవు.

సిద్ధులు : అలాగా! పాపం, ఇంద్రుని పని ఏమౌతుందో?

ఆ సంభాషణలు మా విమానం దగ్గరే జరిగాయి.

జయంతుడు తిలోత్తమని చూసి - "వీరి మాటలు విన్నావు కదా? నువ్వింటికి వెళ్ళు నేనారక్కసుని జయించి మా తండ్రిని విడిపించు కొస్తాను" అని ఆయుదాలు ధరించి రౌద్రాకారంతో విమానం దిగి ఎక్కడికో పోయాడు.

తిలోత్తమ విమానశాలలో విమానం దిగబోతూ నన్ను చూసింది. ఆశ్చర్యపోతూ

"అయ్యా! తమరెవరు? ఈ విమానం మీదకెలా వచ్చారు? మీ వృత్తాంతమేమిటి?" అని అడిగింది.

నేను నా వృత్తాంతం కొంతమేరకు చెప్పి - "స్వర్గంగురించి ఎన్నో విన్న నేను - దానిని చూడాలని వేడుక పడి స్వామిని ప్రార్థించి నిద్రపోయాను.

జగన్నాథ స్వామి నాకలలో కనిపించి - "వత్సా! చింతింపకు. రేపటి రాత్రి యీ వూరిలో ఉన్న చంద్రలేఖ అను వేశ్య పెరటి తోటలోని అశోక వృక్షం మీద నక్కి ఉండు. అక్కడికి తిలోత్తమాజయంతులు విహారార్థమై విమానంలో వస్తారు. అప్పుడు నీవావిమానం ఎక్కు. దేవలోకానికి పోతావు. దేవదానవ యుద్ధం కారణంగా దేవతలంతా రాక్షసలోకానికి పోతారు. నీకు తిలోత్తమతో స్నేహం లభిస్తుంది. ఆమె నీకు స్వర్గ విశేషాలన్నీ చూపెడుతుంది - " అన్నాడు.

నేనలాగే చేసి మీ లోకానికి వచ్చాను. స్వామి వచనము తప్పదు. నీవు తిలోత్తమవై ఉండొచ్చు. ఈ కార్యము నీద్వారా జగవలసి ఉంది" అన్నాను.

"ఓహో! స్వామి కార్యము ఎవరికైనా ఆచరణీయమే. కొంచెం సేపిక్కడుండండి. గ్రామ విశేషాలు తెలుసుకుని వస్తాను" అని ఆమె వీధిలోకి వెళ్ళింది.

నందనవనంలో - రాక్షసభయం వల్ల కాపరులు కూడా లేరు. నేనావనంలో యధేచ్ఛగా తిరుగుతూ, పువ్వులుకోస్తూ పళ్ళుతింటూ, సంగీతవృక్షాల గానం వింటూ కొంతసేపు గడిపాను. అక్కడి పూలతో చక్కని దండలు అల్లాను.

అంతలో ఆమె వచ్చి "నీకు ఊరివిశేషాలు చూబిస్తాను రా." అని నన్ను తీసుకెళ్ళింది. ఆనందనవనం స్వర్గపట్నానికి తూర్పుగా ఉంది.

మొదట విమానశాలలు తరువాత చిత్రశాలలు పిమ్మట విహారశాలలు, ఆ పైన రత్నశాలలు – మధ్యమధ్య అనేకశాలలూ ఉన్నాయి ఆ తోటలో పోతూంటే జలయంత్రాలు చిమ్మే బిందువులతో శరీరం తడుస్తుంది ఒకచోట వసంతం, మరోచోట గ్రీష్మం అవనానికి తుది మొదలు కనపడలేదు

మేము విహరిస్తూంటే – అంతవరకూ రాక్షసులకు భయపడిన వనబాలికలు తిలోత్తమను చూసి ధైర్యంతో బయటకు వచ్చి నన్ను చూసి సంకోచిస్తూంటే "ఇతనొక పుణ్యపురుషుడు రాక్షసులెక్కడికో పోయారు. మనప్రభువతనిని చంపేస్తాడు అని ధైర్యం చెప్పింది వాళ్ళు జయజయ ధ్వానాలు చేస్తూ నాట్యమాడారు

అక్కడ స్త్రీలు ఎంత అందగత్తెలో నేను వర్ణించలేను

తోటలో తిరుగుతుంటే ఒక మాను కనిపించింది దాని విశేషం తిలోత్తమ యిలా చెప్పసాగింది

'ఇది సంగీత వృక్షం వైణిక బృందం పాడినట్లు పాడుతుంది గాలి వీచేకొద్దీ కొత్త కొత్త వింతరాగాలు వినిపిస్తాయి మా లోకంలో అతిపెద్ద విశేషం యిదే అంది

మా లోకంలో పాతితే బతుకుతుందా?" అని అడిగాను

ఆమె కొంచెం ఆలోచించి, "ఈ చెట్టు పూర్వం కైలాసంలో ఉండేది శివుణ్ని ప్రార్థించి విష్ణువు తనలోకానికి తెచ్చుకున్నాడు అక్కడి నుంచి శతానందుడు విష్ణువు నడిగి తనలోకంలో కూడా దీనిని విస్తరింప జేశాడు బ్రహ్మని వేడుకుని ఇంద్రుడు దీని నిక్కడ నాటాడు' అంది నన్ను పట్నంలోకి తీసుకుపోయింది

ఆ పట్నం శోభ ఏమని చెప్పేది? ఎన్నో మేడలు మణులతో ప్రకాశిస్తున్నాయి అక్కడి రాళ్ళు కూడా రత్నలే అన్నీ రాజవీధులే

ఆవింతలు చూస్తూ నేను విభ్రాంతి చెందుతూంటే ఆమె నవ్వుతూ – "నాతోపాటే రావేం? అంది

'నీకూ నాకూ మధ్య ప్రవాహముంది ఎలా దాటగలను?

'అది ప్రవాహం కాదు. మణికాంతుల ప్రవాహం." అందామె

"తిలోత్తమా! నీకు పుణ్యముంటుంది నా చెయ్యి వదలకు. కొంచెం ఎడమైతే నువ్వూ నాకు కనపడకపోతావ్" అని బతిమాలాను

ఆ మేడ మీద ఉన్నవారు దేవకాంతలనుకుంటే – "కాదు, సాలభంజికలు" అంది. నాకంతా ఆశ్యర్యంగా ఉంది.

అది ఇంద్రుడి మేడ దాని దగ్గరిది శచీదేవి మేడ. ఆ పక్కది జయంతునిది దానికి తూర్పున సుధర్మ అనే దేవసభ ఉంది ముందు మా యింటికి తీసుకువెళ్తాను " అని –

నన్నొక గదిలోకి తీసుకెళ్ళింది దాని అలంకారం వర్ణించడానికి ఏడాది చాలదు

అంతలో తిలోత్తమ జగన్మోహనంగా అంలకరించుకుని నామంచం దగ్గరకు వచ్చి నిలబడింది మొట్టమొదట ఆమె నింకెవరో అనుకున్నాను.

'ఆర్యా నువ్వు మా కతిధివి హరిభక్తుడివి. నిన్నర్చింవలసిన విధి మాకుంది నాసపర్యలందుకో' అంటూ ఆమె నా శరీరానికి చందనం పూసింది. అచందన పరిమళ మెంత చక్కగా ఉందో.

ఒకమందారమాల నామె నామెడలో వేసేసరికి నావొళ్ళు పులకరించింది. నామనసులో శృంగారభావాలు చెలరేగాయి

అప్పుడు నేను – 'నీ సపర్యలకు నాకెంతో సంతోషం కలిగింది. తిలోత్తమా! నువ్వు దేవకన్యవి నీ అర్చన స్వీకరించి ఊరుకోకూడదు. తిరిగి నేను నిన్నర్చించాలి చందనం గిన్నె యిలా తీసుకురా " అన్నాను

అందుకామె – 'రసికశేఖరా నీకేదిష్టమో అలా చెయ్యి" అంటూ చందనపు పాత్ర నందించింది.

గౌతముడితో కలసి నేను శృంగార గ్రంధాలు చదివినవాడినే. కనుక నేను వెనకాడలేదు. నేనూ ఆమే తన్మయత్వం చెందాం. తక్కింది నీవే గ్రహించుకో.

ఆవేదుక లెన్నాళ్ళను భవించానో చెప్పలేను ఐతే ఇంద్రుడు వచ్చి నన్ను శిక్షిస్తాడేమో అనే భయంమాత్రం పానకంలో పుడకలా నా మనసుని వేధిస్తూనే ఉంది

ఒకనాడామె నన్ను దేవసభ చూబిస్తానని తీసుకు వెళ్ళింది అప్పటికింకా ఇంద్రుడి జాడ తెలియలేదు పట్నమంతా అలాగే ఉంది ఆమె ఒక మర తిప్పి రహస్యమార్గం ద్వారా తీసుకెళ్ళింది ఆతోవ ఇంద్రుడి సింహాసనం వెనకకి చేర్చింది ఆ సభలో విశేషాలు చెప్పడానికి శక్యం కాదు

తూర్పుదిక్కున చింతామణి అనే పేరుకల ఇంద్రుడి సింహాసనం రత్నఖచితమై ఉంది దానికి రెండు పక్కలా ఎన్నో రత్న పీఠాలు ఉత్తర దక్షిణ భాగాలలో దేవతలు కూర్చునే పీఠాలు ఎదురుగా రంభ మొదలైన వారు నాట్యంచేసే రంగస్థలం అది అతి చక్కగా అలంకరించబడి ఉంది

దిక్పాలకులు మహర్షులు బృహస్పతి – ఇంద్రుడికి దగ్గరలో కూర్చుంటారట నేనలా తిరుగుతూంంటే – రహస్య ద్వారంలో ఎవరివో మాటలు వినిపించాయి తిలోత్తమ భయపడుతూ నా చెయ్యి పట్టుకుని చింతామణి పీఠానికి వెనక్కి లాక్కుపోయింది

మేమూ దేవరహస్య ద్వారానికి దగ్గరగానే ఉండడంతో మాకా మాటలు వినపడసాగాయి

*విజయుడు* నందా ఈ ద్వారం తెరవబడి ఉందేం? శత్రువు లెవరూ దూరలేదుకదా? నిన్ను ఎప్పుడూ యిక్కడ కాపలా ఉండమని చెప్పాడుగా ప్రభువు? ఏం చేస్తున్నావ్?

*నందుడు* ప్రమాదం జరిగింది నందా నన్ను కాపాడు సురాపానం చేసి రతికేళిలో మునిగి యిక్కడికి రావడం మరిచాను ఈ సంగతి తెలిస్తే ప్రభువు శిక్షిస్తాడు గుప్తంగా ఉంచు సుమీ నీకు పుణ్యముంటుంది

విజయుడు . జరిగిన దానికి చింతించి లాభంలేదు ఎందుకు తెరవబడిందో కారణం ఆలోచించు ఇంద్రుడుగారు వొస్తున్నారు సభ సిద్ధంగా అమర్చబడి ఉంచాలి

నందుడు మన దేవేంద్రుని కెలా విజయం చేకూరిందో చెప్పు ఈ ద్వారం మాయడం మనమే మరచిపోయుండవచ్చు శత్రువులకి తెలియదులే

విజయుడు రక్తాక్షుడు ఇంద్రుణ్ణి తీసుకుపోయి ఒక బందికానాలో ఉంచాడు

నందుడు అయ్యో మన ప్రభువుకెంత అవస్థ వచ్చింది ఊ తరవాతేమైంది?

విజయుడు అంతలో జయంతుడు పోయి ఆ రాక్షసుడేమరుపాటుగా ఉన్న తరుణం చూసి, వాడిమీదపడి, వాడిని సంహరించాడట దానితో – మిగిలిన రాక్షసులంతా పారిపోయారట

నందుడు : విష్ణుమూర్తి వచ్చి సహాయం చేశాడని ఒక వదంతి పుట్టిందే.

విజయుడు అదీకావచ్చు, శ్రీహరి కటాక్షం లేనిదే ఎవరికీ జయం కలుగదు కదా

నందుడు ఇంద్రుడిప్పుడే సభకొచ్చి ఏం చేస్తాడు?

విజయుడు . దిగ్విజయ విశేషాలు చెప్పుకుని సంతోషిస్తాడేమో

నందుడు ఐతే – త్వరగా పీఠాలన్నీ చక్కగా అమర్చాలి త్వరపడు

ఆ పెద్దగుమ్మం తలుపులు తెరచుకున్నాయి నేనూ తిలోత్తమా ఒక పెట్టె వెనుక దాక్కున్నాం

అంతలో నా గుండెలు పగిలేలా భేరీధ్వనులు వినిపించాయి. ఇంద్రుడు వచ్చాడు మేమెవరికీ కనపడడం లేదు. మాకందరూ కనపడుతున్నారు

తిలోత్తమ నన్ను నిర్భయంగా ఉండమని చెప్పింది

# ఇంద్రుని కథ

ఇంద్రుడు తన సింహాసనం మీద కూర్చున్నాడు దేవతలూ మునులూ వారి వారి స్థానాలలంకరించారు

అప్పుడు బృహస్పతి లేచి - ఆ రాక్షసుడి విశేషాలు చెప్పి - జయంతుని పరాక్రమం గురించి కొంత సేపు ఉపన్యసించాడు చాలామంది ఉపన్యసించాక రంభమొదలైన వాళ్ళు నాట్యం చేశారు

ఇంద్రుడు తనవిజయం గురించి వివరించి దేవతలకు కానుకలిచ్చాడు

ఎవరికి వారు తమ నివాసాలకు పోయినా సభాద్వారం మూయకుండా కాపలదారులు విచ్చుకత్తులతో పహరా కాయసాగారు. ఇక ఆదారిన పోవడానికి మాకు వీలులేకపోయింది

తిలోత్తమ ఎన్నో విధాలుగా ఆలోచించి, కాపలావాళ్ళకి కనపడకుండా రహస్యద్వారం వరకూ నన్ను తీసుకు పోయింది అంతకు మునుపు మేము వచ్చిన ద్వారాన్ని విజయుడూ నందుడూ లోపల తాళం వేసి బిగించారు

దానితో ఆమె చాలా భయపడింది ' ఈ ద్వారానికి తాళం వేసేశారు ఇక మనకి బతుకు లేదు మరో దారిని వెళ్ళడం మనతరం కాదు. పెద్ద గుమ్మంలోంచి ఇంద్రుడి అనుమతి లేకుండా రాకపోకలు సాగించడం అసాధ్యం ఇప్పుడు మనని చూస్తే అనుమానిస్తారు. అవతలికి పోడానికి నీకు కూడా సాధ్యంకాదు ఇక్కడ ఎన్నాళ్ళుంటాం?

ఈ సభలోనికి వచ్చేవారికీ పోయేవారికీ లెక్క ఉంటుంది ఈ మార్గంలో నేను వెళ్తే లోపలికెలా వెళ్ళావని అడగక మానరు. ఏం చెప్పగలను?" అని ఎన్నో విధాల ఆలోచిస్తూ - అంతలో కళ్ళు తెరిచి -

"ఆ జ్ఞాపకం వొచ్చింది రుచికా మనకొక అవకాశముంది. రాబోవు శుక్రవారం యీ వూర్లో శ్రీపుష్పయాగమను ఉత్సవం చేస్తారు ఆ రాత్రి పార్వతీ పరిణయం అనే నాటకం యీ సభలో ఆడతారు

అప్పుడు చాలా సమ్మర్దంగా ఉంటుంది ఆ సందట్లో మనందాటిపోవచ్చు' అని – మళ్ళీ అంతలోనే – 'కాని నాకో చిక్కొచ్చి పడిందే ఆనాటకం బృహస్పతిగారు రచించారు అందులో నాకొక వేషముంది పార్వతి వేషం ఊర్వశి వేస్తుంది. నేనామె చెలికత్తె జయ వేషం వేయాలి. ఆనాటకంలోని వేషధారులందరూ రేపు రాత్రి బృహస్పతి గారింటికి పోవాలి. అప్పుడు నా సంగతి బయటపడి పోతుంది దీనికేం చెయ్యాలి?" అని తీవ్రమయిన ఆలోచనలో పడింది

తిలోత్తమ అధైర్యం చూసి నాకు భయమేసింది. మనసులో జగన్నాధ స్వామిని ధ్యానించసాగాను. ఆమెకు దుఃఖంలో పొళ్ళు తెలియడం లేదు.

నాకాకలిగా ఉండడంతో – అక్కడ అలంకారంగా కట్టబడిన పళ్ళని తిన్నాను ఆవేళంతా విచారంగానూ భయంగానే గడిచింది మర్నాడు – మేమలా విచారంగా ఉండగా – పెద్ద భేరీధ్వని వినపడింది అది విని "ఇంద్రుడు సభకు వస్తున్నారు అంటే ఏదో కారణం ఉంది ఎంతో ముఖ్యమైన పనుంటే తప్ప సమయంకాని సమయంలో, కొత్తవేళలో సభ చేయరు ఇప్పుడేం చెప్పుకుంటారో మనం వినొచ్చు తలమాత్రం పైకెత్తకేం?" అని ఆమె నన్ను హెచ్చరించింది

ఇంద్రుడు, బృహస్పతి దేవతలు విచారపు మొహాలతో వచ్చారు రంభావాళ్ళు కూడా వచ్చారు కానీ నాట్యాలూ అవీ లేకుండా నిశ్శబ్దంగా నిలబడ్డారు అప్పు డింద్రుడిలా చెప్పాడు

'రక్తాక్షుడి కొడుకు విరూపాక్షుడు యుద్ధంలో ఓడి పారిపోయాడని విన్నాం కదా. ఇప్పుడు వాడు సేనలని కూర్చుకుని మనపట్నాన్ని ముట్టడించడానికి వస్తున్నాడని వదంతి పుట్టింది నిజానిజాలు తెలుసుకోమని చారులను పంపాను కనుక యీ నేపధ్యంలో – మనము చేయవలసిన శ్రీ పుష్పయాగోత్సవం చెయ్యాలా – ప్రస్తుతం మానెయ్యాలా? '

"దేవేంద్రా విరూపాక్షుడు చాలా బలవంతుడు కనుక నిజంగానే అలాటి ప్రయత్నం చెయ్యొచ్చు కనుక వదంతిని వట్టిదని తోసి పారెయ్యకూడదు మన ప్రయత్నంలో మనం ఉండాలి. ఈ ఉత్సవం మరొకప్పుడు చేసుకోవచ్చు ' అన్నాడు బృహస్పతి

ఆ సలహా అందరికీ నచ్చింది

"స్వర్గపువాకిళ్ళన్నీ మూసి ఉంచండి సైన్యమంతా స్వర్గంచుట్టూ మోహరించండి ' అని చెప్పి ఇంద్రుడు సభ చాలించాడు

ద్వారపాలకులు సింహద్వారం మూసి రహస్యద్వారం వద్దకు వచ్చారు

అప్పుడు తిలోత్తమ సంతోషిస్తూ – ' విరూపాక్షుడి వల్ల మనమీ సభలోంచి దాటి పోవచ్చు రహస్యద్వారం తాళం వెయ్యలేదు కాని కాపలా వాడుంటాడు నేను వాణ్ణి బుట్టలో పెడతాను నువ్వు నావెనకాతలే ఉండు నేను వాడిని మాటలలో పెట్టి దూరంగా తీసుకుపోగానే సమయంచూసి గోడచాటున నిలుచో, తరువాత నేను నిన్ను తీసుకుపోతాను ' అంది '

ఆమె తడిమి ఒక మరపట్టుకోగా తటాలున ద్వారం తెరచుకుంది

అక్కడున్ననందుడు – "ఎవరువారు?" అని కేక వేశాడు

' నందా. నేను తిలోత్తమని నన్ను లోపల పెట్టి తలుపులు వేశావేం చూడలేదా? '

నువ్వు ముందుసభలోకి పోయావా? నేను చూడలేదే నువ్వు కనపడలేదని అందరూ చెప్పుకుంటున్నారు?' అని వాడు అడగగా –

నందా నీ భార్యబాగుందా? దానికీ నాకు స్నేహం నీతో ఎప్పుడేనా నాగురించి అంటుందా? నువ్వు నాకు వరసకి బావవుతావు మా అక్కనడిగానని చెప్పు మరో రహస్యముంది చెవిలో చెప్పాలి ఇలారా. ఎవరికీ చెప్పవుకదా? చెవిలో చెప్పాలి ఇలారా చేతిలో ఒట్టెయ్." అంది

"ఏమిటారహస్యం?' అంటూ వాడు ఆమె వద్దకు వెళ్ళాడు.

ఆమె వాడిని మెల్లగా దూరంగా తీసుకుపోయింది

వాడు దూరంగా వెళ్ళాక నేను వెంటనే బయటకు వచ్చి ఆమె చెప్పిన గోడ వెనుక దాక్కున్నాను

ఆమె వాడికేం చెప్పిందో కాని వాడు చాలా ఆనందించి - వచ్చి ఆద్వారం మూసి అక్కడ కాపున్నాడు

'ఈ గుమ్మం చాలా భద్రంగా కాపాడు" అని చెప్పి, నా వద్దకు వచ్చి నన్ను వెంటబెట్టుకుని రహస్యంగా యిల్లు చేరింది

అప్పుడు మాకు చావు తప్పించుకున్నట్లే ఆనందం కలిగింది

తిలోత్తమ తాను వెళ్ళాక ఏం జరిగిందని చెలికత్తెల నడిగింది.

"నువ్వు వెళ్ళాక - మొదట జయంతుడు వర్తమానం పంపాడు. తరువాత బృహస్పతి పంపగా రంభ వొచ్చింది - అన్నారు "రంభకేం చెప్పారు? '

'ఇంట్లో లేదు ఎక్కడికి పోయిందో తెలియదు" - అన్నాము తరువాత ఇంద్రుడు కబురంపాడు. బృహస్పతి వారు చాలా కోపంచేశారని ఇంద్రుడితో చెప్పారట. అంతలో విరూపాక్షుడి గొడవ రావడంతో నీ విషయం అడుగునపడిపోయింది."

అది విని తిలోత్తమ విచారంగా నన్ను తన అంతఃపురానికి తీసుకుపోయింది. అంతలో వీధిలో ఏదో చాటింపు వినపడింది పరిచారికలది తెలుసుకుని వచ్చి - విరూపాక్షుని గురించి వచ్చిన వార్త అంతా అసత్యమట. రేపు యధావిధిగా శ్రీపుష్పయాగోత్సవం జరిపించబడుతుందనీ, పురమార్గాలన్నీ తెరవబడతాయనీ అందరూ స్వేచ్ఛగా సంచరించవచ్చుననీ చాటిస్తున్నారు అని చెప్పారు

అది వినడంతోనే - అయితే నాటకం జరుగుతుంది ఎక్కడికి పోయావని నన్నడిగితే ఏం చెప్పాలి? - అని ఆలోచిస్తూ నా వద్దకూర్చుని ఏదో చెప్పబోతూంంటే - చెలికత్తెవచ్చి - జయంతు డొస్తున్నాడని చెప్పింది

ఆ మాటకు తిలోత్తమ అదిరిపడి - నన్నొక మూల దాచి - అతనికెదురేగి స్వాగతం పల్కింది 'తిలోత్తమా! ఇన్నాళ్ళూ ఎక్కడికి పోయావు? పార్వతీ పరిణయ నాటకంలో నీదొక పాత్ర కలదట దానిని సరిచూడడానికి నిన్న నువ్వు బృహస్పతి గారింటికి పోలేదట ఆయనకు కోపం వచ్చి మా తండ్రితో చెప్పాడు' అని కొంచెం ఆగి - 'నేను హడావిడిగా వెళ్ళిపోయాను తరవాత నువ్వేం చేశావు?" అని అడిగాడు

"జయంతా నా వృత్తాంతం ఏమని చెప్పేది నువ్వు నన్ను దారిలో విడచిపెట్టి పోయాక నేను విమానశాల దగ్గరకు వెళ్ళేసరికి అక్కడ నన్నో రాక్షసుడు పట్టుకుని బలత్కారంగా లాక్కుపోయాడు

నే నెన్ని కేకలు పెట్టినా నా మొరాలకించిన వారే లేకపోయారు వాడు నన్ను ఓ పర్వతం మీదికి తీసుకుపోయి గుహముందు ఉంచి తనకోరిక తీర్చమన్నాడు

నేనందు కంగీకరింపక వాడినెన్నో విధాలుగా దూషించాను వాడు నామీద కోపగించి - తన చేతిలో ఉన్న కత్తి ఝుళిపిస్తూ - "ఒప్పుకుంటావా, లేకపోతే నీతలనరికేసేదా?' అని గద్దించాడు.

నాకెంతో భయమేసింది ఈ గండం గడిస్తే తరువాత చూసుకోవచ్చని - 'నీ కోరిక తీరుస్తాను నువ్వొచ్చినప్పుడు అశుచిగా ఉన్నావు స్నానం చేసి శుభ్రంగా తయారైరా" అన్నాను.

వాడు చాలా సంతోషిస్తూ - కత్తిని పక్కనుంచి - చిన్నకాలువలో బోర్లా పడుకుని నెత్తిమీద నీళ్ళు పోసుకోసాగాడు

నేనదే అదునని సాహసించి కత్తితో వాడి మెడమీద ఒక్క వేటు వేశాను దానితో వాడి తల తెగి - దొర్లుకుంటూ ప్రవాహంలో కొట్టుకుపోయింది

వాడినలా సంహరించాక స్వర్గానికి వచ్చే దారి తెలియక - ఆ పర్వత శిఖరమెక్కి తిరుగుతూంటే - విహరించడాని కక్కడికి కింపురుష జంట వచ్చింది నేను వారి వద్దకు పోయి నా పేరు చెప్పాను

వారు నన్ను గుర్తుపట్టి యీ వూరి ముందు దిగవిడచి పోయారు నేనింటికి వచ్చాను ఇదీ నాకద, బృహస్పతి గారూ, ఇంద్రుడు గారూ కోపగిస్తే నేనేం చెయ్యగలను?' అంది దీనంగా.

నేనామె సమయస్ఫూర్తి కాశ్చర్యపోయాను ఆమె కష్టాలకు కారణం నేనే కదా అని విచారించాను.

అంతలో జయంతుడు "నేను విహారార్థం పోయానంటే మా తండ్రి తిడతాడు ఈ రహస్యం బట్టబయలు చేయకు. తీగలాగితే డొంకంతా కదిలినట్లు నీవల్ల నాగుట్టు రట్టవుతుంది. నువ్వు నందనవనానికి విహారానికెళ్ళినప్పుడు రాక్షసుడు చెరపట్టినట్లు చెప్పు" అని అతను వెళ్ళిపోయాడు

అతను వెళ్ళగానే పరిచారికలు వచ్చి – "రంభా ఊర్వశీ వచ్చారు" అని చెప్పారు

వాళ్ళు వొస్తూనే తిలోత్తమని కౌగలించుకుని – 'ఏమే! నిన్నెవడో రాక్షసుడు చెరబట్టి తీసుకుపోయాడట. ఎంత ప్రమాదం తప్పింది! నిన్న నువ్వు బృహస్పతి గారింటికి రాకపోతే – ఏమో అనుకున్నాము. ఈ సంగతి తెలియక ఆయన కోపగించారు' అంది రంభ

తిలోత్తమ వాళ్ళకేదో సర్ది చెప్పింది సందులోంచి వాళ్ళిద్దరినీ చూశాను వాళ్ళ సౌందర్యం ఏమని చెప్పేది. నాజన్మ ధన్యమైనట్లే అనిపించింది వాళ్ళని చూసేసరికి

'ఈ రాత్రి నాటకంలోకి వొస్తావా? నీవేషం మరెవరూ వేయలేరు దిక్పాలకు లందరూ వస్తారట చక్కగా ప్రదర్శించాలి" అన్నారు వాళ్ళు

పరిచారిక వచ్చి – 'ఇంద్రుడు గారు నిన్ను రమ్మన్నారట. దేవదూత వచ్చి వాకిట నిలచాడు" అంది

తిలోత్తమ – మీరు వెళ్ళండి నేనింద్రుడి దగ్గరకు పోయొస్తాను రాత్రి తప్పకుండా నాటకంలో పాల్గొంటాను" అని వాళ్ళను పంపింది

నా దగ్గరకొచ్చి - "నువ్వంతా వింటున్నావు కదా? నేనింద్రుడి దగ్గరకెళ్తొస్తాను ఇక్కడే ఉండు ఎవరూ రాకుండా తాళం వేసేస్తాను నీకేమీ భయంలేదు - అని వెళ్ళిపోయింది

ఆమె లేని నిముషము ఒక యుగం లాగే గడిచింది నాకు ఇంతలో ఆమె వచ్చింది. కుమారుడి ద్వారా నా వార్త విన్న ఇంద్రుడు నా కథని సాదరంగానే విన్నాడు జరిగిన దానికి విచారించాడు. రాత్రి నాటకంలోకి పొమ్మని కూడా చెప్పాడు అంతవరకూ బాగానే ఉంది కాని - మరోచిక్కొచ్చేలా ఉంది"

ఏమిటి? అని అడిగాను

మేము మాట్లాడుతూంటే విజయుడనే ద్వారపాలకుడు వచ్చి - 'సభని అలంకరిస్తూండగా చింతామణి పీఠం వెనక యీ కాగితం దొరికింది దీనిలో ఉన్నది మనలిపికాదు మానవలిపిలా ఉంది ఇలాటిది సభలోకి రావడానికి కారణం దేవరవారు శోధించాలి " అంటూ ఆ కాగితం అందించాడు

సకల భాషలూ తెలిసిన దేవేంద్రుడు - "పువ్వుల దండ కోసం ఎవరో రాసినట్లున్నారు ఈ రుచికుడెవడు? ఎక్కడి జగన్నాదం? ఈ ఉత్తరం సభలో ఉండడం చిత్రంగా ఉందే" అని రెండో ద్వారపాలకుడు నందుడికీ బృహస్పతికీ తక్షణమే కబురు పంపాడు.

నేను భయపడి - ఇంద్రుడివద్ద శలవుతీసుకుని వచ్చేశాను ఆ ఉత్తరం నువ్వక్కడ మరచిపోయావేమో నందుణ్ణి నిర్బంధించి అడిగితే నా సంగతీ, దానిద్వారా మన గుట్టూ బయటపడొచ్చు ఇంక నువ్విక్కడుంటే మరింత ప్రమాదం నిన్ను భూలోకంలో దింపొస్తాను. నువ్వు సుఖంగా ఉంటే అంతేచాలు. ఐతే నీకొక మేలుచేస్తాను-" అంది తిలోత్తమ.

'ఏమిటి?" అని అడిగాను నేను

"భూలోకంలో నాపేరే కల ఒక రాజకుమా రుంది రూపలావణ్యాలూ నావే సామాన్యుణ్ణి పెళ్ళాడనని పట్టు పట్టి కూర్చుంది

మొన్నటి ప్రయాణంలో ఆమె గురించి తెలిసింది నువ్వామెకు తగిన వాడివి ఆమె మేడమీద నిన్నొదిలుతాను ఆమెతో సుఖంగా ఉండు నేను త్వరగా వచ్చి నాటకాని కందుకోవాలి" అందామె. "అయ్యో! నా మూలంగా నీకెన్ని కష్టాలొచ్చాయి –" అని విచారించాను

ఆమె – "నిన్ను విడవడం ప్రాణాలు వదలడం కంటె కష్టంగా ఉంది అంటూ, విమానశాల వద్దకు తీసుకొచ్చి విమాన మెక్కించి భూలోకానికి తీసుకొచ్చి – మేడమీద దింపి – తను వెళ్ళిపోయింది

ఆమేడమీద వీణవాయిస్తున్న సుందరిని నేను మోహించాను ఆమెకీ నేనంటే అనురాగం కలిగి సఖులను అవతలికి పంపేసింది మూడు రోజులు పగలు రేయి తెలియకుండా మేం క్రీడించాం కనీసం ఒకరిగురించి ఒకరు కనుక్కుందుకు కూడా మాకు వ్యవధి లేకపోయింది.

నాలుగోనాడు ఉదయం కళ్ళు తెరిచేసరికి నేనక్కడలేను. నన్నెవరో ఎక్కడికో తీసుకుపోతున్నారు నేనడిగిన కొంతసేపటికి "మేము దేవదూతలం ఇంద్రుని ఆజ్ఞమేరకు నిన్ను స్వర్గానికి తీసుకుపోతున్నాం" అన్నారు వాళ్ళు

"అక్కడే మయిందో? తిలోత్తమ మాట నిజమే అయింది. ఆమెనేం బాధపెడుతున్నారో ఇంద్రుడు నన్నేంచేస్తాడో? ' అని విచారిస్తూనే –

"అయ్యలారా ఇంద్రుడు నన్నెందుకు తీసుకు రమ్మన్నాడు? అక్కడ నా ప్రసక్తెందుకు వచ్చింది? ' అని వినయంగా అడిగాను కానివాళ్ళు నోరు విప్పలేదు స్వర్గానికి నన్ను తీసుకుపోయారు

ఆ సమయంలో ఇంద్రుడు శివపూజ చేస్తున్నాడని – నన్నొక బందీగృహంలో ఉంచారు అది భూలోకంలో కారాగృహంలా దుర్గంధంతోనూ అసహ్యంగానూ ఉండక – ప్రహరీతో --- చక్కని ఉద్యానవనంలో ఉంది ఈ లోకంలో రాజభవనమేనా అలా ఉండదు

తిలోత్తమమాట ఇంద్రుడికి చెప్పాలా? కూడదా? – అని సందేహంలో పడ్డాను చెబితే ఒక తప్పు చెప్పకపోతే యింకో తప్పు

నా దగ్గరకొచ్చి – "నువ్వంతా వింటున్నావు కదా? నేనింద్రుడి దగ్గరకెళ్తొస్తాను ఇక్కడే ఉండు ఎవరూ రాకుండా తాళం వేసేస్తాను నీకేమీ భయంలేదు' – అని వెళ్ళిపోయింది.

ఆమె లేని నిముషము ఒక యుగం లాగే గడిచింది నాకు ఇంతలో ఆమె వచ్చింది. "కుమారుడి ద్వారా నా వార్త విన్న ఇంద్రుడు నా కధని సాదరంగానే విన్నాడు జరిగిన దానికి విచారించాడు రాత్రి నాటకంలోకి పొమ్మని కూడా చెప్పాడు అంతవరకూ బాగానే ఉంది కాని – మరోచిక్కొచ్చేలా ఉంది"

ఏమిటి?" అని అడిగాను

మేము మాట్లాడుతూంటే విజయుడనే ద్వారపాలకుడు వచ్చి – "సభని అలంకరిస్తూండగా చింతామణి పీఠం వెనక యీ కాగితం దొరికింది దీనిలో ఉన్నది మనలిపికాదు. మానవలిపిలా ఉంది ఇలాటిది సభలోకి రావడానికి కారణం దేవరవారు శోధించాలి.' అంటూ ఆ కాగితం అందించాడు

సకల భాషలూ తెలిసిన దేవేంద్రుడు – "పువ్వుల దండ కోసం ఎవరో రాసినట్లున్నారు ఈ రుచికుడెవడు? ఎక్కడి జగన్నాధం? ఈ ఉత్తరం సభలో ఉండడం చిత్రంగా ఉందే" అని రెండో ద్వారపాలకుడు నందుడికీ బృహస్పతికీ తక్షణమే కబురు పంపాడు.

నేను భయపడి – ఇంద్రుడివద్ద శలవుతీసుకుని వచ్చేశాను ఆ ఉత్తరం నువ్వక్కడ మరచిపోయావేమో. నందుణ్ణి నిర్బంధించి అడిగితే నా సంగతీ దానిద్వారా మన గుట్టూ బయటపడొచ్చు ఇంక నువ్విక్కడుంటే మరింత ప్రమాదం నిన్ను భూలోకంలో దింపొస్తాను నువ్వు సుఖంగా ఉంటే అంతేచాలు ఐతే నీకొక మేలుచేస్తాను–' అంది తిలోత్తమ

'ఏమిటి? ' అని అడిగాను నేను

"భూలోకంలో నాపేరే కల ఒక రాజకుమా రుంది రూపలావణ్యాలూ నావే సామాన్యుణ్ణి పెళ్ళాడనని పట్టు పట్టి కూర్చుంది

మొన్నటి ప్రయాణంలో ఆమె గురించి తెలిసింది నువ్వామెకు తగిన వాడివి ఆమె మేడమీద నిన్నొదులుతాను ఆమెతో సుఖంగా ఉండు నేను త్వరగా వచ్చి నాటకాని కందుకోవాలి అందామె. "అయ్యో. నా మూలంగా నీకెన్ని కష్టాలొచ్చాయి –" అని విచారించాను

ఆమె – "నిన్ను విడవడం ప్రాణాలు వదలడం కంటె కష్టంగా ఉంది అంటూ, విమానశాల వద్దకు తీసుకొచ్చి విమాన మెక్కించి భూలోకానికి తీసుకొచ్చి – మేడమీద దింపి – తను వెళ్ళిపోయింది

ఆమేడమీద వీణవాయిస్తున్న సుందరిని నేను మోహించాను. అమెకీ నేనంటే అనురాగం కలిగి సఖులను అవతలికి పంపేసింది మూడు రోజులు పగలు రేయి తెలియకుండా మేం క్రీడించాం కనీసం ఒకరిగురించి ఒకరు కనుక్కుందుకు కూడా మాకు వ్యవధి లేకపోయింది.

నాలుగోనాడు ఉదయం కళ్ళు తెరిచేసరికి నేనక్కడలేను. నన్నెవరో ఎక్కడికో తీసుకుపోతున్నారు నేనడిగిన కొంతసేపటికి 'మేము దేవదూతలం ఇంద్రుని ఆజ్ఞమేరకు నిన్ను స్వర్గానికి తీసుకుపోతున్నాం" అన్నారు వాళ్ళు

"అక్కడే మయిందో? తిలోత్తమ మాట నిజమే అయింది. ఆమెనేం బాధపెడుతున్నారో ఇంద్రుడు నన్నేంచేస్తాడో? అని విచారిస్తూనే –

"అయ్యలారా ఇంద్రుడు నన్నెందుకు తీసుకు రమ్మనా... అక్కడ నా ప్రసక్తెందుకు వచ్చింది?' అని ...

కానివాళ్ళు నోరు విప్పలేదు. స్వర్గానికి న...

ఆ సమయంలో ఇంద్రుడు శివ...

బందీగృహంలో ఉంచారు అది భూలోకంలో ... దుర్గంధంతోనూ అసహ్యంగానూ ఉండక – ప్రహరీతో --- చక్కని ఉద్యానవనంలో ఉంది ఈ లోకంలో రాజభవనమేనా అలా ఉండదు

తిలోత్తమమాట ఇంద్రుడికి చెప్పాలా? కూడదా? – అని సందేహంలో పడ్డాను చెబితే ఒక తప్పు చెప్పకపోతే యింకో తప్పు

నా దగ్గరకొచ్చి – 'నువ్వంతా వింటున్నావు కదా? నేనింద్రుడి దగ్గరకెళ్తొస్తాను ఇక్కడే ఉండు ఎవరూ రాకుండా తాళం వేసేస్తాను నీకేమీ భయంలేదు ' – అని వెళ్ళిపోయింది

ఆమె లేని నిముషము ఒక యుగం లాగే గడిచింది నాకు ఇంతలో ఆమె వచ్చింది కుమారుడి ద్వారా నా వార్త విన్న ఇంద్రుడు నా కథని సాదరంగానే విన్నాడు జరిగిన దానికి విచారించాడు రాత్రి నాటకంలోకి పొమ్మని కూడా చెప్పాడు అంతవరకూ బాగానే ఉంది కాని – మరోచిక్కొచ్చేలా ఉంది '

ఏమిటి? ' అని అడిగాను

మేము మాట్లాడుతూంటే విజయుడనే ద్వారపాలకుడు వచ్చి – "సభని అలంకరిస్తూండగా చింతామణి పీఠం వెనక యీ కాగితం దొరికింది దీనిలో ఉన్నది మనలిపికాదు మానవలిపిలా ఉంది ఇలాటిది సభలోకి రావడానికి కారణం దేవరవారు శోధించాలి " అంటూ ఆ కాగితం అందించాడు

సకల భాషలూ తెలిసిన దేవేంద్రుడు – ' పువ్వుల దండ కోసం ఎవరో రాసినట్లున్నారు ఈ రుచికుడెవడు? ఎక్కడి జగన్నాధం? ఈ ఉత్తరం సభలో ఉండడం చిత్రంగా ఉందే' అని రెండో ద్వారపాలకుడు నందుడికీ బృహస్పతికీ తక్షణమే కబురు పంపాడు.

నేను భయపడి – ఇంద్రుడివద్ద శలవుతీసుకుని వచ్చేశాను ఆ ఉత్తరం నువ్వక్కడ మరచిపోయావేమో నందుణ్ణి నిర్బంధించి అడిగితే నా సంగతీ దానిద్వారా మన గుట్టూ బయటపడొచ్చు ఇంక నువ్విక్కడుంటే మరింత ప్రమాదం నిన్ను భూలోకంలో దింపొస్తాను నువ్వు సుఖంగా ఉంటే అంతేచాలు ఐతే నీకొక మేలుచేస్తాను– ' అంది తిలోత్తమ

ఏమిటి?" అని అడిగాను నేను

' భూలోకంలో నాపేరే కల ఒక రాజకుమా రుంది రూపలావణ్యాలూ నావే సామాన్యుణ్ణి పెళ్ళాడనని పట్టు పట్టి కూర్చుంది

మొన్నటి ప్రయాణంలో ఆమె గురించి తెలిసింది నువ్వామెకు తగిన వాడివి ఆమె మేడమీద నిన్నొదులుతాను ఆమెతో సుఖంగా ఉండు. నేను త్వరగా వచ్చి నాటకాని కందుకోవాలి" అందామె. "అయ్యో! నా మూలంగా నీకెన్ని కష్టాలొచ్చాయి –" అని విచారించాను

ఆమె – "నిన్ను విడవడం ప్రాణాలు వదలడం కంటె కష్టంగా ఉంది ' అంటూ విమానశాల వద్దకు తీసుకొచ్చి విమాన మెక్కించి భూలోకానికి తీసుకొచ్చి – మేడమీద దింపి – తను వెళ్ళిపోయింది

ఆమేడమీద వీణవాయిస్తున్న సుందరిని నేను మోహించాను ఆమెకీ నేనంటే అనురాగం కలిగి సఖులను అవతలికి పంపేసింది మూడు రోజులు పగలు రేయి తెలియకుండా మేం క్రీడించాం కనీసం ఒకరిగురించి ఒకరు కనుక్కుందుకు కూడా మాకు వ్యవధి లేకపోయింది

నాలుగోనాడు ఉదయం కళ్ళు తెరిచేసరికి నేనక్కడలేను నన్నెవరో ఎక్కడికో తీసుకుపోతున్నారు నేనడిగిన కొంతసేపటికి 'మేము దేవదూతలం ఇంద్రుని ఆజ్ఞమేరకు నిన్ను స్వర్గానికి తీసుకుపోతున్నాం" అన్నారు వాళ్ళు

"అక్కడే మయిందో? తిలోత్తమ మాట నిజమే అయింది ఆమెనేం బాధపెడుతున్నారో ఇంద్రుడు నన్నేంచేస్తాడో? ' అని విచారిస్తూనే –

"అయ్యలారా. ఇంద్రుడు నన్నెందుకు తీసుకు రమ్మన్నాడు? అక్కడ నా ప్రసక్తెందుకు వచ్చింది?' అని వినయంగా అడిగాను. కానివాళ్ళు నోరు విప్పలేదు స్వర్గానికి నన్ను తీసుకుపోయారు

ఆ సమయంలో ఇంద్రుడు శివపూజ చేస్తున్నాడని – నన్నొక బందీగృహంలో ఉంచారు అది భూలోకంలో కారాగృహంలా దుర్గంధంతోనూ అసహ్యంగానూ ఉండక – ప్రహరీతో ––– చక్కని ఉద్యానవనంలో ఉంది ఈ లోకంలో రాజభవనమేనా అలా ఉండదు

తిలోత్తమమాట ఇంద్రుడికి చెప్పాలా? కూడదా? – అని సందేహంలో పడ్డాను చెబితే ఒక తప్పు చెప్పకపోతే యింకో తప్పు

ఏం చేయాలి? అలోచన తెమలక తోటలో తిరుగుతున్న సమయంలో ఒక చిలకవచ్చి నాముందు వాలింది

మొదట నేను దాన్నంతగా పట్టించుకోలేదు కాని అది నాతోనే రావడం గమనించగా దాని ముక్కుకేదో పత్రి కున్నట్లు కనిపించింది అ దా ఉత్తరాన్ని నాముందువదిలి నాకు కొంచెం దూరంగా పోయింది

నేనా ఉత్తరాన్ని విప్పిచూడగా అది మానవభాషలోనే ఉంది దానిలో – ఆర్యా! నువ్వెళ్ళాక నాకు మనస్థిమితం లేదు ఇంద్రుడు బృహస్పతికీ నందుడికీ కబురంపాడని చెప్పాను కదా వాళ్ళు వచ్చాక – 'ఇది మనసభలో ఎందుకుందో?' అంటూ ఇంద్రుడా ఉత్తరాన్ని బృహస్పతి కిచ్చాడు అతనది చదివి – 'ఇది – భూలోకంలో శ్రీ జగన్నాథంలో ఉండే రుచికుడనే మాలికాకారుడికి – తనకి కొన్ని పూలదండలు కావాలని ఒక వేశ్య రాసింది ఈ ఉత్తరం యిక్కడుండడం అనుమానించవలసిందే" అన్నాడు.

ఇంద్రుడు నందుణ్ణి బెదిరించగా – "నేను కొంచెం మైమరచి నప్పుడెవరో రహస్యమార్గంలో వెళ్ళుంటారు ఆ ద్వారం తెరవబడి ఉంది కారణం నాకూ తెలియదు మొన్న తిలోత్తమ ఆ మార్గం లోంచి వచ్చింది. ఇంతకంటె నాకేమీ తెలియదు' అన్నాడు వాడు

ఆ మాటలు వినడం తోటే ఇంద్రు డాశ్చర్యపోయాడు – "తిలోత్తమ రాక్షసుడికి చిక్కి ఉండగా యీ రహస్య మార్గంలో కెలా వచ్చింది? నీ మాటలు నమ్మదగినవిగా లేవు అన్నాడు

అప్పుడు నాకు కబురంపి – నందుడు చెప్పిందంతా చెప్పి – "మొన్ననువ్వు రహస్య మార్గంలో సుధర్మ నుండి వచ్చేవా?' అని ప్రశ్నించాడు

'అయ్యా మీరు నన్నిలా అడగడం ఆశ్చర్యంగా ఉంది రాక్షసుడికి చిక్కిన నేనీ సభకెలారాగలను? ఇతనిమాట మీరెలా నమ్మారు? నాకేమీ తెలియదు' – అనేశాను

'నందుడిమాట నమ్మతగదు ఉత్తరమెలా వొచ్చిందంటే - తిలోత్తమ వచ్చిందంటాడు తను వెళ్ళేవరకూ రహస్యద్వారం తెరచి ఉందన్న మాటెంత వరకూ నిజమో? తిలోత్తమకీ రుచికుడికీ సంబంధమేమిటి? ఏదో కారణం ఉండవచ్చు గురువర్యా. ఇప్పుడా రుచికు డెక్కడున్నాడో - జ్యోతిష సిద్ధాంత శాస్త్రమూ లగ్నాలను బట్టి చూడండి. అతనిని రప్పిస్తే అంతా తెలుస్తుంది" అన్నాడింద్రుడు.

నువ్వున్న చోటు తెలుసుకుని దేవదూతని పంపాడింద్రుడు ఇంద్రుడు నందుణ్ణి నిలదీస్తే - "నేనబద్ధమాడలేదు లోపలికెప్పుడెళ్ళావని ఆమెను నేనడిగితే - నన్నులోపలుంచి తలుపేశావు" అంది. ఆమెను గట్టిగా అడిగితే నిజంబయటపడొచ్చు ఆమెను చూచిన వాడొక్కడున్నాడు నేనతని చేత సాక్ష్యమిప్పిస్తాను' అన్నాడు

ఇంద్రుడాసాక్షిని అడగగా - "దేవా!గుప్తద్వారం దగ్గర నందుడూ తిలోత్తమా రహస్యంగా మాట్లాడుకోడం నేను చూశాను దగ్గరకు వెళ్ళడం భావ్యం కాదని ఊరుకున్నాను మొన్న - "తిలోత్తమతో ఏం మాట్లాడుతున్నా వావేళ? ' అని అడిగితే అది వేరే విషయం అన్నాడు నందుడు ' అన్నాడతను ఇంతకుమించి నాకేమీ తెలియదు.

"ఇంకా చూస్తే కాని నీమాట నమ్మం మరెవరేనా చూశారేమోకనుక్కో ' అని ఇంద్రుడు నందుణ్ణి పొమ్మనగా - వాడు ఊళ్ళో వాళ్ళనందరినీ కనుక్కుంటూ చివరకి నలుగురు స్త్రీలను తీసుకొచ్చాడు.

వీరిని నేనెరుగను వీళ్ళనడగండి అన్నాడు నందుడు

వాళ్ళు "దేవా మేము నందనవనం కాపలా వాళ్ళం దేవరవారిని రక్షాక్షుడు తీసుకుపోయినప్పుడు మేము భయపడి పొదరిళ్ళలో దాగివుండగా తిలోత్తమ చక్కని పురుషుడొకడితో ఆ వనంలో విహరించింది అతనెవరని మేమడగగా - "ఒక పుణ్యపురుషుడు-" అందినవ్వుతూ అతనితో పట్నంవేపు పోయింది " అన్నారు వాళ్ళు

తిలోత్తమ ఒక చక్కని పురుషునితో వీదిలో పోతూండగా చూశామని మరి కొందరు చెప్పి ఉండడంతో – ఇంద్రుడు వాళ్ళ మాటలు నమ్మాడు కోపంతో నన్ను పిలిచి – 'ఏమే తిలోత్తమా. నువ్వేదో ఉత్తమురాలి వనుకున్నాను మర్మమంతా నీదగ్గరే ఉన్నట్లుంది నిజం చెప్పు ఆరుచికుడెవరు? అతను స్వర్గాని కెలావచ్చాడు?' – అని అడగ్గా– వారి మాటలబద్ధాలు నాకేమీ తెలియదు. వాళ్ళెవరిని చూసి నన్ననుకున్నారో నేను మొదట చెప్పిందే సత్యం" అన్నాను

'తిలోత్తమా. నీకున్న మర్యాద పోగొట్టుకునేటట్లున్నావు సరే ఆ రుచికుడినే యిక్కడికి రప్పించి అడుగుతాను అప్పుడు నిజం తేలుతుంది– అని మమ్మల్ని వెళ్ళిపొమ్మన్నాడు

తరువాత జయంతు డిదివిని – నన్ను గుచ్చిగుచ్చి అడిగాడు నేనింకేమీ చెప్పక – ముందు చెప్పినదే సత్యం' – అన్నాను

నువ్వెళ్ళాక జరిగింది యిది ఇకమీదట భారమంతా నీమీదే ఉంది నీట ముంచినా పాలముంచినా నీదే భారం. నీ జగన్నాధస్వామి అనుగ్రహం యిప్పుడు కనిపించాలి విచారంలో రాశాను తప్పులుంటే క్షమించు నీప్రియురాలు

తిలోత్తమరాసిన ఆ ఉత్తరాన్ని చదువుతూంటే నాకు కన్నీళ్ళొచ్చాయి ప్రత్యుత్తరమిమ్మన్నట్లు రాసిన ఆ చిలక చేష్టలు చేస్తూంది

నేనాఉత్తరం మీదే – "చింతింపకు స్వామి మనవైపున్నాడు నీకవమానం రానివ్వను నేను చాలా బాధపడుతున్నాను–" అని పందురసంతో రాసి దానికందించగా ఆ చిలక దానిని తీసుకుని ఎగిరిపోయింది

అంతలో దేవదూతలు నన్ను ఇంద్రసభకి తీసుకుపోయారు దేవేంద్రుని చూచి నేను సాష్టాంగ నమస్కారం చేశాను మిగిలిన వారికి నమస్కరించాను నన్ను చూసి వాళ్ళందరూ ఆశ్చర్యపడుతున్న ట్లనిపించింది

ఇంద్రుడు నన్ను నువ్వెవరు? పేరేమిటి? నివాసమెక్కడ? ఇది వరకు స్వర్గానికొచ్చావా? అని అడిగాడు.

అయ్యా. నాపేరు రుచికుడు మాది జగన్నాధం స్వామి దయవలన మునుపు నాకు స్వర్గ దర్శనం లభించింది ఇప్పుడు మీ దయవల్ల లభించింది నన్నిక్కడికి రప్పించిన కారణమేమిటో సెలవివ్వండి' అన్నాను

బృహస్పతి ఆశ్చర్యపడుతూ - 'నువ్వు మొదట స్వర్గాని కెలావచ్చావు నిజంచెబితే నీకు పారితోషికం యిప్పిస్తాను' అన్నాడు

అందుకు నేను - "అబద్ధమాడవలసిన అగత్యం నాకు లేదు మా తండ్రి బలదేవుడు శ్రీ జగన్నాధంలో నివసిస్తూ పూలదండలు కట్టి స్వామిని సేవించే పరమభక్తుడు స్వామి కటాక్షం వల్లనే నన్ను కన్నాడు ఒక్కడినే అవడంవల్ల నామీద గారాబమెక్కువ నాకు పదహారేళ్ళ వయసురాగానే పెళ్ళిచేయాలని ప్రయత్నించసాగాడు

అంతకు మునుపే ఒకనాడు పురాణం చెబుతూంటే నేను స్వర్గ విశేషాలన్నీ విన్నాను నేను దేవకన్యలని తప్ప మానవకన్యలని పెళ్ళాడనని చెప్పాను

'నీమాటలు చిత్రంగా ఉన్నాయి మానవుడివైన నీకు మానవకన్యలు కాక దేవకన్య లెలా లభిస్తారు? స్వర్గం - మరోలోకం వెళ్ళడానికే సాధ్యంకాదు చక్కని దాన్ని చూస్తాను, పెళ్ళి చేసుకో" అన్నాడు మా తండ్రి

'మానవకాంతలలో - సౌందర్యముంటే విద్యుండదు అదుంటే శీలముండదు పెళ్ళాడితే దేవకన్యనే పెళ్ళాడతాను లేదా బ్రహ్మచారిగా ఉండిపోతాను అని చెప్పేశాను

నాతండ్రి ఎందరితో చెప్పించినా నేను వినలేదు ఒకనాడాయన తన యిష్టదైవమైన జగన్నాధస్వామిని ధ్యానించి నిద్రపోగా - కలలో స్వామి కనిపించి - 'చింతింపకు నీ కొడుకు కోరిక తీరుస్తాను రామచంద్రపురంలో తిలోత్తమ అనే రాజకుమార్తె పెరుగుతోంది ఆమె

నిచ్చి పెళ్ళిచెయ్యి నీకొడుకు స్వర్గసుఖాలనుభవించగలడు ఆ రాజు నీతో సంబంధం కలుపుకుంటాడు ' అని చెప్పినట్లు మా తండ్రి నాకు చెప్పాడు

నేనంగీకరించాను మాతండ్రి ఆ రాజువద్దకు పోయి ప్రార్థించగా - నాకు తిలోత్తమతో వివాహం జరిగింది ఆమె చాలా చక్కనిది

కొన్నాళ్ళయ్యాక - 'తండ్రీ. వివాహంచేసుకుంటే స్వర్గసౌఖ్యాలు కలుగుతాయన్నావు కాని - స్వామి నామాట మరచినట్లున్నాడు స్వర్గవిశేషాలు నాకింతవరకూ అనుభవానికి రాలేదు. ఇక నేను భార్యని వదిలి సన్యాసినై తిరుగుతాను ముందే వొద్దన్నాను వినకుండా 'నాకేవేవో చెప్పి పెళ్ళిచేశావు చెప్పలేదనకు నేనిప్పుడే సన్యాసం తీసుకుకుంటాను-' అన్నాను.

"నాయనా తొందరపడకు దేవుడిమాట వృధా పోదు. కొన్నిరోజులు చూడు నేను మళ్ళీ స్వామిని దర్శించి కనుకుంటాను " అన్నాడు నా తండ్రి ఆ రాత్రి నామీద వాత్సల్యంతో - స్వామిని ధ్యానించి - స్వామిస్వప్నంలో కనిపించిన తరువాత నేను చెయ్యవలసినవన్నీ చెప్పాడు నా తండ్రి.

'నీ అభీష్టం తొందరలోనే నెరవేరుతుంది కొన్నిరోజులలో రక్తాక్షుడనే రాక్షసుడు స్వర్గాన్ని ముట్టడిస్తాడు ఇంద్రుణ్ణి చెరపట్టి తీసుకుపోతాడు అప్పుడు స్వామి గుడివెనక్కి ఒక విమానం వస్తుంది నువ్వు నీ భార్యతో దానినెక్కితే స్వర్గానికి పోగలవు అక్కడి విశేషాలు చూడగలవు. ఇలాగ రాత్రి కలలో నాకు స్వామి చెప్పాడు కనక సంతోషంగా ఉండు "

నేను ఎదురు చూడసాగాను. అతను చెప్పిన సమయానికి గుడిదగ్గరకి విమానం వచ్చింది. నేను తిలోత్తమతో కలసి ఆవిమానం ఎక్కాను తృటిలో అది మమ్మల్ని స్వర్గానికి తీసుకెళ్ళింది. మొదట మేమిద్దరమూ నందనవనంలో కొంతసేపు క్రీడించాం

అప్పుడెవరోవచ్చి – "తిలోత్తమా! ఇతనెవరే?" అని అడిగారు.

ఆమె నవ్వుతూ – "ఒక పుణ్యపురుషుడు." అని చెప్పి నామొహం చూసింది.

"నువ్వు తిలోత్తమ అంశంతో పుట్టావు మీ పేరులోలాగే రూపంలోనూ భేదం లేదు ఆమె ప్రశ్నకు నువ్వు బాగానే జవాబు చెప్పావు " అని నేనామెను మెచ్చుకున్నాను

ఆతోటలోంచి పట్నంలో కొచ్చాము. పట్నమంతా జనశూన్యంగా ఉంది. నిరాటంకంగా వీధులు తిరిగాం మాతండ్రి చెప్పినట్లు సుధర్మ యొక్క గుప్తద్వారం కనుక్కుని కీలు తిప్పాం తలుపొచ్చింది అక్కడెవరూ లేరు. లోపలికి పోయి అక్కడి విశేషాలన్నీ చూసి మళ్ళీ ఆదారినే బయటకొచ్చాం

నావెనుకనున్న తిలోత్తమ నిక్కడిదనుకొని ద్వారంలో ఎవరోనిలిపి – "లోపలికెలా పోయావు?" అని అడిగాడు. అతనికి తగ్గట్లు జవాబు చెప్పి నావద్దకు వచ్చింది

మేమిద్దరమూ మరికొంతసేపు అక్కడ విహరించి మళ్ళీ విమానమెక్కి భూలోకానికి పోయి మా అత్తారింటి దగ్గర కొన్నాళ్ళున్నాం.

ఒకనాడుదయం లేచి చూసేసరికి దేవదూతలు నన్ను పట్టుకుని ఇంద్రుడి ఆజ్ఞమేరకు స్వర్గానికి తీసుకెళ్తున్నామని చెప్పి యిక్కడికి తీసుకొచ్చారు

ఇదీనాకధ నేనప్పుడు చూసిన సభ యిదే పూర్వ జన్మ పుణ్యంకొద్దీ రెండోసారి చూడగలుగుతున్నాను. అప్పుడు కలగని దేవర దర్శనం యిప్పుడు కలిగింది జన్మ ధన్యమైంది ఎల్లకాలం యిక్కడే ఉండేలా అనుగ్రహించండి" అని ప్రార్థించాను

ఇంద్రు డాశ్చర్యపోతూ బృహస్పతి వేపుచూసి "గురువర్యా! వీనిచరిత్ర విన్నారుగా చాలాచిత్రంగా ఉందే. అతను చెప్పిందంతా నిజమేనా? – ఆలోచించి చెప్పండి" అన్నాడు

"దేవేంద్రా! వీ డెంతవాడు కాకపోతే స్వర్గానికి రెండుసార్లు రాగలుగుతాడు? జగన్నాథస్వామికి వీడి తండ్రి పరమభక్తుడు. వీడి పూర్వపుణ్యం మంచిది. ఈ ఉత్తరం వీడిదే. మరచిపోయుంటాడు. ఇకవీడిని భూలోకానికి పంపెయ్" అన్నాడు బృహస్పతి.

"హరిదయకు పాత్రుడైన వీనికి సత్కారం చేయకపోతే స్వామికి కోపం వస్తుంది. పాపం, తిలోత్తమ మీద అనవసరంగా నిందవేశాం. ఆమె చెప్పిందంతానిజమే. ఎవరి తప్పులేదు" అని ఇంద్రుడు నావేపు చూసి–"ఒక కోరిక కోరుకో. దానినితీర్చి నీచోటుకి పంపుతాం" అన్నాడు.

"మీలోకంలో నాకు సంగీత వృక్షం అతిమనోహరంగా తోచింది. దానిని భూలోకంలో పెంచాలని ఉత్సాహంగా ఉంది. ఇదేనాకోరిక. నాభార్య తిలోత్తమలా ఉంటుందని స్వామి చెప్పారు కదా. అది చూడడానికొక్కసారి ఇక్కడికి తిలోత్తమని రప్పించండి. చూసి సంతోషిస్తాను. మీదయకంటె మరేమీ అక్కర్లేదు" అన్నాను వినయంగా.

"రుచికా! నువ్వుకోరింది అసాధ్యమే అయినా నీకిస్తాను. నువ్వు సంగీత వృక్షవిత్తనాన్ని భూలోకంలో నీయిష్టమెచ్చిన చోటపాతు. అది చెట్టుగా పెరిగి మనోహరంగా పాడుతుంది. కాని పుణ్యాత్ములు కానివారికి దాని గానం వినపడదు. వారికది ముళ్ళ చెట్టులా తోస్తుంది. భూమిమీద పాపపుణ్య విచక్షణ ఆ చెట్టువలన తెలుసుకోవచ్చు." అంటూవిత్తనం తెప్పించి యిచ్చాడు. నేను తిలోత్తమ సంగతి గుర్తు చేశాను.

ఇంద్రు డామెను రప్పించి – "తిలోత్తమా! నిన్ను నిష్కారణంగా నిందించాను. నీమాటలలో అబద్ధమేమీలేదు. నందుడు చెప్పింది నిజమే. ఈ రుచికుడు మనం లేనప్పుడు – అచ్చంగా నీలాగే ఉండే, నీపేరే కలిగిన భార్యతో కూడి యిక్కడికి వచ్చి క్రీడించాడట. ఆమెను చూసి యిక్కడివాళ్ళు నువ్వే అనుకున్నారు. ఈ రహస్యమంతా రుచికుడివల్ల తెలిసింది. బాధపడకు ఇతను నిన్ను చూడాలంటే రప్పించాను" అన్నాడింద్రుడు.

నేనామెను ప్రేమగా చూశాను.

ఆమెకూడా నన్ననురాగంతో చూస్తూ – ' ఆర్యా. నీకు నమస్కారం నన్ను రక్షించి నా పైనపడిన నిందను తొలగించారు ఇందుకు ప్రత్యుపకారం ఏమీ చేయలేను ఎప్పుడూ నీ నామం స్మరించుకుంటాను" అని అందరి ముందూ నన్ను పొగిడింది. నేను ఆమె మాటలు విని చాలా ఆశ్చర్యపోయాను ' – అని చెప్పి, "స్త్రీలెంత మాయలమారులో చూశావా? ' అన్నాడు రుచికుడు పరిహాసంగా.

అందుకు చంద్రలేఖ – ' నువ్విలా అనడం ఆశ్చర్యంగా ఉంది. ముల్లోకాలకీ ప్రభువైన ఇంద్రుడి కొలువులో బుద్ధిమంతులలో కెల్లా గొప్పవాడైన బృహస్పతి వింటూండగానే కట్టుకథలు చెప్పి నమ్మించిన మాయగాడవు నీ సాహసం ముందు తిలోత్తమ సాహసమేపాటిది? – సరే తరవాత కథ చెప్పు ' అంది నవ్వుతూ

ఉన్నదున్నట్లు యదార్ధము చెప్పినందుకు నన్ను నీవింతగా పొగడాలా? నీకూ నాభార్యకూ ఏమాత్రమూ తేడా లేదు నీసౌజన్యమువల్ల నన్ను పొగడుతున్నావంతే" అన్నాను నేను

అంతలో ఇంద్రుడు – ' నువ్వు పోవలసిన తావు చెప్పు దూతనిచ్చి పంపుతాను తిలోత్తమా! నువ్విక యింటికిపో" అన్నాడు తిలోత్తమ నాప్రాణాలన్నీ నీమీదే ఉంచుతున్నానన్నట్లు నావేపు చూసి – వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళింది.

నేను చాలా ఆలోచించి – "దేవా! భూలోకంలో నాకు గౌతముడనే ప్రాణ మిత్రుడున్నాడు వాడిప్పు డెక్కడున్నాడో నన్నక్కడ వదలమని మీ దూతలకు చెప్పండి ' అన్నాను

ఇంద్రుడు బృహస్పతి నడిగితెలుసుకుని – నన్ను కళ్ళు మూసుకోమని – క్షణాలలో నన్ను ఢిల్లీ నగరంలో ఒక ఇంటిముందు వదిలేసేలా చేశాడు

ఆ ఇంటిలో నుండి గౌతముడు బయటకు రాగానే నేనువాడిని కౌగలించుకున్నాను అతనాశ్చర్యపోతూంటే నేను పేరు చెప్పాను కొంతసేపు మాకథ లొకరి కొకరికి చెప్పుకుని – మావూరు పోదామని

నిశ్చయించుకుని - మాదేశంపోతూ యీవూరు చేరాం తరువాతకథ మీకు తెలిసిందే. దైవానుగ్రహంవల్ల ప్రాణానికి ప్రాణాలయిన మిమ్మ ల్నందరినీ యిక్కడ కలుసుకున్నాను" అన్నరుచికుడి అదృష్టాన్నందరూ పొగిడారు

చంద్రలేఖ - "చెరకు తిన్ననోటికి బెండు సహించనట్లు దేవకాంతతో రతి సౌఖ్యం అనుభవించిన మీకు మాలాటి మానవకాంత యందు మక్కువేముంటుంది? ఆ తిలోత్తమ నిన్నిక్కడుండనిస్తుందా? మళ్ళీ ఎప్పుడో స్వర్గానికి తీసుకుపోతుంది మేము నీకోసం ఎన్నో కష్టాలు పడ్డాము అంది.

రుచికు డామెకు నచ్చజెబుతూ - "ఎప్పుడూ అలా అనుకోకు. మీరు రూపంలో దేవకాంతలను మించినవారు అదీకాక మానవులకి మానవకాంతలు భార్యలైతేనే భావ్యంగా ఉంటుంది తిలోత్తమ నన్నెప్పుడూ స్వర్గానికి తీసుకెళ్ళదు స్వర్గానికెళ్ళడం సామాన్యం కాదు అప్పుడంటే యుద్ధ సమయం కనక అలాకుదిరింది ఇంద్రుడి అనుమతి లేకుండా అక్కడ గాలయినా కదలదు ఇంకెప్పుడూ మిమ్మల్ని వదలనని ప్రమాణం చేస్తున్నాను మీరు నాకోసం పడిన కష్టాలను తలుచుకుంటూంటే చాలా బాధగా ఉంది. అంటూ వాళ్ళిద్దరినీ కౌగలించుకున్నాడు

తరువాత - విజ్ఞాన యోగిగా ఉన్న తన తండ్రి నక్కడికి రప్పించుకుని అతనికి తన వృత్తాంతమంతా చెప్పి ఆనందం కలగచేసాడు చంద్రలేఖ - రుక్మాంగదునకు తన వృత్తాంతం చెప్పి ఆశ్చర్యపరచి నిదర్శనంగా తాను ధరించే దుస్తులు చూబించింది

రుక్మాంగదుడు వారిని తన దేశంలో ఉండమని ఎంత బతిమాలినా, రుచికుడు తండ్రి మాట ప్రకారం జగన్నాథంలో ఉండడానికే నిశ్చయించుకున్నాడు అతను వారందరికీ చాలాకానుక లిచ్చి - చంద్రలేఖకు, కూతురికిలాగ కొన్నిగ్రామాలు అరణంగా యిచ్చి, అప్పుడప్పుడక్కడికి వొచ్చేట ట్లామెనుండి మాటతీసుకున్నాడు

రుచికుడు చంద్రలేఖనీ, తిలోత్తమనీ గాంధర్వవివాహం ద్వారా భార్యలుగా స్వీకరించి – వారందరితో రామచంద్ర నగరానికిపోయి --- కూతురు కనపడక బెంగతో క్రుంగుతున్న శూరసేన మహారాజుకి తమరాక చెప్పి, సంతోషం కలిగించి, కొన్నాళ్ళక్కడున్నాడు.

శూరసేనుడికి కొడుకులు లేరుకాబట్టి తన రాజ్యానికి రుచికుడినే రాజుగా చేశాడు. తనకి రాజ్యం వచ్చిన తక్షణమే గౌతముడికి మంత్రిపదవిచ్చి, అతనికికూడా చక్కనికన్యతో వివాహం జరిపించాడు.

రుచికుడు స్వర్గంనుంచి తెచ్చిన సంగీతవృక్ష బీజాన్ని శ్రీజగన్నాథంలో గుడి ఆవరణలో పాతించాలని యిద్దరు భార్యలతోనూ వెళ్తూ – మధ్యలో – నువ్వు చూసిన చోట బసచేశారు.

మర్నాడు బయలుదేరబోతూ...ఆ విత్తనం చిన్నది కనుక సవరించబోగా చేయిజారి నేలనపడింది. దానికోసం ఎంత వెదికినా ఎన్నిప్రయత్నాలు చేసినా మరి కనపడలేదు.

రుచికు డప్పుడక్కడే నీళ్ళు జల్లించి చేయవలసినదంతా చేశాడు. ఆ విత్తనం మొలకెత్తి పెరిగి వృక్షమైంది. రుచికుడక్కడే మంచిమేడలు కట్టించి ఏడాది కారునెలలుఇద్దరి భార్యలతోనూ వచ్చి అక్కడుండేవాడు. అతను చాలాకాలం పరిపాలించాడు.

గోపా! నీకు వినపడిన సంగీతం ఆ వృక్షానిదే. పుణ్యాత్ముడివి కనుక నీకా సంగీతం వినపడింది. ఆ వృక్షం నాటి ఎన్నో సంవత్సరాలయింది. దాని గురించి తెలిసిన వారెవరూ యిప్పుడు లేరు. మణిమహిమచే నాకు తెలిసింది “అని ముగించాడు మణిసిద్ధుడు.

“మీ దయుండగా నాకు పాపాలంటుతాయా? ఈ కథ చాలాబాగుంది” అంటూ కావడి భుజానికెత్తుకుని – గోపాలుడు గురువువెంట నడవసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 16. వ మజిలీ

అదొక గొప్ప పట్నం. అక్కడి సత్రం చాలా విశాలంగా ఉంది.

స్వామి వారు స్నానం చేసి జపం చేసుకుందుకు కూర్చోగానే శౌనకుడు (గోపాలుడికి గురువు పెట్టినపేరు) పట్నంలోనివిశేషాలు చూడడానికి వెళ్ళాడు

బజారు చాలా పెద్దది. అక్కడ చాలా వస్తువులున్నాయి. అవన్నీ చూసుకుంటూ – యింకా ముందుకి వెళ్ళాడు.

పట్నపు కోటకనిపించింది. దానిగోడ చాలా ఎత్తుగానూ పొడవుగాను ఉండడంతో దానిచుట్టూ తిరిగి రావాలనిపించింది. అతను కోటద్వారం దగ్గరికి రావడానికే చాలా సమయం పట్టింది. అక్కడి వింతలు అతనికెంతో ఆశ్చర్యం కలిగించాయి.

ఒకచోట మంటపంలో అడ్డంగా వేసిన దూలానికి తలకిందులుగా యిద్దరిని ఇనుపగొలుసులతో వేలాడగట్టి ఉంచారు. వాళ్ళనలా వేలాడదీసి చాలా కాలమైనా వాళ్ళు చచ్చిపోకుండా బతికున్నట్లు ఉన్నారు.

వారి పక్కనున్న రాతిపలకమీద – "దుర్జనులకు బుద్ధివచ్చుపని" అని రాయబడిఉంది.

గోపాలుడక్కడి వారిని – "వాళ్ళెవరు? ఏంతప్పు చేశారని వాళ్ళనలా వేలాడగట్టారు?" అని అడిగాడు. కాని – చెప్పిన వారెవళ్ళూ లేకపోయారు.

గోపాలుడు వేగంగా సత్రానికి పోయి భోజనం చేసి, తనకోసం ఎదురు చూస్తున్న మణిసిద్ధునకు నమస్కరించి ఎదురుగా నిలబడ్డాడు.

యతి కోపం నటిస్తూనే చిరునవ్వుతో – "గోపా! నీకు బొత్తిగా భయం లేకుండా పోతూంది. నీకోసం ఎంతసేపని చూడాలి? ఎక్కడికి పోయావ్? భోజనం మాట మరచి పోయావా? ఏదో ఓ గొడవపెట్టు కుంటావు. ఊ. ..ఇవాళేం వింత చూశావు?...లే" అన్నాడు.

వాడు సిగ్గుతో నవ్వుతూ "స్వామీ! నేను మీవెంట వచ్చింది భోజనానికి కాదు. దేశవిశేషాలు చూడడానికి కదా. మరి అవి చూడకేం చేస్తాను? – " అన్నాడు.

సిద్ధుడు వాడివేపు చూశాడు.

వాడు – "ఈ పట్నం చాలా పెద్దది సుమండీ. అంగట్లో ఎన్ని విశేషాలు చూశానో! ఇక్కడున్న కోటంత పెద్దది మన మింత వరకూ ఎక్కడా చూడలేదు ఆ కోటముందు ఇద్దరు పురుషులని యినప గొలుసులతో తలకిందులుగా వేలాడ కట్టారు. అది దుర్జనులకు బుద్ధివచ్చుపనిట. వాళ్ళేనాడో చచ్చిపోయినా వాళ్ళ శరీరాలు కుళ్ళి చెడిపోక అలాగే ఎలా ఉన్నాయి? –

ఈ రోజు నేను చూసిన విశేషాలలో అదే పెద్దది. నామీద కోప్పడకండి. దీని వెనకకథేమిటో విన్నాకకాని నాకు అన్నంసహించదు" అంటూ ఆయన పాదాల మీద పడి దీనంగా వేడుకున్నాడు.

యతి నవ్వుతూ వాడిని లేవనెత్తి – "నువ్వు ఆలస్యం చేసినప్పుడే అనుకున్నాను – ఏదో గొడవ తెస్తావని నేనెక్కడికీ పోను. భోజనం చెయ్యి. సావకాశంగా చెప్పుకుందాం ఆకలికడుపు మీద సరిగా అర్థం కాదు. నువ్వు అన్నంతినేలోగా నేను మణిని ధ్యానించి ఆకథేమిటో తెలుసుకుంటాను" అని వాడిని బుజ్జగించి అన్నానికి కూర్చోబెట్టాడు. వాడి భోజనమయ్యాక కథ చెప్పసాగాడు.

# ధర్మపాలుడి కథ

పూర్వం మాళవదేశాన్ని ధర్మపాలుడనే రాజు పాలించేవాడు. అతని రాజధాని కౌశాంబిపట్నం. అతనికి విహారభద్రుడు, విజయకేతుడు అనే యిద్దరు మంత్రులు. అతని భార్య పేరు సునంద. ఆమె అందమైనదే కాక పతిభక్తి కలదికూడా. భర్తపట్ల వినయవిశ్వాసాలు కలిగి ఉండి చక్కగా సేవలు చేస్తూండేది.

ఒకనాడు నిండుసభలో – రాజు "రాజులకు దండనీతి తెలుసుకోవడం వల్ల ప్రయోజనమేమిటి?" అని అడిగాడు.

ముందుగా – రెండవమంత్రి విజయకేతుడు లేచి రాజుకి నమస్కరించి – తనకు ప్రభువు నందుకల వినయవిశ్వాసా లుట్టి పడేలా యిలా అన్నాడు.

"దేవా! అగ్నిసంస్కారం లేనిదే బంగారం ప్రకాశించదు. అలాగే నీతితెలియని వాని బుద్ధి బలం గుర్తింపు పొందదు. శాస్త్రం దివ్యనేత్రం. దండనీతి తెలిసిన రాజు కీర్తి ప్రతిష్టలు పొంది ప్రజలను చక్కగా పాలించి సుఖంగా రాజ్యం చేయగలడు."

రాజు ఆ సమాధానానికి సంతోషించి విహారభద్రుడి మొహం వేపు చూశాడు. అతను లేచి రాజుకుమొక్కి – "దేవా! దైవానుగ్రహం వల్ల కలిగిన ఐశ్వర్యానికి కూడా తామే కారకుల మంటూ డాంబికాలు పలికి ప్రభువులను భ్రమపెట్టి తమప్రయోజనాలు నెరవేర్చుకునేవారు, కొందరు. యోగులమని చెప్పుకుంటూ ఆశాపాశం వదలలేరు కొందరు. సామాన్యుడినైనా చక్రవర్తిని చేయగలమని డంబాలు పలికేవారు కొందరు. శస్త్రాలు లేకుండానే శత్రువులను జయించ గలమంటూ రింకొందరు. ఇలాగ డాంబికాలు పలికి రాజును నమ్మించి తమ కనుకూలంగా చేయించుకుంటారు.

ఇప్పుడు విజయకేతుడు చెప్పిన దండనీతి అలాటిదే. వివరంగా చెప్తాను.' వినండి.

"రాజ్యవిద్య నాలుగువిధాలు. వానిలో దండనీతి నాలుగోది." దానిని విష్ణుగుప్తుడు ఆరువేల శ్లోకాలుగా రచించాడు. దానర్థం చేసుకోవాలంటే శబ్దశాస్త్రం చదవాలి. అవన్నీ చదివేసరికి ముసలితనం వొచ్చేస్తుంది. ఇక రాజ్యపాల నెప్పుడు? సుఖపడే దెప్పుడు?

రాజకుమారుడు ఉదయం లేచి దంతధావనం చేసి - ప్రథమభాగంలో ఆదాయ వ్యయాలు తెలుసుకోవాలి. రెండోభాగంలో ప్రజల కలహాలు తీర్చాలి. మూడోభాగంలో వీరభటుల దిగ్విజయ యాత్రావిశేషాలు వినాలి. స్నానభోజనాదులు కానివ్వాలిఅంటూ రోజంతా ఎలాగడపమని చెప్పారో వివరించి – "ఇలాగ రోజంతా గడిపే వాడికి సుఖమేముంటుంది? రాజ్యాన్నేం రక్షించుకుంటాడు? కనుక యథేచ్ఛగా సుఖాలనుభవించ వలసిందే. అరిషడ్వర్గాన్ని జయించాలి, సుఖమందిచ్ఛ ఉండకూడదని ఉపదేశించే పండితులు దివాణంలో సంపాదించింది వేశ్యల పాలు చేస్తారు. కనుక వెర్రిమాటలు నమ్మి విద్యాభ్యాస ప్రయాసకుపోకు. రాజ్యభారమంతా సమర్థుడైన మంత్రిపై ఉంచి అప్సరసలలాటి అంతఃపురస్త్రీలతో క్రీడిస్తూ సంగీత, పాన, గోష్ఠులతో శరీరాన్ని సార్థకం చేసుకో" అన్నాడు.

మంత్రులిద్దరూ యిలా చెప్పేసరికి "ఓహో! మీరు నాకు హితోపదేశం చేశారు కనుక గురువులయ్యారు. మీమాటలు వినడంవరకూ బాగానే ఉన్నాయి" అని సభచాలించి అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

కపటుడైన విహారభద్రుడు నిరంతరమూ రాజుకి బోధచేస్తూ క్రమంగా అతన్ని లోబరుచుకున్నాడు. రాజు వ్యవహారాలన్నీ అతనిమీదే ఉంచి విజయకేతుణ్ణి గౌరవించడం మానేసి తాను అంతఃపురంలో సుఖిస్తూ ఉండిపోసాగాడు.

విజయకేతుడు – " ఈరాజుపూర్వంలా ఉండడంలేదు. విహారభద్రుడి మాటలతో మోసపోయి మూర్ఖుడై పోతున్నాడు. నాతో

# ధర్మపాలుడి కథ

పూర్వం మాళవదేశాన్ని దర్మపాలుడనే రాజు పాలించేవాడు. అతని రాజధాని కౌశాంబిపట్నం. అతనికి విహారభద్రుడు, విజయకేతుడు అనే యిద్దరు మంత్రులు. అతని భార్య పేరు సునంద. ఆమె అందమైనదే కాక పతిభక్తి కలదికూడా. భర్తపట్ల వినయవిశ్వాసాలు కలిగి ఉండి చక్కగా సేవలు చేస్తూండేది.

ఒకనాడు నిండుసభలో – రాజు "రాజులకు దండనీతి తెలుసుకోవడం వల్ల ప్రయోజనమేమిటి?" అని అడిగాడు.

ముందుగా – రెండవమంత్రి విజయకేతుడు లేచి రాజుకి నమస్కరించి – తనకు ప్రభువు నందుకల వినయవిశ్వాసా లుట్టి పడేలా యిలా అన్నాడు.

"దేవా! అగ్నిసంస్కారం లేనిదే బంగారం ప్రకాశించదు. అలాగే నీతితెలియని వాని బుద్ధి బలం గుర్తింపు పొందదు. శాస్త్రం దివ్యనేత్రం. దండనీతి తెలిసిన రాజు కీర్తి ప్రతిష్టలు పొంది ప్రజలను చక్కగా పాలించి సుఖంగా రాజ్యం చేయగలడు."

రాజు ఆ సమాధానానికి సంతోషించి విహారభద్రుడి మొహం వేపు చూశాడు. అతను లేచి రాజుకుమొక్కి – "దేవా! దైవానుగ్రహం వల్ల కలిగిన ఐశ్వర్యానికి కూడా తామే కారకుల మంటూ డాంబికాలు పలికి ప్రభువులను భ్రమపెట్టి తమప్రయోజనాలు నెరవేర్చుకునేవారు, కొందరు. యోగులమని చెప్పుకుంటూ ఆశాపాశం వదలలేరు కొందరు. సామాన్యుడినైనా చక్రవర్తిని చేయగలమని డంబాలు పలికేవారు కొందరు. శస్త్రాలు లేకుండానే శత్రువులను జయించ గలమంటా రింకొందరు. ఇలాగ డాంబికాలు పలికి రాజును నమ్మించి తమ కనుకూలంగా చేయించుకుంటారు.

ఇప్పుడు విజయకేతుడు చెప్పిన దండనీతి అలాటిదే. వివరంగా చెప్తాను.' వినండి.

"రాజ్యవిద్య నాలుగువిధాలు వానిలో దండనీతి నాలుగోది." దానిని విష్ణుగుప్తుడు ఆరువేల శ్లోకాలుగా రచించాడు. దానర్థం చేసుకోవాలంటే శబ్దశాస్త్రం చదవాలి అవన్నీ చదివేసరికి ముసలితనం వొచ్చేస్తుంది. ఇక రాజ్యపాల నెప్పుడు? సుఖపడే దెప్పుడు?

రాజకుమారుడు ఉదయం లేచి దంతధావనం చేసి - ప్రధమభాగంలో ఆదాయ వ్యయాలు తెలుసుకోవాలి. రెండోభాగంలో ప్రజల కలహాలు తీర్చాలి. మూడోభాగంలో వీరభటుల దిగ్విజయ యాత్రావిశేషాలు వినాలి. స్నానభోజనాదులు కానివ్వాలిఅంటూ రోజంతా ఎలాగడపమని చెప్పారో వివరించి - "ఇలాగ రోజంతా గడిపే వాడికి సుఖమేముంటుంది? రాజ్యాన్నేం రక్షించుకుంటాడు? కనుక యధేచ్ఛగా సుఖాలనుభవించ వలసిందే. అరిషడ్వర్గాన్ని జయించాలి, సుఖమందిచ్చ ఉండకూడదని ఉపదేశించే పండితులు దివాణంలో సంపాదించింది వేశ్యల పాలు చేస్తారు. కనుక వెర్రిమాటలు నమ్మి విద్యాభ్యాస ప్రయాసకుపోకు. రాజ్యభారమంతా సమర్ధుడైన మంత్రిపై ఉంచి అప్సరసలలాటి అంతఃపురస్త్రీలతో క్రీడిస్తూ సంగీత, పాన, గోష్టులతో శరీరాన్ని సార్ధకం చేసుకో" అన్నాడు.

మంత్రులిద్దరూ యిలా చెప్పేసరికి "ఓహో. మీరు నాకు హితోపదేశం చేశారు కనుక గురువులయ్యారు మీమాటలు వినడంవరకూ బాగానే ఉన్నాయి" అని సభచాలించి అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

కపటుడైన విహారభద్రుడు నిరంతరమూ రాజుకి బోధచేస్తూ క్రమంగా అతన్ని లోబరుచుకున్నాడు. రాజు వ్యవహారాలన్నీ అతనిమీదే ఉంచి విజయకేతుణ్ని గౌరవించడం మానేసి తాను అంతఃపురంలో సుఖిస్తూ ఉండిపోసాగాడు.

విజయకేతుడు - " ఈరాజుపూర్వంలా ఉండడంలేదు విహారభద్రుడి మాటలతో మోసపోయి మూర్ఖుడై పోతున్నాడు నాతో

నవ్వుతూ మాట్లాడదు. కన్నెత్తిచూడడు. రహస్యాలు చెప్పడు. మంచిపనులకి మానేసి నీచపు పనులకు నియోగిస్తున్నాడు. నా యెగక్షేమా లడగడు. నేనెదురుగా ఉన్నా మరొకరితో మాట్లాడతాడు " అప్రియమైన నిజాన్ని చెప్తే వినేవారెవరు? ఇతని రాజ్యం స్వల్పకాలంలోనే శత్రువుల అధీనమౌతుంది నేనేం చేయగలను? ఆశ్రయించిన దివాణం వదలి పోడానికి మనస్కరించదు, కానీ. మూగవాడిలా చెవిటివాడిలా గుడ్డివాడిలా కాలం గడుపుతాను అని నిశ్చయించుకున్నాడు.

ధర్మపాలుడు కామవశుడై రాజ్యాన్ని పూర్తిగా మంత్రి కప్పగించేసి తాను ఏ మాత్రమూ పట్టించుకోడం మానేశాడు.

ఒకనాడు - చోళదేశపు రాజు యొక్క మంత్రి కొడుకు - దుర్వినీతుడనే వాడు కొంతమంది రహస్య వ్యక్తులతో వచ్చి - చిత్రవిచిత్రా లయిన క్రీడలచేత విహారభద్రుణ్ణి వశం చేసుకున్నాడు. విహారభద్రుడు ఒకనాడు దుర్వినీతుణ్ణి వెంటబెట్టుకుని రాజసభకు వచ్చి అతన్ని చూబిస్తూ - అతని గురించి కొంత చెప్పి "రాజుతో ద్వేషించి ఎక్కడేనా కొలువు చేద్దామని వచ్చాడు. మన కారాజు శత్రువుకదా? శత్రువుయొక్క శత్రువు మిత్రు డౌతాడు. ఇతని కనేక విద్యలందు నేర్పుంది. ఇతనికి మన ఆస్థానంలో తగిన ఉద్యోగమిప్పించండి" అన్నాడు.

అప్పుడు విజయకేతు డూరుకోలేక - "నరేంద్రా! మీరు నన్నడక్కపోయినా, దివాణం మీదకల విశ్వాసం ఊరుకోనివ్వడం లేదు. ఇతను మన శత్రువైన చోళరాజుగారి మంత్రి పుత్రుడు. అలాటివాడిని పరీక్షించకుండా లోపలికి రానివ్వొచ్చునా? ఉద్యోగ నెపంతో కొన్నాళ్ళుండి కోట రహస్యాలన్నీ తెలుసుకువెళ్తే మనమేం చెయ్యగలం? నీతిశాస్త్రంలో - శత్రుపక్షం వాడొస్తే వాడిని పట్టుకుని బందీగృహంలో ఉంచాలని చెప్పబడింది. ఇతనిని విడచిపెట్టకూడదు" అన్నాడు

"ఓహో! అక్కడికి తను రాజు క్షేమంకోరేవాడూ, మనమంతా కానివారమూ కాబోలు. నేను చేయబోయే పనిని కాదనడం వీరికి సహజం. అందువల్ల నేనేమీ చెడిపోను. మనగుట్టు తెలుసుకుందుకితను

రావాలా? కోట ముట్టడించినప్పుడు గుట్టు నిలుస్తుందా? ఐనా యిక దీనిమీద ఆలోచనలూ వాదాలూ అనవసరం. నేనతని కభయమిచ్చాను కనుక ఆశ్రయమిచ్చి తీరవలసిందే. ఇతన్నుంచే శత్రువుల గుట్టు లాగవచ్చు" అనేసరికి రాజు యింకేమీ చెయ్యలేక పెద్దమంత్రి మాటలకు అంగీకారం తెలిపి అంతఃపురానికి వెళ్ళిపోయాడు

అప్పుడు విహారభద్రుడు విజయకేతు ణ్ణాక్షేపిస్తూ దుర్వినీతుణ్ణి తనకు సహాయకుడిగా ఉండే ఉద్యోగమిచ్చేటట్లు చేశాడు. దుర్వినీతుడు క్రమంగా ఆ ఆస్థానంలో ప్రధానపాత్ర కెదిగి - రాజుకి సప్త వ్యసనాలే ఉత్తమాలని చెబుతూ అతని మనసులో స్థానం సంపాదించాడు

దేశంలో జూదం, చౌర్యం మొదలయిన వ్యసనాలెక్కువ కాసాగాయి. కామ ప్రవృత్తి సహజమే మందలించే వారు లేకపోడంతో బలవంతులు చిన్నవాళ్ళను దోచుకోసాగారు రాజ్యం క్షీణదశకు వస్తుంటే దుర్వినీతుడు సంతోషిస్తూ - తనదేశంతో రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలు నడపసాగాడు.

విజయకేతు దది తెలుసుకుని ఒక ఉత్తరాన్ని సంగ్రహించి రాజుకు చూపించి దుర్వినీతుడి కుట్రను తెలియజేశాడు. కాని అతని బోధ రాజు తలకెక్కలేదు

దుర్వినీతుడు పట్నంలో ఒక స్థలం సంపాదించి, దానిచుట్టూ ప్రహరీ కట్టించి రహస్యంగా దానిలోకి సేనలను చేర్చసాగాడు

విజయకేతుడది భరించలేక - పట్టమహిషైన సునంద కిలా తెలియజేసాడు.

"అమ్మా నీ భర్త విహారభద్రుడి దుర్బోధలకు లోనై రాజ్య వ్యవహారా లేమీ చూడడం లేదు. దేశభద్రత భ్రష్టమై పోతూంది దుర్వినీతుడు చోళదేశం నుంచి సైన్యాన్ని రప్పిస్తున్నాడు ఎప్పుడో హఠాత్తుగా కోటని ముట్టడిస్తాడు. రాజ్యహానే కాక మానహాని కూడా సంభవించవచ్చు ఈ దుర్వినీతుడు చోళదేశపు రాజుయొక్క మంత్రికొడుకు. ఈ విషయాలు నేను చెప్పినా రాజు వినిపించుకోడు.

నవ్వుతూ మాట్లాడడు కన్నెత్తిచూడడు. రహస్యాలు చెప్పడు. మంచిపనులకి మానేసి నీచపు పనులకు నియోగిస్తున్నాడు. నా యోగక్షేమా లడగడు. నేనెదురుగా ఉన్నా మరొకరితో మాట్లాడతాడు " అప్రియమైన నిజాన్ని చెప్తే వినేవారెవరు? ఇతని రాజ్యం స్వల్పకాలంలోనే శత్రువుల అధీనమౌతుంది నేనేం చేయగలను? ఆశ్రయించిన దివాణం వదలి పోడానికి మనస్కరించదు, కానీ. మూగవాడిలా చెవిటివాడిలా గుడ్డివాడిలా కాలం గడుపుతాను. అని నిశ్చయించుకున్నాడు.

ధర్మపాలుడు కామవశుడై రాజ్యాన్ని పూర్తిగా మంత్రి కప్పగించేసి తాను ఏ మాత్రమూ పట్టించుకోడం మానేశాడు.

ఒకనాడు - చోళదేశపు రాజు యొక్క మంత్రి కొడుకు - దుర్వినీతుడనే వాడు కొంతమంది రహస్య వ్యక్తులతో వచ్చి - చిత్రవిచిత్రా లయిన క్రీడలచేత విహారభద్రుణ్ణి వశం చేసుకున్నాడు. విహారభద్రుడు ఒకనాడు దుర్వినీతుణ్ణి వెంటబెట్టుకుని రాజసభకు వచ్చి అతన్ని చూపిస్తూ - అతని గురించి కొంత చెప్పి "రాజుతో ద్వేషించి ఎక్కడేనా కొలువు చేద్దామని వచ్చాడు. మన కారాజు శత్రువుకదా? శత్రువుయొక్క శత్రువు మిత్రు డౌతాడు ఇతని కనేక విద్యలందు నేర్పుంది. ఇతనికి మన ఆస్థానంలో తగిన ఉద్యోగమిప్పించండి" అన్నాడు.

అప్పుడు విజయకేతు దూరుకోలేక - "నరేంద్రా! మీరు నన్నడక్కపోయినా, దివాణం మీదకల విశ్వాసం ఊరుకోనివ్వడం లేదు. ఇతను మన శత్రువైన చోళరాజుగారి మంత్రి పుత్రుడు. అలాటివాడిని పరీక్షించకుండా లోపలికి రానివ్వొచ్చునా? ఉద్యోగ నెపంతో కొన్నాళ్ళుండి కోట రహస్యాలన్నీ తెలుసుకువెళ్తే మనమేం చెయ్యగలం? నీతిశాస్త్రంలో - శత్రుపక్షం వాడొస్తే వాడిని పట్టుకుని బందీగృహంలో ఉంచాలని చెప్పబడింది. ఇతనిని విడచిపెట్టకూడదు" అన్నాడు

"ఓహో. అక్కడికి తను రాజు క్షేమంకోరేవాడూ, మనమంతా కానివారమూ కాబోలు. నేను చేయబోయే పనిని కాదనడం వీరికి సహజం. అందువల్ల నేనేమీ చెడిపోను. మనగుట్టు తెలుసుకుందుకితను

రావాలా? కోట ముట్టడించినప్పుడు గుట్టు నిలుస్తుందా? ఐనా యిక దీనిమీద ఆలోచనలూ వాదాలూ అనవసరం. నేనతని కభయమిచ్చాను కనుక ఆశ్రయమిచ్చి తీరవలసిందే. ఇతన్నుంచే శత్రువుల గుట్టు లాగవచ్చు" అనేసరికి రాజు యింకేమీ చెయ్యలేక పెద్దమంత్రి మాటలకు అంగీకారం తెలిపి అంతఃపురానికి వెళ్ళిపోయాడు.

అప్పుడు విహారభద్రుడు విజయకేతు ణ్ణాక్షేపిస్తూ దుర్వినీతుణ్ణి తనకు సహాయకుడిగా ఉండే ఉద్యోగమిచ్చేటట్లు చేశాడు. దుర్వినీతుడు క్రమంగా ఆ ఆస్థానంలో ప్రదానపాత్ర కెదిగి – రాజుకి సప్త వ్యసనాలే ఉత్తమాలని చెబుతూ అతని మనసులో స్థానం సంపాదించాడు

దేశంలో జూదం చౌర్యం మొదలయిన వ్యసనాలెక్కువ కాసాగాయి. కామ ప్రవృత్తి సహజమే మందలించే వారు లేకపోడంతో బలవంతులు చిన్నవాళ్ళను దోచుకోసాగారు. రాజ్యం క్షీణదశకు వస్తుంటే దుర్వినీతుడు సంతోషిస్తూ – తనదేశంతో రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలు నడపసాగాడు.

విజయకేతు దది తెలుసుకుని ఒక ఉత్తరాన్ని సంగ్రహించి రాజుకు చూపించి దుర్వినీతుడి కుట్రను తెలియజేశాడు. కాని అతని బోధ రాజు తలకెక్కలేదు

దుర్వినీతుడు పట్నంలో ఒక స్థలం సంపాదించి, దానిచుట్టూ ప్రహరీ కట్టించి రహస్యంగా దానిలోకి సేనలను చేర్చసాగాడు

విజయకేతుడది భరించలేక – పట్టమహిషైన సునంద కిలా తెలియజేసాడు.

"అమ్మా నీ భర్త విహారభద్రుడి దుర్బోధలకు లోనై రాజ్య వ్యవహారా లేమీ చూడడం లేదు. దేశభద్రత భ్రష్టమై పోతూంది. దుర్వినీతుడు చోళదేశం నుంచి సైన్యాన్ని రప్పిస్తున్నాడు ఎప్పుడో హఠాత్తుగా కోటని ముట్టడిస్తాడు. రాజ్యహానే కాక మానహాని కూడా సంభవించవచ్చు. ఈ దుర్వినీతుడు చోళదేశపు రాజుయొక్క మంత్రికొడుకు ఈ విషయాలు నేను చెప్పినా రాజు వినిపించుకోడు

నామాటిద్దరూ వినరు. పట్టమహిషివి కనుక నీకు తెలియజేస్తున్నాను. దుర్వినీతుడి ఇల్లు పరీక్షిస్తే శత్రుసేనలు కనపడతాయి. నువ్వుకూడా అశ్రద్ధ చేస్తే శత్రువులొచ్చి మీద పడతారు ముందే జాగ్రత్త పడడం మంచిది."

దాసీతో ఆ ఉత్తరాన్ని పట్టమహిషికి పంపాడు

సునంద ఆ ఉత్తరం చదివింది. విజయకేతుని మంచితనం ఆవిడ యిదివరకే విని ఉంది. కనుక ఆరాత్రంతా దర్మపాలుడికి నీతిబోధ చేసి రాజు కంతకు పూర్వం కలిగిన దుర్బుద్ధంతా పోగొట్టి విహారభద్రుడి యందసహ్యాము, విజయకేతుడి యందు యిష్టమూ కలుగు నట్లతని మనసు మార్చింది.

మర్నాడు రాజు సభకు వచ్చి మంత్రు లందరినీ రప్పించి - "దేశపరిస్థితి ఎలా ఉంది?" అని అడిగాడు.

విహారభద్రుడు మునపటిలాగే ఏదో చెప్పబోయాడు

రాజతన్ని వినిపించుకోక విజయకేతుడి ముఖం చూస్తూ - "పట్నమంతా చూడాలి. గుర్రాన్ని సిద్ధం చేయించు." అన్నాడు.

సునంద అతనికి వాస్తవం తెలియజెపి మనసు మార్చినందుకు విజయకేతుడు చాలా సంతోషించాడు. మంచి గుర్రానికి జీను కట్టించి సిద్ధంగా ఉంచాడు.

దుర్వినీతుడిని వెంటరమ్మని కొంతసేపు పట్నం వీధుల్లో తిరిగి - "దుర్వినీతుని ఇల్లెక్కడ?" అని అడిగాడు రాజు.

అతను భయపడుతూ తన ఇల్లుకాక మరోఇల్లు చూపించాడు.

రాజు వినయకేతుడి ముఖంలోకి చూశాడు.

వినయకేతుడది గ్రహించి "ఇది అతనిది కాదు, వేరొకరిది. కొన్నాళ్ళకిందటిందులో కొన్ని రోజులున్నాడు. కాని యిప్పుడు వేరొక చోట గొప్ప భవనం కట్టించాడు. చూపిస్తాను రండి" అని ఆ భవనానికి తీసుకువెళ్ళాడు.

మరో కోటలాగే ఉన్న ఆ భవనాన్ని చూసి రాజు ఆశ్చర్య పోయాడు. విహారభద్రుణ్ణి చూసి కళ్ళెర్రజేస్తూ – గుర్రం దిగి – తలుపులు తెరవమని దుర్వినీతు ణ్ణాజ్ఞాపించాడు

అతను తడబడుతూ – "దీనితాళం చెవి నాదగ్గరలేదు. దీనిలో ఎవరూ లేరు" అనగానే తాళం విడగొట్టించి తలుపులు తీయించాడు రాజు. లోపల నాలుగైదువేల మంది ఆయుధాలతో ఉన్నారు.

వాళ్ళని చూసి రాజుకి భయం, కోపం, ఆశ్చర్యంవేసి – "ఈ సైన్యమెవరిది?" అని అడుగ్గా

"దేవరవారిదే" అన్నాడు దుర్వినీతుడు.

ఆ మాట విని రాజు వెంటనే తలుపులు వేయించమని ఆజ్ఞాపించాడు. అప్పుడు దుర్వినీతుడు అడ్డంగా నిలబడి సైన్యానికేదో సౌజ్ఞచేయగా వాళ్ళు ఆయుధాలు సవరించుకోసాగారు. అదిచూసి విజయకేతుడు తొందరగా రాజభటులచేత బలాత్కారంగా తలుపులు మూయించబోగా వారు ద్వారంలో ఉన్న దుర్వినీతుణ్ణి కూడా లోపలికి తోసి తలుపులు మూసేసారు.

అప్పుడు రాజు విహారభద్రుని వేపు చూసి – "దుర్వినీతుని అవినీతంతా తెలిసిందా? ఇదంతా నీ వల్లే వచ్చింది. నిన్నేంచేసినా పాపంలేదు. ఇప్పుడొచ్చిన ఉపద్రవం దాటనీ, నీ సంగతి చూస్తాను" అని – విజయకేతుడి వేపు తిరిగి – "ఆర్యా! మనసేనలన్నీ ఎక్కడున్నాయి? వేగంగా సిద్ధం చేయించు ఇప్పుడు తప్పకుండా యుద్ధం జరుగుతుంది. ఇదంతా చోళదేశపు రాజయిన వసురక్షితుడి కపటోపాయంలా ఉంది. అతను మనకి సహజశత్రువు ఎలాగేనా మనని జయించాలని అతనికోరిక. ఇప్పుడు బలాలు కూర్చుకుని వస్తాడు. దీనిలోని సైన్యం అతనిది. ఇప్పుడు బయటకు రాకుండా ఏదేనా మార్గం అలోచించు. నువ్వు బుద్ధిమంతుడివి. వెనకటి కోపముంచుకోకు" అన్నాడు.

అందుకు విజయకేతుడు – 'నేనిప్పుడేం చేయాలి? సేనలెక్కడున్నాయో తెలియదు. ఈ లోపలవాళ్ళు బయటకొస్తే నిలవలేం.

కర్తవ్యమేమిటి?' అని ఆలోచిస్తూ - కొందరినక్కడ కాపలా ఉంచి - తక్షణమే పట్నమంతటా చాటింపు వేయించాడు

అప్పటికే సిద్ధంగా ఉన్న సైన్యం వచ్చి కోటముందు నిలిచింది. దానిలో కొంతసేనను దుర్వినీతు డింటి చుట్టూ ఉంచి - దేశంలో ఉన్న సేనకు కబురు పంపాడు

ఇంతలో చోళదేశరాజుకి వీరి బలహీనత తెలిసి అత్యధిక సైన్యంతో వూరు ముట్టడించి యుద్ధభేరీ వాయించాడు.

ఆ ధ్వని వినడంతోనే రాజు గుండెలు గుభేల్మన్నాయి.

కోట తలుపులుమూయించారు. బురుజులమీదా గోడలమీదా ఆయుదాలతో వీరులను నిలబెట్టారు. అలాగ సాధ్యమైనంతవరకూ వ్యూహం పన్నించి - విజయకేతుడు రాజుదగ్గరికి పోయి -

"వసురక్షితుడు చతురంగ బలాలతో వచ్చి నగరం ముట్టడించాడు. వారి సేనలో నాలుగోవంతయినా మనసేనలేదు. కోటను రక్షించడం కష్టంగా ఉంది వీలైనంత వరకూ పోరాడదాం కాని కోటలోని రహస్యమార్గం తలుపులు తీయించండి - ' అని చెప్పగా అతను చింతిస్తూ ఆ ఏర్పాటు చేయించాడు

అది చూసి అంతఃపురకాంతలు గొల్లుమని ఏడవసాగారు. అప్పటికి రాజుకి మూడేళ్ళ కొడు కున్నాడు. భార్య తొమ్మిది నెలల గర్భంతో ఉంది

వారు సిద్ధమవుతున్న సమయంలో రణభేరిధ్వనులు మరింత దగ్గరగా వినిపించాయి. శత్రుసైన్యం నగరంలో ప్రవేశించి కోటను ముట్టడించినట్లు తెలిసింది. రాజు, మంత్రి ఆయుధాలు ధరించి బురుజుల మీదకెక్కి శత్రుసైన్యాన్ని చూసి అధైర్యపడి, అంతలోనే ధైర్యంతెచ్చుకుని, శత్రువులు కోటదగ్గరకు రాకుండా కొంతసేపు ఆయుధాలు ప్రయోగించారు.

దుర్వినీతుడికి కోట గుట్లన్నీ తెలుసు కనుక వీరి రువురు లేని రెండోవేపున తుపాకులు కాల్పించాడు ఆ చప్పుళ్ళకు కోటలోని స్త్రీలు తల్లడిల్లి పోసాగారు రాజు, మంత్రికూడా వీలయినంతవరకూ తుపాకులు

కాలుస్తున్నారు. కాని సముద్రంలా చొచ్చుకువస్తున్న శత్రుసేనను అంతమొందించ లేకపోయారు.

శత్రుసైన్యం రెండోదారిని లోపల ప్రవేశిస్తూంటే, విజయకేతుడు విచారించి, రాజకుమారుడితో రాజపత్నిని రహస్యమార్గంలో కోట దాటించాడు. ఆ తొందరలో సునంద, రత్నావతి అనుదాదీ ఒకవేపూ, రాజకుమారుణ్నిఎత్తుకున్న నింబవతి అనే దాది మరో మరోవేపూ వెళ్ళారు. అందువల్ల ఒకరిజాడ మరొకరికి తెలియలేదు.

రెండవదారిన వచ్చిన శత్రుబలం కోటలో ప్రవేశించడం చూసినరాజు పారిపోవ డానికి ప్రయత్నించాడు. కాని దుర్వినీతుడు. భటులతో వొచ్చి అతన్ని పట్టుకున్నాడు.

రాజు దుర్వినీతుణ్ని చూసి – "దుర్మార్గుడా! యిలాటి ద్రోహం చేస్తావనుకోక నీ కుద్యోగమిచ్చి నందువలన కదా యిలాటి ఉపద్రవం తెచ్చిపెట్టివు. కానీ --- దేవుడు నీకు ఎప్పటికేనా ఆపదలు తెచ్చి పెట్టకపోతాడా? నువ్వుమాత్రం ఎల్లకాలం యిలాగే ఉండిపోతావా? మోసం చేసి హఠాత్తుగా వచ్చి జయించడం మగతనం కాదు. సమయముంటే నీ పౌరుషమెంతో చూసేవాడిని కానీ --- మాకిప్పుడు చెడ్డకాలం వచ్చింది. విజయకేతుడి మాటలు వినక విహారభద్రుని నమ్మినందుకు నాకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగింది" అంటూ ఎన్నో విధాలుగా నిందించాడు.

కాని, దుర్వినీతుడు దేనికీ సమాధానం చెప్పక రాజు కాళ్ళకీ చేతులకీ సంకెళ్ళు తగిలించి తీసుకుపోయాడు.

వసురక్షతుడి సేనలో జయజయ ధ్వానాలు చెలరేగాయి.

విజయకేతుడిని పట్టుకుందామని వారెన్నో ప్రయత్నాలు చేశారు. కాని అతనెక్కడా కనపడలేదు. వసురక్షితుడు దుర్వినీతుణ్ణి కొంతబలంతో ఆ కోటలో ఉండడానికి నియమించి తానూ, మంత్రీ ధర్మపాలుణ్ణి తీసుకుని బలగాలతో యింటికి పోయి అతన్నొక చెరసాలలో పెట్టించారు.

# అదృష్ట దీపుడి కథ

రాజపత్ని సునంద పుత్రుణ్ణి ఎత్తుకుని నింబవతి అనేదాది అరణ్యమార్గంలో వేగంగా పరుగెడుతూ - శత్రువులు వస్తున్నారేమో అని అప్పుడప్పుడు వెనక్కి చూసుకుంటూ - ఒక పగలు, ఒకరాత్రి నడచి సూర్యోదయం వేళ కొాక మహారణ్యంలోకి చేరింది.

ఏకధాటిగా నడచి నడచి అలసిపోవడంతో ఇక నడవలేక ఒకచెట్టు నీడలో - పిల్లవాణ్ణి పక్కనపెట్టుకుని అలసిపోయి పడుకుంది.

ఆమె పడుకున్న కొంతసేపటికి చెట్టు తొర్రలోంచి ఒక కృష్ణసర్పం వచ్చి ఆమెను కాటువేసి - పక్కన ఆడుకుంటున్న పసివాడి శిరస్సుపై పడగ పట్టి ఆడసాగింది. పాము విషం తలకెక్కి ఆ దాది వెంటనే మరణించింది. దాది ఎంతకీ లేవకపోడంతో ఆ బాలుడు గొంతెత్తి ఏడవసాగాడు.

ఆ ప్రాంతంలో పశువులని మేపుకుంటున్న గొల్లపిల్లలు ఆ ఏడుపువిని అక్కడికొచ్చి - పామునీ, పిల్లవాడినీ చూసి, కర్రలతో పాముని బెదిరించారు.

పాము కలుగులోకి దూరిపోయింది. నోటనుండి నురుగులు కక్కుతున్న నింబవతిని చూసి ఆమెచనిపోయిందని, గొల్లవాళ్ళా పిల్లవాణ్ణెత్తుకుని తమ పల్లెకుపోయి పెద్దవాళ్ళకా వృత్తాంతం అంతా చెప్పి పిల్లవాణ్ణి చూపించారు.

పెద్దగొల్లకి సంతానం లేదుకనుక తాను ఆ బాలుణ్ణి పెంచుకుంటానని చెప్పి తన ఇంట్లో పెట్టుకున్నాడు. పింగళికుడను పేరుగల ఆ గొల్లపెద్ద - వెన్న, మీగడలు పెడుతూ ఆ పిల్లాణ్ణి గారాబంగా పెంచసాగాడు ఆ పిల్లాడి కులగోత్ర నామాలెవరికి తెలియవు. తలపై సర్పం పడగనీడ పట్టిన వాడ దృష్టవంతు డౌతాడని విని ఉండడం వల్ల, పింగళికుని తల్లి ఆ పిల్లాడికి అదృష్టదీపుడని పేరు పెట్టింది. పిల్లాడు పెరగసాగాడు.

వాడి కైదేళ్ళువయసు రాగానే ఆ పల్లెలో ఉన్న బడిలో చదవవేశారు.

ఆ బడిలో చదువు చెప్పేవాడికి అక్షరాలు మాత్రం వచ్చు. అక్కడ అతనే మహాపండితుడు. అదృష్టదీపుడు తన గురువుకొచ్చిన విద్యను యిట్టే నేర్చేసుకుని - తనబుద్ధి బలంవల్ల క్రమక్రమంగా చదవడమూ రాయడమూ తెలుసుకున్నాడు.

వాడి కెనిమిదేళ్ళ వయసొచ్చింది. పింగళికుడు కొంతమంది పిల్లవాళ్ళని తోడిచ్చి - అడవికి పంపసాగాడు.

అదృష్టదీపుడు తోటి పిల్లలతో సాయంత్రం వరకూ పశువులని మేపి యింటికి వచ్చాక - రాత్రివేళ పింగళకుడి తల్లి ఆతనికి కథలు చెప్పేది. పండుముసలిదైన ఆమె - పూర్వరాజుల చరిత్రలు చెబుతూంటే అదృష్టదీపుడెంతో ఆసక్తిగా వినేవాడు.

అలాగ అత నడవిలో ఉన్నా లోక మర్యాదలన్నీ చక్కగా గ్రహించసాగాడు.

అతనికి పదిహేడేళ్ళు వొచ్చేసరికి - విశాలమైన కళ్ళు, విల్లులాటి కనుబొమలు, చక్కని చెక్కిళ్ళు, ఆజానుబాహువులు కలిగి చాలా అందంగా తయారయ్యాడు.

ఒకనాడు అతను తోటివారితో అడవికి వెళ్ళాక - 'మా అవ్వచెప్పే కథల బట్టి చూస్తూంటే, యీ భూమి మీద విచిత్రమైన పట్నాలు, గ్రామాలు, రాజులు, రథాలు, సేనలు, గుర్రాలు, మొదలైన వెన్నో ఉన్నాయని తెలుస్తూంది. కాని ఈ అడవిలో మాత్రం ఏమీ కనపడవు. భూమ్మీద ఒకడు సేవకుడుగా మరొకరు పాలకుడుగా ఉండడానికేం కారణమో? మనుష్యజాతి అంతా ఒకటేకదా? నేను పుట్టిన వారిని పోలక మరొకలా ఉండడానికి కారణమేమిటీ? పల్లెలో ఒక్కరూ నాలా ఉరడరు. సరే, నాబుద్ధి బలంతో ఈ వూరంతా నా అధికారానికి లోబడి ఉండేట్లు చేసుకుంటాను' అని ఆలోచించాడు

పిల్లల నందర్నీ పిలిచి - "మనంయిలా అడవిలో ఊరికే తిరగడమెందుకు? నేనోఉపాయం చెబుతాను. మీరంతా నేను చెప్పినట్లు నడుచుకుంటారా?" అని అడిగాడు. వాళ్ళు అలాగే అన్నారు.

"ఈ భూమిని పాలించే రాజొక డుంటాడు. అతనికి మంత్రీ భటులూ ఉంటారు. ఆ రాజు చక్కగా పరిపాలిస్తాడు. మనమూ అలాగే పాలించుకుందాం నేను రాజును మీరు మంత్రులు. వీరు పరిచారకులు. వీరు ప్రజలు. ఇలా ఈ అడవిలో ఆడుకుందాం. చాలా చిత్రంగా ఉంటుంది" అన్నాడు. వాళ్ళు చాలా సంతోషించారు

అప్పుడు ఒక విశాలమైన మర్రి చెట్టుక్రింద వాళ్ళ చేత చక్కగా బాగు చేయించి కర్రలతో ఎత్తుగా ఒక మంచెను - సింహాసనంలా కట్టించాడు. దానిచుట్టూ మంత్రులకూ, సామంతులకూ, లేఖకులకూ తగినట్లు కర్రతోనే ఆసనాలు కట్టించాడు. చుట్టూ ఆవరణ, ద్వారము, ద్వారపాలకులు మొదలైన లక్షణాలతో రాజ్యసభను ఏర్పరిచాడు. ఆ పిల్లలలో కొందరిని మంత్రులుగా, కొందరిని లేఖకులుగా, కొందరిని ప్రజలుగా వారి బుద్ధి బలం బట్టి నిర్ణయించి, తాను రాజుగా సింహాసనం మీద కూర్చుని వారు ఎలా ప్రవర్తించాలో చెబుతూ అదృష్టదీపుడా అడవిలో రాజ్యం చేయసాగాడు.

నిజమైన రాజుకు ప్రజలు జడిసినట్లు ఆ పిల్ల లతనికి భయపడుతూంటారు.

తానురాజుగా ఉండి, పరిచారకులలో రోజుకొకరిని పశువులని కాయడానికి నియోగిస్తూంటాడు. అందువల్ల మిగిలినందరికీ తీరుబడి ఉండేది.

నేరాలు విచారిస్తూ, శిక్షలువిధిస్తూ, ఉద్యోగాలిస్తూ, ధర్మం చెబుతూ, చట్టాలు చేస్తూ అదృష్టదీపుడు అసలయిన రాజులాగే రాజ్యం చేయసాగాడు. ప్రతిరోజూ ఉదయం వచ్చి సాయంకాలం వరకూ ఆడుకుంటూ ఇళ్ళకు పోయేవారు.

తమ పెద్దలెప్పుడేనా అడవిపంటలను అమ్మడానికి పట్నం పోయినప్పుడు పిల్లలు రాసుకుందుకు కాగితాలూ, కలాలూ తెస్తూంటారు.

వాటినన్నిటినీ అదృష్టదీపుడు తన రాజ్యపాలనకు వాడుతూండేవాడు. అది చాలా భయంకరమయిన అరణ్యం. కాబట్టి అక్కడ కెప్పుడూ ఇతరులు వొచ్చేవారుకారు. అక్కడికి గ్రామంకాని, పట్నంకాని చాలాదూరం. ఇలా ఉండగా -

ఒకనాడు సింధుదేశపు రాజు వేటకి ఆ అడవికి వచ్చాడు. శిబిరాలు వేయించి, రెండుమూడు రోజు లక్కడ వేటాడుతూ ఉన్నాడు.

ఆవిషయం తనవారి ద్వారా తెలుసుకున్న అదృష్టదీపుడు - వెదురు బియ్యం, తేనె, ముత్యాలు, చారపప్పు, చామరాలు మొదలయిన వస్తువులన్నీ, సేకరించి, మూటకట్టించి, ఒకవినతి పత్రికనిచ్చి తనవాడితో సింధుదేశపు రాజుకి పంపాడు. దానిలో

మహారాజు సింధుదేశ రాజుగారికి - అమరావతీ చక్రవర్తి అదృష్టదీప మహారాజు చేయు విజ్ఞాపనము -

తాము మా అడవికి రావడం మాకెంతో సంతోషం కలిగించింది. ప్రస్తుతం వచ్చి మీ దర్శనం చేయడాని కవకాశం చిక్కింది కాదు. మీమైత్రి కోరి మా జ్ఞాపకార్థం యీ అడవి వస్తువులను పంపాము. ఈ అడవిలో మీరు నివసించినందుకు ఈయవలసిన పన్ను మేము స్వీకరించము. మమ్మల్ని జ్ఞాపకం ఉంచుకోండి. ఇవే పదివేల ప్రార్థనలు.

అని ఉంది.

సింధురాజు అది చదువుకుని నిజంగా అలాటి చక్రవర్తి ఉన్నాడు కాబోలనుకుని, చక్రవర్తి కనుక అదృష్టదీపుడే తనకంటే అధికుడని భావించి, తనకాయన చేసిన మర్యాదకెంతో సంతోషించాడు. అతను పంపిన కానుకలను స్వీకరించాడు.

అదృష్టదీపుడు పంపిన ఉత్తరానికి -

"మీరు పంపిన ఉత్తరమూ, కానుకలూ అందాయి. చాలా సంతోషించాము. వాటిని మీ జ్ఞాపకార్థం ఎప్పుడూ ఉంచుకుంటాను. మమ్మల్ని మీరు మరచి పోకూడదు. మేము పంపుతున్న వస్తువులని స్వీకరించాలి. ఎప్పుడూ మీ వార్తలు తెలుపుతూ ఉండాలి" అని రాసి

సింధుదేశపు రాజు – ఒక ఏనుగు, రెండు ఒంటెలు, నాలుగు గుర్రాలు, మణులతో ఉన్న ఒక పతకం, కొన్ని పట్టుబట్టలు – కానుకలుగా ఉత్తరం తెచ్చిన గొల్లపిల్లవాడిచేత అదృష్టదీపుడికి పంపాడు.

ఆ ఉత్తరమూ కానుకలూ అందుకుని అదృష్టదీపుడు చాలా సంతోషించాడు. అంతకు ముందే అతనెందరో రాజులపేర్లు విని ఉన్నాడు కనుక వెంటనే నేపాళదేశపు రాజు పేరిట అలాగే ఒక ఉత్తరంరాసి, సింధురా జిచ్చిన కానుకల నిచ్చి గోపాలుడిని ఆ రాజువద్దకు పంపాడు.

నేపాళరాజు అదృష్టదీపుడితో స్నేహ న్నంగీకరిస్తున్నానని సగౌరవంగా రాసి – అతను పంపిన కానుకలకు రెట్టింపు కానుకలను తిరిగి పంపాడు. అదృష్టదీపుడు వాటినన్నింటినీ విదర్భదేశపు రాజుకు పంపగా అతను మైత్రి నంగీకరిస్తూ తిరిగి రెట్టింపు కానుకలు పంపాడు.

ఇలాగే ప్రతి రాజుకి పంపుతూండడం వల్ల అదృష్టదీపుడి పేరు భూమంతా వ్యాపించింది. అంతేకాకుండా వేలకొద్దీ గుర్రాలూ, ఏనుగులూ, ఒంటెలూ, రత్నాలూ కానుకలుగా రావడంతో – వాటిలో కొన్నిటిని అమ్మించి ఆ డబ్బుతో ప్రతిపట్నంలోనూ తన పేరిట సత్రాలు కట్టించాడు.

అక్కడున్న గొల్లవాళ్ళకు మంచి దుస్తులిప్పించి గుర్రపుస్వారి, ఏనుగులను నడిపించడం మొదలైన విద్యలు నేర్పించసాగాడు.

ఒక్కొక్కరాజు దగ్గరినుంచీ వచ్చే కానుకలు లక్షల కొద్దీ ఉండడంతో – వాటిని సగంసగం చేసి ఇద్దరేసి రాజులకు పంపేవాడు. ఆయా రాజధానుల్లో పండగలకు దాన ధర్మాలక్రింద కొంత డబ్బు ఖర్చుపెట్టేవాడు

అందువల్ల అదృష్టదీపుడిపేరు భూమంతా వ్యాపించింది కాని అత నెక్కడుంటాడో ఎవరికీ తెలియదు. అతని కందిన ప్రతికాసూ అలా ఖర్చు చేయడమే తప్ప తాను ముట్టుకునేవాడు కాదు. మర్రిచెట్టుక్రింద తన సరదారాజ్యం చేసుకునేవాడు.

ఇలా రెండు మూడు సంవత్సరాలు గడిచాయి. రాజులందరూ అతని స్నేహితులయ్యారు. ఎక్కడ చూసినా అతనిపేరే మ్రోగుతూంది.

ఒకనాడు - భూమిమీద కల మహారాజు లందరూ విశ్వేశ్వర మహాదేవుని మహాపూజా మహోత్సవానికి కాశీ వచ్చారు. అప్పుడందరూ కలసి మాట్లాడుకోడంలో - ప్రతివారూ తనకు అదృష్టదీపు డతి సన్నిహితుడని చెప్పుకున్నారు. అతనొస్తాడేమో అని చాలామంది చూశారు కాని అతని జాడలేదు.

రాజులందరూ అతని ప్రశంస తేవడంతో - "అదృష్టదీపు డెక్కడివాడు? అమరావతి రాజధాని ఏదేశంలోది? అతని కెంత దేశముంది? అతనెంత బలవంతుడు?" మొదలైన ప్రశ్నలూ, ఆరాలూ బయలుదేరాయి.

రాజులందరూ సభ చేశారు.

"మనందరికీ మిత్రుడైన అదృష్టదీపుడి వృత్తాంతం తెలియక పోవడం ఏమీబాగులేదు. ఇప్పుడు మన మందరమూ అతని చరిత్ర తెలిసికొని పోయి అతన్ని చూడాలి. అతను వ్రాసిన లేఖల బట్టే అతని సుగుణాలు తెలుస్తున్నాయి. అతని సత్రా లీవూళ్ళో అనేక మున్నాయని చెబుతున్నారు. వాటి అధికారులకతని సంగతితెలియకుండా ఉండదు. కనుక వారిని పిలిపించి అడుగుదాం" అన్నారు.

కాశీలో అదృష్టదీపుని సత్రాలు నాలుగున్నాయి. ఒక్కసారే లక్షలకొద్దీ యిచ్చాడు. కనుక దాని వడ్డీ మీదే నిర్వహించబడతాయి ఆసత్రాలు. అందుచేత ఆ సత్రాల నిర్వహణకు యజమాని అవసరమే కలగదు. అదృష్టదీపు డెక్కడి వాడో ఎట్టివాడో తెలియకుండానే ఆ సత్రాలు నిరాటంకంగా సాగుతున్నాయి. "సత్రాలెవరివి?" అడిగారు.

"అదృష్ట దీపమహారాజువి" అన్నారు వాళ్ళు.

"అతడెక్కడవున్నాడు?"

"మాకు తెలియదు -"

మరి మీకు డబ్బెక్కడినుంచి వొస్తూంది?"

"వారిచ్చిన సొమ్ము మీది వడ్డీయే ఎక్కువ."

వాళ్ళని పంపించేసి - రాజులు భూమియొక్క పటాలు తెప్పించారు.

దానిలో మిగిలిన అన్నిదేశాలూ కనిపించాయి కాని అమరావతి రాజధాని కలదేశం మాత్రం కనపడలేదు. అప్పుడు వారు - 'కానుకలు తెచ్చినప్పుడా దూతని అదృష్టదీపుడి నివాసం అడగకపోయామే'! - అని విచారించారు.

అతని వృత్తాంతం తెలుసుకుందుకెన్ని విధాల ప్రయత్నించినా సాధ్యపడకపోవడంతో "ఈసారి అదృష్టదీపు డెవరికేనా కానుకలు పంపితే - ఆ వచ్చిన వారి వెనక మనభటులను పంపి అతని దేశం తెలుసుకోవాలి" అని నిశ్చయించుకున్నారు. వారు తమ తమదేశాలకు వెళ్ళిపోయారు.

ఒకనా దదృష్టదీపుడు పాండ్యదేశ ప్రభువయిన మలయధ్వజ మహారాజుకి పదివేల గుర్రాలు, ఆరువేల ఒంటెలు, రెండువేల ఏనుగులు, రత్నహారాలు, వాహనాలూ, పట్టుబట్టలు పంపేసరి కా రాజు ఆశ్చర్యపోయి 'అదృష్టదీపుని కానుకల విలువకి నా ఐశ్వర్యం మొత్తమంతా కూడా చాలుతుందో, చాలదో...అతనికి తిరిగి ఏం పంపాలి? అతని ఐశ్వర్యమెంతటిదో? అతని దర్శనం చేసుకుంటేనే జీవితం ధన్యమౌతుంది. అతని కానుకల కదనంగా కొన్ని ఏనుగులను చేర్చి పంపుతాను. నేను కూడాపోయి ఆ మహాపురుషుడి పాదాల మీద పడి క్షమించమని కోరతాను" అనుకుని - ఆ కానుకలు తెచ్చిన కింకరులతో ఇలా అన్నాడు.

"రాజభటులారా! మీ రాజుగారు చేసిన సత్కారానికి నే నెంతో సంతోషించాను. ఆయనకు ప్రతి సత్కారము నే నేమీ చేయలేను. స్వయంగా వచ్చి ఆయన పాదాలమీద పడతాను. ఆయన ప్రసిద్ధి ప్రపంచ మంతా నిండి ఉంది. అలాటి వారి దర్శనం కంటె వేరే పుణ్యమేమిటి? ఆ దేశాని కెలా పోవాలి? ఆ దేశం ఎక్కడుంది. అమరావతికి పోవడానికి తోవేది? నాకు రాజుగారి దర్శనం చేయిస్తారా?"

"దేవా! ముందుగా వస్తున్నట్లు ఆయన పేర ఉత్తరం రాసి, ఆయన అనుమతి పొంది వెళ్ళాలి మీ కంత ఉత్సాహంగా ఉంటే ఉత్తరం

రాసి మా కివ్వండి. మేము వెళ్ళి జవాబుతీసుకొస్తాం" అన్నారుఅదృష్టదీపుడి భటులు.

రాజందుకంగీకరించి ప్రార్థిస్తూ ఉత్తరంరాసి, వస్తువాహనాలతో కూడా తన భటులు కొందరిని పంపి జవాబు తెమ్మని ఆజ్ఞాపించాడు.

తనవారికి ఏంచేయాలో ముందుగానే అదృష్టదీపుడు బోధించి ఉండడంతో - వారిలో కొందరు ముందుగా పోయి, మలయధ్వజుడి దూతలు వస్తున్నట్లు చెప్పారు.

'ఎంతోమంది రాజులు నన్ను చూడాలని ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తూంది. నా గుట్టు బయట పడితే యిప్పటివరకూ వచ్చిన కీర్తి అంతా కళంకమైపోతుంది. అంచేత కొన్ని రోజులు రహస్యంగా ఉండడమే మంచిది. ఇప్పుడా భటుల్ని ఇక్కడికి రానివ్వకూడదు అనుకున్నాడు.

"అదృష్టదీపమహారాజు గారిప్పుడు తీర్థయాత్రకు వెళ్ళారు. కొద్దిరోజులలో తిరిగొస్తారు. వారు వచ్చాక మేమే ఉత్తరం రాస్తాం. అప్పుడు వద్దురుగాని-" అని మంత్రి వ్రాసినట్లు రాసి - మలయధ్వజుడి కింకరుల కెదురుగా తీసుకెళ్ళమని చెప్పాడు.

మలయధ్వజుడు పంపిన ద్రవ్యాన్నంతటినీ దానధర్మాల కింద ఒక్కరోజులో పుణ్యక్షేత్రాలలో పంచమన్నాడు. ఆ ఉత్తరాలు చూసుకుని మలయధ్వజుడి దూతలు ఆశ్చర్యపోయారు. ఎంతటిదాతృత్వం! అంత ధనాన్ని ఒక్కరోజులో పంచిపెట్టమన్నాడే! అనుకున్నారు. అతను లేనప్పుడు వెళ్ళడమెందుకని - వెనక్కి వెళ్ళిపోయిన మలయధ్వజుని భటులు అదృష్టదీపుడి చర్యల గురించి తమ వూరిలో అద్భుతంగా వర్ణించి చెప్పారు.

అదృష్టదీపుడికి పద్దెనిమిదేళ్ళు వొచ్చాయి. అతను అవ్వదగ్గర కూర్చుని - "అవ్వా! నువ్వు నాకు చెప్పిన కథలవల్ల - లోకాన్ని ప్రత్యక్షంగా చూడకపోయినా చూసినట్లే ఉంది. ఒక్క టడుగుతాను. ఎంత రహస్యమైనా సరే దాచకుండా చెప్పాలి." అన్నాడు మెల్లగా.

"ఏమిటో అడుగు. నాకు తెలిసిందైతే తప్పకుండా చెబుతాను" అందవ్వ.

"ఎవరి నడిగినా చెప్పలేదు. నువ్వు పెద్దదానివి కనక నీకు జ్ఞాపకముండకమానదు. నీకు నా మీద చిన్నప్పటినుంచీ ప్రేమే. నేను పుట్టిన దినము, ప్రదేశము తెలుసుకొనవలసిన అవసరం కలిగింది" అన్నాడతను మెల్లగా.

ఓహో! ఇతనికి తన పెంపు సంగతి తెలిసింది కాబోలు, యింక నేను మాత్రం ఎందుకు దాచాలి? నా కొడుకు వీనితో ఆ సంగతి చెప్పొద్దన్నాడు కానీ..చెబితే మాత్రం యిప్పుడొచ్చే నష్ట మేముంది? - అని మనసులో భావించి -

"బాబూ! నువ్వు మా యింట్లో పుట్టలేదు. మా పిల్ల లడివికి పోగా ఒక మర్రి చెట్టు కింద - పాముకరచి ఒకస్త్రీ చచ్చి పడుందట. ఆమె పక్కలో నువ్వేడుస్తూంటే - ఒక సర్పం నీనెత్తి మీద గొడుగు పడుతూందట. పిల్ల లా పాముని బెదిరించి తోలేసి నిన్నెత్తుకుని ఊళ్ళోకి తీసుకురాగా మాపింగళికుడది విని - వాడికి కొడుకులు లేరు కనక నిన్ను యింట్లో పెట్టుకుని పెంచుకున్నాడు. అప్పటికి నీకు మూడేళ్ళ వయసుంటుంది. అది జరిగి పదిహేనేళ్ళవుతూంది. దీనిని బట్టి ఊహించుకో" అంది.

పాము కరచి చనిపోయింది మా తల్లి కాబోలు. నన్ను తీసుకుని ఒంటరిగా ఎందుకొచ్చింది? మా తండ్రి ఏమయ్యాడు? నా తల్లి తండ్రు లేకులము వారో? నాకింకెవరేనా బంధువులున్నారా? ఇవన్నీ నాకెలా తెలుస్తాయి?

తన కత్యంత ప్రియమిత్రుడయిన బలభద్రుడితో తన ఉద్దేశం చెప్పాడు. కానుకలుగా వచ్చిన గుర్రాలలో అత్యుత్తమమయిన దానిని దాచి ఉంచాడు. ఒకనాడు - ఎవరికీ తెలియకుండా, బలభద్రునితో అడవికి వెళ్ళినట్లే వెళ్ళి - అక్కడినుంచి గుర్రమెక్కి మిత్రుడితో సహా వెళ్ళిపోయాడు.

ఆ దారిన పోగా పోగా కొన్నాళ్ళ కొక పట్నం కనిపించింది అది - విదర్భదేశపు రాజధానయిన భర్మాపురం. దానిని అనంతవర్మ

అనే రాజు పాలిస్తున్నాడు. ఆ పట్నంలో విదేశస్తుల కుండదగినది అదృష్టదీపుడు కట్టించిన సత్రమే అని అక్కడి వారివలన తెలుసుకుని - మిత్రుడితో గుర్రంమీద ఆ సత్రానికి వెళ్ళాడు.

అక్కడి సత్రపు అధికారులు వాడుక ప్రకారం - యింటల్లుడికి చేసినట్లు స్వాగతసత్కారాలూ, ఉపచారాలూ చేశారు. ఆ పద్ధతిని అదృష్టదీపుడే ఏర్పరచాడు.

అత నేర్పరచిన విధానాల పత్రికలు సత్రంలో ఒకచోట కట్టబడి ఉన్నాయి. వాటిని చక్కగా పాటిస్తున్నందుకు అతనెంతో సంతోషించాడు.

అతనుండగానే మరికొందరు అతిథులు వచ్చారు. ప్రతివారి విషయంలోనూ ఆ పద్ధతులు చక్కగా పాటించబడ్డాయి. ఆ సత్రంలో - అదృష్టదీపుడి పేరు మార్మోగుతూంది. కొందరు అతనిమీద పదాలూ పాటలూ - గోడలమీద రాశారు.

ఆ సత్రానికి కుటుంబంతో సహా వచ్చిన బ్రాహ్మణులు - రామశాస్త్రి, వెంకట శాస్త్రి - యిలా సంభాషించుకోసాగారు.

రామశాస్త్రి : వెంకటశాస్త్రిగారూ! తమరిక్కడికి వచ్చి ఎన్నిదినాలైంది? ఇంకా కొన్నాళ్ళుంటారా?

వెంకటశాస్త్రి : రామశాస్త్రిగారా! తమరెక్కడి నుండి వస్తున్నారు? నేను కుటుంబంతో వచ్చి ఆరుమాసాలైంది. మరికొన్ని రోజులుంటాను. అదృష్టదీప మహారాజు సత్రం వేశారు కదా. ఎన్నాళ్ళున్నా ఏలోటూ ఉండదు. ఇంటికన్న గుడి పదిలమన్నట్లు మనిళ్ళలో ఏముంది. ఆ మహారా జెంత పుణ్యాత్ముడో! ఆయన కట్టించిన సత్రాలన్నీ కూడా యిలాగే ఉంటాయి. ఎన్నాళ్ళున్నా పొమ్మనే మాటే వినపడదు.

రామశాస్త్రి : ఆయన సత్రాలు మీరేం చూశారు? నేను చూసిన వాటిలో యిదేపాటిది? నే నాయనను చూడాలని ఎన్నో దేశాలు తిరిగాను కానీ ఎక్కడా ఆయన కనపడలేదు. ఆయన ప్రఖ్యాతి మాత్రం ఒకచోటకంటె మరొకచోట అధికంగా ఉంది. ఆయన దాతృత్వాని కవధిలేదు సమస్త-శాస్త్రాలూ చదివిన నన్ను చూస్తే ఆయన చక్రవర్తిని చేయడూ?

మొన్న ఒకచోట నూరేనుగులతో పోతూ ఒక బ్రాహ్మణుడు కనిపించాడు. పూర్వం తను శుద్ధ దరిద్రుడు. అతను నన్ను గుర్తుపట్టి - అయ్యో, రామశాస్త్రి గారా! ఎంత పొరపాటు చేశారు! మీరు కూడా రామేశ్వరం వచ్చుంటే ఎంతో ద్రవ్యం దొరికుండేది కదా! అక్కడికి వచ్చిన బ్రాహ్మణులంతా కుబేరులయ్యారు. అన్నాడు.

అదృష్టదీప మహారాజు తీర్థయాత్రలకి వెళ్ళాడని తెలిసి నేనూ ప్రతితీర్థానికీ పోతున్నాను.

ఆ సంభాషణలు విని అదృష్టదీపుడెంతో సంతోషించాడు. వాళ్ళ కివ్వడానికి తనవద్ద ఏమీలేనందుకు చింతిస్తూ - ఆ సత్రంలోనే ఉండి, సాయంత్రాలు బలభద్రుడితో వీధులవెంట విహారం చేయసాగాడు.

అలా తిరుగుతూండగా ఒకనా డావూరి దేవాలయంలో సాముద్రిక శాస్త్రవేత్తయిన సన్యాసి ఉన్నాడని విని ఆయన వద్దకు వెళ్ళాడు. ఆయనను స్తోత్రం చేసి వినయపూర్వకంగా తన చేతిని చాచి, హస్తరేఖలు చూపి తనతల్లితండ్రుల విషయమూ, సా౦బంభావమూ చెప్పమని ప్రార్థించాడు.

ఆ సన్యాసి అతని హస్తరేఖలు చూసి అమితాశ్చర్యపడుతూ - "ఆహా! ఇటువంటి చేతిని నా జన్మలో చూడలేదు. సాముద్రిక శాస్త్రంలో చెప్పబడిన ఉత్తమలక్షణాలన్నీ నీచేతిలో ఉన్నాయి. నువ్విలా సామాన్యవేషంలో ఉండడం చాలా ఆశ్చర్యమే.

నీ తల్లితండ్రులు బ్రతికే ఉన్నారు. నీకొక సోదరుడుండి ఉండాలి. నువ్వు అదృష్టదీపుడంత కీర్తిని పొందుతావు. నువ్వొక్కడివే యీ భూమినంతటినీ పరిపాలించ దగినవాడివి" అన్నాడు.

ఆ సన్యాసి మాటలకదృష్టదీపు దదిరిపడ్డాడు. 'అయ్యో! నా తల్లితండ్రు లెక్కడున్నారో? ఐతే....పాముకరచి చనిపోయింది నా తల్లి కాదన్నమాట. నాకొక తమ్ముడుకూడా ఉన్నాడట! వాడెప్పుడు కనిపిస్తాడో? ఈ సన్యాసి మాటలు తథ్యములు.' అని మనసులో అనుకుని - "స్వామీ మీ దయవుంటే ఏకొదవాలేదు" అని శలవు తీసుకున్నాడు.

# కాంతిమతి కథ

అదృష్టదీపుడికి సన్యాసి చెప్పిన మాటలన్నీ ఆపట్నపు రాజు కూతురు కాంతిమతి యొక్క చెలికత్తె చతురిక వినడం తటస్థించింది. తన ప్రాణసఖి కాంతిమతికి అనుకూలుడైన భర్త లభిస్తాడా అని తెలుసుకుందుకు చతురిక అక్కడకు వచ్చింది. అందుచేత ఆ మాటలు వినడంతోటే ఆమె అదృష్టదీపుణ్ణి పరీక్షించి చూసింది. అతని సౌందర్యాని కాశ్చర్యపడి, అతనే కాంతిమతికి తగినవాడని భావించి అతని గురించి తెలుసుకోవాలని, రెండు మూడు రోజుల పాటు అతన్ని అనుసరించి అతని చర్యలన్నీ చూసి కాంతిమతి వద్దకు వెళ్ళింది

ఆమెను చూస్తూనే – "ఏమేచెలీ! ఇన్నాళ్ళు కనపడకుండా పోయావు. ఆ సన్యాసి దర్శనమైందా? మాట్లాడాడా? మనసంగతులన్నీ విన్నాడా? ఆయనేం చెప్పాడు? మన కోరిక సఫలమౌతుందా? విశేషాలన్నీ వేగంగా చెప్పవే" అంటూ ఆత్రంగా అడిగింది రాజకుమారి కాంతిమతి.

ఆమె ఆరాటానికి ముసిముసి నవ్వులు నవ్వుతూ – "సఖీ! నేనా సన్యాసి వద్దకు వెళ్ళాను కానీ, నిజాని కతనేమీ చెప్పనే అక్కర్లేదు. భగవంతుడే తీసుకొచ్చాడు. నీ దేవతలు ప్రసన్నులయ్యారు" అంది చతురిక.

ఆ మాటలతో కాంతిమతిలో ఆరాటం మరింత పెరిగి "వేగంగా చెప్పవే. నువ్వు చెప్తేకాని తాళలేనే" అంది బతిమాలుతున్నట్లే. అప్పుడు కాంతిమతికి చతురిక యిలా చెప్పింది.

"సఖీ! నేనాసన్యాసి వద్దకు వెళ్ళేటప్పటికి ఒక యువకుడతని చేత చెయ్యి చూపించుకుంటున్నాడు. అతని రేఖలు చూడడమేమిటి, ఆ సన్యాసి అబ్బురపడిపోతూ అతను భూమండలమంతా ఏలగలడనీ, అదృష్టదీపుడంత కీర్తి పొందుతాడనీ చెప్పాడు.

ఆయువకుడి సౌందర్యం గురించి చెప్పాలంటే వసంతుడు, జయంతుడు, మన్మధుల కంటె కూడా అందగాడు. అతని యౌవ్వనం, పొంకం, లావణ్యం చూసి తీరవలసిందే కాని చెప్పడానికి తరంకాదు.

అతను నీకు తగిన వాడని నిశ్చయించుకున్నాను, అతన్ని చూసీచూడగానే. అతని సంగతులూ వివరాలూ తెలుసుకుందామని అతని వెంట రహస్యంగా రెండు మూడు రోజులు తిరిగాను."

"అతనివిశేషాలేమిటి?" కుతూహలంగా అడిగింది కాంతిమతి.

"అతనికీ అతని మిత్రుడికీ జరిగిన సంభాషణ చెబుతాను. దానిని బట్టి నువ్వే తెలుసుకో" అని – చతురిక చెప్పసాగింది.

"మిత్రమా! భూమంతా నీకీర్తి వ్యాపించింది. కాని నిన్ను మాత్రం ఎవరూ ఎరగరు. నీ తెలివితేటలు, చాతుర్యమూ గొప్పవి. నువ్వు చాలా పుణ్యాత్ముడివి "

"బలభద్రా! నేనెంత వాడినైతే ఏమిటి? నా విఖ్యాతికి సార్థకత నాతల్లితండ్రులూ సోదరుడూ కనపడినప్పుడు కదా. అంతవరకూ నేనేం సాధించినా వృథాయే. నాగొప్పతనాన్ని మెచ్చుకునేదెవరు? ఆహా! తల్లి తండ్రులచేత పొగడ్తల నందుకోగలిగే కొడుకులెంత అదృష్టవంతులు! ఎంత పుణ్యాత్ములు!" అని అతను నిట్టూర్పువిడుస్తూ విచారించాడు.

దీనిని బట్టి చూస్తూ అతనెవరో ప్రఖ్యాత పురుషుడే అనిపిస్తూంది. ఏదో కారణంవల్ల మరో వేషంలో తిర్నుగుతున్నాడేమో. అతను నీకు తగినవాడు. నువ్వు అతన్ని చూశావో విరహవేదన తప్పదు నీకు."

"అతను నాకెలా కనబడతాడు? అతన్ని చూపించి నీమాట నిలబెట్టుకో – అతన్ని చూడాలని నా మనసు కొట్టుకుపోతూంది. ఏం చెయ్యాలి? వేగం చెప్పు" అని కాంతిమతి సఖిని తొందరచేసింది.

చతురిక నవ్వుతూ – "చూడకుండానే యింత తొందర పడుతున్నావే! చూశాక నన్ను నిలవనిస్తావా? అతని చిత్రపటం రాసితెస్తాను. అదిచూసి – నచ్చితే అప్పుడతన్ని ప్రత్యక్షంగా చూసే ప్రయత్నం చేద్దాం" అని ఆమె అనుమతి తీసుకుని చిత్రరచనా సామగ్రి పట్టుకుని అదృష్టదీపు డున్నచోటికి వెళ్ళింది.

అప్పుడు అతను బలభద్రుడితో మాట్లాడుతున్నాడు. చతురిక అతనికి నమస్కరించి –

"అయ్యా! మిమ్మ ల్నీ వూళ్లో పదిరోజులనుంచి చూస్తున్నాను. మిమ్మల్ని చూసినప్పుడల్లా మీ వృత్తాంతం తెలుసుకోవాలనిపించేది. కాని మీతో మాట్లాడే అవకాశం దొరికేది కాదు. ఇవాళ కేవలమూ ఈ పనిమీదే వచ్చాను.

నాకు చిత్రపటాలు రాసేనేర్పుంది. చక్కనివాళ్ళ పటాలు రాసి అమ్ముకుంటూ జీవనం గడుపుకుంటాను. మీ రూపం చాలా చక్కగా ఉంది. మీ చిత్రపటం రాయాలని ఉత్సాహంగా ఉంది. నా ప్రార్థనను మన్నించండి"

నాపేరు హరిదాసు. నేనీ వూరు తిరగడానికొచ్చాను. సామాన్యుడిని నారూపం రాసుకుంటే నీకేంలాభ ముంటుంది? అనవసర ప్రయాస కదా?" అన్నాడు.

అతనేదో దాస్తున్నాడని గ్రహించి చతురిక - "ఆర్యా! నాకిది ప్రయాస కాగు. పరమానందకరమైన పని. మీవల్ల గొప్పలాభం పొందాలనే ఇలాటి పనికి దిగుతున్నాను. అనుగ్రహించండి. ఒక్కనిముషం మాత్రం కదలకుండా స్థిరంగా ఉండండి-" అని, నిలబడి ఉన్న అత నాకృతిని అచ్చుగుద్దినట్లు రాసి అతనికి చూపించింది.

తనప్రతిబింబంలా ఉన్న ఆ చిత్రాన్ని చూసి అత నామెనైపుణ్యానికి మెచ్చుకుని ఆపటా న్నామెకిచ్చేశాడు.

ఆమె దానిని తీసుకోదమేమిటి వేగంగా వెళ్ళి కాంతిమతి చేతికిచ్చింది.

అది చూస్తూనే కాంతిమతికి మూర్ఛవచ్చింది. కొతసేపటికి తెలివిరాగా - "చతురికా! నిజంగా యిలా ఉన్నాడా? నన్నాడించడాని కింత చక్కగా రాశావా? ఇంత అందమైనవాడు కథల్లో ఉంటాడు తప్ప నిజంగా ఉంటాడా? చెప్పు. నీకంటే నాకెవరున్నారు? నీపాదాలకి మొక్కుతాను. ఇలాటి సమయంలో పరిహాసా లాడకు." అని బ్రతిమాలింది.

ఆమెను చూసి నవ్వుతూ – "నీతో పరిహాస మాడతానా? నిజంగా అతనిని ఉన్నట్లు చిత్రించడానికి సరిపడ రంగులు నాదగ్గర లేనేలేవు. పోలికమాత్రం రాశాను. అతని చక్కదనం అంతాయింతా అని చెప్పలేం తొందరపడకు. నీకతన్ని చూపిస్తాను." అంది చతురిక.

"ఎప్పుడో చూపిస్తానంటే నేను తాళలేను. ఎప్పుడు చూపిస్తావో చెప్పు. ఇప్పుడే పోయి అతన్ని తీసుకురా. విరహంభరించలేక పోతున్నాను. నీకు మంచి పారితోషికం యిస్తాలే" అని తొందరపెట్టింది రాకుమార్తె.

"నీ తొందర చిత్రంగా ఉంది. అతనిని తీసుకొచ్చెయ్యడానికి పైపైన ఉందనుకుంటు న్నావేమిటి? నాతో మాట్లాడడమే అతనికి కష్టమై పోయింది. ఉపాయం పన్నాను. కనక సాధించగలిగాను. సరేలే. మళ్ళీ పోయి ఏదో మిషతో అతన్ని తీసుకొస్తాను. అనుమతించు" అని ఆమె అతని చిత్రపటం తీసుకుని బయలుదేరింది

"మళ్ళీ వచ్చావేం? రాయడంలో ఏమైనా మరచిపోయావా? ఏమిటి విశేషాలు?" అని అతనునవ్వుతూ మాట్లాడేసరి కామె ధైర్యం తెచ్చుకొని –

"అయ్యా! తమ దయవలన ఆ చిత్రపటాన్ని అద్ది అనేక నకళ్ళు తీసి చూపగా అనేకమంది కొనడానికి సిద్ధపడ్డారు

మా రాజుగారికి కాంతిమతి అనే పుత్రిక ఉంది. ఆమె సౌందర్యంలోనూ గుణాలలోనూ అతి చక్కనిది. నేనీ చిత్రమును కొంటావా? అని ఆమె నడిగాను. ఆమె చిత్రాన్ని బాగా పరీక్షించి – నేను చెప్పిన మాట నమ్మక ఇలాటి పురుషుడు ఉండడనీ, నే నూహించి రాశాననీ అంది.

నేనెంత చెప్పినా ఆమె ఒప్పుకోలేదు. అందుచేత మా యిద్దరికీ వాదన జరిగింది. చివరకి – "అతనిని చూపిస్తే వెయ్యిదీనారాలు పారితోషికం యిస్తాను" అంది

నేనెంతో సంతోషిస్తూ మీ దగ్గరకు పరిగెత్తుకొచ్చాను. ఆ సొమ్మంతా మీరే ఇచ్చినట్లు సంతోషిస్తాను నా గురించి కొంచెం శ్రమపడండి మాలాటి దీనుల మొరవినడం మీవంటి ఉత్తములకు

ధర్మంకదా. ఒక్కసా రామె కళ్ళల్లో పడితే చాలు. ఆ సొమ్ము నాకు దక్కుతుంది ఆమెకూడా చాలా చక్కనిదే! ఆమె చిత్రపటం తెచ్చాను. చూడండి" అంటూ కాంతిమతి చిత్రపటాన్ని చూపించింది.

అదిచూసే సరి కతని మనస్సుకూడా మోహంతో చలించింది. ఇటువంటి సౌందర్యవతి భార్యగా ఉంటే కదా. సౌందర్యవంతుడికి సఫలత చేకూరుతుంది - ఈమె నన్ను మాయచేయడం లేదు కద? నిజంగా ఇంత సౌందర్యవతి ఉంటుందా? చూపిస్తా నంటూంది కదా. తరువాత ఆలోచిద్దాం - అనుకుని తనమనసుని బయటపడన్వికుండా -

"చతురికా! నువ్వతిచతురవి, ఎలారాసినా రాయగలవు. ఎప్పుడూ అంతఃపురంలోనే ఉండే మీ కాంతిమతికి నన్నెలా చూపించగలవు? ఈ పటం గురించి నాకూ అనుమానంగానే ఉంది. ఆమెను తీసుకువస్తే నా అనుమానం కూడా తీర్చినదానివౌతావు. వెళ్ళు" అన్నా డతను.

అందుకామె "అయ్యా! మీకు సర్వమూ తెలుసు. మీమాట కాదనడానికి నేనెంతటి దాన్ని? ఆమె నిక్కడికి రమ్మంటే ఆనందంగా వస్తుంది. కాని – లోకానికి వెరవాలి కదా? మగాళ్ళంటే సర్వస్వతంత్రులు. ఆమె మేడ దిగువనుండి మీరు వెళ్తూంటే ఆమె మిమ్మల్ని చూస్తుంది. నా కోరికనెరవేరుతుంది" అని ప్రార్థించింది.

అతనికి కాంతిమతిని చూడాలని చాలా ఉత్సాహంగా ఉన్నా దాచుకుని పరోపకారిలా ప్రవర్తిస్తూ అంగీకరించాడు.

తరువాత ఆమె రెండు చిత్రపటాలూ పక్కపక్కనుంచి - "చూశారా, ఇవి ఎంతవింతగా ఉన్నాయో!" అంది.

ఆమె అభిప్రాయం తెలిసినా - "నువ్వంత చాతుర్యంతో రాశావు మరి "- అన్నా డతను.

ఆమేడ గుర్తులు చెప్పి ఆమె వెళ్ళిపోయింది. అదృష్టదీపుడు చతురిక మాటలను బట్టి కాంతిమతి తనను వలచిందని గ్రహించి ఆ సంగతులన్నీ బలభద్రుడితో మాట్లాడి – ఏం జరిగినా మంచికే అనుకున్నాడు.

సాయంకాలం ఆమేడ కిందనుండి మూడుసార్లు తిరిగాడు. అప్పు దతని మీద పూలు పడ్డాయి. అతను తలపైకెత్తి చూడగా చక్కని ముఖం కనిపించింది దానినలా రెండు మూడు సార్లు చూసి – ఇతరులు నడుస్తూండడంతో, నిలబడకుండా ఇంటికి వెళ్ళిపోయాడు.

అతనివెనుకే చతురిక కూడా వచ్చింది.

"చతురికా! నీ కోరిక తీరింది కదా? రాజకుమార్తె సొమ్మిచ్చిందా?" అని అడిగాడు

ఆమె లేదన్నట్లు తలూపుతూ – "మిమ్మల్ని శ్రమపెట్టినందుకు చింతిస్తున్నాను. ఎంత వారికేనా డబ్బు వొదులుకోడం కష్టకదా? ఆమె ఏదో వంకబెట్టి గెలవాలనుకుంటూంది. దూరంగా ఉండడంవల్ల మిమ్మల్ని సరిగా చూడడం కుదరలేదట. మీ చిత్రఫలకాన్నీ మిమ్మల్నీ దగ్గరుంచుకుని చూస్తే కాని నమ్మదట. దీనికి నేనేం చెయ్యగలను? అందుకని – అది ఎలా సాధ్యం?"– అని అడిగాను.

"నేను రేపు ఉద్యానవనంలోకి వస్తాను. అక్కడికి తీసుకురా" అంది. ఆమాటే మీకుచెప్పడానికి వచ్చాను. నాగురించి మరొక్కసారి శ్రమపడాలి. మీ ఉపకారం ఎప్పటికీ మరవను–" అని ఎన్నో విధాల ప్రార్థించింది.

ఆమె మాటలు విని "ఓహో! కొంచెం చనువిస్తే ఎక్కువ చొరవ చేస్తున్నావే! అంతఃపురకాంతల చెంతకు మేమొస్తే రాజు శిక్షించడా? ద్వారపాలకు లడ్డగించరా? మాకంత శ్రమపడవలసిన అవసర మేముంది?" అన్నాడతను యిష్టంలేనివాడిలా.

"మీరిప్పుడు రాకపోతే ఆమెముందు నామాట అబద్ధం అవడమేకాక డబ్బుకూడా నష్టపోతాను. నామీద దయవుంచి ఒక్కసారి రండి మిమ్మల్ని ద్వారరక్షకులు అనుమానించకుండా నేను తీసుకు వెళ్తాను. ఉద్యానవనానికున్న రెండోద్వారంలోంచి వెళ్తే ఎవరూ చూడరు" అని పరిపరి విధాల ప్రాధేయపడింది.

అతను ఎట్టకేలకు అంగీకరించినట్లు – "సరే. ఈసారికాక మళ్లీ రమ్మంటేరాను సుమా! అక్కడికెప్పుడు వెళ్ళాలి?" అని అడిగాడు.

"మనంఇప్పుడే పోదాం. ఆమెకంటే ముందుగా మనమక్క డుందాం" అని అతనిని తీసుకుపోయి – ఉద్యానవనంలోకల మేడలో ఉంచింది.

ఆ రాజుగారి కనేక ఉద్యానవనా లున్నాయి. వాటిలో అదే అతిచిన్నదీ, మారుమూల ఉండేదీ అవడంతో అక్కడ తరచుగా రక్షక పురుషులుండరు. ఎప్పుడేనా రాజకుమార్తె అక్కడికి వస్తూంటుంది.

అక్కడి విశేషాలన్నీ చూసి – "మీ రాజకుమార్తె ఎప్పుడొస్తుంది?" అని అడిగాడతను.

"నేను వెళ్ళి ఆమెను వేగంగా తీసుకొస్తాను. మన మిక్కడికి వొచ్చినట్లామెకు తెలిసుండదు. అంతవరకూ మీరీ చిత్రపటాలు చూస్తూండండి" అని చతురిక అక్కడినుంచి వెళ్ళింది. అతను రాజకుమార్తె కోసం ఎదురుచూస్తూ – ఆమెపట్ల మోహంతో మునిగిపోయాడు.

అంతలో బండి చప్పుడు వినిపించింది. అతని గుండె దడదడ లాడింది చతురిక కాంతిమతిని వెంటపెట్టుకుని వచ్చేసరికతను అక్కడున్న వింతలు చూస్తున్నట్లు నటించ సాగాడు.

కాంతిమతి దూరంనుంచే అతన్ని చూసి సిగ్గుతో తలవాల్చి అక్కడే నిలబడిపోగా –

చతురిక "రా..రా.. నేను చిత్రపటంలో రాసిన పురుష డితనే ఏ మాత్రం తేడా ఉన్నా నాకు డబ్బివ్వొద్దు. చూడు" "అంటూ ఆమె నతనికి దగ్గరగా లాక్కుపోయింది.

కాంతిమతి మధ్యమధ్య అతన్నీ అతని సౌందర్యాన్నీ చూస్తూనే – బలవంత పెట్టబడిన దానిలా నటిస్తూ అతనికి దగ్గరగా వెళ్ళింది.

అత నామెను చూస్తూ – "చతురికా! తొందరపడకు. పరీక్షకులే వొచ్చి చూస్తారు–" అంటూ తనదగ్గరున్న చిత్రపటా న్నామెకిచ్చి ఆమె

దగ్గరున్న చిత్రపటాన్ని తాను తీసుకుని ఆపటాన్నీ కాంతిమతినీ పోల్చి చూడసాగాడు.

కాంతిమతి కూడా అతని చిత్రపటాన్నీ, మనిషినీ పోల్చి చూస్తూ శృంగార చేష్టలు చేస్తూ కొంతసేపు గడిపి - చివరికి "చతురికా! నువ్వే గెలిచావు. నీ డబ్బు నీకిచ్చేస్తాను" అని మళ్ళీ ఒకమా రతని ముఖం చూసింది.

అతను కూడా - "చతురికా! నువ్వు చూపిన పటము సరైనదని ఇప్పుడు నమ్మాను. నీ మాటలు నిజమే" అని ఊరుకున్నాడు.

ముగ్గురికి ముగ్గురూ బొమ్మల్లా ఉండిపోయారు. తరువాత చతురిక వారి చిత్ర ఫలకాలు రెండిటినీ సమంగా పట్టుకుని అతనితో - "అయ్యా! ఈ రెండిటిలో ఏది చక్కగా ఉందో నాకు తెలియడంలేదు. మీరు మేధావులు కనుక తేల్చి చెప్పండి" అంది.

అతను చిరునవ్వు నవ్వుతూ - "స్త్రీపురుష భేదం కలయిరెండింటికీ సమానత్వ మేమిటి? దేనికదే చక్కగా ఉంది" అన్నాడు.

చతురిక అదే ప్రశ్న కాంతిమతి నడిగింది ఆమె మెల్లగా - "నువ్వు పందెంగెలిచావు కానీ అతని రూపాన్ని చిత్రపలకంలోకి సరిగా తేలేకపోయావు. చిత్రంలో భేదముంది. అది దేముడికి మాత్రమే తెలియగలదు" అంది.

అతను - "నేను వచ్చి చాలా సేపయింది. నువ్వెంతో కోరబట్టి వచ్చాను నాకోసం నా మిత్రుడు బలభద్రుడు ఎదురుచూస్తూంటాడు. ఇంక నేను పోవచ్చునా?" అని చిరునవ్వు నవ్వుతూ అడిగాడు.

చతురిక కూడా చిరునవ్వుతో "ఆర్యా! మీరు నాపని చక్కగా చేసిపెట్టారు. మీ వృత్తాంతం విని - మీకు నేను చేయగలిగిన ఉపకారం ఏదేనా చేయదలుచుకున్నాను. మీపేరేమిటి? మీరే దేశ రాజకుమారులు? మారువేషంలో యిక్కడ సంచరించడానికి కారణం ఏమిటి? మీదేదేశం? -" అని అడిగింది.

"మేము అబద్ధాలు చెప్పేవాళ్ళంకాము. నేను మొదట చెప్పింది నిజమే. ఈ విషయం గురించి మాటిమాటికీ అడక్కు. నువ్వు నాకు చేయదలుచుకున్న ఉపకారమేమిటో చెప్పు. నేను తొందరగా పోవాలి" అని అతనంటూండగానే సాయంకాలమైపోయింది.

అప్పుడే - ద్వారరక్షకులు వొచ్చి తలుపుతడుతూ - "చతురికా! సాయంకాలపు భేరిని మ్రోగిస్తున్నారు. తోటతలుపులు మూసేస్తారు. కాబట్టి వేగంగా వెళ్ళండి" అన్నారు.

అతనికి భయంవేసి - "నేనిప్పుడింటికి వెళ్ళడంఎలా?" అని చతురిక నడిగాడు.

"అదంతా నేను తరవాత చెబుతాను. ముందు మీరీ దారిన వెళ్ళండి. ఎవరూ అడ్డు పెట్టరు -"

అని కాంతిమతితో బండెక్కి అతివేగంగా యింటికి పోయింది.

ఇంటికి వెళ్ళాక "అతను ఎదురుగా ఉన్నప్పుడేమీ మాట్లాడలేక పోయాను. నా మనసులో ఎన్నో కోరికలూరుతున్నాయి. దుర్మార్గపు సిగ్గు నన్ను మాట్లాడనిచ్చింది కాదు. దొరికిన పండు దొరికినట్లే జారిపోయింది. తటాలున వెళ్ళి అతన్ని గట్టిగా కౌగలించుకోకుండా - ఏదో ఆలోచిస్తూ వెర్రిదానిలా ఊరుకున్నాను. అయ్యో! నా మనసులోని అభిప్రాయమేనా అతనికి చెప్పలేదు.

అతని ఉద్దేశమేమిటో నేను తెలుసుకోలేదు. ఏదో చెప్పాలనుకుని మరేదో చెప్పాను. నాకీ సిగ్గు అడ్డుపడకపోతే నా చమత్కారమంతా చూబెట్టి ఉండకపోయేదానినా! నీ చాతుర్యమంతా ఎక్కడ దాచేవే చతురికా? అతని ముందు ఏమీమాట్లాడలేదేమే? మన మా మేడలో ఎంతసేపున్నాం? నిముషంలాగేనా తోచలేదే.

అబ్బా! నా శరీరమంతా భగ్గున మండిపోతూంది. ఇలాటి బాధ యింతకు ముం దెరగను. అతనికి నాయం దిష్టముందా? అతనే నా సాహసించలేక పోయాడేం? ఒకవేళ - అతను నీ కుపకారం చేయాలని

మాత్రమే వచ్చాడేమో. నువ్వతన్ని భ్రమపెట్టి తీసుకొచ్చావు. ఆమాట చెప్పావు కాదు. ఇది నీతప్పే.

ఈ రాత్రెలా గడుస్తుంది? మనం నిజంగా అతన్ని చూశామా, లేక అదంతా కలేనా? రాత్రి అక్కడే ఉండిపోతే బాగుండును. మనమున్నా అతనుండొద్దూ? తొందరపడి వచ్చేశాం, నీబుద్ధేమయింది? అతనప్పుడే యింటికి పోయాడుకదా. మళ్ళీ అతను కనపడతాడో లేదో. ఉదయం వరకూనేనాగలేను. ఈరాత్రి అతన్నెలాగేనా తీసుకొస్తే ప్రాణాలు నిలుస్తాయి. లేకపోతే చచ్చిపోతాను.

విరహవేదనంటే ఏమిటో అనుకున్నాను. ఇప్పటికి తెలిసింది. ఇలాటి అవస్థ శత్రువులకైనా రాకూడదు" అంటూ పిచ్చిదానిలా మంచంమీదపడి కొట్టుకుంటున్న ఆమెను చూసి –

"కాంతిమతీ! నువ్వెంతో ధైర్యశాలి వనుకున్నాను. ఇప్పుడు తెలిసింది నీధైర్యం ఏపాటిదో. మొదటి పరిచయంలోనే బయట పడడమెందుకని ఊరుకున్నాను. ఒక్కరాత్రే తాళలేవా? అలాటి దానివప్పు డెందుకూరుకున్నావ్? పైగా నన్ను నిందిస్తున్నావ్! నువ్వింత బేల వనుకోలేదు. ఈ రాత్రి ఎలాగో గడుపు. రేపు ఉదయాన్నే అతన్ని తెచ్చి నీ మంచం మీదుంచుతాను."–

అంటూ శైత్యోపచారాలు చేయసాగింది. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది.

శరీరానికి పూసినచందనం, చుట్టినచిగుళ్ళ దండలు – ఏమీ పని చేయలేక పోయాయి. ఆమె మదన తాపాన్ని కొంచెమైనా తగ్గించలేక పోయాయి.

చిన్నప్పటి నుండీ ఎప్పుడూ కనీ వినీ ఎరగని యీ చిన్నదాని కిన్ని చిన్నెలెలా వచ్చాయా అని ఆమె ఆశ్చర్యపోయింది. ఎలాగో ఆరాత్రి గడిచేలా చూసింది.

సూర్యోదయం అవడంతోనే చతురిక కాంతిమతికి కొన్ని జాగ్రత్తలు చెప్పి - అతనింటికి వచ్చి - రహస్యంగా దాక్కుని - వారనుకునే మాటలు వినసాగింది.

"బలభద్రా! నేనెంత తెలివి తక్కువ వాడినో చూడు. చేతికందిన పండుని తీసుకోక వదిలేశాను. దేవుడు ఏదేనా యిస్తాడే తప్ప తినిపిస్తాడా! మంచి అవకాశం చేజారిపోయింది. సాహసించలేక పోయాను. అయ్యో! ఈ విచారాన్నెలా తప్పించుకో గలను? -

సూర్యోదయమౌతున్నట్లుంది. చూడు మనం నిద్రపోనిది ఒక్కరాత్రే. కాని ఎన్నో రాత్రుల్లా అనిపిస్తూంది" అంటూ పలువిధాలుగా విచారిస్తున్న ఆ రాజపుత్రుడి మాటలు విని చతురిక చాలా సంతోషించింది.

కాంతిమతి నావహించిన మోహపిశాచం యితన్ని కూడా ఆవహించింది. ఇది చాలా మంచిది. ఒక్క క్షణంలో నా స్నేహితురాలి కోరిక నెరవేర్చగలనంటూ - వాళ్ళింటి తలుపులు తట్టుతూ - "బలభద్రా! బలభద్రా!" అని పిలిచింది.

ఆ కంఠస్వరం గుర్తుపట్టి అదృష్టదీపుడు చాలా సంతోషంగా బలభద్రుడిచేత తలుపు తెరిపించాడు.

బలభద్రుడు తలుపుతెరిచి - "నిన్న నీతో మాట్లాడిన ఆమె - " అని చెప్పాడు.

ఆమెకు ఆసనం వేయించి - "చతురికా! పొద్దున్నే వచ్చావేం?" అని అడిగాడు.

"మరేమీలేదు. నిన్న మీతో మాట్లాడ్డాని కవకాశం చిక్కింది కాదు. నాగురించి మీరు తీసుకున్న శ్రమకు కృతజ్ఞతలు తెలుపుకుందు కొచ్చాను. అంతేకాకుండా - మా రాజకుమార్తె మీతో మాట్లాడవలసుందని చెప్పింది. నిన్న దేనికీ వ్యవధిలేకపోయింది. ఇవాళ సావకాశంగా మాట్లాడుకోవచ్చు. ఇప్పుడే ఆమె మరో ఉద్యానవనానికి పోయి ఉంది.

మిమ్మల్నక్కడికి తీసుకురమ్మని నన్ను పంపింది. నిన్న మీకు అతిథి పూజ చేయలేదట. మీరేమనుకున్నారో అని రాత్రంతా విచారిస్తూ కూర్చుంది.

ఇప్పుడామె వెళ్ళిన ఉద్యానవనం చాలా విశాలమైంది. అరణ్యంలా ఉంటుంది. అక్కడ అందమైన మందిరాలెన్నో ఉన్నాయి. మీరక్కడికి దయచేయాలి" అని చతురిక ప్రార్థించింది.

అందుకతను చిరునవ్వు నవ్వుతూ – "నీతో బాగా పరిచయమైనందువల్ల నీ మాటకాదనలేకపోతున్నాను. నీ కృతజ్ఞతకి చాలా సంతోషిస్తున్నాను. మీ రాజపుత్రిక నాకు సపర్యలు చేయలేదని విచారించనక్కరలేదని చెప్పు. ఆమెదర్శనమే చాలు, మళ్ళీ నన్నెందుకు శ్రమపెడతావు? రాజభటులు రక్షించే ఆ ఉద్యానవనంలోకి పోవడం అసాధ్యంకదా?" – అన్నాడు – అర్థాంగీకారంతోనే.

చతురిక అతని చేయిపట్టుకుని – "లెండి లెండి. తక్కిన వాటిగురించి చింతించవలసిన అవసరం లేదు. ప్రాతఃకాలకృత్యా లక్కడే జరిగించవచ్చు. రండి, రండి" అని బలవంత పెట్టగా – బలభద్రుడి నింటివద్ద ఉండమని అత నామెతో వెళ్ళాడు. చతురిక అతన్ని ముందుగా తనింటికి తీసుకు వెళ్ళింది. కృతజ్ఞత అంటూ పన్నీటి స్నానం చేయించి – పట్టుబట్ట లిచ్చింది. అలంకారాలు చేసింది.

అదంతా చూసి – "ఈ వేషం నాకెందుకు? నేను త్వరగా పోవాలి. మీ రాజకుమార్తె ఎక్కడ?" అని అడిగాడు అదృష్టదీపుడు.

"తొందరపడకండి రాజపుత్రికను చూపించడానికే యిదంతా" అందామె.

అంతలో బండి వచ్చింది. పరిచారిక వచ్చి ఆ విషయం చెప్పగా – "నువ్వు పో, నేనీ బండెక్కి యిప్పుడే వెళ్తాను" అంది. ఆమె వెళ్ళిపోయాక – అతనికి శరీరమంతా ముసుగేసి ఆ బండెక్కించింది.

అతనామె చెప్పినట్లే చెయ్యసాగాడు. బండివాడిని వేగంగా ఉద్యానవనం చేర్చమంది.

అదృష్టదీపుడు రావడం చూసి రాజకుమార్తె బంగారు పళ్ళెంతో ఎదురొచ్చింది. ముందుగానే అక్కడింకెవరూ ఉండకుండా ఏర్పాట్లు చేసుకున్నారు. రాజకుమార్తె అతని పాదాలు కడిగి తడి ఒత్తి హారతిచ్చి – ఊరుకోగా – "రాకుమారీ! అతిథిపూజ చక్కగా చెయ్యి. సిగ్గుపడి ఊరుకుంటే అతిథికి కోపం వొస్తుంది. సిగ్గుపడకు" అని హెచ్చరించేసరికి ఆమె అతని చేయిపట్టుకుని –

"ఆర్యపుత్రా! మీరాకతో మాయిల్లు పావనమైంది. లోపలికి వచ్చి మమ్మల్ని ధన్యుల్ని చేయండంటూ" అతని చేయి పట్టుకుని తీసుకెళ్ళి శయ్యమీద కూర్చోబెట్టింది. తాను – దగ్గరగా నిలుచుంది.

అంతలో చతురిక వచ్చి – "నువ్వక్కడ నిలబడ్డావేం? నువ్వుకూడా శయ్యమీద కూర్చుని పూజించు. శయ్యఎత్తుగా ఉంది. ఇలాటప్పుడు సంశయింపకూడదు" అంటూ ఆమెను కూడా శయ్య ఎక్కించి – చందనపు గిన్నె చేతికందించింది. రాకుమార్తె అతనివొంటికి చందనం పూయసాగింది.

అతను – "నీ సపర్యలకు సంతోషించాను, చాలు. నాకు చెప్పవలసిన విషయాలేమైనా ఉంటే చెప్పు. నేను వేగంగా పోవాలి" అన్నాడు.

"అయ్యో! చల్లకొచ్చి ముంతదాచడమెందుకూ? మిమ్మల్నూరికే వెళ్ళనిస్తామా? మీరేమీ మాట్లాడకండి. కాంతిమతీ! నువ్వు సందేహించకు. శరీరమంతా చక్కగారాయి" అంది చతురిక – "ఓహో! నువ్వు అతిథికి చక్కని మర్యాదే చేస్తున్నావే! అతనూరుకుంటాడా? నీకు తగ్గట్లే చేస్తాడు" అంటూ ఆగంధపు గిన్నె అతని కందించింది. అతను ధైర్యంగా కాంతిమతి చెక్కిళ్ళు నొక్కుతూ మరీ గంధం పూశాడు.

ఇద్దరి శరీరాలూ పులకరించాయి. చిరుచెమటలు పోశాయి. మన్మథుడే వారికి పురోహితుడై పాణిగ్రహణోత్సవానికి సంకల్పం చెప్పసాగాడు.

చతురిక మెల్లగా అవతలకు పోయింది. వాళ్ళిద్దరూ మన్మధ క్రీడలలో తేలియాడారు. సాయంత్రం అయింది.

చతురిక వచ్చి మనం యింటికి పోవాలి. రేపు మళ్ళీ రావొచ్చు. మీరు మళ్ళీ ముసుగేసుకుని మాతో బయటకొచ్చి బండెక్కండి. మా యింటి దగ్గరదింపుతాను" అంది.

ఆమె యింటి దగ్గర అదృష్టదీపుడు దిగగానే వారిద్దరూ బండిలో వెళ్ళిపోయారు.

కాంతిమతి ఆ రాత్రి అతికష్టంమీద గడిపింది. మర్నాడు ముందరిరోజులాగే ముసుగులో అదృష్టదీపుడు ఉద్యానవనానికి వచ్చి కాంతిమతితో సుఖించాడు.

అలా కొన్నాళ్ళు గడిచాక ----

ఒకనాడు కాంతిమతి తండ్రి అనంతవర్మ ఆస్థానంలో కూర్చుని రాచకార్యాలు నిర్వర్తిస్తుండగా -

ఒకఉత్తరం కనపడింది. అతనది విప్పి చదివసాగాడు.

"రాజా! నువ్వొట్టి గుడ్డివాడివి. నీయింట్లో జరుగుతున్న నేరాన్నే గమనించలేక పోతున్నావు. నీకూతురికి అతి స్వేచ్ఛ యిచ్చావు. ఆమె యిప్పుడు ఉద్యానవనంలో ప్రతిరోజూ ఒక మగాడితో కులుకుతూంది. యౌవనం వచ్చిన ఆడపిల్లకి పెళ్ళిచేయకుండా ఉంచడం నీదేతప్పు. ఆమె యిప్పుడు గర్భవతికూడా. నీకు నేను చాలా ఆప్తుడిని కనక యింతగా రాస్తున్నాను. స్వచ్ఛమైన నీ కులానికి కళంకం వచ్చిందని నాకు విచారంగా ఉంది. నామాట నిజమో కాదో తెలుసుకోవాలంటే సాయంత్రం ఉద్యానవనానికి వెళ్ళి చూడు. నీకే తెలుస్తుంది."

పేరులేని ఆ ఉత్తరం చదువుకుని రాజు చాలా విచారించాడు. నిజం తెలుసుకుని కూతుర్ని శిక్షించాలని నిర్ణయించుకుని - సభచాలించి అంతఃపురానికి వెళ్ళి - "మనకాంతిమతి యిప్పుడేం చేస్తూంది? ఒకసారిక్కడికి రప్పించు. పనుంది-" అన్నాడు భార్యతో.

'అమ్మాయేమీ తప్పు చెయ్యలేదు కదా - ఎప్పటిలా చిరంజీవి అనికాక కాంతిమతి అన్నారు' అని భయపడుతూనే కాంతిమతి కోసం పరిచారికను పంపింది.

ఆమె వెళ్ళి వచ్చి - "అమ్మాయిగారు పొద్దున్నే ఉద్యానవనానికి వెళ్ళారట. రాత్రికి కానిరారట. అక్కడ పరిచారికలు చెప్పారు" అంది.

ఆ మాటలు విని రాజు చాలా కోపంతో భార్యకైనా చెప్పకుండా పరివారంతో బండిమీద ఉద్యానవనానికి వెళ్ళాడు. ద్వారంవద్ద చాలామందిని కాపుపెట్టి - "కొత్తవా డెవడొచ్చినా పోనివ్వక పట్టుకొండి" అని చెప్పి తోటలో వెదుకుతూ కాంతిమతి ఉన్న మేడ దగ్గరికి వెళ్ళాడు.

రాజుని దూరం నుంచే చూసిన చతురిక తమగుట్టు తెలుసుకుందుకే వారు వస్తున్నారని తడబడుతూ - కామకేళిలో మునిగి ఉన్న వారిద్దరికీ "రాజుగారొస్తున్నారు" అని తెలియజేసింది.

ఆ మాటల కదృష్టదీపు దదిరిపడి కాంతిమతి వద్దంటూన్నా వినకుండా మేడకానుకుని ఉన్న ఒకచెట్టు మానుని ఆధారం చేసుకుని నేలమీదకు దిగాడు.

అప్పటికి చీకటి పడుతూంది. దట్టంగా అరణ్యంలా ఉన్న అక్కడ దాక్కున్న వారిని కనిపెట్టడం ఎవరి తరమూకాదు.

రాజుమేడెక్కుతూ దారిలో ఉన్న చతురికని చూసి - "ఏమే చతురికా! కాంతిమతెక్కడ?" అని అడిగాడు.

"దేవరా! ఈ మేడమీద ఉంది. ఇంటికి రావాలని సిద్ధమౌతూంది" అని - ఆతని నాపుటకు వ్యర్థప్రయత్నం చేసింది.

రాజు తిన్నగా మేడమీదకి వెళ్ళాడు. కాంతిమతి శృంగార వేషం తీసేస్తూందప్పటికి. తండ్రిని చూడగానే ఆమె తెల్లబోయి నిలబడి పోయింది.

రాజు - గదిలోని పరిమళ వస్తువులన్నిటినీ చూసి అనుమానించినా - ప్రత్యక్షంగా చూస్తే తప్ప అదక్కూడదనుకుని -

మేడంతా గాలించాడు. ఎక్కడా ఎవరూ కనపడలేదు. కాని కాంతిమతి ముఖం మీద దంత, నఖక్షతాలూ అవీ చూసి ఆమెను సంభోగవతిగా నిశ్చయించి 'వాడిక్కడే ఎక్కడో దాగున్నాడు. ఇవాళ చీకటి పడింది. రేపు వెదికించి పట్టుకుని శిక్షిస్తాను' అనుకుని – కాంతిమతిని చూసి – "చిరంజీవినీ! నువ్వింత స్వతంత్రురాలివై పోయావేం? కోటవదిలి యింతరాత్రివరకూ యిక్కడ ఒంటరిగా ఉండొచ్చునా? ఫో – తరువాత చెబుతాను" అన్నాడు. ఆమె వెంటనే చతురికతో కలసి అంతఃపురానికి వెళ్ళిపోయింది. కాని ఆమె ప్రాణాలన్నీ ఉద్యాన వనంలోనే ఉన్నాయి.

అనంతవర్మ కొంతసేపా ప్రాంతలో వెతికి, చీకట్లో ఏమీకనపడక ద్వారరక్షకులకు గట్టిగా చెప్పి కోటలోకి వెళ్ళి పోయాడు.

రాజశాసనం విన్న కాంతిమతి – "ఉదయాన్నే పోయి నా మనోహరుణ్ణి పట్టుకుని శిక్షిస్తారు కాబోలు. ఆతోటకి మరోతోవ కూడా లేదు. అయ్యో! వారి కేమైనా ప్రమాదం జరిగితే నేను బతకలేను. పోనీ..అమ్మకి అసలు విషయం చెప్పి – అతన్ని గాంధర్వవివాహం చేసుకున్నానని నాన్నగారితో చెప్పుదునా? చతురికా! నువ్వుతెలివైన దానివి. ఏదేనా ఉపాయం చెప్పు నా ప్రియుడక్కడ ముళ్ళకంపలలో ఉంటేనే నిక్కడకి వచ్చేశాను" అంటూ చతురిక ముందు దుఃఖించింది.

"సఖీ! విచారించకు. నేను దీని కుపాయం ఆలోచించాను. ఈ రాత్రి నీప్రియు డక్కడ ఉండడు. మీతల్లి తండ్రుల కీ వార్త యిప్పుడు చెప్పొద్దు. వాళ్ళు కోపంగా ఉన్నారు. తరువాత చెబుదువుగాని. ఇప్పుడు నేను చెప్పినట్లు చెయ్యి" అంది చతురిక.

కాంతిమతి – వికటించే మందుతిని మంచంమీద విరుచుకు పడిపోయింది.

చతురిక – "కాంతిమతిని పాము కరిచింది" అంటూ అరుచుకుంటూ...ఏడుస్తూ కాంతిమతి తల్లికి చెప్పింది

ఆమె వచ్చి అటూ యిటూ కొట్టుకుంటున్న కూతురుని చూసి దుఃఖిస్తూ మూర్ఛపోయింది. అంతలో అనంతవర్మ విషవైద్యులతో అక్కడికి చేరుకుని పుత్రిక అవస్థను చూసి బాధపడసాగాడు.

వైద్యులు కాంతిమతి చేత ఔషధాలు మ్రింగించాలని ప్రయత్నించగా ఆమె పళ్ళూ పెదవులూ బిగించేసింది. చతురిక వాటిని తీసుకుని - మింగించినట్లు నటించి రహస్యంగా పారేసింది. ఈ దుఃఖంలో కాంతిమతి తల్లితండ్రులు - ఆమె మీద తమకోపాన్ని మరిచిపోయారు. అంతలో చతురిక - రాజ పత్నితో - "అమ్మా! మొన్న ఒక యోగి మన ఉద్యానవనంలోకి వచ్చి ఒక మొక్కని చూపించి - పాముకాటుకి మంచి ఔషధం" - అన్నాడు. నేనామొక్కని జ్ఞాపకం పెట్టుకున్నాను. పోయి తెచ్చేదా?" అని అడిగింది.

అందుకామె - "అయ్యో! ఏమందులో ఏ మహిముందో? సందేహించకు. వేగంగా వెళ్ళి తెచ్చి నీ చెలిని బతికించుకో" అని త్వరపెట్టింది.

చతురిక కొంతదూరం వెళ్ళి వెనక్కివచ్చి - "రాజశాసనం లేకుండా తోటలోకి పోవడానికి వీలుపడదు. మరిచిపోయాను. నాకొక చీటి యిప్పించండి-" అంది.

"నీకు కూడా శాసనమెందుకే?" అందిరాజపత్ని. రాజుకి రాణి ఆమాట చెప్పగా అతను చీటీ రాసిచ్చాడు.

చతురిక వేగంగా ఆ తోటకు పోయి - కోటలో జరిగిన ఉపద్రవం చెప్పి చీటి ద్వారపాలకులకి చూపించి లోపలికి పోయింది.

దీపం వెలుగులో తోటలో నాలుగుమూలలా తిరుగుతున్న చతురికకు - మేడకొక ప్రక్కన కూర్చుని తన అవస్థకు విచారిస్తున్న అదృష్టదీపుడు కనపడ్డాడు.

కాంతిమతి అతని కొరకు పడుతున్న పాట్లన్నీ చెప్పగా అతను ఆమెకు తనయందు కల ప్రేమకి చాలా మెచ్చుకున్నాడు.

చతురిక అతనికి తనబట్టలు కట్టి ....మేలిముసుగు వేసి - దీపాన్ని పట్టుకుని ఆదారినే పొమ్మని చీటీ అతనికిచ్చింది.

అతను ద్వారపాలకులకా చీటిచూపించగా - యిందాక వెళ్ళినదే కదా అని - పరీక్షించకుండా వదలివేశారు. అతను యింటికి పోయి - బలభద్రుడి కావృత్తాంతమంతా చెప్పి - సుఖంగా నిద్రపోయాడు.

కొంత సేపయ్యాక - చతురిక ఏదో వేరు తవ్వి - మొదటనే రహస్యంగా తెచ్చిన దీపం వెలిగించి - పోతూంటే ద్వారరక్షకు లడ్డు పెట్టారు.

ఆమె నవ్వుతూ - "గట్టి శూరులే! నేనిందాకా మీకు చీటి - చూపిపోలేదా? అది ఎక్కడో పడిపోయింది. నేను నిత్యమూ వచ్చేదాన్నే. కాంతిమతి చెలికత్తెను. ఆమెపాము కరచి చనిపోడానికి సిద్ధంగా ఉంది. వేగంగా యీ వేరందించకపోతే రాకుమార్తె బతకదు, రాజుగారు నామీద కోపగిస్తారు. నాపేరు చతురిక. నా సంగతి పొద్దున్న రాజుగారికి చెప్పండి" అంది.

అందుకు వాళ్ళు - "నువ్వెవరివైనా మాకు భయంలేదు. నీమాటలు వింతగా ఉన్నాయి. ఇంతకు మునుపే చీటి చూపించి ఒక స్త్రీ వెళ్ళింది. ఇద్దరిని పోనిస్తామా? నీ విషయం అనుమానంగా ఉంది. నిన్ను కదలనివ్వం - " అన్నారు వాళ్ళు.

అందుకు చతురిక కోపంగా - "మీరు బుద్ధిహీనులని తెలుస్తూనే ఉంది. నేనెవరి ననుకుంటున్నారు? ఆలస్యమైతే రాజకుమార్తె జీవించదు. అనేరం మీమీద పడుతుంది. మీ కనుమానమ్ముంటే నాతోరండి. మీ సందేహం తీరుతుంది" అంది అంతలోనే రాజభటులు "చతురికా! చతురికా!" అంటూ వచ్చారు.

ఆమె - ఓయని పలికి "నేనేంచేసేది! వీళ్ళు నన్ను రానివ్వడం లేదు. వేరు తీసుకుని సిద్ధంగా ఉన్నాను" అంది.

రాజభటులు ద్వారరక్షకులని మందలించి నిజంచెప్పగా వాళ్ళు ఏమీఅనలేక - మొదట పోయినదే తమని మోసం చేసిందని గ్రహించి ఆరహస్యం ఎవరికీ చెప్పక - చతురికను పోనిచ్చారు.

ఆవేరు తెచ్చి నట్లందరికీ చెప్పి - దాని నరగదీసి - కాటువేసిన చోట గంధం పూసి - కాంతిమతి చెవిలో ఊదుతున్నట్లు నటిస్తూ - "నీ మనోహరుడు సుఖంగా తోటదాటి యింటికి చేరుకున్నాడు. నువ్వింక తెలివి తెచ్చుకోవచ్చు". అంది.

కాంతిమతి మెల్లగా తేరుకున్నట్లు నటించింది. అందరూ చతురిక వైద్యం గురించి తెగపొగడసాగారు. "మాట్లాడకండి. ఆమెను నిద్రపోనివ్వండి. లేచేసరికి బాగా తేరుకుంటుంది-" అని అక్కడున్న అందరికీ చెప్పింది.

ఉదయం అనంతవర్మ తోటంతా వెదికించినా ఎవరూ కనిపించకపోడంతో తన శత్రువులెవరో ఆ ఉత్తరం రాసుంటారని భావించాడు. ద్వారరక్షకులు రాత్రి జరిగిన మోసం చెబితే రాజు తమని శిక్షిస్తాడన్న భయంతో ఆ విషయం నోరు మెదపలేదు. రాజు కూతురి మీద కోపమంతా పొగొట్టుకుని ప్రేమగా చూసుకోసాగాడు.

ఇల్లు చేరిన అదృష్టదీపుడు - 'ప్రపంచమంతా కామంచేత ఆడించబడుతూంది! జగత్తంతా ప్రసిద్ధి చెందిన నేను కామంవల్లనే కదా అలా చిక్కుకున్నాను. చతురిక దాటించబట్టి కాని లేకపోతే జైలుపాలవుదును. దైవం అనుకూలించబట్టి గండం గడిచింది.

కాంతిమతి రాత్రి నాకోసంపడిన కష్టం తలుచుకుంటే ఆమెను విడిచి వెళ్ళడం కష్టంగా తోస్తూంది. కాని...మరి కొన్ని దేశాలు తిరిగి రావాలి. ఇప్పటికిక్కడినుంచి వెళ్ళిపోడమే మంచిది-' అని మనసులో భావించి -

"కాంతిమతీ! రాత్రి నువ్వు నాకోసం పడిన ప్రయాసకెంతో బాధేసింది. నీకు చాలా కృతజ్ఞతలు. ఇది వరకే మనకు గాంధర్వ వివాహమైంది. నేను నిన్ను తప్పకుండా పట్టమహిషిగా స్వీకరిస్తాను. నా వివరాలు చెప్పకపోడానికి కారణముంది. ఇప్పుడు నాపేరు మాత్రం చెబుతాను. కొన్నాళ్ళు దేశాటనం చేసి మళ్ళీవస్తాను. నువ్వేమీ చింతించకు.

చిత్రఫలకం చూసుకుంటూ దానినే నిన్నుగా భావించుకుంటాను. ఇట్లు "అదృష్టదీపమహారాజు".

అని ఉత్తరం రాసి భలభద్రుడికిచ్చి – "నేను మనసంకేత స్థలానికి పోతున్నాను. ఈ ఉత్తరం చతురికకిచ్చి – ఆమె చదివేలోగానే నువ్వు తప్పించుకొని వచ్చేయ్" అని వెళ్ళిపోయాడు.

అతనలాగే ఉత్తరాన్ని చతురిక కిచ్చి పారిపోయాడు. చతురిక ఆ ఉత్తరాన్ని కాంతిమతి కిచ్చింది. "చతురికా! అతను మనం గొప్పగా చెప్పుకునే అదృష్టదీపుడే!" అంది, ఆశ్చర్యమూ ఆనందమూ పట్టలేని కాంతిమతి.

"ఔను నువ్వు మొదటినుంచీ అలాటివాడివే కదా భర్తగా కోరుకుంటున్నావు? సౌందర్యమూ, గుణగణాలు అతనిసొత్తు. నీఅదృష్టం గొప్పది. శకుంతలలా మంచి మగణ్ణి సంపాదించుకున్నావు. ఈ విషయం నీ తండ్రి వింటే చాలా సంతోషిస్తాడు."

"ఇక మనం నిర్భయంగా చెప్పొచ్చు "

"మనం చెప్పక్కర్లేదు నీ గర్భమే చెబుతుంది."

"ఈ వియోగాన్నెలా భరించగలను? అతను నిజంగా తిరిగొస్తాడంటావా?"

"ఇంక నీకతనితో పనేముంది? కావలసినపని అయింది కదా?" "నాతో పరిహాసాలడక నిజం చెప్పు "

"అతను తిరిగి వొచ్చి నిన్నాదరిస్తాడని యీ ఉత్తరమే చెబుతూంది. అతను రహస్యంగా ఉండడాని కేదో కారణముంది" అంది చతురిక

తరువాత యీవార్త కాంతిమతి తల్లికి చెప్పగా – ఆమెచాలా సంతోషించింది. ఏకాంతంలో – మాటల సందర్భంలో అదృష్టదీపుడి ప్రస్తావనరాగా – "ఆయన మీకల్లుడే" అంది రాజుతో.

"అదెలా?" అని రాజడిగేసరికి రాణి జరిగిదంతా చెప్పింది. అదృష్టదీపుడంతటివాడు తన కల్లుడైనందుకు చాలా సంతోషించాడు.

గాంధర్వవివాహం దూష్యంకాదని శాస్త్రవేత్తలు ,చెప్పడంతో మరింత ఆనందించి --- గర్భవతయిన కాంతిమతిని కంటికి రెప్పలా చూసుకుంటూ అదృష్టదీపుణ్ణి వెదకడానికి నాలుగు మూలలకీ దూతలని పంపాడు.

బలభద్రుడితో కలిసి నడుస్తున్న అదృష్టదీపుడు కాంతిమతితో గడిపిన మధురఘట్టాల గురించి చెబుతూ ఆమె వియోగానికి పరితపిస్తూంటే బలభద్రుడతన్ని ఓదార్చసాగాడు. పదిరోజులు నడిచాక వాళ్ళకొక పట్నం కనిపించింది.

ఆపట్నం పేరు పుష్పగిరి. దానికి రాజు రాజవాహనుడు. అదృష్టదీపు డా పట్నంలో తన పేరిట ఉన్న సత్రంలోనే బస చేశాడు. అక్కడ కూడా తన పేరు బాగా ఖ్యాతి చెందడం అతను గమనించాడు.

ఒకనాడు సత్రం అరుగు మీద కూర్చుని ఉండగా - ఒక బ్రాహ్మణుడు తన ముఖాన్ని పరిశీలనగా చూడడం గమనించాడు.

"అయ్యా! మీ దేదేశం? ఇక్కడికి ఎప్పుడొచ్చారు? నన్నెందుకు పరీక్షగా చూస్తున్నారు?" అని అడిగాడు. దానికా బ్రాహ్మణుడు ఇలా చెప్పాడు.

"అయ్యా! మేము మాళవదేశ రాజధా నయిన కోశాంబి పట్నంలో నివసించే వాళ్ళం. నేను ఆ దేశప్రభువైన ధర్మపాలుని పురోహితుడిని. నాపేరు విష్ణుశర్మ. కొన్ని సంవత్సరాల క్రిందట మారాజుశత్రువులచే ఓడించబడి కారాగారంలో పెట్టబడ్డాడు. నేను చక్కని పండితుడిని. నాది పెద్ద కుటుంబం.

ఆ కొత్తరాజు చాలాదుర్మార్గుడు, ధర్మపాలుడితో కల విరోధంకొద్దీ అత నంతకుముందు నాకిచ్చిన ధనకనకవస్తువాహనాలన్నీ కొల్లగొట్టుకోడమేకాక నన్నా వూరినుంచి వెళ్ళగొట్టాడు. అక్కడ నన్ను రక్షించే వారెవరూ లేక నేను దేశాటనం చెయ్యసాగాను. కుటుంబం పెద్దదవడంతో ఎక్కడికిపోయినా గడవడం కష్టంగా ఉంది.

అదృష్టదీప మహారాజుగారి కీర్తి విని ఆయన దర్శనం చేసుకుంటే నా దరిద్రం పోతుందన్న ఆశతో యీవూరువచ్చి సత్రంలో దిగాను. ఎన్నిరోజులున్నా భోజన లోపంలేదు. పొమ్మనరట. అదృష్టదీపమహారాజు తీర్థయాత్రకు వెళ్ళారట. ఏతీర్థంలో ఉన్నారో తెలియదు ప్రతి తీర్థంలోనూ బ్రాహ్మణులు ఆయన కోసం చూస్తున్నారు. ఆయన్ని దర్శించుకుంటే దరిద్రంపోయి కుబేరు డౌతాడట. ఆపుణ్యాత్ముని దర్శనం కాకపోతుందా అని ఆశతో ఉన్నాను. మీ ముఖం చూస్తూంటే మా ధర్మపాలుని పోలికలు కనపడుతున్నాయని అలా పట్టిపట్టి చూశాను." "అయ్యా! మీరాజుగారి నోడించిన వారెవరు? ధర్మపాలుడికి భార్యాబిడ్డలున్నారా? వాళ్ళేమయ్యారు?" అని అడిగా దదృష్టదీపుడు.

"అయ్యా! మాపట్నాన్ని ముట్టడించిన వాడు చోళదేశపురాజు సురక్షితుడు. మా రాజుగారి భార్య సునంద గర్భవతిగా మూడేళ్ళ వయసుకల కొడుకుతో - యుద్ధకాలంలోనే పారిపోయింది. అప్పటినుండీ వారిజాడే తెలియదు. ఇదంతా పెద్ద మంత్రయిన విహార భద్రుడి వలన వచ్చింది-" అని బ్రాహ్మణుడు చెబుతూంటే - వాళ్ళ వాళ్ళ పేర్లు రాసుకుని దాచి ఉంచాడు.

అంతలో - అంగడికి పోయిన బలభద్రుడు తిరిగివచ్చి - "మిత్రమా! నేనో విశేషం చూశాను. ఒక చక్కని చిన్నవాడిని బండిమీద కెక్కించి ఊరేగిస్తున్నారు అతన్ని చూసి నువ్వే అనుకుని దగ్గరగా వెళ్ళబోయాను. కాని - విచ్చుకత్తుల రాజకింకరులవల్ల మాట్లాడడానికి వీలు చిక్కలేదు" అన్నాడు.

"తరువాత?" అడిగా దదృష్టదీపుడు. "ఆ కింకరులు - యితడేమి అపరాధం చేశాడని నేనడిగినా చెప్పలేదు. అప్పుడక్కడికి దగ్గరగానే ఉన్న మరికొందరినడిగాను."

# ప్రియంవద కథ

"అతనొక బ్రాహ్మణకుమారుడు. అతనిపేరు హరిదత్తుడు. అతనాపట్నపు రాజుగారి కూతురు ప్రియంవద అడిగిన ప్రశ్నలకు జవాబులు చెబుతానని ఒప్పుకుని ఆమె అంతఃపురం ప్రవేశించాడు. కాని ఆమె అడిగిన వాటికి సమాధానాలు చెప్పలేకపోయాడు.

రాజశాసనం ప్రకారం అతన్ని ఉరితీయబోతూ ఊరేగిస్తున్నారు. అతనికి బదులు మరెవరేనా ప్రియంవద ప్రశ్నలకు జవాబిస్తామని ముందుకొస్తే – అతను చెప్పగలిగితే యితన్ని కూడా వదిలేస్తారు. అతను కూడా చెప్పలేకపోతే యిద్దరినీ కలిపి ఉరి తీస్తారు అదీ సంగతి" అని చెప్పారు.

అది విని నేను చాలా విచారిస్తూ వచ్చాను. ఆ బ్రాహ్మణ కుమారుడు అచ్చంగా నీలాగే ఉన్నాడు సుమీ! తలదించుకుని బండిమీద కూర్చున్నాడు. అతన్ని విడిపించగల వాళ్ళెవరూ లేకపోయారు" అన్నాడు బలభద్రుడు జాలినిండినకంఠంతో.

"అయ్యో! బ్రాహ్మణకుమారుణ్ని ఉరి తీసే రాజు నేమనాలి? అతని కూతురింత అన్యాయ వ్రతమెందుకు పూనింది? సరే. నేనిప్పుడే పోయి ఆ ప్రశ్నలకి జవాబులు చెబుతాను. అతన్ని విడిపిస్తాను. దైవం అనుకూలిస్తే సరే. లేకపోతే యిద్దరమూ మరణిస్తాం. ఏమంటావ్?" అని అదృష్టదీపుడు బలభద్రుడివేపు చూశాడు. "అన్నా! తొందరపడకు. ఆ ప్రశ్నలేమిటో తెలుసుకుని తరువాత ఆలోచించు. లేకపోతే అనవసరంగా చిక్కుల్లో పడతాం" అని బలభద్రు డంటూండగానే అతను లేచి – "ఆ విప్రకుమారుడెక్కడ? పద" అన్నాడు. వాళ్ళు అంగడి కెళ్ళేసరికి బ్రాహ్మణకుమారుణ్ణి వధ్యభూమికి తీసుకెళ్ళిపోయారు. అతనిగురించి ప్రజలు సానుభూతి వచనాలు పలుకుతున్నారు. అవివింటున్న అదృష్టదీపుడు "మిత్రగుప్తుడనువాడు యితని ప్రాణాలు కాపాడడానికి

రాజుగారి దగ్గరకు పోయాడు. అంతవరకూ ఉరితీయవద్దని వారికి చెప్పి నువ్వక్కడ ఉండు – "అని బలభద్రుణ్ని వధ్యభూమికి పంపి తాను రాజు వద్దకు వెళ్ళి, వారికి నమస్కరించి

"అయ్యా! మాది కాశీదేశం. నాపేరు మిత్రగుప్తుడు. మీ అమ్మాయి వేసిన ప్రశ్నలకు హరిదత్తుడికోసం నేను జవాబు లిస్తాను. ఆరుమాసాల గడువివ్వండి. ఇప్పుడే హరిదత్తుణ్ని ఉరితీయొద్దని ఆజ్ఞాపత్రం పంపండి." అనే సరికి రాజసభలోని వారతని ధైర్యసాహసాల కాశ్చర్యపడ్డారు. హరిదత్తుడితో ఏదో బంధుత్వం ఉంటుందనుకున్నారు.

రాజవాహను డతని తెగింపుకి ఆశ్చర్యపడి – "నేను దారుణమైన శపథం చేశాను. నువ్వు విన్నావో, లేదో హరిదత్తుడి గురించే నన్ను నిందిస్తున్నారు. నువ్వుకూడా జవాబులు చెప్పలేక పోతే యిద్దర్నీ ఉరితీయవలసివస్తుంది. బాగా ఆలోచించుకో" అన్నాడు.

"మీ శపథ మంతావినే వచ్చాను. ఆ విషయంలో నాకేమీ సందేహం లేదు. వేగంగా వధ్యభూమికి ఆజ్ఞాపత్రిక పంపండి" అని ప్రార్థించాడు.

రాజవాహను డతని పేరురాసుకుని, ఆరుమాసాలకి తిరిగి వచ్చేటట్లుగా ప్రమాణం చేయించుకుని – ఆరునెలలవరకూ హరిదత్తుడిని ఉరితీయకుండా జైలులో ఉంచమని ఆజ్ఞాపత్రిక రాసి వధ్యభూమికి పంపాడు.

దానిని చూసి – రక్షకభటులు హరిదత్తుణ్ణి ఉరితీయకుండా, కారాగారంలో ఉంచారు. అదృష్టదీపుడికి హరిదత్తుడిని చూడాలని పించింది. కాని – పని తొందరలో కుదరలేదు.

ఆ ప్రశ్నలేమిటో చెప్పమని రాజు .నడగగా – ఆ ప్రశ్నలు రాయబడిన పత్రికను తెప్పించి అతనికిచ్చాడు ఆ ప్రశ్నలను అదృష్టదీపుడు చదువుకోసాగాడు.

భువనేశ్వరీదేవికి ఎన్ని ముఖాలు? వాటికే కాంతులుంటాయి. "భువనేశ్వరీ దేవి ఆలయం ఎక్కడుంది? అక్కడి భాషేమిటి? వీటికి సరయిన సమాధానాలు చెప్పినవాడిని వివాహం చేసుకుంటాను. చెప్పకపోయిన వాడిని చంపిస్తాను"

ఆ ప్రశ్నలు రెండుమూడు సార్లు చదువుకుని తలూపుతూ రాజుదగ్గర అనుమతి తీసుకుని యింటికి వెళ్ళాడు. "బలభద్రా! ఈ ప్రశ్నల కెవరూ జవాబులు చెప్పలేరు. భువనేశ్వరీదేవి ఆలయ మెక్కడుందో ఎవరు చెప్పగలరు? ఆరునెలల గడువుందికదా. నువ్విక్కడే ఉండు. నేను దేశాటనం చేసివస్తాను" అన్నాడు.

బలభద్రుడికి దుఃఖం ఆగలేదు. "అయ్యో! నేను ముందే చెప్పాను కదా బాగా ఆలోచించమని నీ కావిశేషం చెప్పడమే తప్పయింది. నువ్వింత సాహసం చేస్తా వనుకోలేదు. ఇంతకీర్తి సంపాదించి చివరికొక ఆడదానివలన మరణించడమా! ఉండు, మనమిప్పు డెవరికీ తెలియకుండా పారిపోదాం. హరిదత్తుడి సంగతేదోఔతుంది" అంటూ విలపించాడు.

"మిత్రమా! విచారించకు. గుక్కెడు ప్రాణంకోసం అబద్ధమాడతామా! సత్యపాలనకోసం పూర్వులెలాంటి కష్టా లనుభవించారో నీకు తెలియదా? ఒక బ్రాహ్మణుని నిమిత్తం ప్రాణాలు త్యాగం చేయడం కంటె సుకృత మింకేం ఉంటుంది. శరీరం అస్థిరమే. కాలం ఎప్పుడూ ఒకరీతిగా నడవదు. డబ్బులేని రోజుల్లో ఎంతో కీర్తి లభించింది. ఇప్పుడో? బ్రాహ్మణుల దీనాలాపాలు వింటూ కూడా ఏమీ యివ్వలేనిస్థితి. పారిపోవడం మగతనం కాదు. అది నాకు సమ్మతం కాదు. ఆరుమాసాలలోగా ఆ ప్రశ్నలకు జవాబులు తెలుసుకుందుకు ప్రయత్నిస్తాను. దైవానుగ్రహంఉంటే తెలుస్తాయి. నువ్వు ధైర్యంగా ఉండు పుట్టించిన భగవంతుడు తరువాతఊరుకుంటాడా? ఈ ఆపద కూడా గట్టెక్కగలమనే నావిశ్వాసం." అంటూ అదృష్టదీపుడతనికి ధైర్యం చెప్పాడు.

" నీ మాటలు నిజమే. మనకవమానం జరగదు. నేనూ నీతో దేశాటనం వస్తాను"అన్నాడు బలభద్రుడు.

"ఆప్రశ్నలకు జవాబుల కోసం దేశాలు తిరగక్కర్లేదు. ఈ ఊరినుంచే తెలుసుకోవచ్చు ఆ రాజకుమార్తె ప్రియంవద నిత్యమూ చేసేపనులు తెలుసుకుంటే ఆ ప్రశ్నలకు జవాబులు లభిస్తాయి. కనక నువ్విక్కడే ఉండి ఆమెను గమనించు. నేనూ ఆ ప్రయత్నం చేస్తాను" అన్నాడు అదృష్టదీపుడు.

ఇంతవరకూ చెప్పేసరి కర్ధరాత్రయిపోయింది. మణిసిద్ధుడు గోపాలుడివేపు చూసి - "కథయింకా చాలా ఉంది. ఈ రాత్రికి పూర్తవుతుందో, లేదో టూకీగా చెప్పెయ్యమంటావా, లేక తరువాత మజిలీలో చెప్పమంటావా?" అని అడిగాడు.

"కథ వివరంగానే చెప్పాలి. మీకు నిద్దరొస్తూంటే రేపు చెబుదురుగాని. అంతే తప్ప కట్టె కొట్టె తెచ్చె అన్నట్లు చెబితే కథ రంజుగా ఉండదు" అన్నాడు గోపాలుడు.

ఇద్దరి భోజనాలూ అయ్యాక - గోపాలుడు పాదాలొత్తుతూంటే యతిహాయిగా నిద్రపోయాడు.

తెల్లవారాక వాళ్ళు మళ్ళీ ప్రయాణం కట్టారు.

# కాశీమజిలీ కథలు

## 17. వమజిలీ

### భువనేశ్వరి దేవి కథ

శౌనకుడు (గోపాలుడు) 'తరువాయి కథ చెప్పండి' అంటూ వేధిస్తూంటే, మణిసిద్ధుడు తన కార్యక్రమాలను తొందరగా ముగించుకుని ఒక చెట్టునీడకు చేరి ఆ కథ చెప్పసాగాడు.

అదృష్టదీపుడు పుష్పగిరిలోనే ఉండి – రాజపుత్రిక నిత్యమూ ఏంచేస్తూందో పరీక్షిస్తూ....ఆమె చెలికత్తెలనూ దాదులనూ తెలుసు కోసాగాడు. కొన్నాళ్ళు గడిచాక – రాజకుమార్తెకు కలహంసిక అనే ఆమెతో చాలా స్నేహమని తెలిసింది.

అతనామె యింటికి వెళ్ళి..."కలహంసికా! నువ్వు చాలా తెలివైన దానివనీ, నీవద్ద కొన్ని విషయాలు తెలుసుకోవాలనీ వచ్చాను. మాది కాశీదేశం. అదృష్టదీపుడికి స్నేహితుడిని. నాపేరు మిత్రగుప్తుడు. అదృష్టదీపుడు తీర్థయాత్రకు పోగా నేనతన్ని చూడాలని వెళ్తున్నాను. ఈ వూరొచ్చి పదిరోజులైంది. ఈ పట్నంలో ఎవరెక్కువ తెలివైన వారంటే నీపేరు ముందుగా చెప్పారు అందుకే నీ దగ్గరకి వచ్చాను.

నేనూ నా మిత్రుడూ ఒకనాడు చతురంగ బలాలలతోనూ ఒక అరణ్యానికి పోయాం. మిట్టమధ్యాహ్నం కాగా ఎండవేడికి తాళలేక ఒక తాడిచెట్టు నీడలో నిలబడ్డాం. మా సేనలన్నీ దగ్గరలోనే ఉన్న ఒక మర్రిచెట్టు నీడలో నిలిచాయి అప్పుడు మా మిత్రుడు ఒక్కసారి ఫక్కున నవ్వాడు.

"ఎందు కకారణంగా నవ్వావు?" అని నేనెంతో కుతూహలంగా అడిగాను. అతను చెప్పలేదు. అంతేకాకుండా – "ఈ కారణం నువ్వు ఊహించి చెబితే నీకు వేయి దీనారాలిస్తాను" అని ప్రతిజ్ఞ చేశాడు.

నేను ఆరుమాసాల వ్యవది కోరాను. అత ననుమతించాడు. అది మొదలు నేను దేశాటనం చేస్తూ ప్రతిపట్నం పోతూ అక్కడ బుద్ధిమంతులుగా పేరు పొందిన వారినల్లా అడుగుతూ వస్తున్నాను. ఇప్పటికి మూడు నెలలు గడిచాయి ఎవరూ చెప్పలేక పోయారు. నీ బుద్రంతా ఉపయోగించి నా ప్రశ్నకు జవాబు చెప్పావో నా లాభంలో సగంనీకిచ్చేస్తాను" అన్నాడు.

అందుకామె – "మీరు నన్నింత పెద్ద చేసి గౌరవిస్తే నేనే మనగలను? అదృష్టదీప మహారాజు మిత్రులైన మీకంటె నేను బుద్ధిశాలిని కాగలనా? నాకు పాండిత్యమూ లేదు, ప్రజ్ఞాలేదు. మాప్రియంవద రూప, విద్యా, బుద్ధులచేత అసామాన్యురాలు. మీరడిగిన ప్రశ్నకు నాకే సమాధానం తోచలేదు. కనుక ఆమెనడిగి చెబుతాను రెండు మూడు రోజులు గడిచిన తరువాత ఒకసారి దయచేయగలరా? ఆమె యిలాటి వాటి కతిసులభంగా చెబుతుంది" అంది

"అలాగే" అని రెండు రోజు లయ్యాక మళ్ళీ ఆమె దగ్గరికి వెళ్ళాడు. "ఆర్యా! నేను మరచిపోయి మిమ్మ ల్నీ రోజు రమ్మన్నాను. ప్రియంవదతో నిన్న మాట్లాడదానికి వీలుకాలేదు. ఆమె ప్రతిశుక్రవారం భువనేశ్వరీ దేవి నర్చించదానికి కేళీ శైలమునకు వెళ్తుంది. ఆరోజు ఆమెతో మిగిలిన విషయాలు మాట్లాడకూడదు. నిన్న శుక్రవారం. మిమ్మ ల్ననవసరంగా శ్రమపెట్టినందుకు సిగ్గుపడుతున్నాను" అంది కలహంసిక.

అదృష్టదీపుడు నవ్వుతూ – "ఈ మాత్రానికే నాకు శ్రమా? దీనికోసమే కదా దేశమంతా తిరుగుతున్నాను? రేపుమళ్ళీ వస్తాను" అని ఒకసా రాగి – "మీస్నేహితురాలికి వివాహమైందా! పిల్లలెందరు? ప్రతి శుక్రవారం భువనేశ్వరీ దేవి పూజ ఎక్కడ చేస్తుంది? కేళీశైలం ఎక్కడుంది? నీద్వారా ఆమెకూడా మాకు బంధువే అయింది. ఆమె వృత్తాంతం తెలుసుకోవాలని ఉంది. రహస్యంకాకపోతే చెప్పు." అన్నాడు.

కలహంసిక ఆమెకు వివాహం కాలేదనీ తండ్రి ఎంత చెప్పినా వినకుండా ప్రశ్నలకూ వివాహానికీ ముడి పెట్టిందనీ, బ్రాహ్మణ కుమారుడి ఉరి గురించీ చెప్పి – "ప్రియంవద ప్రతిశుక్రవారమూ మధ్యాహ్నం

యింటివద్ద భువనేశ్వరీ దేవి నర్చించి సాయంకాలం విధిగా కేళీశైలం వెళ్తుంది. అది యీ పట్నాని కుత్తరంగా రెండు మైళ్ళదూరంలో ఉంది. ఆశిఖర మెక్కేటప్పుడు మాత్రం మమ్మ ల్నెవర్నీ రానివ్వదు. తను ఒక్కర్తే వెళ్ళి కొంతసేపుండి వస్తుంది. ఆ శిఖరం మీద ఏమీలేదు. ఆమె అక్కడేం చేస్తుందో తెలియదు.

ఒకనాడు సాహసించి ఆమె ఏం చేస్తూందో చూద్దామని ఆశిఖరం మీదకు వెళ్ళాను. ఆమె ఎక్కడా కనిపించలేదు. ఏ శిలచాటునేనా ఉంటుందేమో. నన్ను చూస్తే శిక్షిస్తుందన్న భయంతో వెంటనే వచ్చేశాను" అంది.

"ఆమె శుక్రవారం కాక మరెప్పుడేనా అక్కడికి వెళ్తుందా?" మరేరోజూ "వెళ్ళదు" అంది కలహంసిక.

"సరే, నేను మళ్ళీ వస్తాను. ఈ సారికేనానా ప్రశ్నకు సమాధానం సిద్ధం చేసి ఉంచుసుమీ – " అని అతను ఆమెనుంచి శలవు తీసుకున్నాడు.

ఆ సాయంత్రం కలహంసిక చెప్పిన గుర్తులు చూసుకుంటూ అతనా కేళీ శైలానికి వెళ్ళాడు.

ఆ పర్వతం చుట్టుకొలత నాలుగు మైళ్ళుంది. ఎత్తు అరమైలుంది. వీలుగా ఉండడంవల్ల ఎక్కడం కష్టం అవదు. చిన్న చిన్న తుప్పలే తప్ప పెద్ద చెట్లేమీలేవు. కొండమీదకి చాలా తోవలున్నాయి. శిఖరం విశాలంగా బల్లపరుపుగా ఉంది. ఎంత శ్రద్ధగా పరికించి చూసినా అతని కక్కడ ఏమీ కనపడలేదు

అతను కలహంసిక వద్దకు వెళ్ళాడు. ఆమె – "మారాజకుమార్తె – ప్రశ్నకు సమాధానం చెబితే ఏమిస్తారో కనుక్కోనుంది" అంది.

"ముందే చెప్పానుగా? నా కతనిచ్చేదానిలో సగమిస్తానని" అని...తాను వెళ్ళిన కొండ సరయినదే అని నిర్ధారణ చేసుకుని...వచ్చేసి.... ఆ శిఖరానికి మూడు నాలుగుసార్లు వెళ్ళి చూసినా ఏ విశేషమూ కనపడలేదు. అప్పుడతనికి విచారం కలిగింది 'గడువు సమీపిస్తూంది.

జవాబులు దొరకలేదు అనవసరంగా బ్రాహ్మణబాలుడు ఉరితీయ బడతాడు. నాచావుకి విచారం లేదు. ఇంక నేను పట్నానికి పోడమెందుకు? రాత్రి వేళయిక్కడ విశేషాలేమైనా కనపడతాయేమో చూస్తాను.' అని అతనారాత్రి కొండదగ్గరే ఉండిపోయాడు. రాత్రి కూడా అక్కడేమీ కనిపించలేదు.

ఉదయం లేచి - విరక్తితో మరోదేశం పోవాలనుకున్నాడు. తన ప్రఖ్యాతినీ, కాంతి మతినీ .... అన్నిటినీ తలుచుకుంటూంటే అతని కప్రయత్నంగా నిద్రపట్టేసింది. ఆ నిద్రలో అతని కద్భుతమైన కల వొచ్చింది అతను కళ్ళు తెరిచాడు.

ఎదురుగా ఒక దివ్య భవనం, నవర్నత దీపాలు వెలుగుతూ కళ్ళు మిరుమిట్లు గొల్పుతూంది. కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచాడు. మళ్ళీ అలాగే కనపడింది

కలో నిజమో అతని కర్థంకాలేదు అతను చటుక్కున లేచి కూర్చున్నాడు. పర్వతంమీద ఉన్నట్లు గమనించాడు. అప్పుడతనికి విచారమేసింది మరికొంత సేపు ఆకల ఉంటే ఏం జరుగేదో అనుకుని గట్టిగా కళ్ళుమూసుకున్నాడు ఆ భవనం కనిపించింది

అది ఒక ఓషధీ లత ప్రభావమని అతను గ్రహించాడు దానిని ముట్టుకున్నంత సేపూ ఆ భవనం కనిపిస్తుంది. అత నా లతని పెకిలించాడు. కనపడుతున్న మేడలోకి ప్రవేశించాడు.

ద్వారాల పక్కనున్న విగ్రహాలను నిజమైన స్త్రీలనుకుని మాట్లాడబోయాడు అంతలో అవి బొమ్మలని తెలిసింది. ముందుకువెళ్ళి సాహసించి ఒక గది తలుపు తెరవగా దానినిండా వజ్రాలున్నాయి. వాటికాంతులు భరించలేక తలుపు మూసేసాడు మరోగదిలో రత్నాలు, ఇంకో గదిలో వైదూర్యాలు

ఇవన్నీ నా అధీనమైతే లోకంలో యాచకులనే వారినే ఉండనివ్వక పోదును కదా అనుకుంటూ కొన్నిటిని తీసి మూటకట్టాడు. అలా తిరుగుతూంటే ఒకమూల సోపానాలు కనపడ్డాయి. ఆ మెట్ల మీదుగా వెళ్ళగా అక్కడొక అంతస్తుంది. మొదట కాంతిపుంజం తప్ప మరేమీ

కనపడలేదు. కాని క్రమంగా ఆ వెలుగు అణిగి - రత్నకంబళికనిపించింది. ఒక మూల బంగారు విగ్రహం కనిపించింది. రెండు చేతులు, మూడు తలలూ కలిగిన ఆ విగ్రహం శక్తిలా ఉండి - భయం కొల్పుతూంది.

దానిని దాటి మెట్లమీద యింకా పైకి వెళ్ళగా - మరొక అంతస్తులో ఒకమహాశక్తి - ఐదుముఖాలు, పదిచేతులతో...ప్రపంచాన్ని పాలించే సమర్థతని చూచించే తేజస్సుతో....దయ వెదజల్లే కన్నులతో కనపడింది. ఆమె ముఖంలో ఐదురంగులున్నాయి. పీఠం దిగువ - భువనేశ్వరీదేవి - అని రాయబడి ఉంది.

అతని ఆనందం చెప్పనలవికాదు. ఆ భువనేశ్వరీదేవి వెనుక గోడమీద ఒక పద్యం రాయబడి ఉంది. దానిని బట్టి ఓషధీలత చిక్కినవాడే ప్రియంవద భర్త కాగలడు. అక్కడి రత్నాల కధికారి కాగలధు.

అదృష్టదీపుడు - హరిదత్తు దాశపడిన ప్రియంవదను నేనెలా అంగీకరించగలను? - అనుకున్నాడు కానీ - అంతవరకూ వచ్చాక చూడొచ్చులే అనుకుని భువనేశ్వరీదేవికి సాష్టాంగపడుతూ పరాకున తన చేతిలో ఉన్న తీగెను నేలమీద ఉంచాడు.

అతను భక్తి పూర్వకంగా ధ్యానించి లేచి కళ్ళ తెరిచేసరికి కొండ తప్ప మరేమీలేదు. అకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. తుప్పలూ మొక్కలతో నేల కనిపించింది.

అతనికి తను చేసిన పొరపాటు తెలిసింది. 'అదంతా నిజమే అనుకోడానికి తన వద్ద రత్నాల మూట ఉంది. కల ఐతే కలలో వస్తువులెలా ఉంటాయి - మెలకువ వచ్చాక? ఇదంతా దేవమాయ తప్ప మరొకటి కాదు. ప్రియంవదకు కలలో కనిపించిన భువనేశ్వరీ దేవిని బట్టి జవాబులు చెబుతాను" అనుకుంటూ పట్నంలోకి వెళ్ళి కలహంసిక యింటికి వెళ్ళాడు.

అతనిని చూసి ఆమె చాలా సంతోషిస్తూ ఎదురొచ్చి - "అయ్యా! మీ రాజుగారి నవ్వుకి కారణం వినండి 'మర్రి చెట్టు విత్తనం చాలా చిన్నదైనా ఎంతో పెద్దదిగా వ్యాపించి నాసేన నంతటినీ ఎండతగలకుండా

నీడనిస్తూంది. ఈ తాడిచెట్టు విత్తనం చాలా పెద్దదైనా యిద్దరికే నీడ నివ్వలేకపోతూంది! సృష్టి విచిత్రం..' అని నవ్వారు. ఈ కారణం వారికి చెప్పి మీ కిచ్చే కానుకలో సగం నాకు పంచండి. వేగం వెళ్ళండి." అంది.

అతనా రాజపుత్రిక బుద్ధి కౌశలానికి చాలా మెచ్చుకుని– "కలహంసికా! నామిత్రు డిప్పుడెక్కడో ఉన్నాడు. అతనివద్దకు వెళ్ళొచ్చే సరికి చాలా ఆలస్యమౌతుంది. నువ్వు చాలా శ్రమపడ్డావు. మీ ప్రియంవద నీ కోసమే కదా జవాబు చెప్పింది. నా దగ్గర ప్రస్తుతం యీ రత్నాలున్నాయి. వీటిని నీకు పారితోషిక మిస్తున్నాను, తీసుకో" అంటూ రత్నాల నామె దోసిట్లో పోశాడు.

ఆమె ఆ రత్నాలను చూసి, వాటి కాంతికి ఆశ్చర్యపడుతూ "అతను సామాన్యుడు కాదని" అతనికి నమస్కరించి అప్పటికప్పుడే ఆ రత్నాలను తీసుకుని ప్రియంవద దగ్గరకి వెళ్ళింది.

అదృష్టదీపుడు తాను చూసిన విశేషాలు బలభద్రుడితో చెప్పడాని కారాటపడుతూ చాలా వేగంగా యింటికి నడవసాగాడు. అంతలో – రాజకింకరు లెదురుపడి – "హరిదత్తా! ఎక్కడికి పోతావ్?" అంటూ అతన్ని పట్టుకుని జైలులాటి ఒకమేడలో బంధించారు.

"నేనేం నేరం చేశాను? నేను పెట్టిన గడువు దాటలేదే! నేను మిత్రగుప్తుడి నైతే – హరిదత్తు డంటారేమిటి? అత నెక్కడికేనా పారిపోయాడా?" అని అడిగాడు. అందుకు వారు "నీ మాయమాటలు నమ్మం. నువ్వు హరిదత్తుడివే. నీ ఆకారం కల ఈ చిత్ర ఫలకం చూసుకో. కొంచెమైనా తేడా లేదు నువ్వు మమ్మల్ని మాయచేసి పారిపోయి మాకు మాట తెప్పించావు. ఈ సారి నీకు మరణం తప్పదు. నీమీద రాజుగారికి చాలా కోపంగా ఉంది. వ్యవధి వరకూ ఉండనిస్తా రనుకోము" అనిఅన్నారు కఠినంగా.

హరిదత్తుడికీ నాకు అన్నిపోలిక లున్నాయా! ఆ వేళ బలభద్రుడూ అలాగే చెప్పాడు సరే...అతను తప్పించుకు పారిపోయాడు కాబోలు. అతను బతికితే చాలు' అనుకున్నాడు మనసులో.

ప్రియంవద కలహంసి కందించిన రత్నాలను తీసుకుని చాలా ఆశ్చర్యపోయింది "నువ్వు చెప్పినప్పుడు నేను నమ్మలేదు. ఈ మాత్రపు దానికే అంతధనమిస్తాడా అనుకుని శ్రద్ధ చెయ్యలేదు. అదృష్టదీపుని ప్రసిద్ధీ, దాతృత్వమూ గొప్పవి. ఈ రత్నాలకు మా తండ్రి రాజ్యమంతా కూడా సరితూగదు. ఈ వ్రతం లేకపోతే అలాటి వాడిని వివాహమాడితే చక్కగా ఉంటుంది. నాప్రశ్నలకు జవాబులు చెప్పేవాడూ లేడు, నాయౌవనానికి సార్ధకతా లేదు" అని నిట్టూర్చింది

"అక్కా! నిన్నెన్నాళ్ళనుంచో అడుగుదా మనుకుంటున్నా నీకు కోపం వస్తుందేమో అని ఊరుకుంటున్నాను. నువ్వే యీ ప్రసక్తి ఎత్తావు కనక అడుగుతున్నాను తప్పయితే క్షమించు సుమా. నువ్విలాటి వ్రతం ఎందుకు పూనావు?" మెల్లగా అడిగింది కలహంసిక.

"సఖీ! ఆడవాళ్ళ వద్ద రహస్యం దాగదని నీకు చెప్పలేదు. అంతే తప్ప నీకు చెప్పరాని విషయాలు నా దగ్గరేముంటాయి?" అని ఒకసారాగి – "నేను మా కులదేవత భువనేశ్వరీదేవి వరానపుట్టాను. ఒకనాడు త్రికాల వేది అయిన ఒక యోగి మా యింటి కతిధిగా రాగా మా తండ్రి నన్నాయన శుశ్రూషకు నియోగించాడు. నే నాయనకు చక్కగా సేవలు చేశాను. కొన్నాళ్ళుండి – ఆయన వెళ్తూంటే – మా తండ్రి నన్ను చూపించి – "మీ శిష్యురాలి కెలాటి వరుడు లభిస్తాడు?" అని అడిగాడు.

ఆయన నన్నుచూసి నవ్వుతూ – "బాలా! నీకు పెళ్ళి చేసుకోవాలని వుందా?" అని అడిగారు.

నేను సిగ్గుతో తలవంచుకున్నాను. అప్పటికి నాది వచ్చీరాని వయసు. "మీ అనుగ్రహం ఉంటే – పెళ్ళి చేసుకుంటాను." అన్నాను.

అప్పుడాయన ఏదో మంత్రం ధ్యానించి – ప్రశ్నలపట్టిక రాసిచ్చి – "వీనికి సరైన సమాధానాలు చెప్పిన వాడిని కాని పెళ్ళాడకు. ప్రతిశుక్రవారం భువనేశ్వరీదేవి నర్చిస్తూ సాయంత్రం విహార శిఖరానికి వెళ్ళి అక్కడ కొంతసేపు క్రీడించి వస్తూండు. సార్వభౌముడు కాని యీ ప్రశ్నలకు సమాధానం చెప్పలేడు" అన్నాడు

"ఎప్పటికేనా అలాటి వాడు దొరుకుతాడా?" అని అడిగాడు మాతంగ్రి.

అప్పుడా యోగి ఆయనకేమీ చెప్పక నాచెవిలో ఏదో చెప్పి దీవించి వెళ్ళిపోయాడు. గురువు ఆజ్ఞలేదు కనుక అతను నా చెవిలో చెప్పింది మాతంగ్రికి కూడా చెప్పలేదు.

నన్ను చూడాలని వచ్చే వంచకులను ఆటపట్టించడానికే మాతంగ్రి అలాటి శాసనం చేశాడు. అదృష్టదీపుడి స్నేహితుడు చాలా గొప్పవాడిలా ఉన్నాడు. యతి మాటలు తలుచుకుంటే భయమేస్తూంది. ఈ రత్నాలని చూస్తూంటే మానవలోకానికి సంబంధించిన వనిపించదు. మాతంగ్రికి చూపిస్తే అతనికేమి తోస్తుందో?" అంది ప్రియంవద.

వాళ్ళు అలా మాట్లాడుకుంటుండగా – ఒకదాది ఉత్తరం తెచ్చి తంగ్రి గా రిమ్మన్నారంటూ దానిని ప్రియంవద కందించింది.

"అమ్మాయీ! హరిదత్తుడనే బ్రాహ్మణ కుమారుని పేరు నీవిదివరకు విని ఉన్నావు. ఒక కారణం చేత అతని ఉరికి ఆరుమాసాల వ్యవధి ఇవ్వవలసి వచ్చింది. వాడు బందీగృహంనుంచి పారిపోయాడు. కాని మళ్ళీ చిక్కాడు. రక్షకభటు లతనిని వెంటనే ఉరితీసే పత్రమిమ్మని ప్రార్థించారు నేనూ ఇద్దామనే అనుకుంటున్నాను – నువ్వేం చెబుతావు?" అని అతనినడిగాను.

అతను కొంతసేపు ధ్యానించి ఏదో గొడవ చెప్ప బోయాడు. "దేవా! మీ అధికారంలో మీరేం చేసినా చెల్లుతుంది కదా. ఆరునెలల వ్యవధిచ్చి అంతకుముందే ఉరితీయడానికి కారణమేముంది? నేను పారిపోయానని మీరంటున్నారు ఆ మాటలలో నిజమెంతో ఆలోచించండి.

సరే . మీ అమ్మాయిచ్చిన ప్రశ్నలకు సమాధానా లివ్వడానికి నేను సిద్ధంగా ఉన్నాను. నన్నొక సారామెవద్దకు తీసుకు వెళ్ళండి" అన్నాడు.

నేనేమీ బదులు చెప్పకుండా నీ అభిప్రాయం తెలుసు కుందామని చూస్తున్నాను. నీ జవాబు పంపించు."

అది చదివి ప్రియంవద – "కలహంసికా! అతని బుద్ధి ఎంతటిదో ఆనాడే తెలిసింది. ఇప్పుడాఅవకాశం యివ్వడమెందుకు?" అంది.

"అలా అనకు. ఎప్పటి కేబుద్ధి తోచునో? అతను చెప్పే సమాదానాలు విన్నాక ఏంచేయాలో ఆలోచించవచ్చు. బ్రాహ్మణహత్యా దోషానికి మీ తండ్రి సాహసించలేక పోతున్నట్లున్నారు. తలుచుకుంటేనే నాకు వొణుకు పుడుతూంది."

"అదంతా మనకెందుకు? రాజధర్మం చాలా సూక్ష్మమైనది. అతన్నిక్కడికి రప్పించడం కంటె – అతను రాసే సమాధానాల నిక్కడికి తెప్పించుకుందాం. సరిగా ఉంటే సరే. లేకపోతే ఏం చేయాలో అదే చెయ్యవచ్చు – " అని ఆమాటే చీటీలో రాసి తండ్రికి పంపించింది.

రాజవాహను డది చదువుకుని తన ఎదుటనున్న రాజకుమారుడి కా సంగతి చెప్పాడు. అతను వారడిగిన చిత్రం రాయడానికి అవసరమైన సామగ్రి తెప్పించుకుని తాను చేసిన విషయాలన్నీ తెలిసేలా – పుష్పగిరి, దానికుత్తరంగా కేళీశైలం, దాని శిఖరం మీద మూడంతస్తుల భువనేశ్వరీ ఆలయం, ఆదేవి ఐదుముఖాలు, పదిచేతులు,-వాటిరంగులు, దేవి వెనుక గోడమీదున్న పద్యం మొదలైన వన్నీ స్పష్టంగా రాసి ఎవరూ చూడకుండా మడిచి రాజుగారి కిచ్చాడు

అతను కూడా దానిని రహస్యంగా కూతురికి పంపాడు. అప్పటికి కలహంసికతో మాట్లాడుతున్న ప్రియంవద దాని నశ్రద్ధ చేయబోయినా స్నేహితురాలి ప్రోత్సాహంతో విప్పిచూసి – యోగి ఆనాడు తన చెవిలో చెప్పిన విషయాలన్నీ దానిలో ఉండడంతో ఆశ్చర్యపడి ఆనందం పట్టలేక కలహంసికను కౌగలించుకుంది.

"మన భాగ్యదేవత ప్రసన్నురాలైందా? విశేషమేమిటో చెప్పి నా కానందం కలగజెయ్యి." అంది కలహంసిక.

"కలో నిజమోకాని ఈ పటంలో నేను కోరిన సమాధానాలన్నీ ఉన్నాయి. ఇంతకుమునుపు ఇవి ఎవరికీ చెప్పకుండా రహస్యంగా ఉంచాను. చూద్దువుగాని రా." అని ఒక పెట్టెలోంచి పుస్తకంతీసి జ్ఞాపకం ఉండడంకోసం సంజ్ఞల ద్వారా వ్రాయబడిన విశేషాలని చూపించింది.

"ముందరి సంగతాలోచించు. హరిదత్తుణ్ణి నువ్విదివరకు చూశావుకదా. సౌందర్యంలో నీకు తగినవాడేనా?" అని అడిగింది కలహంసిక.

అందుకు ప్రియంవద "దైవం అనుకూలించినప్పుడు మరోలా ఎలా జరుగుతుంది? ముందుగా నువ్వు నాకు బదులు వెళ్ళి ఈహారం అతనిమెడలోవేసి యిక్కడికి తీసుకురా దానితో అంతా తెలుస్తుంది" అని తన మెడలోని హారం ఆమెకిచ్చింది.

"హరిదత్తుడు నా ప్రశ్నలకు తగిన సమాధానా లిచ్చాడు. అతను నా భర్త. అతన్ని నేను వరించాను. కనుక తదుపరి కార్యములు నిర్వహించడం మీ వంతు –" అని తండ్రికి వ్రాసి, ఆ ఉత్తరాన్ని కూడా యిచ్చి కలహంసికను పంపింది.

ఆమె ఆస్థానానికి వెళ్ళేటప్పటికి అదృష్టదీపుడు రాజకింకరులచే చుట్టుముట్టబడి ఉన్నాడు. రాజతన్ని ప్రశ్నిస్తున్నాడు. రాజుకి నమస్కరించి ఉత్తరం అందించింది.

అది చదువుకొని – "ఇతనే ప్రియ దత్తుడు. మనవంశానికి దీపం .అంటూ అతన్ని ఆంనందంతో కౌగలించుకుని – "నీ మహిమ తెలియక, సామాన్యు డనుకుని మేము పెట్టిన కష్టాలను క్షమించు. నిన్ను వరించినట్లు మా అమ్మాయి రాసింది. నువ్వు మా అల్లుడివి" అంటూ ఎంతో గౌరవించి అతన్ని తన అర్ధ సింహాసనం మీద కూర్చో బెట్టుకున్నాడు.

కలహంసిక అతన్ని చూసి ఆశ్చర్యపడుతూ – "ఇదేం వింత? అతను మిత్రగుప్తుడు కదా! హరిదత్తుడంటారేం? పేరుమారిస్తే లాబమేముంది? మొదటి నుంచీ నీ వ్యవహారం అనుమానంగానే ఉంది. సామాన్యుడు నువ్వు తెచ్చిన రత్నాలను ముట్టుకుందుకేనా అర్హుడు కాడు. అంతఃపురానికి పోదాం, రా. నిన్ను చూడాలని మా రాజకుమార్తె తొందరపడుతూంది'' అంటూ అతని మెడలో హారం వేసింది. అప్పుడక్కడున్న వారంతా జయ జయధ్వానాలు చేశారు.

అదృష్టదీపు డేమీ మాట్లాడలేదు. ప్రియంవదను హరిదత్తుడికిచ్చి వివాహం చేస్తానని శపధం పట్టాడు కదా. అంచేత అంతఃపురానికి పోవడాని కిష్టపడక – హరిదత్తుణ్ని వెదకాలనుకుని......అది చెప్పకుండా..... "రాజా! ప్రియంవద నన్ను చేసిన గౌరవాని కెంతో సంతోషిస్తున్నాను. ఆమె ఆజ్ఞప్రకారం యీమె నన్ను అంతఃపురానికి రమ్మని వొత్తిడి చేస్తూంది. కాని నేనిప్పుడొక దీక్షలో ఉన్నాను. అది ముగియడానికి పదిరోజులు పడుతుంది. అంతవరకూ అంతఃపురంలోకి వెళ్ళకూడదు ఇప్పటికి సెలవిస్తే, దీక్షపూర్తికాగానే వస్తాను" అన్నాడు.

రాజవాహను డేమీ అనలేక ఆ విషయం ప్రియంవదకు చెప్పమని కలహంసిక నాజ్ఞాపించాడు.

కలహంసిక అతనితో మాట్లాడాలని సైగ చేసినా అత డలాటి అవసరంలేదని సంజ్ఞచేశాడు. అతనికి ప్రియంవద మీద యిష్టంలేదేమో అనుకుం దామె.

అదృష్టదీపుడు తన విడిదికి వెళ్ళడానికి శకటా న్నేర్పాటు చేసి రాజవైభవంతో పంపాడు రాజు. ఆ వార్తవిని పౌరులందరూ అతనిమీద పూలుజల్లుతూ హర్షధ్వానాలు చేశారు.

అదృష్టదీపుడు – తనరాకకోసం ఎదురుచూస్తున్న బలభద్రుణ్ని కౌగలించుకున్నాడు అతనివైభవం చూసి . . అందుకు కారణం అడిగి ..చనిపోయినవాడు తిరిగొచ్చినంత ఆనందపడ్డాడు. అతని అదృష్టాన్ని అబినందించాడు.

"తమ్ముడా! నేనిప్పుడు మృత్యుముఖంనుంచి బయటపడ్డాను కానీ, మరో చింత వచ్చి పడింది" అన్నా డదృష్టదీపుడు అతనితో ఏకాంతంలో.

"ఏమిటది?" అని అడిగాడు బలభద్రుడు.

"హరిదత్తుడు ప్రియంవద కోసం ప్రాణత్యాగానికేనా తెగించాడు కదా. అతన్ని రక్షించాలనే కదా నే నడ్డుపడ్డాను? దేవుడి దయవల్ల ఆ సమస్యలు తీరాయి.

నేనే హరిదత్తుడని అందరూ భావిస్తున్నారు. అంటే - నేనూ అతనూ ఒకేలా ఉండి ఉండాలి. మొదట్నించీ ప్రియంవదను హరిదత్తుడితో కూర్చాలనే నా కోరిక అలాటిది - నేనిప్పుడామెనెలా పెళ్ళాడగలను? వాళ్ళు నన్నక్కడ ఉంచబోగా దీక్ష మిషతో తప్పించుకొచ్చాను. బ్రాహ్మణున కిచ్చింది మళ్ళీ తీసుకోరాదు. అంచేత ఎలాగైనా అతనితో ప్రియంవదని కూర్చాలి అతనెక్కడికి పారిపోయాడో తెలుసుకుని తీసుకురావాలి. ఇది మన తక్షణ కర్తవ్యం అతన్ని తీసుకొస్తే వీళ్ళందరూ నన్ను క్షమించేస్తారు నువ్వేమంటావు?" అని అడిగాడు.

అతను - "ఔను " అన్నాడు. అదృష్టదీపుడు తాను కేళీశైలంలో చూసిన అద్భుతాలన్నీ అతనికి చెప్పాడు బలభద్రు డవి విని చాలా ఆశ్చర్యపోయాడు. అతని ధార్మికబుద్ధినీ, జితేంద్రియత్వాన్నీ చాలా మెచ్చుకున్నాడు. అదృష్టదీపుడి అభిప్రాయం ప్రకారం హరిదత్తుణ్ని వెదికి తీసుకురావడమే అన్నివిధాలా భావ్యమని మళ్ళీచెప్పాడు.

తిరిగి రావడానికి గడు వేర్పరచుకుని వాళ్ళిద్దరూ ఆరాత్రే చెరో తోవనా వెళ్ళారు.

# హరిదత్తుని కథ

బలభద్రుడు పట్నాలు, పల్లెలు, గ్రామాలు వెదుకుతూ ఒకనాటి సాయంకాలానికి ధర్మాపురం చేరాడు. మునుపే పరిచయం కల అదృష్టదీపుడి సత్రంలో బసచేసి పట్టణవిశేషాలు తెలుసుకుందామని రాజవీధిలో నడుస్తూంటే పాతమిత్రు డొకడు ఎదురుపడి అతని విశేషా లడిగాడు.

బలభద్రుడతనికి తగిన సమాధానాలు చెప్పి - "మిత్రమా! హరిదత్తుడనే బ్రాహ్మణకుమారు డీ వూరువచ్చిన జాడేమైనా నీకు తెలుసా?" అని అడిగాడు.

అత నొకసారి ఆలోచించి "ఓహో! అతనా! మెల్లిగా మాట్లాడు. అతన్ని నువ్వెరుగుదువా? అతని గురించి ఈ వూళ్ళో రకరకాలుగా ఉంది. ఇప్పుడు నేను తొందరపనిమీద పోతున్నాను. రేపు మాయింటికొస్తే ఆ విషయాలు సావకాశంగా మాట్లాడుకుందాం. ఆ కథ రహస్యంగా చెప్పుకోవలసింది" అని - బలభద్రుడి మాట మరేదీ వినిపించు కోకుండా ఎక్కడికో వెళ్ళిపోయాడు.

బలభద్రుడి మనసులో ఎన్నో అనుమానాలు రేకెత్తాయి. కొంతసే పక్కడ తిరిగి చీకటి పడ్డాక సత్రం చేరుకున్నాడు.

సత్రంలో అనేకదేశాల బ్రాహ్మణులు వచ్చి విడిదిచేసి ఉన్నారు. పురాణాలు చెబుతూ, శాస్త్రచర్చలు చేస్తూ, మాట్లాడుకుంటూ కూర్చుని వున్నారు. బలభద్రుడు వారికి నమస్కరించి - వాళ్ళమాటలలో చాలా విషయాలు తెలుస్తాయి కదా అని ఒక చోట కూర్చున్నాడు. అక్కడివారిలో అచ్చన్నశాస్త్రీ బ్రహ్మావధానులూ ఈ విధంగా మాట్లాడుకోసాగారు.

**అచ్చన్న శాస్త్రీ** : బ్రహ్మావధానిగారూ! మీరింత ముసిలివారయి కూడా ఇంత దూరం ఎలా వచ్చారు? మీకు సంతానమైనా లేదుకదా. హాయిగా ఇంటి దగ్గరకూర్చుని రామాకృష్ణా అనుకుంటూ కాలక్షేపం చేయవొచ్చు కదా. మాకంటే కుటుంబ భారం కనుక తప్పదు.

**బ్రహ్మావధాని .** అచ్చన్న శాస్త్రిగారా! మిమ్మల్ని చూసి చాలా కాల మయింది. ఈ మధ్య మీరు నా గురించి తెలుసుకోడం లేదు. నాకూ ఓపిల్లాడు కలిగాడు. వాడిపెళ్ళి నిమిత్తమే ఇంతదూరం వచ్చాను.

**అచ్చన్నశాస్త్రి :** అలాగునా? తెలియక అన్నాను క్షమించండి.

**బ్రహ్మావధాని :** దానికేం లెండి. ఇక్కడ రేపు బాలసారె జరుగునా? ఏదో అర్థం వచ్చిందంటున్నారేమిటి? అదృష్టదీప మహారాజునకు కుమారుడు పుట్టాడనీ బాలసారె అనీ విని వచ్చాను. ఆ మహారాజు దానకర్ణుడనీ, మా బుచ్చిగాడికి వివాహం చేస్తారనీ ముసిల్ది చెప్పగా బయలుదేరివచ్చాను.

**అచ్చన్న శాస్త్రి :** ఈ వచ్చిన వారంతా అలాగని వచ్చినవారే, కాని యింతలో ఏదో గడబిడ పుట్టిందట. అంతా రహస్యంగా ఉంది. పొద్దుటి కంతా తేలుతుంది

**బ్రహ్మావధాని :** అయ్యో! నేను చాలా కష్టపడి వచ్చానయ్యా దేము దేం చేస్తాడో? ఇంతకీ అదృష్టదీప మహారా జిక్కడున్నమాట నిజమేనా?

**అచ్చన్నశాస్త్రి :** ఏమో, నా కేసంగతీ బాగా తెలియదు. నేనివాళ మధ్యాహ్నమే వచ్చాను.

ఈ రామసిద్ధాంతి గారు నాలుగు రోజులకిందట వచ్చారట వారికంతా తెలుస్తుంది.

**బ్రహ్మాధాని :** ఏమండీ సిద్ధాంతిగారూ! మీ కేమయినా తెలుసా? నేను పెద్దవాణ్ణి గంపె డాశతో వచ్చాను.

**రామసిద్ధాంతి :** ఇప్పుడు మొదటికే మోసం వచ్చింది అదృష్టదీపుడు కొన్నాళ్ల కిందట ఈ వూరు రహస్యంగా వచ్చి ఈ రాజుకూతురు కాంతిమతితో రహస్యంగా క్రీడించారట. దానికి గర్భమైంది. అదిగాంధర్వ వివాహంగా భావించి రాజుగారు కూతుర్ని సురక్షితంగా కాపాడారట. కొన్నాళ్ళ కిందట కొడుకు పుట్టాడు.

బ్రహ్మావధాని : తరువాత?

రామసిద్ధాంతి : అంతకుమునుపే అదృష్టదీపుడు తెలియకుండా పారిపోయాడు.

రాజుగా రతని చిత్ర ఫలకం రాయించి చారులకిచ్చి నాలుగు దిక్కులకీ పంపి వెదికి తీసుకురమ్మనగా – ఒకడిని పట్టుకొచ్చారు.

బ్రహ్మావధాని : ఇంకేమీ?

రామసిద్ధాంతి : ఆ పట్టుకు రాబడ్డవాడు తానదృష్టదీపుడు కాడనీ- హరిదత్తుడనే బ్రాహ్మణకుమారుడిననీ, కాంతిమతిని తానెప్పుడూ చూడలేదనీ, ఆమె కన్నకొడుకు తన కొడుకు కాదనీ అంటున్నాడట. కాని రాజకుమార్తె తాను మునుపు వరించిన వా డితడే అనీ, ఎందుకో ఇలా అంటున్నాడనీ, ఇతన్ని పోనివ్వొద్దనీ అంటూందట. అంచేత – వ్యవహారం మీమాంసలో పడింది.

బ్రహ్మావధాని : (భయంగా) సిద్ధాంతిగారూ! ఆ హరిదత్తుడు మా హరిదత్తుడు కాడుకదా?

రామసిద్ధాంతి : అదేమిటండోయ్ మీకో హరిదత్తుడున్నాడా ఏమిటి?

బ్రహ్మావధాని : ఔను ఉండేవాడు. ఆడదాని మూలంగా అతన్ని దూరం చేసుకున్నాను.

రామసిద్ధాంతి : అలా చెబితే మాకెలా తెలుస్తుందీ? వివరంగా విశదంగా చెప్పండి.

బ్రహ్మావధాని : ఒకనాడు ... నేను జాము పొద్దెక్కాక అరణ్యమార్గంలో ముష్టిమూట నెత్తిమీద పెట్టుకుని నడుస్తున్నాను. ఎండకీ నడకకీ ఆయాసం రాగా ఓ చెట్టు నీడలో కొంచెంసేపు విశ్రమించాను అప్పుడా చెట్టు కొమ్మమీద నాకుశిశురోదనం వినిపించింది ఇక్కడ చంటిబిడ్డ ఏడుపెక్కడినుంచి వస్తోందా అని తలెత్తి చూసేసరికి చెట్టుకొమ్మల సందులో

ఒక కోతి చక్కని బిడ్డని వొళ్ళో పెట్టుకుని ముద్దాడుతూండడం, శిశువు క్యారుక్యారు మని ఏడవడం కనపడింది. నేనాశ్చర్యపడుతూ ఆకోతి నదిలించి, చెట్టుమీద కెక్కి ఆ బిడ్డను పదిలంగా చెట్టు దింపి భారంగా ఉన్న బియ్యం మూటను విప్పి అక్కడున్న కోతుల కాహారంగా వేసి బిడ్డతో ఇంటికి చేరుకున్నాను.

**రామసిద్ధాంతి** · ఆ ప్రాంతంలో మీ కెవరూ కనపడలేదా ?

**బ్రహ్మావధాని** : దారిలో ఒక ఆడది కనిపించింది. దానిని నేను పలకరించలేదు. నాకప్పుడు సంతానం లేదు కనుక వేగంగా ఇంటికొచ్చి నా భార్య కా వృత్తాంతం చెప్పి పిల్లవాడి నిచ్చి వాడికి హరిదత్తు డని పేరు పెట్టాను.

**రామసిద్ధాంతి** : మంచిపేరే పెట్టారు. హరి అంటే కోతి, విష్ణువు కూడా. కోతిచేత యివ్వబడినవాడు, భగవంతుడిచేత యివ్వబడినవాడు. కనక ఆ పేరు చక్కగా సరిపోయింది.

**బ్రహ్మావధాని** : వాడిని చూసి నాభార్య కూడా చాలా సంతోషించింది. అద్భుత తేజస్సు కల ఆ కుర్రవాడిని కన్న కొడుకులాగే పెంచసాగింది. వాడికి పన్నెండేళ్ళ వయసు రాగానే ఉపనయనం చేశాం. వాడిని పెంచడం వల్లనే కాబోలు నాకింకో కొడుకు పుట్టాడు.

**రామసిద్ధాంతి** -: కావచ్చు. అలా కలగడం లోకాచారముంది.

**బ్రహ్మావధాని** : వాడు కలిగింది మొదలు నా భార్య హరిదత్తుడిని ప్రేమగా చూడడం మానేసింది. నే నది గ్రహించి మా ప్రాంతంలోని ఒక అగ్రహారంలో ఆచార్యునివద్ద విద్యాభ్యాసానికి పెట్టాను. హరిదత్తుడు అందమైనవాడు, గుణవంతుడు, బుద్ధిశాలి కనక ఆ పండితుడి దగ్గర త్వరగాకొన్ని శాస్త్రాలు నేర్చుకున్నాడు. ఆయన కూతురు కారణంగా ఎక్కడికో పారిపోయాడని తెలిసింది. ఇతను వాడేమో అనిపిస్తోంది.

**రామసిద్ధాంతి** . ఐనా కావొచ్చు. మీరు రేపు వెళ్ళి చూడండి. గుర్తు పట్టగలరా?

బ్రహ్మేవధాని : ఏమో! వాడికి నేను జ్ఞాపక ముంటానా?

రామసిద్ధాంతి : భగవంతుడేం చేసినా చేయగలడు. పొద్దుట చూసుకుందాం. ఇప్పటికే చాలా రాత్రయింది. పడుకోండి.

వాళ్ళిద్దరూ నిద్రపోయారు. బలభద్రుడి ఆశ్చర్యానికి మేరలేదు. 'వీరిమాటల వల్ల హరిదత్తుడు రాజకుమారుడేమో, అనిపిస్తూంది. అతనిలాగే ఉన్నాడు కనక అదృష్టదీపుడి సోదరుడు కావచ్చు. సన్యాసి చెప్పిందబద్ధం కాజాలదు. అదృష్టదీపుడికి హరిదత్తుడి మీద అకారణమైన ప్రేమ కలగడానికి కారణం యిదేనేమో. కాంతిమతి అత నన్నదృష్టదీపు డనుకోడంలో ఆశ్చర్యమేమీలేదు. నేను కూడా అలాగే భ్రమపడ్డానుకదా!. వీళ్ళ అనుమానాలు తీర్చి హరిదత్తుణ్ణి ప్రియంవదతో కూర్చుతాను. నామిత్రుడు చాలా సంతోషిస్తాడు.' 'అని ఆలోచిస్తూంటే

అక్కడే ఒకమూల పడుకుని ఆ మాటలన్నీ వింటున్న ఒక వృద్ధురాలు మెల్లగా లేచివచ్చి -

"అయ్యా! తమ రెవరు? హరిదత్తుని వృత్తాంతం చెప్పిన బ్రాహ్మణు డెక్కడున్నాడు?" అని అతన్నడిగింది.

బలభద్రు డావిడకి తనపేరు చెప్పి -"మీరెవరు? ఇక్కడికెందుకొచ్చారు? ఆ బ్రాహ్మణుడి అవసరం మీకేమిటి?" అని అడిగాడు.

అప్పు డావిడ - "ఏం చెప్పమంటాను. నేను మాళవరాజు ధర్మపాలుడి భార్య సునందకు పరిచారికని. నాపేరు రత్నావతి.

శత్రువులు కోట ముట్టడించగా, గర్భవతి అయినరాణి సునంద, మూడేళ్ళ వయసుగల ఆమె కొడుకు నెత్తుకుని నింబవతి అనేదానీ, నేనూ కోటదాటి ఒక అరణ్యమార్గంలోకి వచ్చాం. ఆ గందరగోళంలో నాదీ సునందదీ ఒకదారి అయింది.

ఆ అరణ్యంలో ఒకనాడు ఉదయం సునంధ పండులాంటి కొడుకునికంది. నీళ్ళు తేవడానికి నేను పోగా దారిలో ఒక బ్రాహ్మణు డెదురుపడ్డాడు. సునందకు నీ రందించాలనే తొందరలో నేనతన్ని పట్టించుగా చూడలేదు. ఆయన వద్ద ఆ పిల్లవా డున్నట్లే ఉంది.

నేను వెళ్ళేసరికి సునంద లేదు. గుర్తులుమాత్రం ఉన్నాయి. అడుగు జాడలనుబట్టి అరణ్యంలో కొంతదూరం తిరుగుతూ, గొంతెత్తి పిలిచాను. ఎక్కడా ఆమె జాడ తెలియలేదు. అదిమొదలు ప్రతిగ్రామం, పల్లె, పట్నం తిరుగుతూనే ఉన్నాను. కాని వారి జాడేమీ తెలియరాలేదు.

రాజకుమారు ణ్నెత్తుకుని మరో తోవలో పోయిన నింబవతి జాడకూడా తెలియరాలేదు. రాజకుమారు లిద్దరూ ఈ పాటికి మంచివయసులో ఉంటారు.

ఈ బ్రాహ్మణుడు చెప్పిన మాటలన్నీ నేను విన్నాను. హరిదత్తుడు మా రాజపుత్రుడు. అతన్ని చూస్తే నా ఆత్రత తీరుతుంగి చెప్పండి, మీకు పుణ్యముంటుంది" అని వేడుకుంది.

ఆమె మాటలు విన్న బలభద్రుడు 'మా మిత్రుడి కిప్పుడు మంచిరోజులు వచ్చిన ట్లున్నాయి. నింబవతి తీసుకెళ్ళిన బాలుడు నా మిత్రుడే. హరిదత్తుడు కూడా సునంద బిడ్డడే అనిపిస్తూంది. ఇది వింటే నా మిత్రుడెంత సంతోషిస్తాడో'...అనుకుంటూ –

"అవ్వా! నువ్వు విచారించకు. నీ ఆప్తుల్ని కలుసుకుంటావు. నేను మీ రాజుగారి పెద్దకొడుకు స్నేహితుణ్ని. అతను క్షేమంగా ఉన్నాడు. నింబవతిని పాము కరవగా చనిపోయింది. ఆ బాలుడు పెరిగాడు. నేడో రేపో భూమండలమంతా ఏలగలడు" అన్నాడు.

ఆమె ఆ మాటల కెంతో సంతోషించింది.

"తల్లిమాత్రం ఎక్కడుందో తెలియాలి. అన్నదమ్ము లిద్దరూ తొందరలోనే తమరాజ్యాన్ని స్వాధీనం చేసుకుంటారు. మంచిరోజులు వస్తాయి" అనిఆమెను మరింత సంతోషపెట్టాడు.

ఉదయాన్నే లేచి – ఆ బ్రాహ్మణినీ, రత్నావతినీ అక్కడే ఉండమని, తాను కాంతిమతి చెలికత్తె నిపుణిక ఇంటికి వెళ్ళాడు. ఆమె అతన్ని సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టి– "అయ్యా! నువ్వు నీ మిత్రుడితో విడిపోయి ఎక్కడున్నావ్? ఇక్కడి కెప్పుడొచ్చావు? నీ మిత్రుడికి

మా మీద దయతప్పింది. అత నెన్నడూ మమ్మల్ని చూసే ఎరగడట! తన పేరు సైతం మరొకటంటున్నాడు" అంటూ జరిగిన సంఘటల నెత్తి చెప్పి – "ఆ శిశువు కూడా అచ్చంగా అతనిలాగే ఉన్నాడు. కాంతిమతి సిగ్గువిడిచి కొడుకుని చూపించి పోలికను బట్టయినా గుర్తించమంటే – అతను తిరస్కరిస్తున్నాడు.

మా రాజుగారేమో పిల్లవాడికి జాతక కర్మమొదలైనవి చేయాలని విద్వాంసులనీ బ్రాహ్మణులనీ ఆహ్వానించారు. ఇతనేమో పీటలమీద కూర్చోనంటాడు. మీరు సమయానికి వచ్చారు. పరిస్థితి చక్కబరచండి" అని కోరింది.

బలభద్రుడు నవ్వుతూ – "భగవంతుడి సృష్టి బహు విచిత్రమైంది. మనిషిని పోలిన మనిషుండడం సహజమే. ఎంత వెర్రివాడైనా ఊరికే ఎరగనని పూర్వ పరిచయం కల స్త్రీని అనగలడా? అత డెక్కడున్నాడో చెప్పు. నేను వెళ్ళి మాట్లాడతాను" అన్నాడు.

ఆమె బలభద్రుడిని హరిదత్తుని వద్దకు పంపింది. అప్పటికి – "మీరెన్ని చెప్పినా నే నంగీకరించను. రాజ్యలోభంతో పరస్త్రీని పత్నిగా స్వీకరించను. నన్ను పోనివ్వండి. నా మూలంగా ఒక మంచివాడు చిక్కులు పడుతూంటాడు. మీకు పదివేల నమస్కారాలు. నాదారిన నన్ను పోనివ్వండి" అంటున్నాడు హరిదత్తుడు.

వాళ్ళతనికి పిచ్చెక్కిందని నిర్ణయించారు.

అలాటి స్థితిలో ఉన్న హరిదత్తుడికి బలభద్రుడు దగ్గరగా వెళ్ళి "మిత్రమా! నేనెవరో ఎరుగుదువా?" అని అడిగాడు.

అతను పరికించి "అయ్యో! నిన్ను మరిచిపోతానా? నా ప్రాణదాతవు కదా. నామూలంగా మీ రక్కడ చిక్కులు పడుతున్నారు కాబోలు. వీళ్ళ నిదివరకు చూడనేలేదు ఈమె నీభార్య – ఇతను నీ పుత్రుడు ... అంటూ కదలనివ్వకుండా ఉన్నారు. నువ్వేనా వీరికి చెప్పి నన్ను విడిపించి తీసుకుపో" అన్నాడు.

బలభద్రుడు నవ్వుతూ – "నువ్వు మమ్మల్ని తాకట్టుపెట్టి పారిపోయావు. వాళ్ళు మమ్మల్ని ఉరి తియ్యబోయేంతలో – దేవుడి దయవలన మిత్రగుప్తుడు ప్రియంవద ప్రశ్నలకు సమాధానం చెప్పాడు. అందువల్ల మాకుమరణం తప్పింది. నీతో కొన్ని రహస్యాలు చెప్పాలి." అన్నాడు.

అదివిని మిగిలిన వారంతా వాళ్ళని ఒంటరిగా వదలి వేరొక చోటుకి పోయారు.

ఏకాంతంలో బలభద్రుడు. జరిగినదంతా హరిగుప్తుడికి చెప్పాడు. అప్పుడు – "నీమాటలు విచిత్రంగా ఉన్నాయి. నాకు అన్న ఎవరూ లేరు. నా దత్తత తండ్రికి నాతరువాతనే ఒకకొడుకు పుట్టాడు కనక తమ్ముడే ఔతాడు. నన్ను విష్ణుగుప్తుడిగా వీరు భావించడానికి మరేదైనా కారణ ముందేమో" అన్నాడు హరిదత్తుడు.

"అందుకేకదా నీ చరిత్ర ను వ్వెరగ వన్నాను? నీ దత్తత తండ్రింటికి నువ్వెలా వచ్చావో నీకు తెలుసా?"

" ఒక కోతి వడిలో నేనుండగా నా దత్తత తండ్రి నన్నింటికి తీసుకొచ్చాడని తెలుసు" అన్నాడు. అప్పుడు బలభద్రుడతనికి రత్నావతి మాటలూ, బ్రాహ్మణుడు చెప్పిన విశేషాలూ చెప్పాడు.

అది విని హరిదత్తుడు పట్టలేని ఆనందంతో అతన్ని కౌగలించుకుని – "ఇలాటి శుభవార్త చెప్పినందుకు పారితోషికంగా ఇవ్వడానికి నాదగ్గరేమీ లేకపోయింది. నా ప్రాణమే నీ అధీనం చేస్తున్నాను. ఇది మొదలు నువ్వెలా చెబితే అలా చేస్తాను." అన్నాడు.

అంతలో కాంతిమతి, చతురిక బిడ్డ నెత్తుకుని అక్కడికి వచ్చారు. వారినిచూసి బలభద్రుడు, హరిదత్తుడు లేచారు హరిదత్తుడు కాంతిమతి పాదాలమీద పడ్డాడు. అదిచూసి కాంతిమతి "చూశావా, చూశావా బలభద్రా! నీ మిత్రు డేంచేస్తున్నాడో? నీ మిత్రుడికి పిచ్చెక్కిందేమో చూడు –" అంది.

బలభద్రుడు – "వీనికి పిచ్చెక్కలేదు. మీరే భ్రమపడుతున్నారు. ఇతను నీ భర్తకు తమ్ముడు. ఒకేలా ఉండడంవల్ల మీ రితన్ని మా భర్తగా భావించి పొరపాటు పడుతున్నారు. ఇతను మీకుమరిది" అన్నాడు.

ఆ మాటలకు కాంతిమతి సిగ్గుపడి..నిదానించి అతన్ని చూస్తూ "బ్రహ్మసృష్టి ఎంత మోసం చేసింది! ఇతను గుణవంతుడు కనక ఇంతవరకూ నిశ్చలంగా ఉన్నాడు. మరొకలాటి వాడైతే ఏమౌనో.." అనుకుని మరదిని మన్నించి తన పుత్రు ణ్ణతని కందించింది.

బలభద్రుడు కూడా ఆ శిశువును ముద్దులాడి...కాంతిమతితో – "అమ్మా! మేము పోయి ఈ విశేషాలన్నీ నీ భర్తకి చెప్పి అతన్ని తీసుకొస్తాం. మేము పెట్టిన గడువు కూడా సమీపిస్తూంది" అన్నాడు.

ఆమె ఎన్నో జాగ్రత్తలు చెప్పి చివరకు వాళ్ళు వెళ్ళడానికి కనుమతించింది.

బలభద్రుడు హరిదత్తుడితో కలసి అంతఃపురం నుంచి సత్రానికి పోయి – రత్నావతి బ్రహ్మవధాలను కలుసుకున్నాడు. హరిదత్తుడి వృత్తాంతం చెప్పేసరికి అతన్నిముందే తెలిసినవారు కనుక ఆనందంగా కౌగలించుకుని గౌరవించారు.

తాను అన్నతో కలసి వచ్చేవరకూ వారినక్కడే ఉండమని – బలభద్రుడితో "మా అన్నని చూడాలని చాలా ఆరాటంగా ఉంది. అతని దగ్గరకి వేగంగా తీసుకు పో" అన్నాడు.

"తమ్ముడూ! మేము పెట్టుకున్న గడువుకి మూడురోజులుంది. అప్పటికి మనం సులభంగా వెళ్ళగలం. అతనూ అప్పటికే వస్తాడు." అంటూ అతన్ని తీసుకుని పుష్పగిరి బయలు దేరాడు. పుష్పగిరి చేరాక బలభద్రుడు హరిదత్తుడి నొకచోట ఉండమని తాను వెళ్ళి అదృష్టదీపుడి నక్కడికి తీసుకొస్తానని – సంకేతస్థలానికి వెళ్ళాడు.

అంతవరకూ ఊరికే కూర్చుం డేంచేయాలని – హరిదత్తుడు చక్కగా తయారై వింతలు చూడడానికి అంగడికి పోయాడు.

ఆవేళ శుక్రవారం. ప్రియంవద, కలహంసిక బండిలో కేళీ శైలానికి వెళ్తున్నారు. బండి కిటికీలోంచి కలహంసిక హరిదత్తుణ్ణి చూసి – "ప్రియంవదా! చూడు. నీ ప్రియుడు...." అంది విరహంతో వేగుతున్న ప్రియంవద బండి ఆపించి, కలహంసికను దింపి – "అతనిని కేళీశైలానికి తీసుకురా" అని బండిలో తాను వెళ్ళిపోయింది.

కలహంసిక అతడు అదృష్టదీపుడే అనుకుని దగ్గరకు వెళ్ళి నమస్కరించింది. అతను ఆచారం ప్రకారం దీవించాడు.

"మీరిన్నాళ్ళు ఆలస్యం చేయవొచ్చా? మా చెలి విరహబాధ భరించలేకపోతూంది. ఇప్పుడు కేళీశైలానికి వెళ్ళింది. మనమూ వెళ్దాం, రండి. కొత్తగా చూస్తున్నారేం? నన్ను గుర్తు పట్టలేదా? నేను దేవరవారి దాసిని ...... కలహంసికను"–

అనూహ్యంగా బంధువులని కలుసుకోడంవల్ల ఒకవిధమయిన మరపులో పడ్డ హరిదత్తుడు పూర్వస్మృతి లేక, మనుపు తానాపట్నం రావడం, ప్రియంవదని పెళ్ళాడాలనుకోడం, చెరసాల నుంచి తప్పించుకోవడం – అంతా మరచిపోయాడు. అందుచేత – "నీ మాటలు బాగానే ఉన్నాయి. కాని నన్నెవరనుకుంటున్నావు? నువ్వు నాతో మునుపు మాట్లాడావా? నీ సఖి ఎవరు? నాకోసం విరహం చెందడమేమిటి? నన్నెవరో అనుకుంటున్నావు" అన్నాడు.

ఆ మాటల కామె గుండె ఝల్లుమంది. "హరిదత్తా! నిన్ననే నెరగ ననుకున్నావా? నీ టక్కరిమాటల కేంలే. పోదాం, రా. మనకోసం ఆమె ఎదురుచూస్తూ ఉంటుంది" అంది.

అప్పుడతను – " ఇది చాలా చిత్రంగా ఉంది. ఈమె నాపేరు కూడా చెబుతూందే! ఈమెను ఎప్పుడూ చూసిన జ్ఞాపకం లేదు. ఈ వూరి మహిమకాబోలు" అనుకుంటూ – "నువ్వు నీదారినిపో. నీకు నాపే రెవరు చెప్పారు?" అన్నాడు.

"దివ్యదృష్టితో తెలుసుకున్నాను. మీతో కొంచెం పనుంది. ఒకసారి ఉద్యానవనాని కొచ్చి ఉపకారం చెయ్యండి" అంది పరిహాసంగా

అంతలో ప్రియంవద ఎక్కివెళ్ళిన బండి అక్కడికి వచ్చింది. దానిలోని దాది కలహంసికను తొందరపెట్టగా ఆమె అతన్ని చేయిపట్టుకుని బండిలోకి లాక్కుపోయింది.

వారిరాకకెదురు చూస్తున్న ప్రియంవద అతనికి స్వాగతం పలికేందుకు కొందరు చెలికత్తెల నెదురు పంపింది. వారతనికి పాదాలొత్తి, పూలమాలలు వేసి, గొడుగు పట్టి వింజామరలు వీస్తూ అతన్ని తీసుకువెళ్ళసాగారు.

అతని ఆశ్చర్యానికి అంతులేదు. 'ఇదికలా? ఇంద్రజాలమా? వీళ్ళు నన్నేంచెయ్య దలుచుకున్నారు? బలభద్రుడు కూడా మోసగాడు కాదుకదా? సరే.... దైవం ఎలా తలుచుకుంటే అలా జరుగుతుంది-" అనుకుని కలహంసికతో నడవసాగాడు.

కలహంసిక అతన్ని ప్రియంవద ఉన్న పొదరింటిలోనికి తీసుకుపోయి పూలపాన్పు మీద కూర్చోబెట్టింది.

"ఇకనేనా, నాతో పనేమిటో చెప్పి నన్ను వదిలిపెట్టండి. నాకోసం నా మిత్రుడు ఎదురు చూస్తూంటాడు. మీరందరూ నన్నెందు కింతలా గౌరవిస్తున్నారు? బలభద్రుడి ధర్మమా అని అవిదాటాను. మళ్ళీ ఈ ముప్పు" అన్నా డతను కలహంసికతో.

అప్పుడు ప్రియంవద ఇలా అంది. "వీరికి మనపై ప్రేమ తగ్గింది కాబోలు. మరోలా మాట్లాడుతున్నారు. ఓహో! మొదట అవమానపరిచామని కాబోలు. శపథ భంగం క్షత్రియధర్మం కాదు కదా! నా తప్పులు క్షమించండి-" అంటూ అతని పాదాల మీద పడింది.

మెరుపు తీగెలా ఉన్న ప్రియంవదని చూసేసరి కతని కామె మీద మోహం కలిగింది. కాని పరస్త్రీ అని జ్ఞాపకం రాగానే - "మీ మాటలేమీ నాకర్థం కావడం లేదు. నిజంచెప్పండి" అన్నాడు.

అప్పు డామె అతను తన కోసం పడినపాట్లు, కారాగారవాసం, ప్రశ్నలకి సమాధానాలు చెప్పడం, దీక్షావ్రతం, అతనురాసిన ఉత్తరం

మొదలైన వన్నీ చెప్పింది. వాటిలో కొన్ని అతను చేసినవే కనుక – "ఆ వృత్తాంతం అంతగా జ్ఞాపకంలేదు. కొంత జరిగినట్లే ఉంది. నీవెవరి భార్యవు? నీపేరేమిటి?" అంటూ ప్రశ్నించాడు.

ప్రియంవద – "ఇతను నిజంగానే ఇలా అంటున్నాడా! కలహంసికా! ఆవేళ మెడలో పూలదండ వేసింది ఇతనికేనా? బాగా గుర్తుపట్టావా?" అంది.

"నేనంత వెర్రిదాన్నా? అంతకుముందు నుంచీ నే నితన్ని ఎరుగుదును. తాటిపండు ప్రశ్నకి దోసెడు రత్నాలిచ్చిన వా డితనే. మనతో ఆటలాడుకుంటున్నాడు" అంది కలహంసిక.

"అయ్యో! నాపేరు ప్రియంవద. మా తండ్రి పేరు రాజవాహనుడు. నేను హరిదత్తుడను వాని భార్యను, మీరడిగారు కనుక చెబుతున్నాను" అంది ప్రియంవద.

"నువ్వు చెప్పిన మొదటి మాటలన్నీ, బాగానే ఉన్నాయి. కాని .... హరిదత్తుడు నీ ప్రశ్నల కెలా సమాధానం చెప్పాడో తెలియడంలేదు. అతను రాసిన ఉత్తరం ఉందన్నావు కదా, దాని నొకసారి తెప్పించు" అని అత నంటూండగా ఆమె – "నా కీపాటి అధికార ముందిలే" అంటూ అతన్ని కౌగలించుకుని ముద్దులు కురిపిస్తూ పూలపాన్పు మీదకు చేర్చింది.

అతనుకూడా మోహం ఆపుకోలేక ఆమెను కౌగలించుకుని శృంగార చేష్టలు చేయసాగాడు. "నువ్వెంత సాహిసివో! ఇదివరలో రెండు ప్రమాదాలు తప్పించుకోగలిగాను కాని యిప్పుడు దాటలేకపోయాను. నిజంగా నువ్వు పరస్త్రీవి కాదు కద?" అని అతనంటూంటే ఆమె – "అయ్యో! పొరపాటు జరిగింది. నేను కేళీశైలానికి వెళ్ళాలి. నేను తిరిగొచ్చే వరకూ యిక్కడే ఉండండి" అని లేచి వెళ్ళిపోయింది.

కేళీశైలం మీద తాను జపం చేసుకునే ప్రదేశం వేపు నడుస్తూంటే చిన్నరాయి కాలికి తగిలి పడిపోయింది పూలు సజ్జలో కెత్తుతూండగా ఓషధీలత ఆమె చేతికి తగిలి భువనేశ్వరీదేవి ఆలయం

ఆమెకు సాక్షాత్కరించింది. ఆమె దానిలో ప్రవేశించి అదృష్టదీపుడికి కనిపించిన విశేషాలన్నీ చూసింది. అతను తెచ్చిన రత్నా లిక్కడివే అని గ్రహించింది. తాను తెచ్చిన పూలతో దేవిని అర్చించింది. ఆ పూలతోపాటు ఓషధీలత కూడా అమ్మవారి పాదాల మీద పడింది అంతే. అవన్నీ అదృశ్యమై శిఖరం మాత్రమే మిగిలింది.

అదొక అద్భుతమైన ఇంద్రజాలమని తలచి ఆ విశేషాలు సఖులకు చెప్పాలని వెనక్కిపోడానికి తొందర పడుతూంటే – బలభద్రునికి చెప్పిన సంకేతస్థలం అదే కనుక అదృష్టదీపు డక్కడికి వచ్చాడు.

ఆమె అతన్ని హరిదత్తుడిగా భావించి – "మీరిక్కడి కెందుకొచ్చారు?" అంటూ నమస్కరించింది. జరిగినదంతా చెప్పింది.

అప్పు డతను లతను వెదుకుతూంటే – వేగంగా కొండెక్కుతున్న బలభద్రుణ్ణి రాజభటులు అడ్డగించబోయారు. అదృష్టదీపుడు – "అతను మామిత్రుడే. రానివ్వండి" అని చేత్తో సంజ్ఞలు చేయగా వా రతన్ని వదిలారు.

బలభద్రు డక్కడికి వచ్చాడు. "ఇతను అదృష్టదీపుడా? హరిదత్తుడా?" అని అతనికి సందేహం కలిగింది. "మిత్రమా! రా దూరంగా నిలబడి పోయావేం?" అని అతను పిలిచాడు.

ఆమె – పరపురుషుడిని చూసి దూరంగా తొలిగింది.

"తమ్ముడూ! హరిదత్తుని జాడ తెలిసిందా? నువ్వులేక యిన్నాళ్ళూ నాకు ఏమీ తోచలేదు సుమీ" అంటూ అతన్ని కౌగలించు కున్నాడు.

బలభద్రుడు జరిగిన దంతా వివరించి, "హరిదత్తుడు నీతమ్ముడే" అంటూ సత్రంలో బ్రాహ్మణుడి మాటలూ, రత్నావతి చెప్పినవీ చెప్పాడు.

అదివిని – "ఇవాళెంత మంచిరోజు! ఎంత మంచివార్త విన్నాను! హరిదత్తుడు నా తమ్ముడా! ఎక్కడున్నాడు? మాతండ్రిని

బందీగృహంలో పెట్టిన దుర్మార్గుడెవరు? మాతల్లి ఎక్కడుందో? నా తమ్ముణ్ని కాపాడిన బ్రాహ్మణునీ, రత్నావతినీ తీసుకు రాలేకపోయావా? నావల్ల నింబవతి ప్రాణాలు పోగొట్టుకుందే. అయ్యో" అని విచారిస్తూంటే -

"అన్నా! గతానికి వగచి ప్రయోజనమేముంది? ఇప్పుడు కాలం మన కనుకూలంగానే ఉందికదా. ఈమె ఎవరు? గుర్తులనిబట్టి ప్రియంవద అనుకుంటాను. ఈమెను హరిదత్తుడికి కూర్చుతానన్న మాట మరిచేవా?" అన్నాడు బలభద్రుడు.

"తమ్ముడూ! నేను పట్టిన శపథం విడుస్తానా? నే నిక్కడికొచ్చేసరి కీమె ఇక్కడుంది. నన్నెలా గుర్తుపట్టిందో, తెలిసినట్లు మాట్లాడింది. ఓషధీలత ఈమె చేతచిక్కి జారిపోయింది. దానికోసం వెదుకుతూంటే నువ్వొచ్చావు. అంతేతప్ప నే నీమెను వరించలేదు" అన్నా డదృష్టదీపుడు.

అంతలో - కలహంసికతో కలసి హరిదత్తు దక్కడికి వచ్చాడు. హరిదత్తుడిని చూసి అదృష్టదీపుడే ఆశ్చర్యపోయాడు. ప్రియంవదా, కలహంసికలు వారిద్దరినీ చూసి ఆశ్చర్యంతో నోటమాటలేక ఉండిపోయారు.

కలహంసిక - "ప్రియంవదా! ఈయ నెవరు? నువ్వురాక పోడంతో హరిదత్తుడు వెళ్ళిపోతానని తొందరపడుతూంటే ఇక్కడికి తీసుకొచ్చాను. ఇతను అచ్చంగా హరిదత్తుడిలాగే ఉన్నాడే!" అంది.

అదృష్టదీపుడు తనుకోరుకున్నట్లే జరిగినందుకు చాలా సంతోషించి దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుని - "బలభద్రా! మనమిక ఆలస్యం చేయకూడదు. తమ్ముణ్ణి వెదికి తెచ్చినట్లే తల్లినికూడా తీసుకురా. ముందుగా ప్రియంవదకూ తమ్మునికీ వివాహం చెయ్యాలి. తరువాత మిగిలిన విషయాలు చూసుకుందాం" అన్నాడు.

ప్రియంవద వాళ్ళిద్దరినీ చూస్తూ - తేడా తెలియక .... "కలహంసికా! ఎంత చిత్రంగా ఉంది! వీళ్ళిద్దరిలోనూ నా ప్రశ్నలకు జవాబు చెప్పిన వారెవరో నిరూపించు" అంది

కలహంసిక – "అయ్యలారా! మీరిద్దరూ ఒకేరూపంలో ఉన్నారు. అన్నదమ్ములు కాబోలు! మీలో మా మిత్రురాలు కోరిన ప్రియు డెవరు?" అని ప్రార్థించింది.

"అది నీ స్నేహితురాలినే కనుక్కోమను" అన్నా డదృష్టదీపుడు. ఆమె తేల్చుకోలేక ఆశ్చర్యంతో చూస్తూఉండి పోయింది.

అప్పుడు బలభద్రుడు – "ఓషధీలత చేతికి చిక్కినవాడే నిధుల కధికారనీ ప్రియంవదకు ప్రియుడనీ వ్రాసి ఉంది. అది నీచేతికి చిక్కింది. మరి ప్రియంవదకు హరిదత్తుడెలా ప్రియు డౌతాడు?" అని అడిగాడు. అదృష్టదీపుడు హరిదత్తుడి చేయి పట్టుకుని ఒక చెట్టు వెనక్కి తీసుకెళ్ళాడు. అక్కడికి దగ్గరలో ఒకచోట నిర్మాల్య ద్రవ్యాలను(దేవుడికి పూజ చేసిన పూలూ మొదలైనవి) చూసి గుర్తుపట్టి వాటిలో చేయిపెట్టి వెదికించాడు. అప్పుడాలత హరిదత్తుడి చేతికి తగిలింది. అతను – మణికాంతులతో వెలుగుతున్న మేడ కనపడగా ఆశ్చర్యపోతూ అదేమిటని అడిగాడు. అదృష్టదీపు డాలతను తాను తీసుకుని "ఇప్పుడు?" అని అడిగాడు. హరిదత్తుడు "ఏమీ కనపడడంలేదు" అన్నాడు.

అప్పుడు అదృష్టదీపు డాలతను గట్టిగా బుట్టలో మూటకట్టి – అందులోని విశేషాల నందరికీ చూపించాలని – "తమ్ముడా! నీ సందేహానికి సమాధానం దొరికింది. చివరికీలత హరిదత్తుడికే దొరికింది. నేను తీసుకున్నాను. మీరందరికీ ఆ మేడలోని విశేషాలు చూపెడతా, రండి. నన్ను పట్టుకుని ఉండండి" అంటూ దానిలోకి తీసుకువెళ్ళాడు. వాళ్ళవన్నీ చూస్తూ....స్వర్గం. .స్వప్నం....అనుకున్నారు.

అదృష్టదీపుడు ఆ భవనంలోని వృత్తాంతం కొంత చెప్పి ఆ అమ్మవారి ఎదుటే హరిదత్తుడి చేత ప్రియంవదకు పాణిగ్రహణం చేయించి తాను చేసిన ప్రతిజ్ఞనెరవేర్చుకున్నాడు.

ఆ దంపతులు అమ్మవారికీ అదృష్టదీపుడికీ నమస్కరించారు.

అప్పుడు అదృష్టదీపుడు తమ్ముణ్ణి దీవిస్తూ – "నువ్వామెకోసం ప్రాణత్యాగానికి కూడా సిద్ధపడ్డావు కదా? దేవుని దయవల్ల నీ కోరిక నెరవేరింది. ఇప్పుడు నా మనసుకి హాయిగా ఉంది" అన్నాడు.

అప్పుడు హరిదత్తుడు – చిరునవ్వుతో – "అన్నా! నిజానికి నే నీ ప్రియంవదను కామించి అలాటి పనికి పూనుకోలేదు. బలవన్మరణం పాపమనీ, ఉరితీయబడితే పాపముండదనీ భావించి అలాటి అసాధ్య కార్యానికి పూనుకున్నాను. ఎందుకంటే. .

# సత్యవతి కథ

నన్ను మా పెంపుడు తండ్రి ఒక అగ్రహారంలో సోమశేఖరుడనే పండితుడికి విద్యనేర్పమని అప్పగించాడు. నేను భిక్షమెత్తుకుంటూ చక్కగా విద్యనేర్చుకోసాగాను. నా శ్రద్ధాసక్తులు చూసి అతను కొన్నాళ్ళయ్యాక నన్ను తన యింట్లోనే ఉంచుకుని చదువు చెప్పేవాడు.

ఆయనకు పదహారేళ్ళ కూతు రుండేది. ఆమెపేరు సత్యవతి. అందమైనదీ, కళలు తెలిసినదీ. ఆమె భర్త పెళ్ళయిన వెంటనే కాశీపోయి తిరిగిరాకపోడంతో...ఆమెయౌవనం చూసేవారికి జాలి కొల్పేది.

ఒకనాడు గురువుగారు రాత్రి భోజనం చేస్తూ ఏదో పుస్తకం కావాలని నన్ను పుస్తకాల గదికి వెళ్ళి తెమ్మన్నారు. ఆ గది కొంచెం మూలగా ఉండడంతో నేనొక దీపం పట్టుకుని వెళ్తూంటే – సత్యవతి వచ్చి నా చేతిలో దీపం లాక్కుని "సాయంలేకుండా ఒక్కడివీ వెళ్తావా? నేనూ వస్తాను పద" అంటూ నాతో వచ్చింది.

నేను పుస్తకాల కట్టవిప్పి వెదుకుతూంటే – "హరిదత్తా! నువ్వు కొక్కోకంలాటి లక్షణ గ్రంథాలేమైనా చదివావా?" అని అడిగింది.

"చదివానక్కా" అన్నాను.

"ఆ గ్రంథం బాగా గుర్తుందా?" అని ఆమె అడగగా – "ఉంది" అన్నాను.

ఆమె శ్లోకాల మొదళ్ళు చెబుతూంటే నేనా శ్లోకాలు చదివాను.

**సత్యవతి** : నువ్వు లక్షణగ్రంథం బాగానే వల్లించావు? లక్ష్యమెలా ఉంటుందో చూడాలి. కన్యక ఎన్నేళ్ళకు బాల అనిపించుకుంటుంది?

**నేను** : పదహారేళ్లవరకూ,

**ఆమె** : తరువాత?,

**నేను** : ముప్ఫయ్యేళ్ళ వరకూ తరుణి అనిపించుకుంటుంది., ఆమె బాలకేవి యిష్టం?,

**నేను** : తాంబూలం ,.... చందనం మొదలైనవి,

**ఆమె** : తరుణికి?,

**నేను** : (మౌనంగా ఉండిపోయాను.,)

**ఆమె** : సుందరుడా! నావేపు చూడు. నేను బాలనో? తరుణినో చెప్పగలవా?,

**నేను** : నాకేమీ తెలియదు.,

**ఆమె** : (చిరునవ్వు నవ్వుతూ) హరిదత్తా! నువ్వు గ్రంథాలైతే చదివావు కానీ అనుభవం మాత్రం లేదు సుమీ!,

**నేను** : అక్కా! ఇదినేనుఅనుభవం కోసం చదవలేదు. కావ్యలక్షణాల కోసం చదివాను.,

**ఆమె** : నీకు దాని అనుభవమే ఉంటే – ఇంత చక్కని వాడివైకూడా యౌవనాన్ని వృథా చేసుకుంటావా? నువ్వు కోరాలే కాని కాదనే మూఢురాలుంటుందా?,

నేను : శివశివ. రూపం, విద్య, చెడ్డపనులు చేయడానికా! అలాఎప్పుడూ అనుకోకూడదు.,

ఆమె : ఈ మాటలకేంలే. చవిచూడలేదు కనక ఇలా అంటున్నావు. స్త్రీ మోహంలో పడిన మహర్షుల కథలు చదవలేదూ?,

నేను : అక్కా! ఇప్పు డీ ప్రసంగ మెందుకూ? దీపం తిన్నగా చూపించు. మీ అమ్మ పిలుస్తున్నట్లున్నారు దీపమక్కడుంచి వెళ్ళు.,

ఆమె : పోతానులే. నీతో ఎన్నోరోజులనుంచి ఒక విషయం చెప్పాలను కుంటున్నాను. ఇప్పటికి సమయం చిక్కింది. ఆ మాట లింకెవరూ వినకూడదు.

ఆ మాటలకి నాకు భయమేసింది. ఈమె ఇంతవరకూ నీతిని పాటిస్తూ వచ్చినా ఇప్పుడు చెదిరినట్లుంది – అనుకుని – ధైర్యం నటిస్తూ – "అదేమిటో చెప్పు" అన్నాను.

ఆమె సిగ్గు వదలి..నాలుగు వేపులా చూసి – ఎవరూ లేరని నిశ్చయించుకుని – "అందగాడా! నేనొకటి చెబుతాను, విను. భగవంతుడు మనుషుల్ని సృష్టించి అవయవా లిచ్చింది సుఖపడమనే. విషయాభిలాష అన్ని ప్రాణులకీ సామాన్యమే. దానివల్ల పాపపుణ్యా లొస్తాయనుకోవడం మూర్ఖత్వం. తల్లితండ్రులు కట్టపెట్టినవాడు అన్యాయం చేస్తే కన్య బతు కేంకావాలి? యువతి ఎవరిని వాంఛిస్తుందో వారినే దైవంగా భావిస్తుంది. వారిని వదిలితే నేరమౌతుంది. నన్ను చిన్నపుడే ఎవరికో కట్టబెట్టగా అతను కాశీలో విద్యాభ్యాసం చేస్తున్నాడట ఎందుకో. నేనతన్ని దైవంగా భావించి చేయగలిగే దేముంది? ఆకలేసి నప్పుడే అన్నంతినాలి. ఇంద్రియాల నాపడం ఎవరితరమూ కాదు. ఇప్పుడు నేను నిన్ను కామించా ననుకో. తరువాత వదిలేస్తే దోషమే. నువ్వు నా సిద్ధాంతంతో ఏకీభవిస్తావా లేదా?

అప్పటికి గురువుగారు భోజనం చేసి – "హరిదత్తా! ఇం తాలస్యం చేస్తున్నావేం? పుస్తకం దొరకలేదా?" అని కేకవేశారు.

"ఇదిగో వస్తున్నా" నంటూ అక్కడినుంచి వెళ్ళాను. పుస్తకం కనపడలేదని చెప్పాను. నా వెనకే వచ్చిన సత్యవతి నామొహం చూసి నవ్వింది.

వీలు చిక్కగానే నా అభిప్రాయం ఆమెకు చెప్పాలనుకున్నాను. భోజనం చేసి – ఎప్పట్లాగే సరస్వతీ మందిరంలో పడుకున్నాను.

ఆమె చక్కగా అలంకరించుకుని వచ్చి దీపం ఆర్పి .... నా గుండెలమీద వాలింది. నే నరవబోయి – ఆమె రాసుకున్న చందనపు వాసనను బట్టి ఆమెను గుర్తించి..... అరిస్తే గురువుగారి కపకీర్తికదా అనుకుని – ఆమెను మంచి మాటలతో పంపేద్దామని ప్రయత్నించాను. కాని ఆమె నన్ను వదలలేదు.

వాకిట్లోకి వెళ్ళి ఎవరైనా ఉన్నారేమో చూసొస్తానని బొంకి బయటకు వచ్చాను. గురువుగారు – "ఎవర"ని కేకవేశారు.

"సరస్వతీ మందిరంలో దీపం ఆరిపోయింది. వెలిగించడానికి వచ్చాను" అన్నాను.

ఒకటి రెండు రోజులు గడిచాక ఒకనాడామె నన్ను బలవంతంగా ముద్దు పెట్టుకుంది. మరొకనాడు కౌగలించుకుంది. నే నామెను ఎంత ప్రతిఘటించినా లెక్కచేసేదికాదు.

గురువుగారు మరో గ్రామం వెళ్ళగా ఆమె అలంకరించు కోవడం చూశాను. ఏం సాహసం చేస్తుందో అని భయపడుతూనే నిద్రకు ప్రయత్నించాను. ఆమె సుడిగాలిలా వచ్చి నన్ను కౌగలించుకుంది. నన్ను కదలనివ్వకుండా బంధించి ముద్దులు పెట్టుకుంది. వదిలితే పారిపోతానని కాబోలు గట్టిగా పట్టుకుంది. "ఎన్నాళ్ళనుంచో అవకాశం చిక్కక పోయింది. ఇవాళకు నా తపస్సు ఫలించింది ఒక్కసారి నీ అధరామృతం గ్రోలనీ, తరవాత ఏం చెప్పినా వింటాను.

ఎవరు నన్ను వెలేసినా, తల్లితండ్రులు తరిమేసినా...నాకు లక్ష్యంలేదు. ఇలాటి సుఖం వదులుకోను. అంటూ నా అధరా

లందుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నా నేను పడనిచ్చాను కాదు. ఆమెతో పెనుగులాడి పెనుగులాడి చివరికెలాగో మృత్యుముఖంలాటి ఆమె బంధం నుంచి తప్పించుకు పారిపోయాను.

నేను మళ్ళీ వస్తానని కొంతసే పామె ఎదురు చూసి - నేను రానందుకు కోపంతో ఆఇంటి నలుమూలలా వెదికింది.

నేను ఆమెకు కనపడకుండా అంతా చూస్తున్నాను.

అప్పు డామె -' దుర్మార్గుడా నీకోసం ఎంతో ప్రయాసపడి వొస్తే ఇలా చేస్తావా! ఇంక నీపాట్లు చూసుకో" అంటూ తలవిరగ బోసుకుని" శరీరం గీరుకుని - "అమ్మో! అని అరిచింది.

అది విని వాళ్ళమ్మ అక్కడి పరుగెత్తుకొచ్చి - "ఏమైంది" అంటూ అడిగింది.

సత్యవతి ఏడుస్తూ - "ఏం చెప్పమంటావు? నాన్న తొందరపడి ఒక నిర్భాగ్యుణ్నింట్లో పెట్టుకున్నాడు. వాడు నామీద మొదట్నుంచీ కన్నేశాడు. నేను వాకిట్లోకి వచ్చాను.నిద్రపోతున్నావు కదా అని నిన్ను లేపలేదు. వాడది ఎలా కనిపెట్టాడో వొచ్చి నాచెయ్యి పట్టుకుని నిర్బంధించాడు. నేనెంత చెప్పినా వినకుండా బలాత్కారంగా నామీద పడ్డాడు. నేనంగీకరింపలేదని నాజుత్తుపట్టుకుని వొళ్ళంతా చీరేశాడు. నేను నిన్ను పిలవగానే పారిపోయి ఎక్కడో దాగున్నాడు. నాన్న యింట్లో లేకపోడంతో యిలా జరిగింది" అంది.

గురుపత్ని పిలవగానే నే నామె ముందుకు వెళ్ళాను. ఆమె నన్ను నానామాటలూ అని యిరుగుపొరుగులని కేకేసింది. అంతవరకూ సత్యవతికి గుణవంతురాలని పేరుండడంతో - నేనేంచెప్పినా లాభంలేకపోయింది. అందరూ దానిమాటే నమ్మారు.

`నేను తప్పుచేసిన వాడిలా తలవంచుకుని - దైవకృత్యానికి విచారిస్తూ - ఎలాగో తెల్లవారే వరకూ గడిపాను.

సోమశేఖరుడు రాగానే ఆయన భార్య అంతా చెప్పింది. అప్పుడాయన దుర్వాసుడిలా మండిపడుతూ - నన్ను పిలిచి - "కృతఘ్నుడా! నీరూపం చూసి గుణవంతుడివనుకొని యింట్లో పెట్టుకుంటే యిలా చేస్తావా. ఛో" అంటూ దుడ్డుకర్ర తీసుకొని కొట్టవచ్చారు.

దెబ్బలకు భయపడి నేను పారిపోయాను. ప్రజలు నన్ను నిష్కారణంగా నిందించసాగారు. భగవంతుడనే మాట అసత్యమైనది. అతన్ని వంచించడానికి - చావడంకంటె మరో మార్గం లేదని, చావడంకోసం రకరకాల ప్రయత్నాలు చేస్తూ - చివరి కీ వూరు చేరాను. ఇక్కడ ఈ వృత్తాంతం విని ప్రశ్నలకు సమాధానాలు చెబుతానని తయారవడం - చావాలనే తప్ప ప్రియంవదమీద కోరికతో కాదు" అన్నాడు.

అతని నిర్మలమైన వృత్తాంతాని కందరూ సంతోషించారు.

అదృష్టదీపుడు కేళీశైలం నుంచి కొన్ని రత్నాలు, బంగారం తీసుకుని, వారితో కొండదిగి, బండెక్కి, వైభవంతో రాజవాహనుడి కోటలోకి వచ్చాడు

ప్రియంవద ద్వారా అత నదృష్టదీపుడనీ, అతని తమ్ముడు హరిదత్తుడనీ తెలిసిన రాజు చాలా సంతోషించి .. తన పొరపాట్లను క్షమించమని అతని పాదాలమీద పడ్డాడు.

అదృష్టదీపుడు వచ్చాడన్న వార్తవిని యాచక బ్రాహ్మణులు వేలకొలదీ రాసాగారు. అతను దేవి భవనంలో కల మణులనీ, బంగారాన్నీ తనకోసం తీర్థాల వెంబడి తిగుతున్న బ్రాహ్మణులతో సహా దరిద్రు లందరికీ దానం చేయసాగాడు. అది అక్షయం కనక ఎంత ఖర్చుపెట్టినా లోటులేకుండా ఉంది

అదృష్టదీపుడు పుష్పగిరిలో తనతమ్ముడికి వివాహం చేస్తాడనే వార్త భూమంతా వ్యాపించి - విద్వాంసు లందరూ అక్కడికి రాసాగారు.

# ప్రియంవదా హరిదత్తుల వివాహం

అదృష్టదీపుడు వచ్చినవా రందరినీ కుబేరులని చేసి పంపుతున్నాడు. ఒక రత్నం యిస్తే చాలు కోటీశ్వరుడౌతాడు.

ధర్మపురినుంచి రత్నావతిని, బ్రహ్మావధానినీ పిలిపించి - వారినుంచి తమ పూర్వవృత్తాంతం తెలుసుకుని, కాంతిమతినీ చతురికనీ అక్కడికి రప్పించాడు.

ధర్మపాలుని భార్య అయిన సునంద జాడ చెప్పినా, ఆమెను తీసుకువచ్చినా నూరుకోట్ల దీనారాలు బహుమతిగా యిస్తామని ప్రకటించడమేకాక ప్రతిగ్రామంలోనూ ప్రచారం చేయించాడు. అత నెక్కడున్నా ప్రతిరోజూ నూరుకోట్ల విలువైన బంగారం బ్రాహ్మణులకు దానం చేస్తూండడంతో అతని ఖ్యాతి మునుపటికంటే మరింతగా వ్యాపించసాగింది.

చోళదేశ ప్రభువగు వసురక్షితునికి తప్ప అందరు రాజులకూ రమ్మని ఉత్తరాలు రాశాడు. అదృష్టదీపుణ్ణి చూడాలన్న కోరికతో వస్తువాహనాలతో వారందరూ వచ్చి - అతడిచ్చిన అత్యద్భుతమైన విందు స్వీకరించి - తమ జీవిత కాలంలో అలాటి విందు ఎరగమని పొగిడారు. అతని దాతృత్వం - తాము వినిన దానికంటే చాలఎక్కువని కొందరు ప్రశంసించారు. అతనిచ్చే ఒక మణివిలువ తమ ఐశ్వర్యం కంటే ఎక్కువని కొందరు కొనియాడారు.

ప్రకటించిన పదిరోజులకు సునందను వెంట బెట్టుకుని ఒక బ్రాహ్మణుడువచ్చాడు. అదృష్టదీపుడు, హరిదత్తుడు ఆమెను కౌగలించుకున్నారు. వాళ్ళిద్దరూ తన కొడుకులే అని తెలిసి ఆనందం పట్టలేకపోయిం దామె. అంతలోనే భర్తని తలుచుకుని గొల్లున ఏడ్చింది. "మీ బాల్యం చూడనే లేక పోయాను. సమయానికి మీకు ఆహారం లభించిందో లేదో. ఉండి కూడా ఏమీ కూడా లేనివాళ్ళలా చిక్కులు పడ్డాం. మిమ్మల్ని చూశాక నాకళ్ళు చల్లబడ్డాయి."

"అమ్మా! నువ్వు వీరమాతవి. సామాన్యులలా ఏడవకూడదు. నిన్నిన్నాళ్ళూ ఆదరించిన వారి ఋల్లు బంగారం చేస్తాను ఎవరైనా నీ కవమానం చేస్తే వాణ్ణి చంపేస్తాం. నీ వృత్తాంతం చెప్పు." అని అడిగాడు అదృష్టదీపుడు. అప్పు డామె తన కథ చెప్పసాగింది.

# సునంద కథ

"అరణ్యంలో పుత్రుణ్ణి ప్రసవించి నీళ్ళు తెమ్మని రత్నావతికి సంజ్ఞ చేశాను. ఆమె వెళ్ళాక ఒక కోతి వచ్చి నా వొడిలోని శిశువు నెత్తుకుని పోతున్నా – ఏంచేయడానికీ శక్తిలేక .... స్పృహకోల్పోయాను. అంతలో ...

ఆ దారిన మణిమంతుడనే వర్తకుడు అత్తవారింటినుంచి పల్లకీ మీద భార్యను తీసుకువస్తూ, మూర్ఛలో ఉన్న నన్ను చూసి – దయతో ఆ పల్లకీ ఎక్కించుకుని తమవూరు తీసుకెళ్ళాడు.

మంచి వైద్యుల చేత చికిత్స చేయించడం వల్ల నాలుగు రోజులకి నాకు తెలివొచ్చింది. కొడుకు కోసం విచారిస్తూంటే వాళ్ళు న న్నోదార్చేరు."

అదృష్టదీపుడు మణిమంతుని పేరు రాసుకుని అతన్ని తీసుకు రాడానికి ఏనుగును పంపాడు. దూతలకు ప్రత్యేకంగా చెప్పాడు.

"రెండు మూడేళ్ళు వాళ్ళింట్లో సురక్షితంగా ఉన్నాను. అతని భార్య నన్నెంతో గౌరవంగా చూసేది.

ఒకనా డామె తమ్ముడి వివాహానికి నన్నుకూడా తీసుకెళ్ళింది. అక్కడ న న్నామెదాసీ అనుకుని వారు పనులు చెబుతూంటే పెద్దవారని, నాశక్తిమేరకు నేను చేశాను.

ఎంగి ళ్లెత్తుతుండగా ఒక నీచుడు "ఏమే సునందా! దాసీపనులు చేయడమెందుకూ? నాతో వచ్చేస్తే నిన్నుంచుకుని గౌరవంగా చూస్తాను" అన్నాడు.

విధి బలీయసీ అని అనుకుంటూ నేను కన్నీరు కార్చసాగాను".

"వాడిపేరు చెప్పు. ముక్కలు ముక్కలుగా చీరేసి తెస్తా" అన్నా డదృష్టదీపుడు.

"వానిని నిందించడ మెందుకు? మనకాలం అలా ఉంది. నాకథతో మిమ్మల్ని కూడా బాధపెడుతున్నట్లున్నాను సరే.... నేనేమీ మాట్లాడకపోడంతో నా మెత్తదనం గ్రహించి ప్రతివాళ్ళూ అలాగే మాట్లాడసాగారు.

నేను - షాహుకారి భార్య అంబికకు నాకథంతా చెప్పి - "నువ్వు వారిని మందలించక పోతే నేను బలాత్కారంగా చనిపోతాను" అన్నాను.

ఆమె వారిని మందలించి - న న్నోదార్చింది. మరికొన్నాళ్ళ య్యాక చాలా ధనవంతుడైన వైదేశికు డనే వర్తకుడు నన్ను కామించి అంబికను వేడుకున్నాడు. నా బుద్ధి తెలిసినా, స్త్రీ చాపల్యం కొద్దీ నా ముం దతని గౌరవం, భాగ్యం, సౌందర్యాలను పొగడసాగింది. అంతేకాక "సునందా! నువ్విప్పుడు నడిమివయసులో ఉన్నావు. ఆప్తులెవరూ లేరు. కాలూ చెయ్యీ లేనప్పుడు యితరులు పోషించరు కదా. వైదేశికుడు కోటీశ్వరుడు. నిన్ను కామించినవాడు. భార్యచనిపోయింది. మళ్ళీ పెళ్ళి చేసుకోడం యిష్టంలేదు. సంతానముంది. అత న్నాశ్రయిస్తే నీకు మర్యాదగా ఉంటుంది. అతను చాలా మంచివాడు. నీ కేమీ లోటు రానివ్వడు. నేనున్నన్నాళ్ళూ నీకే లోటూ ఉండదు. నాతరవాత నీవేమౌతావో అని నాచింత. నువ్వతన్ని చేరితే నాకు నిశ్చింత. నీ అభిప్రాయమేమిటి?" అని అడిగింది.

నేను కన్నీరు కార్చుతూ - "అమ్మా! నీకు నా మీద ఆదరం తగ్గింది కాబోలు. నన్నెప్పుడూ ఇలాటి మాటలని ఎరగవు. ఇదంతా నా ప్రారబ్ధం. ప్రాణంపోయినా, కులంచెడినా నే నెన్నడూ ఇలాటి పని చెయ్యనని గ్రహించు. శీలం వదిలిన స్త్రీ పరలోకంలో నరకయాతన

లనుభవిస్తుంది. కాబట్టి నువ్వెప్పుడూ ఎవరినీ యిలాటి పనులకు ప్రేరేపించకు" అని వేడుకున్నాను.

ఆమె సిగ్గుపడి - మరేమీ అనకుండా ఊరుకుంది. మరేవో మాట్లాడి ఆమెకు సంతోషం కలిగించాను.

ఆ రాత్రి నేను పడుకున్న చోటుకి వైదేశికుడు వచ్చి రత్న భూషణాలు చూపిస్తూ. "సునందా! నేను వైదేశికుడిని. అంబిక నా గురించి చెప్పే ఉంటుంది." అనడంతో నేను భయపడుతూ లేచి - "నీచకృత్యములు చేయుచున్న నన్ను కామించి ఏంలాభం? నేను నీ కూతురివంటిదాన్ని. నావ్యతిరేకత అంబికకు చెప్పాను. నన్ను నీకూతురిలా చూసుకో" అన్నాను. అతనికి కోపం వచ్చింది. "ఓసిరండా! నీచకృత్యాలు చేసే నీకు నాకూతుర్లతో సామ్యమా! మా యింటికి దాదిగా వచ్చి మాకే పెద్దమాటలు చెబుతున్నావే. నీ టక్కులు నాకు తెలుసు. మర్యాదగా సమ్మతింపకపోతే తన్ని మరీ తీసుకుపోతాను. మా మణిమంతుడు వెర్రివాడు కనుక ని న్నూరికే మేపుతున్నాడు. దుత్తలా తిని పొగ రెక్కావు" అనగా -

నేను రోషంగా-"నీచుడా! నువ్వు భాగ్యవంతుడివని గర్వపడుతున్నావు కాబోలు, నీ భాగ్యమంతా నాకాలిగోరుకి సరితూగదు. నీమాటలకు లోబడను" అనేసరి కతను నన్ను కాలెత్తి తన్నాడు. నన్ను బలాత్కారం చేయబోగా - భయంతో అరుచుకుంటూ ఆ ప్రాంతంలోని బ్రాహ్మణుని యింటికి పారిపోయాను.

వైదేశికు డక్కడికొచ్చి "ఆరంద నిటుతోసెయ్" అన్నాడు

అతను - "ఈమె ఏంతప్పు చేసింది?" అని అడిగాడు.

"అదంతా నీకెందుకు? నా స్థితి నీకు తెలుసా? దాన్ని పంపకపోతే నీపని కూడా పడతాను" అని వైదేశికుడు బెదిరించేసరికి ఆ బ్రాహ్మణుడు భయపడి నన్ను వదిలేసేవాడే. కాని .... రాజకీయోద్యోగి ఒకడు నా సంగతి విని జాలిపడి - ఆ వైదేశికుడిమీద తిరగబడి - "నువ్వెవరివి? అర్ధరాత్రి అల్లరిచేస్తున్నావ్?" అని గద్దించాడు.

అతన్ని సామాన్యు డనుకుని వైదేశికుడు శిక్షిస్తాననడంతో అతను ఊళవేయగా రాజభటులు పరుగెత్తుకొచ్చారు. వైదేశికుణ్ని పారిపోనివ్వకుండా పట్టుకుని సంకెళ్ళు వేసి కారాగారంలో పడేశారు.

కొన్ని రోజు లక్కడుండి "నేను మరొక నగరం చేరుకుని... బిచ్చగత్తెలా వేషంమార్చి దేవాలయంలో రాత్రులు పడుకుంటూ మరికొన్నాళ్ళు దేశయాత్ర చేశాను.

ఒకనాటి సాయంకాలం నేనాగుడిలో ఉండగా – బ్రాహ్మణుల సంభాషణలో – "సునందని తీసుకు వచ్చిన వారికి నూరుకోట్ల బంగార మిస్తానని అదృష్టదీప మహారాజు గారు ప్రకటించారట" అనుకోడం విన్నాను. వాళ్ళు నాపోలికలగురించి కూడా అనుకున్నారు.

నాకు సందేహం కలిగింది. అదృష్టదీపుడికి నా అవసర మేం కలిగింది? అతను నా కొడుకుకాదు కద? నా కంత అదృష్టంపడుతుందా? అనుకుంటూ ఆ బ్రాహ్మణులతో – "రేపొస్తే మీకు సునంద జాడ చెబుతాను" అన్నాను.

నన్ను బిచ్చగత్తెగా గుర్తెరిగినవారు. "ఇది వెర్రిది. దీని మాటలు నమ్మడం శుద్ధతెలివి తక్కువ" అని వెళ్ళిపోయారు. ఈ బ్రాహ్మణుడు మాత్రం నన్ను వదలక – "అమ్మా! నేను చాలాదరిద్రుణ్ని. కుటుంబంపెద్దది. పోషించలేక చాలా యిబ్బంది పడుతున్నాను. నన్ను రక్షించి ఆ సునంద జాడ చెప్పమ్మా" అని ప్రార్థించాడు.

అతనిమీద జాలిపడి – "నేనే సునందని" అంటూ నా వృత్తాంతం అంతా చెప్పాను. అప్పటి కతనికి నమ్మకం కుదిరి – ఎవరికీ చెప్పకుండా ఆరాత్రే ప్రయాణం కట్టి ఇక్కడికి తీసుకొచ్చాడు" అని తన కథ ముగించింది.

అదృష్టదీపు డామె నోదార్చి, ఆ బ్రాహ్మణుడికి నూరుకోట్ల ధనమిచ్చి, తల్లిని కలుసుకో గలిగిన ఆనందంలో అనేక దానాలు చేశాడు.

మర్నాడు రాజు లందరినీ సమావేశపరచి – "మేమిప్పుడు చోళరాజయిన వసురక్షితుడి మీదకు యుద్ధానికి వెళ్తున్నాం. మాకు

సహాయంగా ఎవరొస్తారు?" అని అడిగేసరికి అందరూ సిద్ధమయ్యారు. వసురక్షితుడు దుర్మార్గుడు, కపటి అని వారందరికీ తెలిసిందే.

వసురక్షితుడు చారులవలన ఆ వార్తవిని, అదృష్టదీపుడు ధర్మపాలుని కొడుకగుటచే అతనిని జయించడం అసాధ్యమని, సంధి కంగీకరింపడనీ నిశ్చయించుకుని పారిపోవడానికి ప్రయత్నించాడు.

కాని అది ముందే గ్రహించిన అదృష్టదీపుడు అతన్ని బంధించి, తండ్రిని సంకెళ్ళనుంచి విముక్తుణ్ణి చేసి వసురక్షితుని చేత అతని పాదాలకు నమస్కరింపజేశాడు ధర్మపాలునికి కొడుకులిద్దరూ తమ తమ వృత్తాంతాలు చెప్పారు.

ధర్మపాలుడు తన అదృష్టానికి భగవంతుణ్ణి ప్రార్థించాడు.

దుర్వినీతుడు, విహారభద్రుడు ఎక్కడున్నారని ఆరాతీయగా వారు కాశింబి నేలు తున్నారని తెలిసింది. అప్పుడు అదృష్టదీపుడు దండుతోపోయి వారిని పట్టుకుని కారాగారంలో వేయించి, మంచి ముహూర్తంలో కోటలో ప్రవేశించి పట్టాభిషిక్తుడై రాజులందరికీ విలువైన రత్నాలను కానుకలిచ్చి వారి దేశాలకు పంపేశాడు

వినయకేతుని వెతికించి రప్పించి అతనికి ప్రధాని ఉద్యోగం ఇచ్చాడు. దుర్జనులని రక్షించడం లోకాని కపకారమని – ఆ కోట ద్వారంవద్ద మంటపం కట్టించి – దానిమీద అడ్డంగా దూలాలువేసి, విహారభద్రుడినీ, దుర్వినీతుణ్ణీ గొలుసులతో తలకిందులుగా వేలాడదీసి చిత్రవధ చేయించాడు. వారి శరీరంలోని మాంసం, కండలూ ఎండిపోయాక ఏదో ఓషధిరాసి చిరకాలం అలాగే ఉండేలా చేశాడు.

"గోపా! నువ్వు చూసిన వారు విహారభద్రుడూ, దుర్వినీతుడూ. అందుకే "దుర్జనులకి బుద్ధి వచ్చును – " అని రాశారు.

అని చెప్పి మణిసిద్ధుడు ఆనందంలో మునిగిన గోపాలుడితో బయలుదేరి తరువాయి మజిలీ చేరుకున్నారు.

రెండవ భాగం సమాప్తం

